# హిందీ - తెలుగు కోష్

## (30 వేల పదములతో)

## HINDI - TELUGU DICTIONARY

సంకలనం

**శ్రీ కప్ప గంతుల సత్యనారాయణ**



రోహిణి పబ్లికేషన్స్

రాజమండ్రి - 1

ROHINI

# Hindi-Telugu Dictio

By

*Sri Kappagantula Satyanaray*

© Publisher's



First Edition:
**August 1998**

PRICE :
**Rs. 130/-**

Printers
శ్రీ అరుణోదయ ప్రింటింగ్ ప్రెస్
సీతారాంపురం, విజయవాడ-2.
ఫోన్ : 431422

Published By:

**ROHINI PUBLICATIO**

**Main Road, Rajamundry.**

# వేదన

హిందీ బహు సంఖ్యాకుల భాష యావత్ భారతావనికి రాష్ట్రభాష, రాజభాష. బహుప్రాంతములలో విద్యార్థులకు హిందీ అనివార్యముగా బోధింపబడుచున్నది. హిందీయేతర ప్రాంతములలో కూడా హిందీ భాషాధ్యయనము గంభీరముగా కొనసాగుచున్నది. కనుకనే వ్యాకరణములు, నిఘంటువులు అందుబాటులో నుండుట బహుఆవశ్యకమని గుర్తించి ఈ హిందీ-తెలుగు నిఘంటువు సంకలింపబడినది. విద్యార్థులకు, సాహిత్యాభిలాషులకు, వ్యావహారిక జ్ఞానాభిలాషులకు అధికముగా ఉపయోగపడాలనే ఉద్దేశ్యముతో సుమారు 30వేల పదములతోపాటు చివర అనుబంధముగా హిందీ జాతీయములు, లోకోక్తులు, అతి ఆవశ్యకమగు ఇంగ్లీషుప్రేజు పదప్రయోగములకు హిందీ పర్యాయములు కూడా సమకూర్చ బడినవి. ఈ నిఘంటువు ఉపయోగాలను ఇనుమడింప జేయుటలో ఏక్కడో ఏదో దోసము, లొసుగు దొరలియుండ వచ్చును. విద్వాంసులు అట్టి దోసములను సానుభూతితో తెలియపర్చినచో మలిముద్రణలో తప్పక సవరించి నిఘంటువు ఘనతను ద్విగుణీకృతము చేయ గలనని సవినయముగా విన్నవించు చున్నాను.

ఇట్లు

సంకలన కర్త

# संकेत सूची

| | | |
|---|---|---|
| आ०क्रि | – | अकर्मक किचा |
| अव्य० | – | अव्यय |
| उप० | – | उपसर्ग |
| क्रि.०वि० | – | क्रिचा विशेषन |
| पु० | – | पुल्लिग। |
| प्र० | – | प्रत्यय |
| बहु० | – | बहुवचन |
| मु० | – | मुहावश |
| चौ० | – | चौगिक |
| स.क्रि० | – | सकर्मक क्रिया |
| सर्व० | – | सर्वनाम |
| स्त्री० | – | स्त्रीलिंग |



# रोहिणि हिन्दी – तेलुगु कोश

# రోహిణి హిందీ - తెలుగు కోశ్

## अ

**अंक** - पुं० గురుతు; అంకె; ఒడి; అక్షరము; నాటకపరిచ్ఛేదము.

**अंककार** - पुं० ఆటలలో మధ్యవర్తి.

**अंकरा** - पुं० రాతిముక్క; కంకర ముక్క.

**अंकन** - पुं० వ్రాయుట; గుర్తించుట, ముద్రించుట; లెక్కించుట.

**अंकवार** - पुं० ఒడి; ఆలింగనము; గర్భము अकवार भरना ; ఆలింగనము వేయుట.

**अंकपाली** - स्त्री० దాది

**अंकाना** - स०क्रि० అంచనా వేయించుట; మూల్యము నిర్ణయించుట; పరీక్ష చేయించుట.

**अंकुडा** - पुं० ఉక్కుములికి.

**अंकडी** - स्त्री० కొక్కెము.

**अंकुर** - पुं० మొలక; చిగురు; మొగ్గ.

**अंकुरना** - अ०क्रि० మొలకెత్తుట.

**अंकुरित** - वि० మొలకెత్తిన.

**अंकुश** - पुं० అంకుశము.

**अंकुस** - पुं० अंकुश ; అంకుశము.

**अंकोर** - पुं० ఒడి; వక్షస్థలము; కానుక; లంచము; పొలములో పనిచేయువారికి పంపు భోజనము - **छाक**.

**अंकोरी** - स्त्री० अंकोर ; ఒడి; ఆలింగనము.

**अँखडी** - स्त्री० కన్ను; చూపు - **अँखिया** - स्त्री० కన్ను; సూది రంధ్రము.

**अंखुआ** - पुं० अंकुर , అంకురము.

**अंखमीचनी** - स्त्री० दे० आँखमिचौनी

**अंग** - पुं० అంగము; దేహము.

**अंगचारी** - पुं० సహచరుడు.

**अंगज** - पुं० కుమారుడు; మన్మథుడు; చెమట; దేహమునుండి పుట్టిన.

**अंगडाई**-स्त्री० अंगराई ; బడలికతో కూడిన

ఒడలు విరుపు.

**अंगडाई लेना; अंगडाना; अंगराना** - अं०क्रि० ఒడలు విరుచుకొనుట.

**अंगबीक** - पुं० शहद ; తేనె.

**अंगरखा** - पुं० చొక్కా; అంగరఖా.

**अंगराग** - पुं० అంగరాగము; గంధాదుల పూత; పారాణి.

**अंगरेजी** - वि० ఆంగ్లేయులకు సంబంధించిన; स्त्री० ఇంగ్లీషు భాష.

**अंगलेर** - पुं० శరీర నిర్మాణము; శరీర సౌష్ఠవము.

**अंगा** - पुं० अंगरखा ; చొక్కా.

**अंगार** - पुं० నిప్పుకణము, అగ్నికణము.

**अंगारा** - पुं० दे० अंगार

**अंगीठा** - पुं० **अंगीठी** - स्त्री० కుంపటి; కొలిమి.

**अंगुर, अंगुल** - पुं० అంగుళము.

**अंगुली** - स्त्री० వ్రేలు.

**अंगुरत** - पुं० బొటనవ్రేలు.

**अंगुरतनुभा** - वि० చెడ్డగా ప్రసిద్ధమైన; కుఖ్యాతమైన; Notorious.

**अंगुरतनुमाई** - स्त्री० కళంకము; అపకీర్తి.

**अंगुरतरी** - स्त्री० ఉంగరము.

**अंगुरताना** - पुं० కుట్టుపనివారు వేలికి ధరించు ఇనుప లేక ఇత్తడి తొడుగు.

**अंगुष्ठ** - पुं० अंगूठा ; బొటనవ్రేలు.

**अंगूठा चूसना** - ముఖస్తుతి చేయుట.

**अंगूठा दिखाना** - నిర్మొఖమాటంగా తిరస్కరించుట.

**अंगूठी** - स्त्री० ఉంగరము.

**अंगूर** - पुं० ద్రాక్ష; పుండుమాను సమయమునకు కనిపించు ఎర్రకండ- **अंगूर खट्टा होना** ద్రాక్షపండు పుల్లనగుట, ప్రయత్నము ఫలించనప్పుడు వాంఛితవస్తువులో దోషము చూపుట.

**अंगूरी** - वि० లేత ఆకు పచ్చరంగు గల; ద్రాక్షతో చేసిన.

**अंगेजना** - स०क्रि० సహించుట; స్వీకరించుట; ఎత్తుట.

**अंगेर** - स्त्री० అంగదీప్తి.

**अंगेठा** - पुं० పెద్ద కుంపటి.

**अंगोछा** - पुं० అంగవస్త్రము.

**अंगोछना** - स०क्रि० తువ్వాలుతో లేక అంగవస్త్రముతో ఒడలు తుడుచుకొనుట.

**अंचरा; अंचल** - पुं० అంచు; కొంగు; సరిహద్దు ప్రదేశము.

**अंचवना** - अ०क्रि० ఆచమనము చేయుట.

**अंजन** - पुं० కాటుక; సిరా; రాత్రి.

**अंजना ; अंजनी** - स्त्री० ఆంజనేయుని తల్లి.

**अंजर-पंजर** - पुं० అస్థిపంజరము.

**अंजलि ; अंजली** - स्त्री० దోసిలి.

**अंजवाना** - स्त्री० కాటుక పెట్టుట.

**अंजही** - स्त्री० ధాన్యము అమ్మ బజారు; అన్నముతో తయారైన మిఠాయి.

**अंजाम** - पुं० పరిణామము; సమాప్తి.

**अंजीर** - पुं० అత్తిపండు.

**अंजुम** - पुं० నక్షత్ర సమూహము; నక్షత్రములు.

**अंजुमन** - स्त्री० సభ.

**अंजुरी** - स्त्री० अंजली

**अंजोर** - पुं० ప్రకాశము; వెలుతురు

**अंजोरा** - वि० వెలుతురు గల.

**अंझा** - पुं० సెలవు; ఆటవిడుపు.

**अंटना** - अ०क्रि० ఇముడుట; నిండుట.

**अंटा** - पुं० పెద్దగుండు; నూలు లేక పట్టు కండె

**अंटियाना** - स०क्रि० మాయముచేయుట; జీర్ణించుకొనుట.

**अंटी** - स्त्री० చూపుడువ్రేలు నడుమవ్రేలు కలిసినపుడు ఉండు ముద్రావిశేషము; పిల్లలు పైరీతి వేళ్ళు కలిపి జిల్లాయి అని కేకవేతురు.

**अंठी** - स्त्री० టెంక; బీజము; రొండి లేక బొడ్డు.

**अंड** - पुं० వృషణము; గ్రుడ్డు; బ్రహ్మాండము.

**अंडकोश** - पुं० వృషణము; బ్రహ్మాండము; పండుపై తోలు లేక తొక్క.

**अंडज** - वि० గ్రుడ్డులోంచి పుట్టినటువంటి - పక్షిమొదలగునవి.

**अंडबंड** - वि० అసంబద్ధ ప్రలాపము.

**अंडा** - पुं० గ్రుడ్డు.

**अंडी** - स्त्री० ఆముదపు చెట్టు.

**अंडुआ (बैल)** - पुं० బుడ్డకొట్టని ఎద్దు లేక ఆబోతు.

**अंडुआना** - अ०क्रि० దూడ గిత్తగా పెరుగుట; బుడ్డకొట్టుట.

**अंडुआ बैल** - पुं० सांड ; ఆబోతు.

**अंत** - पुं० అంతము; తుది; సమాప్తి.

**अंत:करण** - पुं० అంతఃకరణము; మనస్సు.

**अंतक** - पुं० యముడు; శివుడు.

**अंतडी** - स्त्री० ప్రేగు; आंत.

**अंतकाल** - पुं० మృత్యువు.

**अंतक्रिया** - स्त्री० అంత్యక్రియ.

**अंतरंग** - वि० ఆత్మీయుడైన; లోపలి; అన్యోన్యత గల.

**अंतर** - पुं० దూరము; భేదము; వ్యవధి; లోపలి (वि).

**अंतरपर; अंत:पर** - पुं० యవనిక, తెర.

**अंतरा** - पुं० మధ్యభాగము; ...నుపల్లవి

क्रिं॰वि॰ వినా; దగ్గర, వేరుగా.
**अंतराय** - पुं॰ అంతరాయము. విఘ్నము.
**अंतराल** - पुं॰ ఆవరణము; మధ్యభాగము.
**अंतरीय** - पुं॰ ద్వీపము; సముద్రమున చొచ్చుకొనియుండు మొనగల భూభాగము.
**अंतर्गत** - वि॰ దాగియున్న; గూఢమైన; లోపలికి వచ్చిన.
**अंतर्द्वार** - पुं॰ గుప్తద్వారము.
**अंतर्राष्ट्रीय** - वि॰ అంతర్దేశీయమైన.
**अंतर्नशिक** - पुं॰ అంతఃపుర రక్షకుడు.
**अंतिम** - पुं॰ చివరి, కడపటి.
**अंतेवासी** - पुं॰ గురుకుల శిష్యుడు; అంత్యజుడు.
**अंत:करण** - पुं॰ అంతఃకరణము. వివేకము.
**अंत्य** - पुं॰చివరి; కడపటి.
**अंत्यज** - पुं॰ శూద్రుడు; అస్పృశ్యుడు.
**अंत्येष्टि** - पुं॰ అంత్యక్రియలు.
**अंत्र** - पुं - **अंत्री** - स्त्री॰ ప్రేగు.
**अंदर** - क्रिं॰वि॰ లోపల.
**अंदरी ; अंदरूनी** - वि॰ లోపలి.
**अंदाज** - पुं॰ అంచనా; ఊహ.
**अंदाजा** - पुं॰ दे - अंदाज.
**अंदाजन** - क्रिं॰वि॰ దాదాపు; దాదాపుగా.
**अंदेशा** - पुं॰ సంశయము; సందేహము; జంకు; చింత.

**अंदोरा** - पुं॰ హంగామా, గలభా.
**अंदोह** - पुं॰ దుఃఖము.
**अंदोहगी ; अंदोहगीन** - वि॰ దుఃఖించువాడు; దుఃఖితుడు.
**अंध** - वि॰ గుడ్డి; చీకటిగా; వెర్రెత్తిన; అజ్ఞాని.
**अंधकार** - पुं॰ చీకటి.
**अंधकूप** - पुं॰ అంధకూపము; పాడుబావి; చీకటి బావి.
**अंधखोपडी** - पुं॰ మూర్ఖుడు; తెలివిలేని.
**अंधड** - पुं॰ తుఫాను.
**अंधतमस** - पुं॰ కటిక చీకటి.
**अंधता** - पुं॰ గుడ్డితనము.
**अंधपरंपरा** - स्त्री॰ వివక్షణలేకుండా గుడ్డిగా నమ్ముట.
**अंधा** - पुं॰ గుడ్డివాడు; వివేకహీనుడు. **अंधा धुंध**-स्त्री॰ ఆలోచనలేని పని; ఘోరమైన అంధకారము; అన్యాయము; గడబిడ.
**अंधिचार ; अंधिचारा** - पुं॰ చీకటి; वि॰చీకటిగానున్న.
**अंधिचारा** - पुं॰ दे॰ अंधेरा.
**अंधिचारी** - स्त्री॰ చీకటి; గుడ్డము కళ్ళగంత; వేటపక్షుల కళ్ళగంత.
**अंधेर** - पुं॰ అత్యాచారము; దుండగము.
**अंधेरखाता**-पुं॰ వ్యతిక్రమము; అన్యాయము;

లెక్క- పత్రములేని ఖాతా లేక వ్యవస్థ.
**अंधेरा** - पुं० మసక; చీకటి.
**अंधेरे घर का उजाला** - కులదీపకుడు.
**अंधेरे मुँह या मुँह अंधेरे** - చీకటి ముఖమున.
**अंधेरा गुप** - కటిక చీకటి.
**अंब** - स्त्री० తల్లి; మామిడిచెట్టు.
**अंबक** - पुं० తండ్రి ; నేత్రము.
**अंबर** - पुं० వస్త్రము; ఆకాశము; అభ్రకము; మేఘము; సుగంధ ద్రవ్యము.
**अंबरडंबर** - पुं० సంధ్యారాగము; సూర్యాస్త సమయమున, పడమటి దిక్కున వ్యాపించు ఎర్రదనము.
**अंबराई** - स्त्री० आमराई ; మామిడి తోట.
**अंबा** - स्त्री० దుర్గ, పార్వతి; తల్లి; మామిడి.
**अंबार**-पुं० అంబారము; సమూహము; రాశి.
**अंबारी** - स्त्री० ఏనుగుమీది అంబారి.
**अंबिया**- पुं० మామిడి పిందె.
**अंबु** - पुं० జలము; నీరు.
**अंबुज** - पुं० కమలము; वि. నీటిలో ఉత్పన్నమైన; జలమున పుట్టిన.
**अंबुद ; अंबुधर** - पुं० మేఘము; నీరు ఇచ్చునది.
**अंबुधि ; अंबुराशि** - पुं० సముద్రము.
**अंबुरुह** - पुं० కమలము.
**अंबुवह ; अंबुवाह** - पुं० మేఘము.
**अंबोह** - पुं० సమూహము; గుంపు.
**अंभोज** - वि० నీటిలో పుట్టిన.
**अंभोरुह**-पुं० శంఖము; కమలము; చంద్రుడు; కర్పూరము.
**अंश** - पुं० అంశము; భాగము; వంతు.
**अंशसुता** - स्त्री० యమునా నది
**अंशी** - पुं० భాగస్థుడు.
**अंशु** - पुं० కాంతి; కిరణము; భుజము.
**अंशुमान ; अंशुमाली** - पुं० సూర్యుడు.
**अंस** - पुं० కిరణము.
**अंसुआ** - पुं० కన్నీరు.
**अंहडा** - पुं० తూనికరాయి; తూనికరాళ్ళు.
**अक** - पुं० పాపము; దుఃఖము.
**अकड**-स्त्री० దర్పము; పొగరు; మిడిసిపాటు.
**अकडबाज ;** దర్పము గలవాడు; పొగరుబోతు.
**अकडना** - पुं० మిడిసిపాటు; పొగరుగా ప్రవర్తించుట; బిరుసెక్కుట; కొంకరపోవుట.
**अकडाव** - पुं० మిడిసిపాటు ; దర్పము; పొగరు.
**अकल ; अकलनीय** - वि० అనిర్వచనీయమైన; చెప్పనలవికాని.
**अकदस** - वि० శ్రేష్ఠమైన; పవిత్రమైన
**अकधक**-पुं०आगे-पीछे ; వెనుక ముందు.

**अकना** - अ०क्रि० గాబరాజెందుట; భయ పడుట.

**अकब** - पुं० వెనుక భాగము; వృశ్చికము; వృశ్చికరాశి.

**अकबक** - पुं० అసంబద్ధ ప్రలాపము.

**अकबकाना**- अ०क्रि० సంభ్రాంతుడగుట; చకితుడగుట.

**अकबर** - वि० మహోనుడు; గొప్ప; అక్బరు చక్రవర్తి.

**अकबाल** - पुं० दे० एकबाल.

**अकरा** - वि० శ్రేష్ఠమగు; ప్రియమైన; విలువ గల.

**अकरास** - स्त्री० ఒళ్ళువిరుపు.

**अकशू** - स्त्री० గర్భవతి.

**अकरूण** - वि० కరుణలేని; జాలిలేని.

**अकर्म** - वि० పనిలేని, సోమరి; కర్మలేని.

**अकर्मण्य** - वि० సోమరితనముగల; పని చేయని.

**अकर्मा** - वि० दे० अकर्मण्य.

**अकर्मी** - पुं० చెడుపని చేయువాడు; పాపి; దుష్కర్మి; అపరాధి.

**अकलंक** - वि० నిర్మలమైన; కళంకము లేని.

**अकल** - वि० యావత్తు; నేర్పులేని; स्त्री० తెలివి.

**अकल्लियत** - स्त्री० సంఘము; మతము; అల్పసంఖ్యాకమైనసంఘము లేకమతము.

**अकवन** - पुं० జిల్లేడు.

**अकस** - पुं० ద్వేషము; వైరము; అక్కసు.

**अकसर ; अक्सर** - स्त्री०वि० తరచుగా; సామాన్యముగా.

**अकसाम** - पुं० (किस्म का बहु०)- పలు రకములు.

**अकसीर; अक्सीर** - वि० గుణము కలుగ జేయునది; గుణము నిచ్చునది; स्त्री०రసా యనము; సర్వరోగ నివారిణి.

**अकह** - वि० अकथ ; చెప్పదగని; అనిర్వచ నీయమైన.

**अकांड** - वि० కొమ్మలేనిది; అకారణము; అకస్మాత్తుగా; అసందర్భముగా ఘటించు నది.

**अकांड - तांडन** - पुं० పసలేని కుప్పి గంతులు; పనికిమాలిన చర్చ; వితండ వాదము.

**अकाज** - पुं० वि० చెడ్డపని; విఘ్నము; ఆటంకము; పాపము क्रि वि० నిష్ప్ర యోజనముగా.

**अकाजना** - अ०क्रि० హానికలుగుట; గతిం చుట. स०क्रि० నష్టము కలిగించుట; ఆటంకపరచుట.

**अकाजी** - वि० దుష్కృత్యము చేయువాడు;

కార్యభంగము చేయువాడు; ఆటంక పరచువాడు.

**अकार ; आकाद्य** -वि० దృఢమైన; ఖండింప నలవికాని.

**अकाम** - वि० కామనా రహితుడు; నిస్పృహుడు; కోరికలేని,వ్యర్థమైన; పని లేని; నిష్ప్రయోజనమైన.

**अकाय** - वि० అశరీరుడు; శరీరములేని; నిరాకారుడు; జన్మరహితుడు.

**अकारज** -पुं० హాని; నష్టము; కార్యభంగము.

**अकाल** - पुं० అనుపయుక్త సమయము; కుసమయము; కరువుకాలము; కాటకము; అభావము; లోటు. वि० నిత్యము; శాశ్వతము.

**अकाली**-पुं० శిక్కుల సంప్రదాయ విశేషము.

**अकाव** - पुं० आक ; జిల్లేడు.

**अकास** - पुं० आकाश ; ఆకాశము.

**अकिंचन** - पुं० నిష్ఠదరిద్రుడు; కడు దరిద్రుడు.

**अकिंचनता** - स्त्री० దారిద్ర్యము; బీదరికము; गरीबी

**अकीदत** - स्त्री० ధార్మిక విశ్వాసము; మత సంబంధమైన నమ్మిక.

**अकीदा**-पुं०దృఢమైన విశ్వాసము; మతము; ధర్మము.

**अकील** - वि० బుద్ధిమంతుడు; తెలివిగల.

**अकुंट ; अकुंठित** - वि० పదునుగల; వాడి అయిన; అకుంఠితమైన; అప్రతి హతమైన.

**अकुताना** - स्त्री०वि० ऊबना ; విసుగొందుట.

**अकुल** - वि० కులములేని; నీచుడు.

**अकुलाना** - स्त्री०वि० కలతచెందుట; వ్యాకులపడుట.

**अकूत** - वि० లెక్కలేని; లెక్కింపశక్యము గాని; అపరిమితమైన.

**अकूल** - वि० ఒడ్డులేని; అపారమైన.

**अकृत** - वि० చేయనిది; కృత్రిమముకానిది; ప్రకృతమైన.

**अकृती** - वि० अनाडी ; చేతకానివాడు.

**अकेला** - वि० ఏకాకి; అద్వితీయమైన पुं० ఒంటరి; ఏకాంతము నిర్జనస్థానము अकेला - दुकेला ; ఒకటి - రెండు; ఒకళ్ళిద్దరు.

**अकेले** - क्रि०वि० ఒంటరిగా.

**अकोर** - पुं० दे० अँकोर.

**अकौवा** - पुं० జిల్లేడు; కంఠనాళము.

**अक्ल** - स्त्री० బుద్ధి; తెలివి.

**अक्ल मंद** - वि० బుద్ధిమంతుడు; తెలివిగలవాడు.

**अक्ल-मंदी** - स्त्री० తెలివి.

**अक्ली** - वि० బుద్ధి సంబంధమైన; తెలివికి సంబంధించిన.

**अक्स** - पुं० చిత్రము; ఫొటో; ఛాయ.

**अक्खड** - वि० మొండితనముగల; మూర్ఖుడు; మోటైన; అనాగరి.

**अक्खडपन** - पुं० మోటుతనము; నిర్భీతి; పోట్లాట స్వభావము అనాగరికము.

**अक्सर** - क्रि० वि० दे० अकसर.

**अक्षंतव्य** - वि० క్షమింపరాని.

**अक्ष** -पुं० నేత్రము; సర్పము; పాచిక; రుద్రాక్ష; ఆత్మ.

**अक्षत** - वि० గాయపడని; నొప్పింపబడని; అఖండమైన పుం० అక్షతలు; అక్షింతలు.

**अक्षम** - वि० ఓర్పులేనివాడు; సామర్థ్యము లేని.

**अक्षमता** - स्त्री० असमर्थता ; అసమర్థత.

**अक्षम्य** - वि० క్షమింపరాని.

**अक्षय** - वि० నశించని पुं० పరమాత్మ.

**अक्षयलोक** - पुं० స్వర్గము.

**अक्षर** - वि० నశించని; చెడని; పరివర్తనలేని पुं० ఆత్మ; బ్రహ్మ; శివుడు; విష్ణువు; ఆకాశము; మోక్షము; అక్షరము.

**अक्षरगणित** - पुं० బీజగణితము.

**अक्षरशः** - क्रि०वि० ఉన్నది ఉన్నట్లుగా; పూర్తిగా; అక్షరశః.

**अक्षरौटी** - स्त्री० వర్ణమాల; వర్ణమాలనను సరించి వ్రాయబడిన పద్యములు.

**अक्षि** - स्त्री० కన్ను.

**अक्षिगत** - वि० దృష్టము; కనిపించినది.

**अक्षित** - वि० శిథిలముకాని; నశించని.

**अक्षुण्ण** - वि० విరగని; యావత్తు.

**अक्षोनी ; अक्षौहिणी** - स्त्री० చతురంగిణి సేన; 109350 పైగా సైనికులు; 65610 అశ్వములు 4,21,870 గజములు గల సైన్యము.

**अक्षोभ** - वि० క్షోభములేని; గంభీరమైన; శాంతముగల; నిర్భయుడు; पुं० శాంతి; క్షోభము లేనివాడు.

**अखंड** -वि०సమస్తము; యావత్తు; ఖండము లేని.

**अखडैत** - पुं० మల్లుడు; మల్ల విద్యా ప్రవీణుడు.

**अखबार** - पुं० వార్తాపత్రిక ; **अखवार नवीस** ; పత్రికలో వ్రాయువాడు.

**अखर** - पुं० అక్షరము.

**अखरना**-अ०क्रि० అప్రియముగా నుండుట; కటువుగా నుండుట.

**अखरोट** - पुं० అఖరోటాపండు.

**अख़लाक**-पुं० మర్యాద; శీలము; అలవాటు

**अखाडा** - पुं० మల్లయుద్ధము చేయుచోటు, గోదా; సాధువులు ఉండుచోటు.
**अखाद्य** - वि० తినదగని.
**अखिल** - वि० ఖిలముకాని ; యావత్తు.
**अखीर** - पुं० సమాప్తి; తుది; చివర.
**अखेर** - पुं० दे० आखेर.
**अखोह** - पुं० ఎగుడు దిగుడు భూమి.
**अख्तर** - पुं० నక్షత్రము.
**अख्तयार** - पुं० दे० इख्तियार.
**अगरना** - अ०क्रि० జమకూడుట; ఏకత్రమగుట.
**अगड-बगड** - वि० తలాతోకలేని ; वे सिर पैर का.
**अगणित** - वि० లెక్కలేని.
**अगण्य** - वि० లెక్కకురాని; లెక్కలేని; తుచ్ఛమైన; సామాన్యమైన.
**अगत ; अगति** - स्त्री० దుర్దశ. నరకము.
**अगत्या** - क्रि०वि० అకస్మాత్తుగా; విధిలేక.
**अगम्य** - वि० దుర్గమమగు; పోరాని; పొందరాని.
**अगर** - पुं० అగరు; చందన విశేషము ; अव्य० ఒకవేళ यादि.
**अगलबगल** - क्रि०वि० ఇరుగు పొరుగున अडोसबडोस ; ఇటునటు.
**अगला** - वि० మొదటి; ప్రాచీనపు; రానున్న; పిమ్మట पुं० పూర్వజుడు; నాయకుడు.
**अगवाडा** - पुं० ఇంటిముందు ప్రదేశము.
**अगवानी** - स्त्री० స్వాగతము; ఎదురువెళ్ళి స్వాగతించుట; నేతృత్వము; అభ్యర్థన.
**अगवार** - पुं० दे० अगवाडा.
**अगहन** - पुं० మార్గశీర్ష మాసము.
**अगहनी** - स्त्री० మార్గశీర్ష మాసమున పంటకు వచ్చు పైరు
**अगाऊ** - वि० సంచకరువు; ముందటి ; क्रि०वि० తొలి; ముందు.
**अगाडी** - क्रि०वि० ముందు; ఎదుట; తొలి.
**अगाध** - वि० గంభీరమైన; మిక్కిలి లోతుగల; అర్థము కాని.
**अगास** - पुं० ఇంటిముందరి అరుగు.
**अगासी** - स्त्री० తలపాగ.
**अगाह** - वि० दे० आगाह.
**अगिन** - स्त्री० అగ్ని; वि० లెక్కలేని.
**अगियाना** - अ०क्रि० మండిపడుట; మిక్కిలి కోపగించుట.
**अगुआ** - पुं० నాయకుడు; మార్గదర్శకుడు; మొనగాడు.
**अगुआई** - स्त्री० మార్గదర్శకత్వము; నాయకత్వము; స్వాగతము.
**अगोचर** - वि० అగోచరము; తెలియరాని.
**अगोरना** - स०क्रि० ఎదురుచూచుట;

కాపలా కాయుట.

**अगोरा** - वि० రక్షించువాడు.

**अगोनी** - स्त्री० दे० अगवानी.

**अग्र** - पुं० మొన; ముందటి భాగము ; वि. శ్రేష్ఠమగు.

**अग्रज** - वि० ముందు జన్మించినవాడు; అన్న.

**अग्रसर** - पुं० ముందునడుచువాడు; నాయకుడు.

**अग्रहायण** - पुं० अगहन ; మార్గశీర్ష మాసము.

**अग्रहार** - पुं० బ్రాహ్మణులకు పారితోషికముగా ఇవ్వబడిన భూమిలేక గ్రామము.

**अग्राह्य** - वि० గ్రహింపరాని; స్వీకరించదగని.

**अघ** - पुं० పాపము; దుఃఖము.

**अघर** - वि० దుర్ఘటమైన; కష్టమైన.

**अघटित** - वि० అసంభవమైన; కఠినమైన; ఘటింపని ; అనివార్యమగు; తగని.

**अघमर्षण** - पुं० సర్వపాపములను నశింపజేయు జపము; ఒక ఋషి.

**अघाना** - अ०क्रि० ప్రసన్నమగుట; భోజన పానాదులచే తృప్తిజెందుట; సంతుష్ట మగుట.

**अघाड ; अगाऊ** - पुं० తృప్తి; సంతుష్టి.

**अघी** - वि० పాపి; దురాత్ముడు.

**अघोर** - वि० సుందరమగు; మనోహరము కాని; पुं० శివుని రూపములలో ఒకటి ఒక మత సంప్రదాయము.

**अघोरी** - पुं० అఘోర సంప్రదాయమునకు చెందినవాడు; భక్ష్యాభక్ష్యవివేకములేనివాడు అసహ్యముగా ఉండు వ్యక్తి.

**अघोष** - पुं० కవర్గాది 5 వర్గములలోని మొదటి రెండు అక్షరములు श,ष,स లును అఘోష వర్ణములు అనబడును.

**अघ्रानना** - स०क्रि० सूंघना ; వాసన చూచుట.

**अचंभा** - पुं० ఆశ్చర్యము.

**अचंभित** - पुं० ఆశ్చర్యము నొందిన

**अचकन** - पुं० ఒక విధమగు చొక్కా, లాల్చీ

**अचक्का** - वि० తెలియని

**अचगरी** - स्त्री० తుంటరి తనము; అల్లరి.

**अचर** - पुं० జడ పదార్థము.

**अचरज** - पुं० ఆశ్చర్యము अचंभा.

**अचल** - वि० చలించని पुं० పర్వతము.

**अचला** - वि० స్థిరమగు स्त्री० భూమి, పృథ్వి.

**अचानक** - क्रि०वि० అకస్మాత్తుగ.

**अचार** - पुं० ఊరగాయ.

**अचिंत्य** - वि० చింతించదగని.

**अचीता** - वि० ఆకస్మికమగు; చింతలేని; ఊహింపని.

**अचूक** - वि० వ్యర్థముగాని; అమోఘమైన.

**अचेत** - वि० ఏమరుపాటుగల; తెలియని; స్పృహలేని ; తప్పిన.

**अचेतन** - पुं० స్మృతిలేని; చేతనలేని; చైతన్యములేని.

**अच्छर** - पुं० अक्षर ; అక్షరాలు.

**अच्छा** - वि० మంచి; సరైన; బాగుగానున్న.

**अच्छाई** - स्त्री० మంచితనము.

**अच्युत** - वि० చ్యుతముగాని; ధృడమగు; నాశములేని.

**अछक** - वि० ఆకలిగొన్నవాడు; తృప్తినొందనివాడు

**अछत**-क्रि०वि० ఎదుట ఉండగా; సమక్షమున.

**अछूत ; अछूता** - वि० అంటరాని; అస్పృశ్యమగు, తాకరాని.

**अछेह** - वि० ఎడతెరిపిలేని; అధికమగు; అపరిమితమగు.

**अज** - वि० అజన్మ; పుట్టని; బ్రహ్మ; విష్ణు; మహేశ్వరుడు; మన్మథుడు; మేక; ప్రకృతి.

**अजकार** - पुं० जिक्र का बहुवचन.

**अजखुद** - क्रि०वि० आप से आप ; స్వయముగ.

**अजगर** - पुं० కొండచిలువ.

**अजगरी** - वि० సోమరి; కొండ చిలువవలె; स्त्री० సోమరితనము.

**अजदह** - पुं० दे० अज़गर.

**अजनबी** - वि० ఎరగని; పరాయి; పరదేశి; अनजान.

**अजनबीपन** - पुं० పరిచయములేమి; వింత.

**अजब** - वि० విచిత్రమగు; విలక్షణమగు; వింతయైన.

**अजबर** - क्रि०वि० కేవలము స్మరణశక్త్యాధారముగ; ఆశువుగ.

**अजमत** - स्त्री० మహోన్నత; గొప్పదనము.

**अजमाना** - स०क्रि०दे० आजमाना.

**अजर** - वि० వార్ధక్యములేని; ముసిలితనములేని; క్షీణించని.

**अजवाइन ; अजवाचन** - स्त्री० వాము.

**अजस** - पुं० అపకీర్తి.

**अजसरे** - क्रि०वि० మొదటినుండి.

**अजस्र** - क्रि०वि० సర్వదా; ఎల్లప్పుడు; అవిచ్ఛిన్నముగా.

**अजह ; अजहू** - क्रि०वि० आज भी ; నేటికిని.

**अजाँ** - स्त्री० అజ్ఞానము अव्य० ఇందువలన

**अजा** - वि० జన్మించని; జన్మలేని स्त्री० ఆడమేక; ప్రకృతి, భ్రమ.

**अजाची** - वि० आयाची ; యాచించని.

**अजात** - वि० కులములేని; వెలివేయ బడిన; జన్మించని.

**अजान**-स्त्री॰बाँग; నమాజుకొరకు పిలుపు.
**अजान** - वि॰ తెలివిలేని; पुं॰ అజ్ఞానము.
**अजाब**-पुं॰ యాతన; దండన; ప్రాయశ్చిత్తము.
**अजायब-खाना ; अजायब घर** - पुं॰ వస్తు ప్రదర్శనశాల; సంగ్రహాలయము.
**अजित** - वि॰ జయింపబడని.
**अजिन** - वि॰ పులి లేక జింకచర్మము; తోలు.
**अजिर** - पुं॰ ముంగిలి; వాకిలి.
**अजी** - अव्य॰ సంబోధనశబ్దము; అయ్యా! ఓయీ!
**अजीज** - वि॰ ప్రియమైన; ఆదరింపదగిన पुं॰ మిత్రుడు.
**अजीत** - वि॰ జయింపబడని.
**अजीब** - वि॰ అద్భుతమైన **अनोखा.**
**अजीब गरीब**-पुं॰ అపూర్వమైన; **अनोखा.**
**अजीम** - पुं॰ వృద్ధుడు; పూజ్యుడు; **बुजुर्ग;** वि॰ మహత్తరమైన; విస్తృతమైన.
**अजूह** - पुं॰ చమత్కారము; విలక్షణ పదార్థము; అద్భుతము.
**अजूह** - पुं॰ యుద్ధము.
**अजौ** - क्रि॰वि॰ ఇంకనూ; నేడు కూడా; నేటివరకు.
**अज्ञ** - वि॰ తెలివిలేనివాడు; మూర్ఖుడు.
**अज्ञता** - स्त्री॰ అజ్ఞానము.
**अज्ञात** - स्त्री॰ తెలియని.
**अज्ञानी** - वि॰ తెలియని; మూర్ఖుడైన.
**अज्ञेय** - वि॰ తెలియశక్యముగాని.
**अट** - स्त्री॰ ప్రతిబంధకము; షరతు.
**अटक** - स्त्री॰ అడ్డు; చిక్కు; అడ్డంకు; విఘ్నము. वि॰ విచ్చలవిడిగా తిరుగువాడు.
**अटकना** - अ॰क्रि॰ తగుల్కొనుట; చిక్కుకొనుట; నిలుచుట; తటాలున ఆగుట.
**अटकल** - स्त्री॰ ఊహ, అంచన.
**अटकलना** - स॰क्रि॰ అంచనా వేయుట, ఊహించుట.
**अटकलपच्चू** - पुं॰ కపోల కల్పన.
**अटकलबाज** - पुं॰ అంచనా వేయుటలో దిట్ట.
**अटका** - स्त्री॰ విఘ్నము.
**अटकाना** - स॰क्रि॰ అటకాయించుట; అడ్డుపెట్టుట; ఆటంకపరచుట.
**अटकान**-पुं॰ విఘ్నము; అడ్డంకి; ఆటంకము.
**अटखट** - वि॰ అస్తవ్యస్త; గడబిడ.
**अटना**-अ॰क्रि॰ తిరుగుట; విహరించుట.
**अटपट**-वि॰ అసంబద్ధమైన; వంకరటింకరగా.
**अटपटा** - वि॰ दे॰ अटपट.
**अटपटाना**-अ॰क्रि॰ సంకోచించుట; తటపటాయించుట; తూలుచు నడచుట.
**अटल** - वि॰ అచంచలముగ; స్థిరముగ.

**अटवी** - स्त्री० जंगल ; అడవి.

**अटा** - स्त्री० అటక; మేడమీది గది.

**अटारी** - स्त्री० మేడ; అటక; పై అంతస్తు; ధాన్యరాశి.

**अटाल** - पुं० బురుజు.

**अटूट** - वि० విరగని; దృఢమగు.

**अटेरना** - स०क्रि० మితిమీరి మద్యపానము చేయుట; ఆసుపోవుట.

**अट्टहास** - पुं० అట్టహాసము; పెద్ద నవ్వు.

**अट्टालिका** - स्त्री० మేడ; మేడపై గది.

**अट्टी** - स्त्री० लच्छा ; నూలు విచ్చు.

**अट्ठाईस** - वि० 28.

**अट्ठानवे** - वि० 98

**अट्ठारह** - वि० 18.

**अट्ठावन** - वि० 58.

**अट्ठासी** - वि० 81.

**अठखेली** - स्त्री० ఒయ్యారపు నడక; వేడుక.

**अठन्नी** - स्त्री० అర్ధరూపాయి నాణెము.

**अठपाव** - पुं० కొంటెతనము.

**अठमासा** - पुं० సీమంతము वि० ఎనిమిది మాసాలకే పుట్టిన.

**अठलाना** - अ०क्रि० दे० इठलाना.

**अठवारा** - पुं० ఎనిమిది రోజుల కాలము.

**अठोठ** - पुं० ఆడంబరము.

**अडंगा**-पुं० విఘ్నము; ఆటంకము; కుస్తీ.

**अडचन** - स्त्री० విఘ్నము; ఆటంకము.

**अडतालीस** - वि० 48.

**अडतीस** - वि० 38.

**अडना** - अ०क्रि० ఆగుట; మొండిగా నుండుట (తన మాటమీద) हठना.

**अडाना**-स०क्रि०అడ్డగించుట; చొప్పించుట पुं० పోటీగుంజ.

**अडार** - पुं० సమాచారము; రాశి; కట్టెల పోగు; కట్టెల అడితి.

**अडारना** - स०क्रि० వేయుట; ఇచ్చుట.

**अडिग** - वि० अचंचल ; అచంచలమైన; దృఢమైన.

**अडियल**-वि०మంకుపట్టు పట్టిన; మొండి; సోమరియైన.

**अडी** - स्त्री० అవసర సమయము; మొండి పట్టు.

**अडीठ** - वि० కనిపించని.

**अडोल** - वि० अचंचल ; చలించని.

**अडोस-पडोस** - पुं० ఇరుగు - పొరుగు.

**अडोसी-पडोसी** - पुं० ఇరుగు - పొరుగు వారు.

**अड्डा** - पुं० కేంద్రము; బసచేయుచోటు; ఆగుచోటు; ప్రధానస్థానము; కార్లు, రిక్షాలు మొ.నవి ఆగుచోటు Stand.

**अढतिया** - पुं० కమీషన్ వర్తకుడు; దళారి.

**अढाई** - वि० ढाई ; రెండున్నర.

**अढुक** - पुं० ठोकर ; ఎదురు దెబ్బ.

**अणि** - स्त्री० ఇరుసుచీల; మొరికి; హద్దు; అంచు.

**अणिमा** - स्त्री० అష్టసిద్ధులలో ఒకటి ; ఒక ఐశ్వర్యము.

**अणु** - पुं० అణువు; సూక్ష్మకణము.

**अत:** - क्रि०वि० కనుక; కాబట్టి.

**अतएव** - क्रि०वि० కనుకనే; కాబట్టే.

**अतनु** - वि० శరీరములేని; पुं० మన్మథుడు.

**अतर** - पुं० इत्र ; అత్తరు.

**अतरसो** - क्रि०वि० మొన్నటి క్రితపురోజు; ఎల్లుండి తరవాతి రోజు.

**अतल** - पुं० పాతాళలోకము.

**अतसी** - स्त्री० अलसी ; అవిసె చెట్టు.

**अता** - स्त्री० బహుమానము; దానము; అనుగ్రహము.

**अतालीक** - पुं० గురువు.

**अताई** - वि० నేర్పరియగు; ధూర్తుడు; అనుభవశాలి.

**अति** - पुं० ఎక్కువ; మక్కువము.

**अतिक्रम** - पुं० మీరుట; ఉల్లంఘించుట.

**अतिक्रांत** - वि० హద్దుమీరిన.

**अतियार** - पुं० అతిక్రమణము.

**अतिरथ ; अतिरथी** - पुं० పెక్కుమందితో యుద్ధము చేయు మహా యోధుడు.

**अतिरिक्त** - क्रि०वि० अलवा ; అదిగాక.

**अतिरेक** - पुं० ఆధిక్యము.

**अतिरोग** - पुं० క్షయ.

**अतिवाद** - पुं० కఠోరవచనము; కుటూక్తి; అతిశయోక్తి.

**अतिशय** - वि० చాల ఎక్కువ.

**अतिशयोक्ति** - स्त्री० అతిశయోక్తి అనబడు అలంకారము; ఒక అర్థాలంకారము; గొప్పగా పొగడుట.

**अतिसार** - पुं० సంగ్రహణిరోగము; పాసనాల రోగము.

**अतींद्रिय** - वि० अगोचर ; అగోచరమైన

**अतीत** - वि० గడచిన; వెనుకటి.

**अतुराई** - स्त्री० చాంచల్యము; శీఘ్రత; ఆదుర్దా.

**अतुराना** - अ०क्रि० ఆతురపడుట.

**अतुल ; अतुलित** - पुं० సాటిలేని; అమిత ము.

**अतुल्य** - वि० अनुपम ; అనుపమైన; సాటి లేని.

**अतृष्ण** - वि० కోరికలు లేని.

**अतोर** - वि० దృఢమైన; విరుగని.

**अत्ता** - स्त्री० తల్లి; తల్లిసోదరి; అత్త.

**अत्तार** - पुं० అత్తరు అమ్మువాడు; యూనాని మందులు అమ్మువాడు.

**अत्यंत** - वि० బహు ఎక్కువ; మిక్కిలి.
**अत्यय** - पुं० మృత్యువు; నాశము; దుఃఖము; దండన; శిక్ష; దోషము.
**अत्याचार** - पुं० దుండగము; దురాచారము; పౌర్జన్యము.
**अत्याचारी** - वि० దురాచారి; అన్యాయము చేయువాడు; క్రూరుడు.
**अत्युक्ति** - स्त्री० అతిశయోక్తి.
**अत्र** - क्रि०वि० ఇచ్చట.
**अत्रक** - वि० ఇచ్చటి.
**अत्रप** - वि० సిగ్గులేని; నీతిలేని.
**अथ** - क्रि०वि० మంగళవాచకము; ఇప్పుడు.
**अथक** - वि० అలసిపోని.
**अथवा** - अव्य० లేక या.
**अथाई** - स्त्री० ఇంటిముందు అరుగు; పంచాయతీ సభ జరుగు చోటు; కూడలి; రచ్చవాసడి
**अथाह** - वि० గంభీరమైన; లోతైన; లోతు తెలియని.
**अदण्ड्य** - वि० దండింపదగని; దండింపరాని.
**अदंत** - वि० దంతములేని; పళ్ళులేని.
**अदद** - स्त्री० సంఖ్య; లెక్క.
**अदना** - वि० అతిసామాన్యమైన; తుచ్ఛమైన.
**अदब** - पुं० మర్యాద; వినయము; ఆదర - సత్కారము; వాఙ్మయము.
**अदबदाकर** - क्रि०वि० అవశ్యముగా; తప్పని సరిగా.
**अदबी** - वि० సాహిత్య సంబంధమైన; సాహిత్యవేత్త.
**अदमपैरवी** - स्त्री० న్యాయ విచారణకు తగిన చర్య తీసుకొనకుండుట.
**अदम्य** - वि० అణచశక్యముగాని.
**अदरक** - पुं० అల్లము.
**अदल** - पुं० న్యాయము वि० సైన్యములేని; ఆకులు లేని.
**अदल-बदल** - पुं० మార్పిడి; పరివర్తిన; **हेरफेर**.
**अदहन** - पुं० ఎసరు; ఎసరు నీరు.
**अदा** - वि० చెల్లింపు; నిర్వహించుట; स्त्री० ఒయ్యారము; కులుకు **आदा करना**; చెల్లించుట; బాకీ తీర్చుట.
**अदाई** - स्त्री० చెల్లింపు.
**अदाबन्दी** - स्त्री० అప్పుతీర్చుటకు కాలనిర్ణయము; అప్పును వాయిదా పద్ధతిలో తీర్చు.
**अदायगी** - स्त्री० అప్పుతీర్చుట; అప్పు తీర్చు.
**अदालत** - स्त्री० న్యాయస్థానము; కోర్టు.
**अदालती** - स्त्री० న్యాయస్థానమునకు సంబంధించిన; కోర్టు వ్యవహారములు

తెలిసిన లౌకికుడు.

**अदावत** - स्त्री॰ విరోధము; శత్రుత్వము; ద్వేషము.

**अदीठ** - वि॰ చూడబడని; గుప్తమైన.

**अदीब** - पुं॰ సాహిత్యవేత్త.

**अदृश्य** - वि॰ అదృశ్యమైన.

**अद्ध, अद्धा** - पुं॰ అర్ధాంశము; సగము.

**अद्य** - क्रि॰वि॰ నేడు; ఇప్పుడు.

**अद्रि** - पुं॰ పర్వతము; కొండ.

**अद्वितीय** - वि॰ అద్వితీయమైన; సాటిలేని.

**अद्वैत** - वि॰ రెండులేని, ఒంటరి पुं॰ పర బ్రహ్మ; వేదాంత మార్గము; బ్రహ్మమే సత్యమని ఘోషించు సిద్ధాంతము.

**अध:** - क्रि॰वि॰ క్రింద.

**अधकचरा** - वि॰ అపరిపక్వమైన; బాగుగా పండని. Half backed.

**अधकपारी** - स्त्री॰ పార్శ్వపునొప్పి.

**अधकहा** - वि॰ అస్పష్టముగా చెప్పబడిన.

**अध खिला** - वि॰ సగము విచ్చిన.

**अधम** - वि॰ నీచుడు; నీచము.

**अधमरा** - वि॰ సగము చచ్చిన.

**अधर** - पुं॰ క్రింది పెదవి; పాతాళము; ఆకాశము.

**अधारी** - स्त्री॰ ఆధారము; సాధువుల చేతి దండము.

**अधिक** - वि॰ ఎక్కువ; అధికము.

**अधिकरण** - पुं॰ అధ్యాయము; ఆధారము; సప్తమీ విభక్తి.

**अधिकृत** - वि॰ స్వాధీనమైన.

**अधिकृति** - स्त्री॰ స్వత్వము; అధికారము.

**अधिक्षेप** - पुं॰ ఆక్షేపము; అవమానము.

**अधिगत** - वि॰ లభించిన; తెలిసిన; చదువబడిన.

**अधिदेव** - पुं॰ ఇష్టదేవత; కులదైవము.

**अधिनायक** - पुं॰ నియంత; ముఖ్యుడు; నాయకుడు.

**अधिप** - पुं॰ రాజు; స్వామి; యజమాని.

**अधियाना** - स॰क्रि॰ ఒకదానిని రెండు సగభాగములు చేయుట లేక రెండు సగ భాగములుగా పంచుట.

**अधिवर्ष** - पुं॰ లీపు సంవత్సరము (366 రోజులు గల సంవత్సరము)

**अधिवेशन** - पुं॰ సమావేశము; సభ.

**अधिष्ठान** - पुं॰ నివాసస్థానము; ప్రభుత్వము; రాజ్యాధికారము; ఆశ్రమము; సన్నిధి.

**अधीन** - वि॰ అధీనము; ఆధారపడిన.

**अधीर** - वि॰ అధీరుడు, ధైర్యములేని; కలతజెందిన.

**अधीश**-पुं॰ రాజు; పతి; స్వామి; యజమాని.

**अधूरा** - वि॰ సగము పూర్తి అయిన.

**अधेड** - पुं० నడివయస్సుగల

**अधेला** - पुं० అరగాని.

**अध्यवसाय** - पुं० నిరంతర పరిశ్రమ; పట్టుదల.

**अध्यवसायी** - वि० నిరంతరము శ్రమించు వాడు; ప్రయత్నించువాడు.

**अध्यवसित** - वि० ప్రయత్నింపబడిన

**अध्यापक** - पुं० ఉపాధ్యాయుడు; అధ్యాపకుడు.

**अध्यापन** - पुं० బోధించుట; చదువు చెప్పుట.

**अध्यापिका** - स्त्री० ఉపాధ్యాయిని.

**अध्याय** - पुं० అధ్యాయము; పరిచ్ఛేదము.

**अध्यारोप ; अध्यारोपण** - पुं० మిథ్యా జ్ఞానము; మిడిమిడి జ్ఞానము; నేరము; దోషము.

**अध्याहार** - पुं० వాక్యమును పూరించుటకు మరియొకచోటునుండి శబ్దములు తెచ్చుట; తెచ్చి పూరించుట; తర్క వితర్కము.

**अध्येता** - पुं० అధ్యయనము చేయువాడు.

**अध्य** - पुं० దారి; మార్గము; బాట.

**अध्यग** - पुं० పాంథుడు; బాటసారి.

**अध्वर** - पुं० యజ్ఞము.

**अनंग** - पुं० మన్మథుడు; वि० శరీరములేని.

**अनंग क्रीडा** - स्त्री० రతి; సంభోగము.

**अनंत** - वि० అంతములేని; అపరిమితమైన.

**अनंतर** - क्रि०वि० పిమ్మట; పిదప.

**अन** - क्रि०वि० లేని; వినా, **बिना, बगैर.**

**अनकरीब** - क्रि०वि० రమారమి; తరచుగా.

**अनकहा** - वि० చెప్పబడనది.

**अनख** - पुं० క్రోధము; ఈర్ష్య; ద్వేషము దుఃఖము; కోపము.

**अनखना** - अ०क्रि० కోపగించుట.

**अनखी** - वि० కుళ్ళుబోతు; త్వరగా కోపగించువాడు; తీయగాలేని. **गुस्सावर.**

**अनगढ** - वि० మొరటు అయిన; చిత్రమైన.

**अनगिनत** - वि० లెక్కలేని; లెక్కింపరాని.

**अनघ** - वि० పాపరహితుడు; పుణ్యాత్ముడు; పుణ్యము.

**अनचाखा** - वि० ఎంగిలిచేయబడని; రుచి చూడబడని.

**अनजान** - वि० తెలియని; అజ్ఞాని; పరిచయములేని.

**अनत** - वि० వంగని; మరియొకటి; వినయములేని क्रि०वि० మరియొక చోట .

**अनधिकार** - वि० అధికారము లేని.

**अनन्नास** - पुं० అనాసదుంప (పండు).

**अनन्य** - वि० సాటిలేని.

**अनन्वय** - वि० పొందికలేని पुं० తనకు తనే

సాటి - సాటిలేనిది; ఇవి అర్థాలు కావు.

**अनन्वित** - वि० అసంబద్ధమైన; పొందిక లేని.

**अनपच** - पुं० అజీర్ణము.

**अनपढ** - पुं० చదువు రానివాడు

**अनपत्य** - वि० నిస్సంతానుడు; సంతానము లేని.

**अनपेक्ष** - वि० అపేక్షలేని; లక్ష్యములేని.

**अनपेक्षित** - वि० ఇష్టములేని; అనావశ్యమైన.

**अनबन** - वि० వైమనస్యము; విరోధము; జగడము.

**अनभल** - स्त्री० కీడు; చెరుపు.

**अनभला** - वि० చెడ్డ पुं० కీడు.

**अनभिज्ञ** - वि० తెలియని; అజ్ఞాని.

**अनभिमत** - वि० ఇష్టములేని; అభిమతము కాని.

**अनभ्यस्त** -वि० అభ్యాసములేని; అలవాటు లేని.

**अनमन** - वि० దిగాలుగానున్న; విచారము గల.

**अनमना** - वि० दे० अनमन.

**अनमिल ; अनमेल** - वि० అసంబద్ధమైన; పోలికలేని; కలవని.

**अनमीलना** - स०क्रि० (కన్నులు) తెరచుట.

**अनमोल** - वि० అమూల్యమైన; అందమైన; విలువైన.

**अनय**-पुं० అనీతి; అన్యాయము; అమంగళము.

**अनयन** - वि० కన్నులేని; గ్రుడ్డివాడు.

**अनरथ** - पुं० అనర్థము.

**अनरीति** - स्त्री० కురీతి; చెడ్డ ఆచారము; చెడునడత.

**अनर्गल** - वि० ఇష్టంవచ్చినట్లు; నిరాటంకముగా.

**अनर्घ**-वि०అమూల్యమైన; ఎక్కువ విలువైన

**अनर्ह** - वि० అర్హముకాని; అయోగ్యమైన.

**अनर्थ** - वि० అర్థములేని; అనర్థము; ఆపద.

**अनल** - पुं० అగ్ని.

**अनलख** - वि० కంటికి కనిపించని.

**अनलहक** - पुं० నేనే భగవంతుడను అనువాడు; అహం బ్రహ్మాస్మి.

**अनल्प** - वि० విస్తారము; ఎక్కువ.

**अनवट** - पुं० గానుగ ఎద్దు కళ్ళగంత; కాలిమెట్టె

**अनवद्य** - वि० దోషములేని; నిర్దోషమైన.

**अनवधि** - क्रि०वि० ఎల్లప్పుడు; वि० అంతు లేని.

**अनवरत** - क्रि०वि० ఎల్లప్పుడు; నిరంతరము.

**अनशन** - पुं० उपवास ; ఉపవాసము.

**अनसुना** - वि० వినబడని.

**अनहद-नाद** - पुं० ప్రణవనాదము; ఓంకార నాదము.

**अनहित** - पुं० కీడు; విరోధము; वि० హానికరమైన.

**अनाहितू** - पुं० అపకారి वि० కీడు కోరువాడు.

**अनहोनी** - स्त्री० అసాధారణ విషయము; वि० అసంభవము.

**अनाकानी** - स्त्री० పెడచెవిని పెట్టుట; వినీవినట్లుండుట.

**अनागत** - वि० రానిది; లేనిది; జరుగబోవునది; తెలియనది. क्रि०वि० హఠాత్తుగా.

**अनाज** - पुं० ధాన్యము.

**अनाडी**-वि० అనుభవములేని; అయోగ్యుడు; చేతగాని; తెలియని.

**अनाथ** - वि० దిక్కులేనివాడు; దీనుడు.

**अनादि** - वि० ఆదిలేని; నిత్యమైన.

**अनादृत** - वि० తిరస్కరింపబడిన; ఆదరింపబడని.

**अनाप-शनाप** - वि० నిరర్థకమైన; ఉపయోగములేని; అర్థం - పర్థం లేని ప్రలాపము.

**अनामय** - वि० జబ్బులేని ; पुं० ఆరోగ్యము.

**अनामा** - वि० పేరు ప్రఖ్యాతులు లేని.

**अनामिका** - स्त्री० ఉంగరపు వ్రేలు.

**अनायास**-क्रि०वि० సులువుగా; ప్రయాసము లేకుండా తటాలున.

**अनार** - पुं० దానిమ్మ చెట్టు లేక కాయ; చిచ్చుబుడ్డి

**अनावृत** - वि० ఆవరణలేని; కప్పబడని.

**अनावृष्टि** - स्त्री० వర్షాభావము.

**अनास़** - पुं० మిత్రుడు.

**अनासक्त** - वि० ఆసక్తిలేని; కోరికలేని.

**अनास्था** - स्त्री० అశ్రద్ధ; నమ్మకము లేని.

**अनाहार** - वि० నిరాహారము; पुं० ఉపవాసము; లంఘనము.

**अनाहूत** - वि० ఆహ్వానింపబడని.

**अनिंद्य** - वि० దోషరహితమైన; ఉత్తమమైన;; దోషములేని.

**अनिच्छा** - स्त्री० అయిష్టము.

**अनित्य** - स्त्री० అస్థిరమైన; అశాశ్వతమైన.

**अनिमिष ; अनिमेष** - क्रि०वि० రెప్పవేయకుండా; నిరంతరము पुं० చేప; మీను.

**अनियंत्रित** - वि० నిరంకుశమైన; నిగ్రహము లేని.

**अनियमित**-वि० నియమములేని; అనిశ్చితము.

**अनियारा** - वि० మొనగల; పదునైన.

**अनिर्दिष्ट** - वि० నిర్దేశింపబడని.

**अनिर्वचनीय** - वि० చెప్పరాని; వర్ణింప

నలవిగాని.
**अनिर्वाच्य** - वि० చెప్పుకొనదగని; వర్ణింప వీలులేని.
**अनिवार्य** - वि० తప్పనిసరి.
**अनिल** - पुं० గాలి; వాయువు
**अनिष्ट** - वि० ఇష్టముకాని; पुं० అశుభము.
**अनी** - स्त्री० కొన, మొన; లజ్జ; దెప్పి పొడుపు; సేన.
**अनीक** - पुं० సేన.
**अनीठ** - वि० ఇష్టములేనిది; చెడ్డది.
**अनीत ; अनीति** - पुं० నీతిలేని; పోకిరి తనము; అన్యాయము; అనీతి.
**अनीश** - पुं० అనాధుడు; దిక్కులేనివాడు; దీనుడు; శ్రేష్ఠుడు.
**अनीस** - पुं० दे० अनीश.
**अनु** - ఒక ఉపసర్గము - తరువాత; ప్రతియొక్క మాటి మాటికి; తో కూడ అను ఎన్నో అర్థములిచ్చును.
**अनुकंपा** - स्त्री० దయ; దాక్షిణ్యము.
**अनुकरण** - पुं० నకలు.
**अनुगृहीत** - वि० కృతజ్ఞుడు.
**अनुग्रह** - पुं० దయ; అనుగ్రహము; సహాయము.
**अनुग्रही** - वि० దయగల; पुं० సంరక్షకుడు.
**अनुगत** - पुं० సేవకుడు.
**अनुगामी** - पुं० ఆజ్ఞానువర్తి; వెంటనడచు వాడు.
**अनुचर** - पुं० అనుచరుడు; సేవకుడు.
**अनुच्छेद** - पुं० అధ్యాయము; పరిచ్ఛేదము.
**अनुज** - पुं० తమ్ముడు.
**अनुज्ञा** - स्त्री० ఆజ్ఞ.
**अनुपात** - पुं० దుఃఖము; పశ్చాత్తాపము; సంబంధము, Ratio.
**अनुनय** - पुं० వినయము; ప్రార్థన; వేడు కొనుట.
**अनुनयी** - पुं० విధేయుడు.
**अनुनाद** - पुं० ప్రతిధ్వని गूँज.
**अनुनासिक** - वि० ముక్కుతో పలకబడు నది Nasal.
**अनुपम** - वि० అద్వితీయము; సాటిలేని.
**अनुपयुक्त** - वि० పనికిమాలిన.
**अनुपलब्ध** - वि० పొందబడనిది.
**अनुपस्थित** - वि० హాజరుకాని.
**अनिपस्थिति** - स्त्री० గైరుహాజరు.
**अनुप्राणित** - वि० ప్రేమింపబడిన; పోషింప బడిన; జీవించుచున్న.
**अनुप्राशन** - पुं० అన్నప్రాశన.
**अनुप्रास** - पुं० వర్ణసామ్యము; ఒక శబ్దాలం కారము.
**अनुबंध** - पुं० అనుబంధము; ఒప్పందము;

సంబంధము.

**अनुभूति** - स्त्री० అనుభవము.

**अनुभोग** - पुं० అనుభవము; భోగము.

**अनुमति** - स्त्री० అనుజ్ఞ; సమ్మతి.

**अनुमान** - पुं० అంచనా; ఉజ్జాయింపుగా.

**अनुमानत** - क्रि०वि० अंदाजन ; ఉజ్జాయింపుగా.

**अनुमेय** - वि० ఊహింపదగినది.

**अनुमोदन** - पुं० ఆమోదము.

**अनुयायी** -पुं० అనుసరించువాడు; वि०వెంబడించువాడు.

**अनुरक्त** - वि० అనురాగముగల; पुं०అనురాగము గలవాడు.

**अनुराग** - पुं० అనురాగము; ప్రేమ; ఎరుపు రంగు; శ్రద్ధ.

**अनुरोध** - पुं० మర్యాదగా బలవంత పెట్టుట; ఆటంకము.

**अनुलेपन** - पुं० లేపనము; అలుకు; నలుగు పెట్టుట.

**अनुशृति** - स्त्री० పారంపర్యము; వినికిడి.

**अनुषंगी** - वि० సంబంధించిన; తప్పని సరిగా జరుగునది; అనురాగముగల.

**अनुष्ठान** - पुं० వేదోక్తవిధి; ఆచారము.

**अनुसरण** - पुं० అనుసరణము.

**अनुसार** - क्रि०वि० అనుసారముగా; అనుగుణముగా.

**अनूठा** - वि० అద్భుతమైన.

**अनूढ** - वि० వివాహముకానివాడు.

**अनूढा** - वि० వివాహము కాని స్త్రీ.

**अनूदित** - वि० అనువదింపబడిన.

**अनूप** - वि० అనుపమైన; సాటిలేని.

**अनुवाद** - पुं० తర్జుమా; అనువాదము.

**अनुवादक** - पुं० అనువాదకుడు; తర్జుమా చేయువాడు.

**अनेरा** - वि० వ్యర్థము; నిజముకాని; వృథా; అన్యాయముగా వ్యవహరించువాడు.

**अनैस** - पुं० కీడు; దిగులు वि० చెడ్డ; అయిష్టమైన; పనికిమాలిన.

**अन्देशा** - पुं० సంశయము; తటపటాయింపు; హాని; దుఃఖము.

**अन्न** - पुं० ధాన్యము; అన్నము.

**अन्ना** - स्त्री० తల్లి; దాది.

**अन्य** - वि० పరాయి; ఇతర.

**अन्यत्र** - क्रि०वि० మరియొకచోట.

**अन्यथा** - क्रि०वि० లేనియెడల; వేరు విధముగా.

**अन्यपुरूष** - क्रि०वि० ప్రథమ పురుషము third person ; ఇతరుడు.

**अन्यमनस्क** - वि० పరధ్యానములోనున్న; దిగులుగానున్న.

**अन्योन्य** - सर्व० పరస్పరము.

**अन्वय** - पुं० పరస్పర సంబంధము; అన్వయము; వంశము.

**अन्वीक्षण** - पुं० సూక్ష్మ పరిశీలన.

**अन्वेषण** - पुं० అన్వేషణ; వెదకుట; పరిశోధన.

**अन्वेषी** - पुं० పరిశోధించువాడు.

**अपंग** - वि० వికలాంగుడు; అంగహీనుడు.

**अप** - उपस - విరుద్ధార్థమునిచ్చు ఉపసర్గము.

**अपकर्ष** - पुं० పతనము; అవమానము.

**अपकाजी** - वि० స్వార్థపరుడు; స్వార్థము కలవాడు; చెడ్డపని చేయువాడు.

**अपकार** - पुं० అపకారము; అవమానము; హాని.

**अपकीर्ति** - स्त्री० అపకీర్తి; అప్రతిష్ఠ.

**अपक्व** - वि० పండని; పక్వముకాని.

**अपगा** - स्त्री० नदी; दरिया ; నది.

**अपच** - पुं० అజీర్ణము.

**अपचय** - पुं० లోటు; వినాశము; హాని.

**अपचार** - पुं० అపచారము; తప్పు; అపకీర్తి.

**अपजय** - स्त्री० ఓటమి.

**अपटु** - वि० అసమర్థుడు; చేతకాని.

**अपढ** - वि० చదువురాని; అజ్ఞాని.

**अपत** - वि० ఆకులులేని; సిగ్గులేని.

**अपत्य** - पुं० సంతానము.

**अपन** - सर्व० మనము.

**अपना** - सर्व० తన; ఆత్మీయుడు.

**अपनाना** - स०क्रि० దగ్గరకు తీసికొనుట; తనలో లేక తమలో కలుపుగొనుట.

**अपनापन ; अपनायत** - पुं०स्त्री० ఆత్మీయత

**अपनापा** - पुं० दे० अपनापन.

**अपने आप** - सर्व० స్వయముగా.

**अपभ्रंश** - पुं० పదముల యొక్క వికృత రూపము; అపభ్రంశము.

**अपमान** - पुं० అవమానము.

**अपमार्ग** - पुं० చెడుదారి.

**अपयश** - पुं० అపకీర్తి.

**अपर** - वि० ఇతరము; వెనుకటి.

**अपरा** - स्त्री० లౌకికవిద్య; మరియొక; పశ్చిమ దిశ.

**अपराजिता** - स्त्री० కోకిల; దుర్గాదేవి.

**अपराह** - पुं० మిట్ట మధ్యాహ్నము.

**अपरिमित** - वि० మితములేని.

**अपरिमेय** - वि० ఊహాతీతమైన.

**अपर्णा** - स्त्री० పార్వతి; దుర్గ.

**अपलक** - वि० రెప్పవాల్చక.

**अपवर्ग** - पुं० మోక్షము; దానము; నిర్వాణము.

**अपवाद** - पुं० సాధారణ నియమునకు భిన్నముగా నున్నది; అపకీర్తి.

**अपशब्द** - पुं० చెడు శబ్దము; తిట్టు.

**अपसरण** - पुं० దూరముచేయుట; వెడలు గొట్టుట.

**अपस्मार** - पुं० మూర్ఛరోగము.

**अपहृत** - वि० దొంగిలించబడిన.

**अपांग** - पुं० కటాక్షము; క్రీగంటి చూపు ; वि० వికలాంగుడు.

**अपा** - पुं० అహంకారము; గర్వము; దర్పము.

**अपादान** - पुं० విడిపోవుట; వేరగుట; పంచమీ విభక్తి.

**अपाय** - पुं० అపాయము; ఆపద; నాశము.

**अपार** - वि० దాటశక్యముగాని; అంతులేని.

**अपावन** - वि० అపవిత్రమైన, అపావనమైన.

**अपाहिज** -वि० అపాంగుడు; వికలాంగుడు; కుంటి గ్రుడ్డి; సోమరి.

**अपितु** - अव्य० बल्कि ; కాని; అదిగాక.

**अपील** - स्त्री० నివేదనము; ప్రార్థన.

**अपूर्व** - वि० అద్భుతమైన पुं० పశ్చిమదిశ.

**अपेक्षा** - स्त्री० కోరిక; వాంఛ; ఆశ अव्य० కంటె ; से.

**अपेक्षित** - वि० కోరబడిన; వాంఛితము.

**अपेय** - वि० త్రాగకూడని.

**अपेल** - वि० अटल ; దృఢమైన.

**अप्रतिभ**-वि० నివ్వెరబోయిన; తెల్లబోయిన.

**अप्रतिहत** - वि० అడ్డు-ఆపులేని; జయించిన.

**अप्राप्त** - वि० పొందని.

**अप्राप्य** - वि० ప్రాప్తించని; లభ్యముగాని; దొరకని.

**अप्रिय** - वि० ప్రియముకాని; రుచిలేని.

**अफई** - पुं० త్రాచుపాము.

**अफगन** - पुं० విజయము సాధించినవాడు, పడగొట్టువాడు.

**अफरना ; अफराना** - अ०क्रि० కడుపు నిండా భుజించుట; భోజనముతో తృప్తి నొందుట.

**अफलातून** - पुं० ప్లేటో అను గ్రీకుదేశపు తత్వవేత్త.

**अफवाह** - स्त्री० వదంతి.

**अफसर** - पुं० ఆఫీసరు, అధికారి.

**अफसाना** - पुं० किस्सा ; కథ.

**अफसोस** - पुं० దుఃఖము.

**अफीक** - वि० సదాచారి

**अफीम** - स्त्री० నల్లమందు.

**अफीमची** - पुं० అలవాటుగా నల్లమందు తినువాడు.

**अब** - क्रि०वि० ఇప్పుడు.

**अबखरा** - पुं० ఆవిరి.

**अबतर** - वि० చెడ్డ; చెడిన; పతనమైన.

**अबतरी** - स्त्री० చెడుగు; పతనము.

**अबद** - पुं० అనంతము.
**अबरक ; अबरख** - पुं० అభ్రకము.
**अबलक ; अबलख** - वि० चितकबरा; दोरंगा या दुरंगा ; రెండు రంగులు కలసిన పుం० నలుపు తెలుపుల గుఱ్ఱము.
**अबला** - स्त्री० స్త్రీ.
**अबवाब** - पुं० అదనపు పన్ను; cess.
**अबाकबा** - पुं० వదులైన పొడుగుపాటి అంగరఖా లేక చొక్కా.
**अबादान** - वि० నిండిన; నిండుగనున్న; సమర్థమైన.
**अबादानी** - स्त्री० दे० आबादानी.
**अबाध ; अबाधित** - वि० నిరాటంకమైన; విఘ్నరహితమైన.
**अबार** - स्त्री० ఆలస్యము क्रि०वि० శీఘ్రముగా.
**अबीर** - पुं० బుక్కా; గులాము; పుప్పొడి
**अबुध** - वि० బుద్ధిహీనుడు.
**अबू** - पुं० తండ్రి.
**अबूझ** - वि०दे० अबुधा.
**अबे** - अव्य० తిరస్కార సూచక శబ్దము; అరే!
**अबे तबे तबे करना** - स०क्रि० - అసభ్యతా పూర్వంగా నిందించుట లేక మాట్లాడుట.
**अबेर** - स्त्री० ఆలస్యము.
**अब्द** - पुं० సంవత్సరము; మేఘము.
**अब्धि** - पुं० సముద్రము.
**अब्बा** - पुं० తండ్రి.
**अब्बास** - पुं० సింహము; మహమ్మదు సాహెబు యొక్క పినతండ్రిపేరు.
**अब्र** - पुं० మేఘము.
**अभद्र** - वि० అసభ్యుడు; నీచమగు.
**अभाग** - पुं० దురదృష్టము.
**अभागा** - पुं० భాగ్యహీనుడు.
**अभाग्य** - पुं० दे० अभाग.
**अभाव** - पुं० అభావము; లోటు.
**अभास** - दे० आभास.
**अभिघार** - पुं० మంత్రములతో ఇచ్చుబలి.
**अभिजात** - वि० గొప్ప వంశములో జన్మించిన
**अभिजित** - वि० విజయుడు; జయించిన వాడు.
**अभिज्ञ** - वि० తెలిసినవాడు.
**अभिज्ञा** - स्त्री० స్మృతి; అలౌకిక జ్ఞానము.
**अभिज्ञान** - पुं० గురుతు; స్మృతి చిహ్నము; జ్ఞాపకము.
**अभिधान** - पुं० పేరు; ఉపాధి; హోదా.
**अभिनंदन** - पुं० ప్రశంస; అభినందన; ఆనందము; పొగడ్త.

**अभिनय** - पुं० నటన; అభినయము.
**अभिनव** - पुं० ఆధునికము.
**अभिनिवेश**-पुं० తత్పరత; మనో యోగము.
**अभिनेता** - पुं० నటుడు; actor.
**अभिनेत्री** - पुं० నటి ; actoress.
**अभिन्न** - वि० తేడాలేని; భిన్నముకాని.
**अभिपन्न** - वि० ఆపద గ్రస్తుడు ; पुं० పాపి; అపరాధి.
**अभिभावक** - पुं० సంరక్షకుడు; పోషకుడు.
**अभिभाषण** - पुं० ఉపన్యాసము.
**अभिमत** - पुं० సమ్మతి.
**अभिमान** - पुं० అభిమానము; అహంకారము; గర్వము.
**अभियान** - पुं० దాడి; ముట్టడి; యాత్ర.
**अभियुक्त** - पुं० నేరస్థుడు.
**अभियोग** - पुं० నేరారోపణ; నేరము.
**अभियोगी** - पुं० ఫిర్యాది.
**अभिराम** - वि० మనోహరమైన.
**अभिरुचि** - स्त्री० కోరిక; ప్రవృత్తి.
**अभिलाष ; अभिलाषा** - पुं०स्त्री० అభిలాష; వాంఛ.
**अभिलेख** - पुं० శిలాశాసనము; తామ్రపత్రములలో వ్రాయబడినశాసనసూచన
**अभिवंदन ; अभिवंदना** - पुं० నమస్కారము; స్తుతి.
**अभिवंदनीय; अभिवंद्य**- पुं० నమస్కరింపదగిన; స్తుతింపదగిన.
**अभिवादक** - पुं० నమస్కరించువాడు; స్తుతించువాడు.
**अभिवादन** - पुं० శ్రద్ధాంజలి ; స్తుతి.
**अभिव्यंजन** - पुं० ; **अभिव्यंजना** - स्त्री० అభివ్యంజన; అభివ్యక్తి.
**अभिशंस ; अभिशंसा** - पुं०स्त्री० నేరము ఋజువుపరచుట ; శిక్షవిధించుట.
**अभिशप्त** - पुं० శపింపబడిన.
**अभिशाप** - पुं० శాపము.
**अभिसंधि** - स्त्री० కుట్ర; మోసము.
**अभिसार** - पुं० ప్రియుని కలసికొనుటకు చేయు యాత్ర.
**अभिसारना** - अ०क्रि० ప్రియుని కలసికొనుటకు వెళ్ళుట.
**अभिसारिका ; अभिसारिणी** - पुं० ప్రియుని కలసికొనుటకు సంకేతస్థలమునకు వెళ్ళు ప్రియురాలు.
**अभिसारी** - पुं० ప్రియురాలిని కలసి కొనుటకు సంకేతస్థలమునకు వెళ్ళు ప్రియుడు.
**अभिहित** - वि० చెప్పబడిన.
**अभी** - क्रि०वि० ఇప్పుడే; ఇప్పుడు కూడ
**अभीप्सा** - स्त्री० తీవ్రవాంఛ.
**अभीर** - पुं० గొల్లవాడు.

**अभीष्ट** - पुं॰ కోరిక वि॰ కోరిన.
**अभुआना** - अ॰क्रि॰ - గణము పూనుట; ఒళ్ళు పెరుగుట; భూతముఆవేశించుట.
**अभूत** - वि॰ లక్షణమైన.
**अभ्यंतर** - पुं॰ నడుమ; లోన; హృదయము.
**अभ्यर्थना** - स्त्री॰ వేడుకోలు.
**अभ्यस्त** - वि॰ అభ్యసించిన; అభ్యసింప బడిన.
**अभ्युत्थान** - पुं॰ సమృద్ధి; ఔన్నత్యము.
**अभ्यागत** - पुं॰ అతిథి.
**अभ्युदय** - पुं॰ శుభోదయము.
**अभ्र** - पुं॰ మేఘము.
**अभ्रांत** - वि॰ భ్రాంతిలేని.
**अमचूर** - पुं॰ మామిడి; బురుగు; ఎండిన మామిడి కాయచూర్ణము.
**अमर** - वि॰ చావు లేని पुं॰ దేవత.
**अमराई** - स्त्री॰ మామిడితోపు లేక మామిడి తోట.
**अमरुद** - पुं॰ జామిచెట్టు లేక కాయ.
**अमर्त्य** - वि॰ చావులేని पुं॰ దేవత.
**अमर्ष** - पुं॰ కోపము; కినుక.
**अमल** - वि॰ స్వచ్ఛమైన; దోషములేని पुं॰ నడవడి; అధికారము.
**अमलदारी** - स्त्री॰ రాజ్యాధికారము; పరి పాలనా కాలము.
**अमला** - स्त्री॰ లక్ష్మి; నేల ఉసిరిచెట్టు.
**अमली** - वि॰ అమలులోనికివచ్చు; पुं॰ త్రాగు బోతు.
**अमात्य** - पुं॰ మంత్రి.
**अमान** - वि॰ కొలతలేని; గౌరవములేని; గర్వములేని पुं॰ రక్షణ; శరణు.
**अमाना** - अ॰क्रि॰ పూర్తిగానుండుట; ఇముడుట.
**अमानी** - स्त्री॰ పోరంబోకు భూమి; पुं॰ గర్వములేని.
**अमानुषी** - स्त्री॰ పైశాచికము; పాశవికము.
**अमामा** - पुं॰ साफा ; తలపాగ.
**अमारी** - स्त्री॰ అంబారి
**अमाल** - पुं॰ అధికారి; శాసకుడు.
**अमालनामा** - पुं॰ కార్యవివరణము వ్రాసి ఉంచు పుస్తకము.
**अमावट** - स्त्री॰ మామిడి తాండ్ర.
**अमिट** - पुं॰ శాశ్వతమైన; నశ్వరముకాని.
**अमिताभ** - पुं॰ అమితమైన తేజస్సుగల ; पुं॰ బుద్ధుడు.
**अमिय** - पुं॰ अमी ; అమృతము.
**अमियमूरि** - स्त्री॰ సంజీవని మూలిక.
**अमिष** - वि॰ మిషలేని; కపటములేని.
**अमी** - पुं॰ दे॰ अमिय.
**अमीन** - पुं॰ కోర్టు అమీనా; న్యాయస్థానము

నుంచి ఉత్తర్వులు తెచ్చు కర్మచారి.

**अमीर** - पुं० ధనవంతుడు; భాగ్యవంతుడు.

**अमीरजादा**-पुं० ధనవంతుని కుమారుడు.

**अमीराना** -पुं० దనవంతులరీతి; ధనవంతుల వలె; ప్రభువుల రీతి.

**अमीरी** - स्त्री० ధనాఢ్యత; సంపన్నత.

**अमीरुल अस्कर** - पुं० సేనాధిపతి.

**अमुक** - वि० ఫలానా; ఒకానొక.

**अमूमन** - पुं० సాధారణమైన.

**अमूर्त्त** - वि० రూపములేని.

**अमूल** - वि० ఆధారములేని; వేరులేని.

**अमूलक ; अमूल्य** - वि० వెలలేని; అమూల్యమైన; అతి విలువైన.

**अमृत** - पुं० అమృతము.

**अमेठना** - स०क्रि० दे० उमेठना.

**अमेय** - वि० అపరిమితము.

**अमोघ** - वि० అమోఘమైన; వ్యర్థముకాని.

**अमोल ; अमोलक** - वि० दे० अमूल्य.

**अमोला** - पुं० మామిడిమొక్క; మొలకెత్తుచున్న మామిడిమొక్క.

**अम्जद** - वि० ఎక్కువపవిత్రమైన; పూజ్యుడు.

**अम्जाद** - पुं० పూజ్యులు.

**अम्लान** - वि० వాడనిది; నిర్మలమైన.

**अम्हौरी** - स्त्री० ఒంటిపేలుడు; శరీరపు పేలుడు.

**अयन** - पुं० ఇల్లు; మార్గము; ఉత్తర దక్షిణాయనములు.

**अयश** - पुं० అపకీర్తి.

**अयाँ** - वि० స్పష్టమైన; గోచరమైన.

**अयाचित** - वि० కోరబడనిది; యాచింపబడనిది.

**अयाची** - वि० యాచించనివాడు पुं०అయాచకుడు.

**अयादत** - स्त्री० రోగియొక్క క్షేమ సమాచారము విచారించుట.

**अयाल** - पुं० గుఱ్ఱపు జూలు; సింహము జూలు.

**अयोग** - पुं० అకలయిక; అనౌచిత్యము; చెడుకాలము.

**अय्याम** - पुं० సమయము.

**अय्यार** - पुं० బహుచెడ్డవాడు ; ధూర్తుడు.

**अय्यारा** - पुं० వ్యభిచారి; విలాసి.

**अरंड** - पुं० ఆముదము.

**अरक** - पुं० అరకు; రసము.

**अरगजा** - पुं० సుగంధ ద్రవ్యము.

**अरगनी** - स्त्री० दे० अलगनी.

**अरज** - स्त्री० నివేదనము; ప్రార్థన पुं० వెడల్పు

**अरजना** - स०क्रि० ప్రార్థించుట.

**अरजी** - स्त्री० దరఖాస్తు वि० దరఖాస్తు దారుడు.

**अरजमन्द** - पुं० ప్రార్థించువాడు.

**अरजाँ** - वि० చౌక

**अरथाना** - स०क्रि० - అర్థము చెప్పుట; తెలియచెప్పుట.

**अरथी** - स्त्री० పాడె.

**अरदली** - पुं० బిళ్ళబంట్రోతు.

**अरना** - पुं० అడవి ఎనుబోతు ; अ०क्रि० హఠము చేయుట.

**अरब** - पुं० నూరుకోట్లు; అరేబియా నివాసి.

**अरबी** - पुं० అరేబియా నివాసి (స్త్రీ) అరబీ భాష.

**अरमान** - पुं० ఆకాంక్ష.

**अरवा** - पुं० పచ్చిబియ్యము.

**अरविंद** - पुं० తామరపువ్వు; పద్మము.

**अरवी** - स्त्री० अरुई ; చామదుంప.

**अरस-परस** - पुं० ఒక విధమైన పిల్లల ఆట (దాగుడు మూత).

**अरसा** - पुं० సమయము; వ్యవధి.

**अरस्तू** - पुं० గ్రీకు దేశపు తత్వవేత్త.

**अरहट** - पुं० బావి గిలక.

**अरहर** - स्त्री० కందులు.

**अराजकता** - स्त्री० అరాజకత్వము; అరాచకత్వము.

**अराजी** - स्त्री० సాగులోకి వచ్చిన భూమి.

**अराल** - वि० వంకరైన पुं० మదపుటేనుగు.

**अराति** - पुं० శత్రువు.

**अरिवन** - पुं० చేంత్రాడు.

**अरिष्ट** - पुं० అరిష్టము; కీడు; అపశకునము.

**अरु** - अव्य० మరియు और.

**अरुई** - स्त्री० दे० अरवी.

**अरुज** - वि० రోగములేని.

**अरुण** - वि० కొంచెము ఎర్రని సూర్యుడు; సూర్యసారథి.

**अरुणशिखा** - पुं० కోడిపుంజు.

**अरुणाई ; अरुणिमा** - स्त्री० ఎఱ్ఱదనము.

**अर्क** - पुं० సూర్యుడు.

**अर्गल** - पुं० **अर्गला**-स्त्री० తలుపు గడియ.

**अर्घ ; अर्घ्य** - पुं० అర్ఘ్యము; పూజ; వెల.

**अर्चक** - पुं० పూజారి.

**अर्चन** - पुं० **अर्चना** - स्त्री० పూజ.

**अर्चि** - स्त्री० అగ్నిజ్వాల; కిరణము.

**अर्चित** - वि० పూజింపబడిన; సత్కరింపబడిన.

**अर्ज** - पुं० నివేదన; ప్రార్థన; వెడల్పు.

**अर्जक** - वि० సంపాదించువాడు.

**अर्जन** - पुं० సంపాదన.

**अर्जा** - वि० చౌక.

**अर्जित** - वि० సంపాదించిన.

**अर्जी** - स्त्री० దరఖాస్తు; ప్రార్థనాపత్రము.

**अर्जी-दावा** - पुं० న్యాయస్థానమునందు

దాఖలు చేయుట అర్జీ.

**अर्जी - नवीस** - पुं० అర్జీలు వ్రాయువాడు.

**अर्णव** - पुं० సముద్రము; సూర్యుడు; ఆకాశము.

**अर्थ** -पुं० అర్థము; ఉద్దేశ్యము; అభిప్రాయము; ధనము; కారణము.

**अर्थकर** - वि० ధనోపార్జన చేయు; లాభదాయకమైన.

**अर्थदण्ड** - पुं० జరిమానా.

**अर्थशास्त्र** - पुं० ఆర్థికశాస్త్రము; అర్థశాస్త్రము.

**अर्थात** - अव्य० यानी అనగా.

**अर्थी** - पुं० అర్థించువాడు; యాచకుడు.

**अर्दली** - पुं० బిళ్ళబంట్రోతు.

**अर्धांगी** - पुं० భార్య.

**अर्पण** - पुं० అర్పణ; అర్పించుట.

**अर्बखर्ण** - वि० లెక్కలేనన్ని.

**अर्भक** - पुं० దుర్బలుడు; అర్భకుడు; చిన్న బాలుడు ; శిశువు.

**अलग** - वि० వేరుగా; భిన్నమైన.

**अलम** - अव्य० पर्याप्त ; చాలినంత.

**अलम** - पुं० దుఃఖము; వేదన; జండా.

**अलगौझा** - पुं० సంపకము; వేర్పాటు.

**अलतमिश** - पुं० సేనా నాయకుడు.

**अलफाज** - पुं० శబ్దములు. लफज కి बहुवचन.

**अलबत्ता** - क्रि०वि० నిస్సందేహముగా.

**अलबेला** - वि० షోకిలా; విలాసి.

**अलमस्त**-वि० చీకూచింతలేని; మదించిన.

**अलमास** - पुं० వజ్రము.

**अलस** - वि० సోమరి.

**अलसाना** - अ०क्रि० బద్ధకించుట.

**अलसुबह** - क्रि०वि० తెల్లవారుఝామున.

**अलसी** - स्त्री० అవిసె చెట్టు.

**अलसेट** - स्त्री० అడ్డంకి ; లేని పోని జాగు.

**अलहदा** - वि० వేరు; వేరైన ; अलग.

**अलान** - पुं० ఏనుగును కట్టివేయుటకు గొలుసు.

**अलापना** - अ०क्रि० రాగాలాపన చేయుట.

**अलार** - पुं० చలిమంట; ఆవము.

**अलाल** - वि० పనికిరాని; సోమరి

**अलाव** - पुं० చిట్టి; కొలిమి.

**अलावा** - क्रि०वि० అంతేకాక; తప్ప.

**अलि** - पुं० గండు తుమ్మెద.

**अली** - स्त्री० చెలికత్తె; సఖి; సంక్తి; తుమ్మెద.

**अलीक** - पुं० మర్యాదహీనత; वि० దారి తప్పిన.

**अलोना** - वि० ఉప్పులేని; రుచిలేని.

**अलौकिक** - वि० అద్భుతమైన; లోకాతీతమైన.

**अल्ताफ** - पुं० దయ; అనుగ్రహము.
**अल्पसंख्यक** - पुं० అల్పసంఖ్యాకులు.
**अल्हक** - वि० వాస్తవముగా; నిజానికి.
**अल्हड** - वि० పిన్నవయస్సుగల; నిర్లక్ష్యముగా తిరుగు; అమాయకమైన; లేగదూడ.
**अवगत** - वि० తెలిసిన; విదితమైన.
**अवगुंठन** - पुं० ముసుగు; ఆచ్ఛాదనము.
**अवगुंठित** - वि० దాచబడిన; అచ్ఛాదితము; ముసుగు వేయబడిన.
**अवगुंफन** - पुं० గ్రుచ్చుట; కూర్చుట; అల్లుట.
**अवघट** - वि० దుర్గమమైన; కఠినమైన.
**अवज्ञा** - स्त्री० తిరస్కారము, అవమానము.
**अवडेर** - पुं० ఇబ్బంది; తగులాటము.
**अवतंश ; अवतंस** - पुं० శిరోభూషణము; కిరీటము; శ్రేష్ఠుడు.
**अवदात** - वि० స్వచ్ఛమైన; ఉజ్వలమైన.
**अवद्य** - वि० అధముడు; పాపి.
**अवधि** - स्त्री० గడువు; వ్యవధి; మేర;అయోధ్య సంబంధమైన.
**अवधी** - स्त्री० అవధిభాష - అయోధ్య ప్రాంతపు భాష.
**अवधूत** - पुं० సన్యాసి; దిగంబర సన్యాసి; సాధువు.
**अवध्य** - वि० వధింపరానిది; చంపరానిది.
**अवनत** - वि० పతితమైన; వంగిన.
**अवनति** - स्त्री० అధోగతి; హీనదశ; లొంగిన.
**अवनि** - स्त्री० భూమి.
**अवनिय** - पुं० राजा ; రాజు.
**अवमान** - पुं० అవమానము; తిరస్కారము.
**अवयव** - पुं० అవయవము; శరీరాంగము.
**अवयस्क** - वि० అల్పవయస్కుడు; మైనరు; ఈడురాని.
**अवस्क** - वि० అవరుద్ధమైన, ఆగిన; అడ్డగింపబడిన.
**अवरुढ** - वि० దిగిన.
**अवरेब** - पुं० వంకరనడత; పేచీ; వంకర కత్తిరింపు (గుడ్డ).
**अवरोध** - पुं० అడ్డు; అడ్డగింత; అవరోధము; అంతఃపురము.
**अवरोहण** - पुं० దిగుట; పతనము.
**अवरोहना** - अ०क्रि० దిగుట; स०क्रि० అడ్డగించుట.
**अवलंब ; अवलंबन** - पुं० ఆధారము; ఆశ్రయము.
**अवलंबित** - वि० ఆశ్రయించిన; ఆధారపడిన.
**अवलि; अवली** - पुं० పంక్తి; సమూహము.
**अवलोकन**- पुं० పరిశీలన; అవలోకనము.
**अवलोकना** - स०क्रि० చూచుట; పరి

శీలించుట.

**अवश** - पुं० వశములేని; విధిలేక.

**अवश्य**-क्रि०वि०जरूर ; తప్పక; అవశ్యము.

**अवश्यमेव** - क्रि०वि० తప్పకుండా; నిశ్చయముగా.

**अवशिष्ट** - वि० बाकी ; మిగిలిన.

**अवसन्न** - वि० చివరిదశలోనున్న; నశించనున్న.

**अवसाद** - पुं० విషాదము; అలసట.

**अवसान** - पुं० మరణము; నాశనము.

**अवसि** - क्रि०वि० दे० अवश्य.

**अवस्था** - स्त्री० స్థితి; వయస్సు; దశ

**अवस्थित** - वि० ఆగిన. హాజరైన.

**अवहित्थ**-पुं०**अवहित्था**-स्त्री- గోపనము; చాటు; మనోభావములను గోప్యముగానుంచుట.

**अवहेलना**-स्त्री० తృణీకారము; అనాదరణము; తిరస్కారము.

**अवहेला** - स्त्री० दे० अवहेलना.

**अवांतर** - वि० లోపలి; నడుము पुं० మధ్య.

**अवाई**- स्त्री० ఆగమనము; లోతుగా దున్నుట.

**अवाक्** - वि० స్తబ్దుడైన; నిశ్చేష్టుడైన.

**अवाच्य** - वि० చెప్పకూడనిది.

**अवाम** - पुं० (आम का बहु वचन) - జనసమూహము ; సామాన్య ప్రజ.

**अवारजा** - पुं० ఖాతా పుస్తకము.

**अविफल** -वि० మార్పులేని; తారుమారులేని; వ్యవస్థితము.

**अविकार** -वि०వికారములేని; మార్పులేని.

**अविगत** - वि० తెలియశక్యముకాని; గతించనిది.

**अविचल** - वि० చలనములేని.

**अविद्या** - स्त्री० అజ్ఞానము, మాయ; భ్రాంతి.

**अविनय** - पुं० అవిధేయత.

**अविरत** - वि० నిరంతరము; ఎల్లప్పుడు.

**अविरल** - वि० దట్టమైన.

**अविराम** - वि० విరామములేని; क्रि०वि० నిరంతరము.

**अविलंब** - वि० ఆలస్యములేని ; क्रि०वि० శీఘ్రముగా.

**अविश्रांत** - वि० అలయని; ఆగని ; क्रि०वि० ఎడతెరిపి లేకుండా.

**अवीरा** - स्त्री० భర్త కుమారులు లేని స్త్రీ. वि० స్వతంత్రమైన.

**अवैतनिक** - वि० జీతములేని.

**अवैधा** - वि० చట్ట విరుద్ధము; నియమ విరుద్ధము; చట్టవిరుద్ధమైన.

**अव्यय** - वि० నశించని; మార్పులేని; వికారము లేని.

**अव्यवस्था** - स्त्री॰ గడబిడ; నియమ రాహిత్యము.

**अव्यवस्थित** - वि॰ వ్యవస్థలేని; నియమ పాలనలేని.

**अव्याधात** - वि॰ అడ్డులేని.

**अव्वल** - वि॰ ప్రథమము; మొదటి;శ్రేష్ఠమైన ప్రారంభము.

**अशंक** - वि॰ बेशक ; జంకులేని; సందేహ ములేని.

**अशंकित** - वि॰ दे॰ अशंक.

**अशकुन** - पुं॰ అపశకునము.

**अशन** - पुं॰ భోజనము; ఆహారము.

**अशरण** - वि॰ శరణులేని; నిస్సహాయుడు; అనాధుడు.

**अशरफ** - वि॰ కులీనుడైన; ఘనమైన,గొప్ప హోదా గలవాడు.

**अशराफ** - पुं॰ సౌజన్యముగల.

**अशिक्षित** - वि॰ చదువులేని; సభ్యతలేని.

**अशिष्ट** - वि॰ అసభ్యమైన; విధేయతలేని.

**अशेष** - वि॰ అంతయు; నిశ్శేషము.

**अशोक**-वि॰ దుఃఖములేని; అశోకవృక్షము.

**अश्क ; अश्रु** - पुं॰ आँसू ; కన్నీరు.

**अश्रुत** - वि॰ వినని.

**अश्लील** - वि॰ అసభ్యమైన; అవాచ్యము; బూతు.

**अश्व** - पुं॰ అశ్వము; గుఱ్ఱము.

**अश्वतर** - पुं॰ खच्चर ; కంచరగాడిద.

**अश्वत्थ** - पुं॰ రావిచెట్టు; అశ్వని నక్షత్రము.

**अष्टम** - वि॰ ఎనిమిదవ.

**असंख्य** - वि॰ లెక్కలేని अनगिनत.

**असंगत** - वि॰ పొసగని ; యుక్తముకాని.

**असंगति** - स्त्री॰ అనౌచిత్యము; పొసగమి.

**असंतुष्ट** - वि॰ తృప్తిలేని.

**असंबद्ध** - पुं॰ పొసగని; సంబంధములేని.

**असंभावना** - स्त्री॰ అసంభవము; సంభావ్య ముకాని.

**असंथत**-वि॰ స్వచ్ఛందముగా; నియంత్రము లేని.

**असगुन** - पुं॰ దుశ్శకునము.

**असबाब** - पुं॰ सामान ; సామానులు; కారణములు.

**असभ्य** - वि॰ సభ్యతలేని; అసభ్యమైన.

**असमंजस** - स्त्री॰ అనిశ్చయమైనస్థితి ; తటపటాయింపు; ఇబ్బంది.

**असम** - पुं॰ పాపము; అపరాధము.

**असमत ; अस्मत** - पुं॰ పవిత్రత; పాతివ్రత్యము.

**असमग्र** - वि॰ అసంపూర్ణమైన.

**असर** - पुं॰ ప్రభావము; ఒత్తిడి.

**असरार** - क्रि॰वि॰ बारबार ; మాటి

**खस्सी** - पुं० మేకపోతు.

**खाँ** - पुं० खान ; పఠానులకు ఒక బిరుదు; జాగీరుదారు.

**खाँख** - स्त्री० రంధ్రము.

**खाँखर** - वि० బహుపల్చని; జల్లినేతగల; బోలుగానున్న.

**खाँग** - पुं० ముల్లు; అడవి పందికోర; కోడిపుంజు మొ॥ వాని కాలిగోరు లేక ఆర स्त्री० లోటు; లోపము.

**खाँचा** - पुं० పెద్దగంప.

**खाँड** - स्त्री० శుభ్రము చేయని పంచదార; కందపాదపంచదార లేక బెల్లము; గొయ్యి.

**खाँडा** - पुं० ఖడ్గము.

**खाँसना** - अ०क्रि० దగ్గుట.

**खाँसी** - स्त्री० దగ్గు.

**खाई** - स्त्री० కందకము.

**खाऊ** - वि० खवैया ; తిండిబోతు.

**खाक** - स्त्री० మట్టి; బూది; బూడిద; वि० తుచ్ఛమైన; क्रि०वि० ఏమియు లేదు.

**खाक उड़ना** - मु० నశించుట; అప్రతిష్ట పాలగుట; దుమారము లేపుట.

**खाक उड़ाना** - मु० దిక్కులేక ఇటు అటూ తిరుగుట; దుమారము లేపుట.

**खाक चाटना** - मु० లొంగిపోవుట; తల యొగ్గుట.

**खाक छानना** - मु०दे० खाक उडाना.

**खाक में मिलना** - मु० నాశమగుట; నశించుట.

**खाक में मिलाना** - मु० నాశనము చేయుట; నశింపజేయుట.

**खाकरोब** - पुं० ఊడ్చువాడు; పాకీమనిషి.

**खाकसार** - वि० తుచ్ఛమైన; అణుకువగల; దీనుడు; पुं० మహమ్మదీయులలో ఒక తెగ.

**खाकसारी** - स्त्री० దైన్యము; వినమ్రత.

**खाका** - पुं० రేఖాచిత్రము; నకలు; ముసాయిదా.

**खाका उडाना** - पुं० పరిహసించుట - ముసాయిదా.

**खाकी** - वि० బూడిద వన్నెగల; మట్టి వన్నెగల; మట్టికి సంబంధించిన.

**खागना** - अ०क्रि० గ్రుచ్చుకొనుట; అంటుకొనుట. स०क्रि० అంటించుట; జోడించుట.

**खाज** - स्त्री० తీట; దురద పెట్టు గజ్జి.

**(कोढ में) खाज** - मु० గోరిగిన గుండు మీద వడగండ్లు; దుఃఖించువానికి మరింత దుఃఖము.

**खाजा** - पुं० కాజా; ఒక విధమగు మిఠాయి.

**खार** - स्त्री० चारपाई ; మంచము.

**खाट पडना या खाट पर पडना** - मु॰ జబ్బు పడుట.

**खाडी** - स्त्री॰ అఖాతము - మూడువైపులా భూమిచే చుట్టబడి వుండెడి సముద్రపు విభాగము. (ఉదా : బంగాళా ఖాతము)

**खात** - पुं॰ చెరువు; గొయ్యి; నుయ్యి; అగడ్త త్రవ్వకము.

**खातमा** - पुं॰ సమాప్తి; మృత్యువు.

**खाता** - पुं॰ జమాఖర్చుపద్దు; ధాన్యపు పాతర; వడ్లగాదె; ఆవర్జా పుస్తకము; చెరువు.

**खातिमा** - पुं॰ दे॰ खातमा.

**खातिर** - स्त्री॰ ఆదరము; గౌరవము; సత్కారము. अव्य॰ కొరకు; కై.

**खातिर ख्वाह** - क्रि॰वि॰ ఇష్టము వచ్చినట్లుగా; యథేచ్ఛగా.

**खातिरजमा** - स्त्री॰ సంతోషము; సంతుష్టి; ఓదార్పు; ఉల్లాసము.

**खातिरदार** - वि॰ సత్కరించువాడు.

**खातिरदारी** - स्त्री॰ అతిథి సత్కారము; మర్యాద.

**खातिरी** - स्त्री॰ दे॰ खातिरदारी.

**खाती** - स्त्री॰ గొయ్యి; पुं॰ వడ్రంగి; ఉప్పర జాతి.

**खातून** - स्त्री॰ గొప్ప వంశపు మహిళ; గౌరవించదగిన స్త్రీ.

**खाद** - स्त्री॰ ఎరువు.

**खादक** - वि॰ తినువాడు.

**खादन** - पुं॰ భోజ్య పదార్థము; భోజ్యము.

**खादर** - पुं॰ పల్లపుభూమి; తేమ భూమి; పచ్చికబీడు.

**खादिम** - पुं॰ సేవకుడు; దాసుడు.

**खादिमा** - स्त्री॰ దాసి.

**खादी** - स्त्री॰ ఖద్దరు.

**खान** - पुं॰ భోజనము; తినుట; स्त्री॰ గని.

**खान-पान** - पुं॰ భోజనాదులు.

**खान** - पुं॰ పఠానుల బిరుదు; నాయకుడు; ధనవంతుడు.

**खानक**-पुं॰ గని త్రవ్వువాడు वि॰ త్రవ్వువాడు.

**खानकाह** - स्त्री॰ మహమ్మదీయ ఫకీరుల మఠము.

**खानखानाँ; खानखानान**- पुं॰ సర్దారులకు సర్దారు; ముసల్మాను శాసన కాలమున సర్దారులకునొసంగబడు బిరుదు.

**खानगी** - स्त्री॰ వేశ్య वि॰ घरेलू ; ఇంటి సంబంధమైన; స్వంతమగు; వ్యక్తిగతమైన.

**खानजादा** - पुं॰ ఉచ్చకులీను; ధనవంతుల బిడ్డ

**खानदान** - पुं॰ వంశము; కులము.

**खानदानी** - पुं॰ మంచి కుటుంబమున జన్మించిన

**खानम** - स्त्री॰ గొప్పింటి స్త్రీ; కులీను రాలు; గొప్పవాని భార్య.

**खानसामाँ** - पुं॰ ఆంగ్లేయులకు; ముసల్మా నులకు వంట చేయువాడు; వంటవాడు.

**खाना** - पुं॰ భోజనము; स॰क्रि॰ తినుట; భోంచేయుట; కాజేయుట; లంచగొండి తనము ద్వారా ధనోపార్జన చేయుట; నష్ట పరచుట

**(मुँह की) खाना** - मु॰ చేసిన పనికి శాస్తి నొందుట.

**खाना** - पुं॰ ఇల్లు; అర(డ్రాయరు); స్థానము.

**खाना-पीना** - पुं॰ భోజనాదులు; అన్న పానములు.

**खाना-खराब** - वि॰ (मु॰) ఇల్లు వాకిలి లేనివాడు; దేశదిమ్మరి వినాశకుడు.

**खानाजंगी** - स्त्री॰ అంతఃకలహము.

**खानाजाद** - पुं॰ బానిస; యజమాని ఇంటిలో పుట్టి పెరిగిన బానిస.

**खानातलाशी** - स्त्री॰ కనిపించని లేక పోయిన వస్తువు కొరకు ఇల్లంతయు కలయ వెతుకుట.

**खानादामाद** - पुं॰ ఇల్లరికపు అల్లుడు.

**खानादामादी** - स्त्री॰ ఇల్లరికము.

**खानादार** - वि॰ గృహస్థుడు.

**खानादारी** - स्त्री॰ గృహస్థధర్మము.

**खानानशीन** - वि॰ పనీపాటు చెయ్యక ఎప్పుడూ ఇంటిలోనే ఉండువాడు.

**खानापुरी** - स्त्री॰ ఖాళీస్థలములు లేక గళ్ళు పూర్తి చేయుట; లేక పూరించుట; పట ములు గీయుట.

**खानाबदोश** - पुं॰ దేశ దిమ్మరి; నిలువనీడ లేనివాడు.

**खाना-बरबादी** - पुं॰ ఇల్లు లేక కుటుంబ వినాశము.

**खाना-शुमारी** - स्त्री॰ ఏదేని గ్రామము లేక నగరములోని గృహముల గణన.

**खाना-साज** - वि॰ ఇంటిలో తయారైన.

**खाना-पीना** - पुं॰ అన్నపానములు.

**खानि** - स्त्री॰ दे॰ खान.

**खाम** - पुं॰ కవరు; కూడిక; సంధి वि॰ క్షీణిం చిన; తగిన; పచ్చి; పక్వముకాని.

**खाम खचाली** - स्त्री॰ పనికిమాలిన ఆలోచన.

**खामना** - स॰क्रि॰ కవరును అంటించుట; తడిమట్టి లేక పిండితోగాని ఏదేని పాత్ర మూతిని మూయుట.

**खामी** - स्त्री॰ పచ్చిదనము; దోషము; లోటు; అనుభవలేమి.

**खामोश** - वि॰ నిశ్శబ్దము; మౌనము వహించిన.

**खामोशी** - स्त्री० चुप्पी; నిశ్శబ్దత; మౌనము.

**खायन** - वि० తన వద్ద ఉంచిన లేక తాకట్టు పెట్టిన వస్తువులు భుక్తము చేసుకొనువాడు; నమ్మకద్రోహి.

**खायफन** - पुं० कायर ; పిరికి; పిరికిపంద.

**खाया** - पुं० అండకోశము; కోడిగ్రుడ్డు.

**खायाबरदार** - वि० ఎక్కువగా ముఖస్తుతి చేయువాడు; ఎక్కువగా సేవచేయువాడు.

**खार** - पुं० క్షారము; బూడిద; చౌడు నేల; చౌడు; ముల్లు; ద్వేషము; ఈర్ష్య.

**खार खाना** - मु० ఈర్ష్య వహించుట.

**खारा** - वि० ఉప్పని; ఒక విధమగు వల.

**खारिज** - वि० వేరైన; బహిష్కృతమైన; వెడలగొట్టబడిన.

**खारिश ; खारिश्त** - स्त्री० దురద; తీట.

**खारिश्ती** - वि० దురదగలవాడు; తీట గలవాడు.

**खारी** - स्त्री० ఒకవిధమగు ఉప్పు; वि० ఉప్పని.

**खाल** - स्त्री० చర్మము; తోలు; బెరడు; కమ్మరి తిత్తి; పల్లపు భూమి.

**खाल उधेडना या खींचना** - मु० కొట్టి చర్మమువలచుట; తొక్క తీయుట.

**खालसा** - पुं० సిక్కులకు చెందిన ఒక తెగ. वि० శుద్ధమైన; ప్రభుత్వ సంబంధమైన; రాజ్యమునకు సంబంధించిన.

**खाला** - वि० పల్లపు.

**खाला** - स्त्री० పినతల్లి ( తల్లి చెల్లెలు).

**खालाजी का घर** - मु० సులభమైన కార్యము; తేలికపని.

**खालिक** - पुं० సృష్టికర్త.

**खालिस** - वि० విశుద్ధమైన; కల్తీలేని.

**खाली** - वि० ఖాళీ; రిక్తమైన; अव्य० కేవలము; వట్టి.

**खालू** - पुं० मौसा ; తల్లి సోదరి భర్త.

**खाविंद** - पुं० యజమాని; భర్త; పతి

**खास** - वि० ముఖ్యమైన; ముఖ్యమగు; విశేషించి, విశిష్టమైన.

**खासकर** - वि० విశేషించి.

**खास व आम** - पुं० పెద్దలు - పిన్నలు అందరూ.

**खास कलम ; खासनवीस** - पुं० వ్యక్తిగత కార్యదర్శి; ప్రైవేటు సెక్రటరీ.

**खासगी** - स्त्री० ప్రత్యేకత; విశిష్టత वि० వ్యక్తిగతమైన యజమానికి లేక అధికారికి సంబంధించిన.

**खासतराश** - पुं० రాజుగారి మంగలి.

**खासदान** - पुं० पानदान ; తమలపాకుల పెట్టె.

**खासबरदार** - पुं० రాజుగారికి ముందు నడుచు సిపాయి; సర్దారు లేక రాజుగారి అస్త్ర

శస్త్రములు పుచ్చుకొని ముందు నడచు సిపాయి.

**खास बाजार** - पुं॰ రాజు మహలువద్దనున్న పెద్ద బజారు ; మార్కెట్టు.

**खास महल** - पुं॰ కేవలము వైవాహిక స్త్రీలు నివసించు భవనము; వైవాహిక స్త్రీ లేక రాశి.

**खासा** - पुं॰ గొప్పవారి భోజనము; ఒక విధ మగు శ్రేష్ఠమైనపట్టువస్త్రము; రాజుగారికి ఇష్టమైన గుఱ్ఱములు, ఏనుగులు ఉండు శాల; స్వభావము; ప్రకృతి वि॰ శ్రేష్ఠమైన; స్వస్థమైన; అందమైన; పూర్ణమైన.

**खासियत** - स्त्री॰ విశిష్టత; వైశేష్యము.

**खाह** - अव्य॰ दे॰ ख्वाह.

**खाहिश** - स्त्री॰ दे॰ ख्वाहिश.

**खिंचना** - अ॰ क्रि॰ ఆకర్షింపబడుట; లాగ బడుట; పీల్చబడుట; ఇంకిపోవుట; ప్రేమ జనించుట.

**खिंचाई** - स्त्री॰ ఆకర్షణ; పీల్చుట; లాగు లేక ఈడ్పు కూలి.

**खिंचाव** - पुं॰ ఆకర్షింపబడుట; లాగుడు; ఈడ్పు; బిగింపు.

**खिचडी** - स्त्री॰ పులగము.

**खिंचवाना** - स॰क्रि॰ లాగించుట.

**खिजना** - अ॰क्रि॰ दे॰ खीजना.

**खि.जलाना** -स॰क्रि॰ కోపము తెప్పించుట.

**खिजाँ** - स्त्री॰ శిశిరఋతువు; ఆకురాలు కాలము; అసానకాలము; వృద్ధాప్యము.

**खिजाब** - पुं॰ తెల్ల వెంట్రుకలను నలుపు చేయు రంగు.

**खिजाबी** - वि॰ జుట్టుకు నల్లరంగు వేసు కొనువాడు.

**खिजालत** - स्त्री॰ शरमिन्दगी ; సిగ్గు; సిగ్గు నొందుట.

**खिझाना** - स॰क्रि॰ కోపము తెప్పించుట; విసిగించుట.

**खिडकी** - स्त्री॰ కిటికి; కోట రహస్య మార్గము.

**खिताब** - पुं॰ బిరుదు; పదవి.

**खिताबी** - वि॰ బిరుదు పొందిన.

**खित्ता** - पुं॰ భూభాగము; ప్రాంతము; భూఖండము.

**खिदमत** - स्त्री॰ సేవ; చాకిరి; ఊడిగము.

**खिदमतगार** - पुं॰ సేవకుడు; నౌకరు.

**खिदमतगारी** -स्त्री॰ సేవ; నౌకరి; దాస్యము.

**खिदमत गुजार** - वि॰ సేవపరాయణుడు.

**खिन्न** - वि॰ భిన్నమైన; దుఃఖముగల; చింతగల.

**खियाना** - अ॰क्रि॰ ఒరిసి కొనిపోవుట.

**खिरद** - स्त्री॰ బుద్ధి; తెలివి.

**खिरदमंद** - वि॰ బుద్ధిమంతుడు; తెలివిగల.

**खिरमन** - पुं॰ వరికుప్ప; కళ్ళము.

**खिराज** - पुं॰ పన్ను; కప్పము.

**खिराम** - स्त्री॰ ఒయ్యారము; ఒయ్యారపు నడక.

**खिरामाँ** - वि॰ ఒయ్యారముగా నడుచువాడు.

**खिरामाँ खिरामाँ** - मु॰ ఒయ్యారముగా మెల్లిమెల్లిగా నడుచుట.

**खिर्स** - पुं॰ भालू ; ఎలుగుబంటు.

**खिलअत** - स्त्री॰ రాజుగారి ద్వారా సన్మాన సూచకముగా ఇవ్వబడువస్త్రములు.

**खिलकत** - स्त्री॰ సృష్టి; ప్రకృతి; జన సందోహము.

**खिलखिलाना** -अ॰क्रि॰ పకపకానవ్వుట.

**खिलना** - अ॰क्रि॰ వికసించుట; సంత సించుట; అందముగా కనిపించుట.

**खिलवत** -स्त्री॰ నిర్జనస్థానము; ఏకాంతము.

**खिलवाड़** - पुं॰ ఆట; వేడుక.

**खिलवाना** - स॰क्रि॰ తినిపింపజేయుట; వికసింపజేయుట; ఆడింపజేయుట.

**खिलाड़ी** - वि॰ ఆటగాడు.

**खिलाना** - स॰क्रि॰ ఆడించుట; తిని పించుట; వికసింపజేయుట.

**खिलाफ** - पुं॰ విరుద్ధమైన; వ్యతిరేకమైన; విపరీతము.

**खिलाफ-गोई** - स्त्री॰ మిథ్యా భాషణము; అసత్య కథనము లేక సంభాషణము.

**खिलाफत** - स्त्री॰ ఖలీఫా పదవి; వారసత్వము (ఖలీఫా పదవికి)

**खिलाफी** - स्त्री॰ విరోధము; వ్యతిరేకత.

**खिलाल** - स्त्री॰ ఆటలో ఓటమి; జూద ములో ఓటమి; పేకాటలో ఓటమి; పల్లు కుట్టు లోహము ముక్క; దూరము.

**खिलौना** - पुं॰ ఆటబొమ్మ.

**खिल्की** - पुं॰ స్వాభావికమైన; ప్రకృతి సిద్ధమైన.

**खिल्ली** - स्त्री॰ కిళ్ళీ; పరిహాసము; ఎగతాళి.

**खिल्ली उड़ाना** - मु॰ పరిహసించుట; ఎగతాళిచేయుట.

**खिल्लीबाज** - पुं॰ ఎగతాళి చేయువాడు

**खिल्लीबाजी** - स्त्री॰ ఎగతాళి; పరిహాసము; వినోదము.

**खिश्त** - स्त्री॰ ईट ; ఇటుక.

**खिसकना** -अ॰क्रि॰ జారుకొనుట; నిశ్శబ్ద ముగా తప్పుకొనుట.

**खिसलना** -अ॰क्रि॰फिसलना; జారుట

**खिसारा** - पुं॰ घटा ; నష్టము; హాని.

**खिसिआना ; खिसियाना** - अ॰क्रि॰ సిగ్గు పడుట; చిరాకు పడుట.

**खिसिआहट ; खिसियाहट** -स्त्री॰ చిరాకు;

కోపము; సిగ్గు.

**खिसौहाँ** -वि० కస్సుబుస్సుమను స్వభావ ముగల; చిరాకు స్వభావముగల.

**खिस्मत** - स्त्री० कंजूसी; పిసినారితనము; కార్పణ్యము.

**खींचतान** - स्त्री० ఇరుపక్షముల పెనుగులాట.

**खींचना** - स०क्रि० లాగుట; ఈడ్చుట; గీయుట; ( గీత, చిత్రము)

**खींचा-खींची ; खींचातान ; खींचातानी** - स्त्री० పెనుగులాట; గుంజులాట.

**खीज** - स्त्री० విసుగు; కోపము; చిరాకు.

**खीजना** - अ०क्रि० విసుగుట; కస్సుబుస్సు మనుట; కోపగించుట.

**खीझ** - स्त्री० दे० खीज.

**खीमा** - पुं० दे० खेमा.

**खीर** - स्त्री० పరమాన్నము; క్షీరాన్నము.

**खीर चटाना** - मु० శిశువుకు అన్నప్రాసన చేయుట.

**खीरा** - पुं० ఒక విధమగు దోసకాయ.

**खीरा ककडी समझना** - मु० హీనముగా తలచుట, నిర్లక్ష్యము చేయుట.

**खीरी** - स्त्री० పొదుగు.

**खील** -स्त्री० పెద్దమేకు, గునుపము, పేలాలు.

**खीस** - स्त्री० కోపము, లజ్జ, ఇకిలింపు, నాశము, वि० ధ్వంసమైన.

**खीसना** - अ०क्रि० విస్పష్టమగుట, నాశ మగుట.

**खीसा** - पुं० జేబు, సంచి.

**खुँदाना** - स०क्रि० (గుఱ్ఱములను) దుమి కించుట.

**खुचर ; खुचुर** - स्त्री० ऐबजोई ; ఇతరుల దోషములు చూపు పని.

**खुजलाना** - अ०क्रि० దురద పెట్టుట. स०क्रि० గోకుట, గీకుట.

**खुजलाहट** - स्त्री० దురద.

**खुजली** - स्त्री० దురద, గజ్జి.

**खुजाना** - अ०क्रि० & स०क्रि० दे० खुजलाना.

**खुटकना** - पुं० ఏదేని వస్తువును పైపైన త్రుంచుట లేక కొరుకుట.

**खुटचाल** - स्त्री० చెడు ప్రవర్తన, కపటము.

**खुटचाली** - वि० చెడుగా ప్రవర్తించు, దుండగము చేయు.

**खुटाई** - स्त्री० खोटापन ; దోషము.

**खुट्टी** - स्त्री० పుండు పైని పక్కు లేక చెక్కు.

**खुतका** - पुं० దుడ్డుకర్ర, పురుషుని వీర్యము.

**खुतबा** - पुं० ప్రశంస, పొగడ్త; రాజుగారి ప్రకటన లేక ఘోషణ.

**खुतूत**-पुं०(खत का बहु०) ఉత్తరములు.

**खुत्तामा** - स्त्री० వ్యభిచారిణి.

**खुद** - वि० స్వయముగ, స్వయము.

**खुद-ब-खुद** - क्रिं०वि० తనంతట తానే, తనకు తానే.

**खुद आराई** - स्त्री० తనకుతాను తన ప్రదర్శన.

**खुद-कशी ; खुद-कुशी** - स्त्री० ఆత్మ హత్య.

**खुद-गरज** - वि० స్వార్థపరుడు.

**खुद-नुमा** - वि० అహంకారి; అభిమాని.

**खुद-परस्त** - वि० खुद - गरज ; స్వార్థ పరుడు.

**खुद-पसंद** - वि० తనని తను మంచి అనుకొనువాడు.

**खुद-मुख्तार** - वि० సర్వస్వతంత్రుడు; ఎవనికి లోబడనివాడు.

**खुदना** - अ.क्रि० త్రవ్వబడుట.

**खुदरा** - पुं० చిల్లరవస్తువులు.

**खुदरा फरोश** - वि० చిల్లర వస్తువులు అమ్మువాడు.

**खुदरा कराना** - स.क्रि० నోటును చిల్లరగా మార్పించుట లేక మార్చుట.

**खुदराई** - स्त्री० నిరంకుశత్వము; స్వేచ్ఛా చారము.

**खुदवाई** - स.क्रि० త్రవ్వింపు; త్రవ్వింపు కూలి.

**खुदवाना** - पुं० త్రవ్వింపజేయుట.

**खुदसर** - वि०మొండిమనిషి; నిర్లక్ష్యపరుడు; స్వేచ్ఛారి.

**खुदसरी** - स्त्री० మొండిపట్టుదల.

**खुदा** - पुं० భగవంతుడు.

**खुधाई** - स्त्री० దైవత్వము.

**खुदाई** - स्त्री० త్రవ్వకము.

**खुदा खैर करे** - अव्य० దైవము రక్షించు గాక

**खुदाताला** - पुं० భగవంతుడు.

**खुदादाद** - वि० భగవంతుడు ఇచ్చిన.

**खुदा-हाफिज** - अव्य० భగవంతుడే రక్షకుడు. (వీడ్కోలు సమయమున పలుకు పదము)

**खुदी** - स्त्री०అహంకారము; అహంభావము; స్వార్థపరత.

**खुनकी** - स्त्री० శీతలత; చలి.

**खुनसना** - अ०क्रि० కోపించుట; కోప పడుట.

**खुन्सा** - पुं० हिजडा ; నపుంసకుడు.

**खुफिया** - वि० గుప్తమైన; గుప్తముగానున్న.

**खुबासत** - स्त्री० నైచ్యము; తుచ్ఛత; దౌష్ట్యము.

**खुभना-**अ०क्रि० चुभना ; గుచ్చుకొనుట.

**खुम** - पुं० కుండ ; కల్లుముంత.

**खुम-कदा ; खुम-खाना** - पुं० మధుశాల.

**खुमार** - पुं० జాగరణ బడలిక; నిషా తగ్గిన మీదట కలుగు బడలిక; మత్తు; నిషా.

**खुमारी** - स्त्री० दे० खुमार.

**खुमी** - स्त्री० పుట్టగొడుగు మొ. పత్రపుష్ప రహితమైనది; పల్లుకు వేయు బంగారు, వెండి మొదలగు తొడుగు; ఏనుగు దంతములకు వేయు తొడుగు.

**खुरा** - स्त्री० కల్లు.

**खुरंड** - पुं० పుండు; గాయముగానున్నపుడు; మీద ఏర్పడు పొక్కు లేక పెచ్చు.

**खुर** - पुं० గిట్ట.

**खुर खुर** - स्त्री० గొంతులో గురకమనెడి శబ్దము.

**खुरखुरा** - वि० గరుకుగల. గరుకైన.

**खुरचन** - स्त्री० గీకుడు; గీకితీయబడిన పదార్థము; గోకుడు పైరా.

**खुरचना** - स०क्रि० గీకుట, గీరుట, తురుముట.

**खुरचाल** - स्त्री० కొంటెతనము; పోకిరీతనము; చెడునడత.

**खुरजी** - स्त्री० గుఱ్ఱము; గాడిద; ఎద్దు మొదలగు వాటి వీపు మీదమోపెడి పెద్ద సామానుల సంచి.

**खुरदरा** - पुं० గరుకుగానున్న; ఎగుడు దిగుడుగానున్న.

**खुरदा** - पुं० చిన్న చిన్న చిల్లర వస్తువులు.

**खुरपा** - पुं० డోకుడు పార; తవ్వుకోల.

**खुरपी** - स्त्री० చిన్నడోకుడు పార; చిన్న తవ్వుకోల.

**खुरमा** - पुं० ఖర్జూరపు కాయ; ఒక విధముగు మిఠాయి లేక పిండి వంట.

**खुरशैद** - पुं० సూర్యుడు.

**खुराक** - स्त्री० ఆహారము; భోజనము; మందుమోతాదు.

**खुराकी** - स्त्री० భోజనముకొరకై ఇచ్చు ధనము. वि० తిండి బోతు.

**खुराफात** - स्त्री० గందరగోళము; వ్యర్థ ప్రలాపము; కలహము; బూతు; తిట్టు.

**खुरी** - स्त्री० గిట్టల గుర్తు.

**खुर्द** - वि० చిన్న.

**खुर्दबीन** - स्त्री० సూక్ష్మదర్శక యంత్రము.

**खुर्द बुर्द** - पुं० అపసవ్యముగా ప్రాప్తించిన సొమ్ము; అపవ్యయము; ధననాశము.

**खुर्दमहल** - पुं० ఉంపుడు కత్తెలు ఉండు భవంతి; ఉంపుడు గత్తె.

**खुर्द साल** - वि० అల్పవయస్కుడు; తక్కువ వయస్సుగల.

**खुर्द साली** - स्त्री० అల్ప వయస్కురాలు.

**खुर्दा** - पुं० खुरदा ; చిల్లర సామాను; చిల్లర. वि० తినిన; తినియున్న.

**खुर्दा-फरेश** - पुं॰दे॰ खुरदा फरोश.
**खुर्राट** - वि॰ ముసిలి; అనుభవముగల; ధూర్తుడు.
**खुर्राट** - पुं॰ గురక.
**खुलना** - अ॰क्रि॰ తెరుచుకొనుట; విడిపోవుట.
**खुला** - वि॰ స్పష్టమైన; అడ్డులేని; వెల్లడియైన; విశాలమైన.
**खुलासा** - पुं॰ సారాంశము; సంక్షేపము. वि॰అడ్డులేని; వెల్లడియైన.
**खुलूस** - पुं॰ పవిత్రత; నిష్ఠ.
**खुल्क़** - पुं॰ సజ్జనత్వము ; సత్ప్రవర్తన.
**खुल्लमखुल्ला** - क्रि॰वि॰ బాహాటముగా; బహిరంగముగా; స్పష్టముగా.
**खुश व खुर्रम** - वि॰ खुशहाल ; ప్రసన్న చిత్తుడు.
**खुश** - वि॰ ఆనందముగానున్న; ఉల్లాసముగానున్న; మంచి.
**खुश-किस्मत** - वि॰ खुश-नसीब ; అదృష్టవంతుడు.
**खुश-किस्मती** - स्त्री॰ खुशनसीबी.
**खुश-खत** - वि॰ అందమైన దస్తూరి గల.
**खुश-खबर** -वि॰ శుభవార్త వినిపించువాడు.
**खुश-खबरी** - स्त्री॰ శుభసమాచారము.
**खुश - जायका** - वि॰ రుచికరమైన; స్వాదిష్టమైన.
**खुश-दामन** - स्त्री॰ सास ; అత్తగారు (భార్యతల్లి)
**खुश-नसीब** - वि॰ दे॰ खुश-किस्मत.
**खुश-नुमा** -वि॰ खूबसूरत ; సుందరమైన.
**खुश-बयान** - वि॰ మంచివక్త.
**खुश-बू** - स्त्री॰ సువాసన; సుగంధము.
**खुश-बूदार** - वि॰ సువాసనగల.
**खुश-मिजाज** - वि॰ ప్రసన్నచిత్తుడు.
**खुश-रंग** -वि॰ మంచిరంగుగల; అందమైన రంగు గల.
**खुश - वक्त** - वि॰ సంతోషము గల; సుఖము గల.
**खुश-वक्ती** - स्त्री॰ प्रसन्नता ; సుఖము; సంతోషము.
**खुश-हाल** - वि॰ సంపన్నుడు; సుఖవంతుడు.
**खुशामद** - स्त्री॰ चापलूसी ; ముఖస్తుతి.
**खुशामदी** - वि॰ चापलूस ; ముఖస్తుతి చేయువాడు.
**खुशी** - स्त्री॰ ఆనందము; ప్రసన్నత; ఇష్టము.
**खुशी-खुशी** - क्रि॰वि॰ ఉల్లాసముగా.
**खुश्क** - वि॰ ఎండిన; నీరసమైన.
**खुश्की** - स्त्री॰ తడిలేని ; అనావృష్టి; కాటకము; రుచిహీనత.

**ख़ुसर** - पुं० ससुर ; మామగారు, భార్య తండ్రి లేక భర్త తండ్రి.

**ख़ुसर - ख़ुसर** - स्त्री० గుసగుసలు.

**ख़ुसरु** - पुं० చక్రవర్తి.

**ख़ुसर - फुसर** - स्त्री० दे० ख़ुसर-ख़ुसर.

**ख़ुसिया** - पुं० అండకోశము.

**ख़ुसूमत** - स्त्री० వైరము, పగ.

**ख़ुसूसन** - क्रि०वि० ముఖ్యముగా, విశేషించి, ప్రత్యేకించి.

**ख़ुसूसियत** - स्त्री० విశిష్టత, ప్రత్యేకత.

**ख़ूँखार ; ख़ूँख़्वार** - वि० నెత్తురు త్రాగు వాడు, హంతకుడు, క్రూరమైన.

**ख़ूँट** - स्त्री० కొన, వైపు ; అడ్డు, स्त्री० చెవి గుబిలి.

**ख़ूँटना**-स्त्री० తగ్గుట, విరుగుట. स०क्रि० అడ్డగించుట; విరగగొట్టుట; త్రోయుట, జాడలీయుట.

**खूँटा** - पुं० పెద్ద మేకు, గుంజ, గూటము.

**खूँटी** - स्त्री० మేకు ( చిన్న ), గుంజ.

**ख़ूँरेज** - वि० నెత్తురు ప్రవహింపచేయు వాడు, హంతకుడు.

**ख़ूँरेजी** - पुं० రక్తపాతము.

**ख़ू** - स्त्री० आदत ; అలవాటు.

**ख़ू-बू** - पुं० रंग-दंग ; వాలకము, నడక, నడత, పద్ధతి.

**ख़ून** - पुं० రక్తము; ఖూనీ.

**ख़ून आलूदा** - पुं० రక్తసిక్తమైన

**ख़ूनखराब ; ख़ूनखराबा**-पुं० రక్తపాతము; మూకసంహారము.

**ख़ून उबलना ; ख़ून खौलना** - पुं० క్రోధముతో శరీరము ఎర్ర బారుట; క్రోధోద్దీప్తుడగుట.

**ख़ून का प्यासा** - पुं० చంపగోరువాడు.

**ख़ून सफेद होना** - मु० ముఖమాటము బొత్తిగా లేక పోవుట; మానవత్వము లేకపోవుట.

**ख़ून सिर पर सवार होना** - मु० చంప సిద్ధమగుట.

**ख़ून पीना**-मु० చంపివేయుట; వధించుట.

**ख़ूनी** - वि० హంతకుడు.

**ख़ूब** - वि० అందమైన; శ్రేష్ఠమైన.

**ख़ूबसूरत** - वि० సుందరమైన; అందమైన ఆకారముగల.

**ख़ूबरू** - वि० दे० ख़ूबसूरत.

**ख़ूबसूरती** - स्त्री० సుందరమైన ఆకారము; సౌందర్యము; సుందర రూపము.

**ख़ूबी** - स्त्री० మంచితనము; మేలు; విశేషత.

**ख़ूराक** - स्त्री० दे० ख़ुराक.

**ख़ूसट** - पुं० గుడ్లగూబ; దుశ్శకునము. వృద్ధుడు, దౌర్భాగ్యమైన.

**खेचर** - वि० ఆకాశమున సంచరించు ;
वि० పక్షి; మేఘము ; నక్షత్రము.
**खेट ; खेटक; खेडा** - पुं० కుగ్రామము, చిన్న గ్రామము.
**खेत** - पुं० పొలము, పొలములోని పంట, యుద్ధక్షేత్రము.
**खेतिहर** - पुं० వ్యవసాయదారుడు, రైతు.
**खेती** - स्त्री० వ్యవసాయము, పంట.
**खेतीबारी** - स्त्री० వ్యవసాయము, సాగు.
**खेद** - पुं० క్లేశము, దుఃఖము, అలసట.
**खेदना** - स०क्रि० తరుముట, వేటాడుట.
**खेदा** - पुं० వేట.
**खेना** - स०क्रि० పడవ నడుపుట.
**खेप** - स्त्री० ఒకసారి తీసుకువెళ్ళగల్గిన బరువు; ఒకసారి బరువు ఎక్కించు.
**खेपना** -स०क्रि० గడుపుట, వీడ్కోలిచ్చుట.
**खेम** - पुं० క్షేమము.
**खेमा** - पुं० గుడారము.
**खेल** - पुं० ఆట, క్రీడ, సులువు పని.
**खेल-कूद** - पुं० కుప్పిగంతులు, ఆట.
**खेलना** - अ०क्रि० ఆడుట, **जानपर या जी पर खेलना** - मु० ప్రాణమొడ్డుట, సాహసోపేతమైన కార్యము చేయుట.
**खेलबाड** - पुं० ఆట, తమాషా.
**खेलाडी** - वि०दे० **खिलाडी.**
**खेवक** - पुं० పడవ నడుపు వాడు.
**खेवट** - पुं० గ్రామ కరణము వద్దనుండు పొలాల వివరములు చూపు పుస్తకము.
**खेवनहार** - पुं० పడవ నడుపు వాడు, దరి జేర్చు వాడు (భగవంతుడు)
**खेवना** - स०क्रि० కాలము వెళ్ళబుచ్చుట. పడవ నడుపుట.
**खेवा** - पुं० పడవ కూలి; పర్యాయము, పడవ, బరువు వేయబడిన పడవ, వంతు.
**खेवाई** - स्त्री० పడవ నడుపుట, పడవ కూలి.
**खेह ; खेहर** - स्त्री० దుమ్ము, ధూళి.
**खेंचना ; खैंचना** - स०क्रि०दे० **खींचना.**
**खैयाम**-पुं० డేరాలు తయారు చేయువాడు, ఖాముడైనవాడు ; ఉమరఖయాం (గొప్ప ఫారసీ కవి).
**खैर** - पुं० కాచు, కుశల-క్షేమము.
**खैर** - अव्य० సరే, అస్తు! మంచిది.
**खैर आफियत** - स्त्री० కుశల-క్షేమము, యోగక్షేమములు.
**खैर खाह ; खैर ख्वाह** - वि० మేలుకోరువాడు, తృప్తి.
**खैर मकदम**-पुं० శుభాగమనము; స్వాగతము.
**खैरात** - स्त्री० దానధర్మములు, పుణ్యకార్యములు.
**खैरात खाना** - पुं० అన్న సత్రము.

**खैरियत** - स्त्री० యోగక్షేమము, శుభము.
**खैल** - पुं० సమాచారము, సముదాయము.
**खैला** - स्त्री० వెర్రిబాగుల స్త్రీ.
**खोई** - स्त्री० చెరకు పిప్పి.
**खोखला** - वि० బోలు, తొర్ర.
**खोज** - स्त्री० అన్వేషణ, వెతుకుట.
**खोजा** - पुं० हिजड़ा ; మహ్మదీయుల రాణి వాసములో కాపలా కాయు నపుంసక ప్రహరి.
**खोट** - स्त्री० దోషము, మంచి వస్తువునందు చెడు వస్తువును కలుపుట, కల్తీ.
**खोटा** - स्त्री० చెడుగల, చెడ్డ.
**खोटाई** - स्त्री० చెడ్డతనము, చెడు లక్షణము.
**खोड़रा** - पुं० कोटर ; చెట్టుతొర్ర.
**खोद** - पुं० యుద్ధక్షేత్రమున శిరస్సునకు ధరించు ఇనుప కవచము, శిరస్త్రాణము.
**खोदना** - स० क्रि० త్రవ్వుట; చెక్క మీద బహు విధముగా లతలు వగైరాలు చెక్కుట, పురిగొల్పుట; ఎగతాళి చేయుట.
**खोदाई** - स्त्री० త్రవ్వకము, తవ్వుడు కూలి, నగిషీపని; చెక్కుడు పని.
**खोनचा** - पुं० ఇంటింటికీ తిరిగి అమ్మువాని తట్ట లేక ఒకవిధమగు గంప.
**खोना** - स० क्रि० పోగొట్టుకొనుట, अ० क्रि० పోవుట.
**खोपड़ा** - पुं० కపాలము, పుర్రె, కొబ్బరి చిప్ప.
**खोपड़ी** - स्त्री० పుర్రె, తల ; **खोपड़ी खा जाना** - मु० వ్యర్థ ప్రసంగములో విసిగించుట.
**खोया** - पुं० పాలకోవా.
**खोर** - स्त्री० ఇరుకు గొంది, సందు; పసువులకు మేత పెట్టు తొట్టి, స్నానము.
**खोरा** - पुं० మంచి నీరు త్రాగుటకు ఉపకరించు పాత్ర. वि० కుంటి.
**खोरि ; खोरी** - स्त्री० ఇరుకు సందు లేక గొంది; దోషము; చెడు.
**खोल** - पुं० గలీబు.
**खोलना** - स० क्रि० తెరచుట, విప్పుట; ప్రకటించుట, బహిర్గతము చేయుట.
**खोली** - स्त्री० గలీబు, దిండు గలీబు; సంచి.
**खोवा** - पुं० खोया ; పాలకోవ.
**खोह** - स्त्री० గుహ ; కొండలోయ.
**खोही** - स्त्री० తాటాకు గొడుగు.
**खौंचा** - पुं० खोनचा ; మిఠాయి గంప.
**खौफ** - पुं० భయము, భీతి.
**खौफजदा** - वि० భీతిల్లిన, భయపడిన.
**खौफनाक** - पुं० భయంకరమైన, భయానకమైన.
**खौर** - स्त्री० చందనపు బొట్టు; స్త్రీల శిరోభూషణము.

**खौरना** - **स॰क्रि॰** నుదుట మీద చందనపు బొట్టు పెట్టుట.

**खौरहा** - **वि॰** చుం(్రడు వ్యాధిగల, చుండు వ్యాధి గల.

**खौरा** - **पुं॰** చుం(్రడు వ్యాధి, చుండు వ్యాధి.

**खौलना** - **अ॰क्रि॰ उबलना** ; మసులుట, మరుగుట, కాచుట, కాగి పొంగుట, ఆవేశ పడుట.

**खौलाना** - **स॰ क्रि॰ उबालना** ; మరగ బెట్టుట, కాచుట, కాచి పొంగించుట.

**ख्यात** - **वि॰** ప్రసిద్ధమగు.

**ख्याल** - **पुं॰** ఆలోచన, స్మరణము, భావము, ధ్యానము, అంచనా.

**ख्याली** - **वि॰** ఊహించిన, కల్పితమైన, కృత్రిమమైన

**ख्याली पुलाब पकाना** - **मु॰** అసంభవమైన విషయములు ఆలోచించుట లేక ఊహించుట.

**ख्वाजा** - **पुं॰** యజమాని, ప్రభువు, నాయకుడు, మహ్మదీయ ఫకీరు, కొజ్జావాడు.

**ख्वाजा-सरा** - అంతఃపురకొజ్జా సేవకుడు.

**ख्वान** - **पुं॰** భోజనపు కంచము లేక పళ్ళెము.

**ख्वाब** - **पुं॰** కల ; స్వప్నము.

**ख्वार** - **वि॰** తినువాడు ; తిండిబోతు; చెడ్డ; తిరస్కృతమైన ; వినష్టమైన.

**ख्वारी** - **स्त्री॰** నాశము; చెడు; దుర్దశ.

**ख्वाह** - **वि॰** కోరువాడు.

**ख्वाहमख्वाह** - **क्रि॰वि॰** ఇష్టమున్నా లేకపోయినా; బలవంతముగా; అవశ్యము

**ख्वाहिश** - **स्त्री॰** కోరిక ; అభిలాష.

**ख्वाहिश-मन्द ; ख्वाहाँ**-**वि॰** కోరువాడు అభిలాషి; అభిలషించువాడు.

## ग

**गंग** - **स्त्री॰** గంగానది ; **पुं॰** ప్రసిద్ధి చెందిన ఒక హిందీ కవి.

**गंगबरार**-**स्त्री॰** వరద తగ్గిన మీదట బయట పడిన నదీ భూభాగము.

**गंगाजमनी** - **वि॰** మిశ్రమమైన; కలనేతగల.

**गंगा जली** - **स्त्री॰** గంగాజలము తెచ్చు పాత్ర.

**गंगा जली उठाना** - **मु॰** గంగా జలము చేతిలోనికి తీసుకొని శపథము చేయుట.

**गंगाल** - **पुं॰** గంగాళము.

**गंगालाभ** - **पुं॰** మృత్యువు; గంగా తీరమున మృత్యువు.

**गंज** - **पुं॰** బట్టతల; ధనాగారము; ధాన్యపు మార్కెట్టు; విపణి.

**गंजन** - **पुं॰** అనాదరము; తిరస్కారము; నాశము.

**गंजा** - **पुं॰** చుండు వ్యాధి.

**गंजिया** - **स्त्री॰** నూలు డబ్బు సంచి; గడ్డి

అమ్ము వారు గడ్డి ఉంచు సంచి.

**गंजी** - स्त्री० బనియను; సమూహము.

**गंजेडी** - वि० గంజాయి త్రాగువాడు.

**गंठकटा** - पुं० गिरहकट ; జేబుదొంగ; మూటలు కొట్టు వాడు.

**गँठजोडा ; गँठ बँधन** - पुं० పెళ్ళి సమయమున వధూవరుల కొంగులను కలిపివేయు ముడి; వివాహము.

**गंड** - पुं० కణత; చెక్కిలి.

**गंडा** - पुं० ఒకవిధమగు దిష్టి తాడు.

**गंडा तावीज** - पुं० మంత్ర యంత్రము; రక్షరేకు.

**गंडासा** - पुं० పశువులకు వేయు చొప్పగడ్డి మొ. చిన్నచిన్న ముక్కలుగా నరకెడి కత్తి, ఒకవిధమగు పరశు.

**गंडेरी** - स्त्री० చెరుకు ముక్క.

**गंदगी** - स्त्री० మురికి.

**गंदला** - वि० మురికిగానున్న.

**गंदा** - वि० మురికిగానున్న; దుర్వాసనగల.

**गंदुम** - पुं० गेहूँ ; గోధుమ.

**गंदुमी** - वि० గోధుమ వన్నెగల.

**गंध** - स्त्री० వాసన; సువాసన.

**गंधक** - पुं० గంధకము; పసుపు పచ్చని ఒక ఖనిజ పదార్థము.

**गंध-बिलाव** - पुं० పునుగు పిల్లి; ముంగిస; గుంటనక్క కలసిన ఆకారము గల ఒక మాంసాహారి చిన్న జంతువు, కస్తూరి పిల్లి.

**गंधर्व** - पुं० గంధర్వుడు, గాయకుడు.

**गंधर्व विद्या** - स्त्री० గాన విద్య.

**गंधर्व विवाह** - पुं० ప్రేమ పెళ్ళి.

**गंधवह** - पुं० గాలి; ముక్కు.

**गंधी** - पुं० अत्तार ; అత్తరు అమ్మువాడు.

**गवँ** - स्त्री० యుక్తి; పద్ధతి; అదను; ఎత్తు.

**गँवँ से**-मु० యుక్తిగా; మెల్లిగా; చెప్పుకోకుండా.

**गँवई** - पुं० కుగ్రామము.

**गँवर मसला** - पुं० పల్లెటూరి వాండ్ర సామెత.

**गँवाना** -स०क्रि०खोना ; పోగొట్టుకొనుట.

**गँवार** - वि० देहाती ; పల్లెటూరి రైతు.

**गँवारी**-स्त्री०गँवारपन; గ్రామీణత; అసభ్యత; మూర్ఖత; గ్రామీణ స్త్రీ; वि० పల్లెటూరికి సంబంధించిన; పల్లెటూరి మాదిరి.

**गँवारिन** - स्त्री० గ్రామీణ స్త్రీ; మోటు స్త్రీ.

**गँवारू** - वि० మోటుగా; గ్రామీణమైన; నాజూకులేని; అసభ్యమైన.

**गँस** - पुं० వైరము; ద్వేషము; ముడి.

**गँसना** - स०क्रि० బిగించుట; దట్టముగా నేయుట.

**गँसीला** - वि० మొనతేలిన; గుచ్చుకొను.

**गऊ** - स्त्री० गाय ; ఆవు.

**गऊघाट** - पुं० ఆవుల నీటి రేవు; పశువుల నీటి రేవు.

**गगन** - पुं० ఆకాశము.

**गगन घूल** - स्त्री० ఒక విధమగు పుట్టకొక్కు; కేతకీ పుష్ప పరాగము.

**गगरा** - पुं० బిందె.

**गगरी** - स्त्री० చిన్న బిందె.

**गच** - पुं० గచ్చు చేసిన నేల.

**गचकारी** - स्त्री० గచ్చు పని.

**गचपच** - पुं०दे० गिचपिच.

**गज** - पुं० గజము బద్ద. **गज** - पुं० ఏనుగు.

**गजक** - पुं० సారా మొ॥ మత్తు పదార్థము తాగిన పిదప నోటి రుచి మార్చుటకై అప్పడము మొ॥తినుట లేక తిను పదార్థము.

**गजनफर** - पुं० సింహము.

**गजपाल** - पुं० महावत ; మావటి వాడు.

**गजब** - पुं० आफत ; ఆపద; కోపము; అన్యాయము; అత్యాచారము; విచిత్రమగు విషయము.

**गजब का** - पुं० విచిత్రమగు; విలక్షణమగు.

**गजबनाक** - वि० బహుక్రుద్ధుడైన.

**गजर** - पुं० గంట; గంట ధ్వని.

**गजरदम** - पुं० ప్రాతఃకాలము; పెందలకడ.

**गजरा** - पुं० పూల; పుష్పహారము.

**गजल** - स्त्री० ఫారసీ; ఉర్దూ భాషలలో వ్రాయు ఒకవిధమగు శృంగార రసాత్మకమైన కవిత్వము.

**गजी** - स्त्री० ఆడ ఏనుగ.

**गजी** - पुं० ముతక వస్త్రము; తక్కువ వెడల్పు గల మోటు వస్త్రము.

**गज्झ** - पुं० నీటి బుడగల సమూహము; ఏనుగ అంబారి; రాశి; సమూహము.

**गटकना** - स०क्रि० మ్రింగివేయుట; కాజేయుట.

**गटपट** - स्त्री० కలయిక; మైత్రి; ఘనిష్టత; సంభోగము.

**गट्टा** - पुं० మణికట్టు; శీలమండ; విత్తు; కమల బీజము; ఒక విధమగు మిఠాయి.

**गट्टर** - पुं० మోపు; పెద్ద మూట.

**गट्ठा** - पुं० పెద్ద మూట.

**गट्ठी** - स्त्री० गाँठ ; ముడి.

**गठन** - स्त्री० నిర్మాణము; రచన.

**गठना** - अ०क्रि० ధృడముగా నుండుట; బిగువుగా నుండుట.

**गठ बंध ; गठ बंधन** - पुं० వివాహము; వివాహ సందర్భములో వధూవరుల కొంగులు కలిపి ముడి వేయుట.

**गठरी** -स्त्री० మూట; పొట్లము; కూడబెట్టిన ధనము.

**गठित** - वि० నిర్మింపబడిన; కూర్చబడిన.

**गठिया** - स्त्री० కీళ్ళ వాతము; చిన్న మూట; ధాన్యము పోయుటకు ఉపయోగించు గోనెసంచి.

**गठियाना** - स० क्रि० ముడివేయుట; ముడి వేసి కట్టుట.

**गठीला** - वि० బలిష్ఠమగు; బిగిసియున్న; అనేక ముళ్ళుగల; మెలితిరిగిన.

**गड** - पुं० కందకము; గుంట; ప్రాకారము.

**गडकना** - अ० क्रि० గడగడమనుట; లీన మగుట.

**गडगडा** - पुं० ఒకవిధమగు హుక్కా.

**गडगडाना** - स० क्रि० గడగడమని శబ్దము చేయుట; హుక్కా త్రాగుట ; अ० क्रि० గర్జించుట (మేఘములు).

**गडगडाहट** - स्त्री० మేఘగర్జన.

**गडना** - अ० क्रि० దిగబడుట; దూరుట; గ్రుచ్చుకొనుట; నొప్పిపుట్టుట; పూడ్చ బడుట.

**गडपना**-स० क्रि० మింగుట; కొల్లగొట్టుట.

**गडप्पा** -पुं० గొయ్యి; తప్పుదారి; అపాయము కలుగచేయు చోటు.

**गडबड** - पुं० గడబిడ; తారుమారు; గంద్ర గోళము.

**गडबडझला** - पुं० गोलमाल ; అవ్యవస్థ; అక్రమము.

**गडबडिया** - पुं० గోలచేయువాడు; గంద్ర గోళము సృష్టించువాడు.

**गडबिडी** - स्त्री० दे० गडबड.

**गडरिया** - पुं० గొల్లజాతి మనిషి; గొర్రెలు పెంచువాడు.

**गडहा** - पुं० दे० गड्ढा.

**गडा** - पुं० రాశి; పోగు.

**गडाना** - स० क्रि० గ్రుచ్చుట; పాకుట; పాడుచుట.

**गडारी** - स्त्री० నూతిగిలక; గుండ్రని చారలు.

**गडुई** - स्त्री० - **गडुवा** - पुं० కొమ్ముచెంబు, చిన్న ఝూరి.

**गडे मुर्दे उखाडना** - मु० ఎప్పుడో జరిగిన విషయాలను లేవనెత్తుట.

**गडेरिया** - पुं० दे० गडरिया.

**गडोना** - स० क्रि० గ్రుచ్చుట; చొప్పించుట.

**गडोलना** - पुं० చిన్న పిల్లలను కూర్చుండ బెట్టి త్రిప్పెడి బండి.

**गड्ड** - पुं० गड्डी ; దొంతర; గొయ్యి.

**गड्डा** - पुं० ఎద్దు బండి; మోపు; తాళ్ళనిచ్చెన.

**गड्ढा** - पुं० గొయ్యి.

**गढंत** - वि० కల్పితము स्त्री० కలిపించిన మాట.

**गढ** - पुं० కోట; దుర్గము; కందకము.

**गढन** - पुं० నిర్మాణము; ఆకారము.
**गढना** -स०क्रि० కల్పించి సృష్టించుట; నిర్మించుట; ఒట్టొట్టి మాటలను వ్యాపింపజేయుట; చితకబాదుట.
**गढवाल** -पुं० దుర్గరక్షకుడు; ఒక ప్రాంతము.
**गढा** - पुं० गड्ढा ; గొయ్యి.
**गढाई** - स्त्री० నిర్మాణము; నిర్మించుట; రచన, రచించుట; కంసాలికిచ్చు మజూరి.
**गढिया** - पुं० కల్పించు వాడు; నిర్మించు వాడు.
**गढी** - स्त्री० చిన్నకోట; చిన్నగొయ్యి.
**गढैया** - पुं० दे० गढिया.
**गण** - पुं० సమూహము; శ్రేణి; శివుని సేవక సముదాయము.
**गणक** - पुं० జ్యోతిష్కుడు.
**गणतंत्र** - पुं० సర్వతంత్ర స్వతంత్ర రాజ్యము.
**गणना** - स्त्री० లెక్క; గణన
**गणनीय** - वि० లెక్కింపదగిన; ప్రసిద్ధి గాంచిన.
**गणपति** - पुं० శివుడు; విఘ్నేశ్వరుడు.
**गणराज्य** - पुं० ప్రజాతంత్రరాజ్యము.
**गणिका** - स्त्री० వేశ్య.
**गण्य** - वि० లెక్కింపదగిన.
**गण्यमान्य** - वि० గౌరవింపదగిన.
**गत** - वि० గతించిన; చనిపోయిన; జరిగిపోయిన; గడచిన.
**गतका** - पुं० అధికారదండము; దుడ్డుకర్ర; గద.
**गतकुल** - वि० लावारिस ; వారసులు లేని.
**गतंक** - पुं० గతసంచిక वि० నికృష్టమైన.
**गतगत** - पुं० రాకపోకలు; జననమరణములు वि० వస్తూపోతూఉన్న; వచ్చి వెళ్ళిన.
**गतानुगतिक** - वि० అంధానుసరణచేయువాడు; గుడ్డిగా అనుసరించువాడు.
**गति** - स्त्री० చలనము; నడక; స్థితి; దశ; గమనము.
**गति-विधि** - स्त्री० జరుగు రీతి; క్రమము; స్థితి.
**गतिशील** -वि० గమనముగల; చలనముగల.
**गत्ता** - पुं० కాగితపు అట్ట.
**गत्तालखाता**-पुं० बट्टा खाता; రాని బాకీల ఖాతా.
**गथ** - पुं० మూలధనము.
**गद** - पुं० విషము; రోగము.
**गदका** - पुं० दे० गतका.
**गदकारा** - वि० మృదువైన; మెత్తని.
**गदगद** - वि०గద్గదము; డగ్గుత్తికపడినమాట.
**गदर** - पुं० విప్లవము; క్రాంతి; తిరుగుబాటు.
**गदराना**-अ०क्रि०కాయలు మొ॥ దోరపడుట; యువావస్థలో అంగ ప్రత్యంగములు మిసమిసలాడుట; కంటిలో పుసి

కట్టుట; వికసించుట.

**गदह पच्चीस ; गधा पच्चीसी** - स्त्री० 16-25 సంవత్సరముల కాలములో కలుగు అనుభవ హీనత.

**गदहपन** - पुं० మూర్ఖత; మౌర్ఖ్యము.

**गदहा** - पुं० दे० गधा.

**गदा** - पुं० బికారి; యాచకుడు.

**गदा** - स्त्री० గద.

**गदाई** - स्त्री० భిక్షాటన; భిక్షావృత్తి; वि० క్షుద్రమైన; నీచమైన.

**गदीर** - वि० धोखेवाज ; ప్రపంచకుడు.

**गद्दा** - पुं० పరుపు; మెత్త.

**गद्दार** - वि० ద్రోహి; విద్రోహి; తిరుగుబాటు దారుడు; విప్లవకారుడు; కృతఘ్నుడు.

**गद्दी** - स्त्री० పరుపు; అధికార పదవి; సింహాసనము; వంశపారంపర్యముగా లేక శిష్య పరంపరంగా లభించు అధికార పదవి.

**गद्दीनशीन** - वि० సింహాసనారూఢు; అధికార పదవినధిష్ఠించిన.

**गद्य** - पुं० గద్యము; వచనము.

**गधा** - पुं० गदहा ; గాడిద.

**गधापन** - पुं० మూర్ఖత్వము; గాడిద లక్షణము.

**गनी** - वि० గొప్ప ధనవంతుడు; పరమ స్వతంత్రుడు.

**गनीम**-पुं०दुश्मन ; శత్రువు; దోపిడీ దారుడు; బందిపోటు దొంగ.

**गनीमत** - स्त्री० దోపిడీ సొత్తు; ఊరికేవచ్చిన సొమ్ము; ఆస్తి; సంతోషించవలసిన విషయము.

**गन्दगी** - स्त्री० दे० गंदगी.

**गन्दुम** - पुं० గోధుమ.

**गन्ना** - पुं० చెరుకు.

**गप** - स्त्री० బడాయి; పుకారు; కాలక్షేపపు కబుర్లు.

**गपकना** - स०क्रि० గుబుక్కున మ్రింగుట.

**गपड़चौथ** - पुं० పనికిమాలిన మాటలు; గడబిడ; లోకాభిరామాయణము.

**गपना** - स०क्रि० గప్పాలుకొట్టుట.

**गपोड़ा** - पुं० బడాయి.

**गप्पी ; गपबाज** - वि० కోతలరాయుడు; గప్పాలు కొట్టువాడు.

**गपशप** - स्त्री० ఒట్టొట్టి మాటలు; పిచ్చాపాటి.

**गप्फा** - पुं० లాభము; పెద్దముద్ద.

**गफ** - वि० गाढा ; చిక్కని; దట్టమైన.

**गफलत** - स्त्री० असावधानी; నిర్లక్ష్యము; అచేతనత; పొరపాటు; అజాగ్రత్త.

**गफलती** - वि० నిర్లక్ష్యముచేయువాడు; అజాగ్రత్త; జాగ్రత్తలేనివాడు.

**गफ़ूर** - वि० క్షమించువాడు ( భగవంతుడు)

**गफ़्फार** - वि० గొప్ప దయార్ద్రుడు ( భగ వంతుడు)

**गबन** - पुं० **अमानत मे खयानत** ; దగ్గర ఉంచిన పరుల సొత్తును భుక్తపరుచుకొనుట.

**गबरू** - वि० కిశోరావస్థలోనున్న ; నవ యువకుడు; అభంశుభం తెలియనివాడు.

**गब्बर** - वि० అహంకారి; అహంభావి; గర్విష్ఠి.

**गम** - स्त्री० అందుబాటు; ప్రవేశము; నిర్వాహకము.

**गम** - पुं० చింత; దుఃఖము; మనస్తాపము.

**गमक** - स्त्री० సువాసన; మద్దెల ధ్వని; वि० సూచించునట్టి; బోధించునట్టి.

**गमकना** - अ०क्रि० గుబాళించుట; సువాసన నచ్చుట.

**गम खाना** - पुं० సహించుట; పోనిచ్చుట.

**गमखोर** - वि० సహనశీలుడు; ఓర్పువాడు.

**गमगीन** - वि० దుఃఖముగల; ఖిన్నుడు.

**गमगसार** - वि० ఇతరుల దుఃఖమును పార దోలువాడు.

**गमजदा** - वि० దుఃఖముగల దుఃఖార్తుడు.

**गमछा** - पुं० అంగవస్త్రము.

**गमजा** - पुं० ప్రియురాలి హావభావములు; ప్రియురాలి చలిపి చేష్టలు.

**गमन** - पुं० ప్రయాణము; వెళ్ళుట; దారి; సంభోగము; వేశ్యాగమనము.

**गमला** - पुं० పూలకుండి; పూలతొట్టి.

**गमी** - स्त्री० మృత్యువు; మృత్యుశోకము.

**गम्य** - वि० చేరవలసినది; పొందదగినది; గమ్యము.

**गम्माज** - वि० చాడీకోరు.

**गयंद** - पुं० గజేంద్రము; పెద్ద ఏనుగు.

**गया-गुजरा ; गया-बीता** -वि० గతించిన; పనికిమాలిన; నిక్కష్టమైన.

**गर** - पुं० **जहर** ; విషము; రోగము; గొంతు; ఒక ప్రత్యయము ( ఉదా: **कलई गर, बाजीगर**) **अव्य० अगर** ; అయినచో; ఒకవేళ.

**गरक** - वि० **दे० गर्क**.

**गरकी** - स्त्री० **बाढ** ; వరద; జలప్లావనము.

**गरचे** - अव्य० **अगरचे** ; అయినప్పటికి.

**गरज** - स्त्री० గర్జింపు; గర్జన.

**गरज** - स्त्री० ప్రయోజనము; ఆవశ్యకత; అవసరము; ఉద్దేశ్యము; **अव्य०** తుదకు; క్లుప్తముగా.

**गरजना** - अ०क्रि० గర్జించుట.

**गरजमंद ; गरजी ; गरजू** - वि० పనిపడిన వాడు; స్వార్థపరుడు; అక్కరకలవాడు; అవసరము గలవాడు.

**गरीबाना** - वि० దరిద్రులవలె; బీదలవలె.

**गरीबी** - स्त्री० దారిద్ర్యము; బీదరికము.

**गरीयस** - वि० మిక్కిలి గొప్ప.

**गरु ; गरुआ** - वि० బరువుగల; గౌరవ నీయమైన.

**गरुआई** - स्त्री० భారము ; బరువు ; గురుత్వము.

**गरुड** - पुं० గ్రద్ద; గరుత్మంతుడు.

**गरू** - वि० గొప్ప; బరువుగల.

**गरूर** - पुं० घमंड ; గర్వము.

**गरूरा ; गरूरी** - वि० అహంకారి; గర్విష్ఠి.

**गरेबान** - पुं० చొక్కా మెడ భాగము; చొక్కా మెడపట్టీ; చొక్కా కాలరు.

**गरेरना** - स०क्रि० చుట్టుముట్టుట; అడ్డగించుట.

**गरेब** - पुं० కోలాహలము; గల్లంతు.

**गरोह** - पुं० झुंड ; గుంపు; మంద.

**गर्क** - वि० నిమగ్నమైన; మునిగి ఉన్న; విచారమగ్నమైన.

**गर्की** - स्त्री० వరద; నిమజ్జన; మునుగు.

**गर्द** - स्त्री० దుమ్ము; ధూళి.

**गर्दखोर** - वि० త్వరగా మురికి కానిది.

**गर्दखोरा** - पुं० కాళ్ళు తొక్కుడు; కాళ్ళమట్టి - మశానము రాయుటకు గుమ్మము ముందు వేయు కొబ్బరి పీచు పట్టా.

**गर्द-गुबार** - पुं० దుమ్ము - ధూళి; గాలి దుమారము.

**गर्दन** - स्त्री० दे० गरदन.

**गर्दभ** - पुं० गधा ; గాడిద.

**गर्दिश** - स्त्री० తిరుగుడు; విపత్తు.

**गर्दिश में आना** - मु० విపత్తులో చిక్కుకొనుట.

**गर्ब** - पुं० పశ్చిమ దిశ; సూర్యాస్తమయము.

**गर्हण** - पुं; **गर्हणा** -स्त्री० గర్హించుట; నింద; తిరస్కారము.

**गर्हित** - वि० నిందింపబడిన; గర్హింపబడిన.

**गलकंबल** - पुं० ఎద్దు; ఆవు; మొదలగు మెడక్రింద వ్రేలాడు గంగడోలు.

**गलत** - वि० తప్పు; పొరపాటు; అశుద్ధమైన.

**गलतंस** - पुं० నిస్సంతానునిగా చనిపోయిన వాడు.

**गलतनामा** - पुं० తప్పొప్పుల పట్టిక; శుద్ధి పత్రము.

**गलतफहमी** - स्त्री० భ్రమ; భ్రాంతి.

**गलती** - स्त्री० తప్పు; త్రుటి; అశుద్ధి.

**गलयन ; गलयना** - पुं० అజస్తనములు; మేకమెడలో వ్రేలాడుచూ కనిపించు చన్నులు.

**गलना** - अ०क्रि० కరుగుట; త్రుళ్ళుట.

**गलफाँसी** - स्त्री० మెడకువేయు ఉరి;

కుటుంబ జంజాటము.

**गलबाँही** - स्त्री० కంఠాలింగనము.

**गलबा** - पुं० గలభా; గల్లంతు.

**गलमुच्छा** - पुं० బుగ్గ మీసములు.

**गलशुंडी** - स्त्री० कौआ ; కొండనాలుక.

**गलस्तनी** - स्त्री० మెడలో చన్నులు గల మేక; गलयनी.

**गला** - पुं० गर्दन ; కంఠము; మెడ; గొంతు; కంఠస్వరము.

**गला बैठना** - पुं० గంతు బొంగురు పోవుట.

**गलेका हार** - पुं० బహు ఇష్టమైన వస్తువు.

**गले पडना** - मु० మెడకు చుట్టుకొనుట; ఇష్టము లేకపోయినను వెంటనుండుట.

**गले मढना** - मु० నెత్తికిరుద్దుట; బలవంతముగా అంటగట్టుట.

**गले मिलना या गले लगना** - मु० ఆలింగనము చేయుట; కౌగిలించుకొనుట.

**गलाऊ** - वि० కరుగునట్టి.

**गलाना** -स०क्रि० కరిగించుట; కరగపెట్టుట; జీర్ణింపజేయుట.

**गलित** - वि० కరిగిన; జీర్ణించిన; నశించిన.

**गलित यौवना** - स्त्री० యువావస్థ దాటిన స్త్రీ; మధ్యవయస్కురాలు.

**गलियारा** - पुं० ; **गलियारी** - स्त्री० ద్వార మండపము; దీర్ఘమైన కూర్చుండు వంకర తిరిగిన బల్ల.

**गली-कूचा** - पुं० సందు; గొందు.

**गलीचा** - पुं० తివాచి; రత్నకంబళము.

**गलीज** - वि० మురికియగు ; గలీజు ; पुं० మురికి; పెంట.

**गलिया** - पुं० ఇరుకుసందు.

**गलेबाज** - वि० మధుర నాయకుడు.

**गलौआ** - पुं० కోతినోటిలోని సంచి.

**गल्प** - पुं० कहानी ; చిన్నకథ; బడాయి.

**गल्ला** - पुं० పశువుల మంద; గోల.

**गल्ला** - पुं० పంట; ధాన్యము; దుకాణములో దినసరి అమ్మకమువలన వచ్చు పైకము లేక రాబడి.

**गवँ** - स्त्री० ప్రయోజనము.

**गवँसे** - मु० అదనుచూచి; పొంచి; మెదలకుండా.

**गवन** - पुं० गमन ; గమనము; ప్రస్తావము.

**गवाक्ष** - पुं० झरोखा ; కిటికి.

**गवाना** - स०क्रि० పాడించుట.

**गवारा** -वि० पसंद ; నచ్చిన; అనుకూలమైన; పసందగు.

**गवास** - पुं० कसाई ; కసాయివాడు.

**गवाह** - पुं० साक्षी ; సాక్షి.

**गवाही** - स्त्री० साक्ष्य ; సాక్ష్యము.

**गवेषणा** - स्त्री० అన్వేషణ; పరిశోధన.

**गवेषी** - पुं० అన్వేషించువాడు; పరిశోధించువాడు.

**गवैया** - पुं० गानेवाला ; గాయకుడు.

**गव्य** - वि० ఆవునుండి లభించు వస్తువులు.

**गव्या** - स्त्री० ఆవుల మంద.

**गश** - पुं० మూర్ఛ.

**गश्त** - पुं० పహరా; గస్తీ; భ్రమణము.

**गश्ती** - वि० గస్తీ తిరుగువాడు.

**गश्ती चिट्ठी-या पत्र** - సర్క్యులరు; గస్తీ ఉత్తర్వు.

**गसना** - स०क्रि० ఇరికించుట; ముడిపెట్టుట; వడుగునందు పేకను పట్టించి నేయుట.

**गसीला** - वि० దట్టమైన నేతగల; చిక్కుకొనిన.

**गस्सा** - पुं० కబళము; ముద్ద.

**गह** - स्त्री० కత్తిపిడి.

**गहगहा** - वि० ఆనందాతిరేకములోనున్న.

**गहगहाना** - अ०क्रि० అమితముగా ఆనందించుట.

**गहन** - वि० లోతైన; గంభీరమైన; దట్టమైన; కఠినమైన; पुं० లోతు; దట్టము.

**गहना** - पुं० ఆభరణము; తాకట్టు; स०क्रि० పట్టుకొనుట.

**गहनी** - स्त्री० మొండిపట్టు; హఠము.

**गहबर** - वि० దుర్గమమైన; చొరశక్యముగాని.

**गहर** - स्त्री० ఆలస్యము.

**गहरना** - अ०क्रि० జాగుచేయుట; పోట్లాడుట; కోపపడుట.

**गहरा** - वि० లోతైన; గంభీరమైన; చిక్కనైన.

**गहराई** - स्त्री० లోతు; గాంభీర్యము.

**गहवा** - पुं० పట్టకారు; పట్కారు.

**गहवारा** - पुं० ఊయల; ఉయ్యాల.

**गह्वर** - पुं० గుహ్యస్థానము; గుప్తస్థానము; గుహ; అంధకారమయమైన; ప్రదేశము. वि० దుర్గమమైన.

**गाँज** - पुं० రాశి; కుప్ప; పోగు.

**गाँजना** - स०क्रि० ప్రోగు చేయుట; కుప్పగా పోయుట.

**गाँजा** - पुं० గంజాయి.

**गाँठ-कर** - मु० జేబుదొంగ; మూటల దొంగ.

**गाँठ**-स्त्री० ముడి; మూట; ఈర్ష్య; ద్వేషము; కణుపు.

**गाँठ पडना** - पुं० మనస్సులో ద్వేషభావము కలుగుట.

**गाँठ का पूरा** - मु० ధనవంతుడగు.

**गाँठ में बाँधना** - मु० జాగ్రత్తగా జ్ఞాపకముంచుకొనుట.

**गाँठ गोभी** - स्त्री० కోసుగడ్డ; క్యాబేజి.

**गाँठना** - स०क्रि० ముడివేయుట; కలుపుట;

బిగించుట.

(मतलब) गाँठना - मुం స్వార్థమును నెర వేర్చుకొనుట.

गाँड - स्त्रीం గుదస్థానము; ముడ్డి.

गाँडा - पुం చెరుకుముక్క.

गाँडू - पुం తుచ్ఛుడు; పిరికివాడు; ఒక తిట్టు.

गाँथना - सంక్రిం దేం गूँथना.

गाँधी- पुం మహాత్మాగాంధీ గుజరాత్ ప్రాంతములో ఒకవైశ్య తెగ.

गाँव - पुం గ్రామము.

गाँस - स्त्रीం అడ్డంకు; విరోధము; ముడి; బాణపు ములికి లేకఫలకము; రహస్యము.

गाँहक -पुం చందాదారు; గ్రాహకుడు; గ్రహించువాడు; ఖాతాదారు.

गगार - पुం కుండ; బిందె.

गगार में सागर भरना - मुం చెంబులో అపార సాగరమును నింపుట; కొద్దిలో ఘనముగా చెప్పుట.

गागरी - स्त्रीం చిన్నకుండ లేక బిందె.

गाछी - स्त्रीం గంత; తోట.

गाज - स्त्रीం గర్జింపు; పిడుగు; పిడుగు పడు శబ్దము.

गाजना - अంక్రిం ఆనందముతో సకిలించుట; గర్జించుట.

गाजर-स्त्रीం ముల్లంగి జాతికి సంబంధించిన ఒకకందము.

गाजर-मूली के बराबर - मुం తుచ్ఛముగు; క్షుద్రమైన.

गाजा - पुం ముఖమునకు రాచుకొను ఒక సువాసనగల చూర్ణము.

गाजा-बाजा - पुం బాజాభజంత్రీలు; మేళము; మేళగాళ్ళ సమూహము.

गाड - स्त्रीం పాతర; గొయ్యి.

गाडना - सంక్రిం పాతుట; పూడ్చిపెట్టుట; నాటుట.

गाडर - स्त्रीం గొర్రె.

गाडी - स्त्रीం బండి.

गाडीवान - पुం బండివాడు; బండి తోలువాడు.

गाढ-पुం ఇబ్బంది; సంకటము; विం చిక్కని; లోతైన; దృఢమైన; కఠినమైన.

गाढा - विం చిక్కనైన; దట్టమైన; మోటు అయిన. गाढे में पडना - मुం సంకట స్థితిలో చిక్కుకొనుట.

गात - पुం శరీరము.

गाती - स्त्रीం మెడకు చుట్టబడు దుప్పటి లేక వస్త్రము; మెడకు వస్త్రము చుట్టుకొను ఒకపద్ధతి.

गात्र - पुం गात ; శరీరము.

गाथा - स्त्रीం ఆనవాయితీగా ప్రచారములో

నున్న ఒకగాథ లేక కథ; స్తుతి.

**गाद** - स्त्री० తలఛట ; మడ్డి ; (ద్రవ పదార్థము లో అడుగున పేరు కొనుమడ్డి.

**गादड ; गादर** - वि० పిరికిపంద, భీరువు; సోమరి पुं० నక్క; గుంట నక్క.

**गादा** - पुं० సరిగా పక్వమునకు రాని పంట; పంటకు రాని పైరు. మగ్రికాయ.

**गान** - पुं० పాట; గీతము.

**गाना** - स०क्रि० పాడుట; స్తోత్రించుట; पुं० పాట.

**गाफिल** - वि० స్పృహలేని; ఏమరిపాటున; జాగ్రత్తలేని.

**गाभ** - पुं० చూడి.

**गाभा** - पुं० మొవ్వాకు; చిగురుటాకు; పచ్చి ధాన్యము.

**गाभिन ; गाभिनी** - वि० చూడి అయిన.

**गाम** - पुं० గ్రామము; అంగ; అడుగు.

**गाय** - स्त्री० ఆవు; वि० అమాయకమైన; కల్లకపట మెరుగని.

**गायगोठ** - स्त्री० गोशाला ; ఆవులపాక.

**गायत** - वि० చాలా ఎక్కువ; పరమావధి; చరమసీమ, అసాధారణమైన.

**गायक** - पुं० गवैया ; గాయకుడు.

**गायब** - वि० అదృశ్యమైన; అంతర్ధానమైన.

**गायबाना** - क्रि०वि० पीठ पीछे ; వెన్ను చాటున; అనుపస్థితిలో; పరోక్షముగా.

**गार** - पुं० గుహ; లోతైనగొయ్యి.

**गारत** - वि० ధ్వంసమైన ; వినష్టమైన ; पुं० దోపిడి; వినాశము.

**गारतगर** - वि० దోపిడీచేయువాడు; నాశము చేయువాడు.

**गारद** - स्त्री० పహరా; సైనికదళము.

**गारना** - स०क्रि० పిండుట (తడిగుడ్డమొ॥) విడిచిపెట్టుట.

**गारा** - पुं० అడుసు; గచ్చు.

**गारी** - स्त्री० दे० गाली.

**गार्दभ** - पुं० గాడిద; గర్దభము; वि० గాడిదకు సంబంధించిన.

**गाल** - पुं० బుగ్గ; చెక్కిలి.

**गाल करना या मारना** - मु० అధిక ప్రసంగము చేయుట; నిర్లక్ష్యపు ధోరణిలో మాట్లాడుట; బడాయి కొట్టుట.

**गाल फुलाना** - मु० మూతి ముడుచు కొనుట; అలిగి మాటాడకుండుట.

**गाल सेंकना** - पुं० చెంపదెబ్బకొట్టుట.

**गाला** - पुं० पूनी ; ఏకు ( దూది) బడాయి.

**गालिब** - वि० ప్రబలుడు; ప్రతాపుడు; విజితుడు; సంభావ్యము; ఒక ప్రసిద్ధ ఉర్దూకవి.

**गालिबन** - क्रि०वि० సంభవతః; చాలా

వరకు.

**गाली** - स्त्री० తిట్టు; దూషణ; దుర్భాష.

**गालीगलौज ; गाली गुफ्ता** - स्त्री० తిట్లు; తిట్లాట; పరస్పరము తిట్టుకొనుట. तूतू मैं मैं की - बात.

**गालीचा** - पुं० दे० गलीच.

**गालू** - वि० బడాయికోరు.

**गाव** - स्त्री० ఆవు गाय.

**गावकुशी** - स्त्री० గోవధ.

**गावजोरी** - स्त्री० బలప్రదర్శన కోరిక.

**गावदी** - वि० बेवकूफ ; మూర్ఖుడు.

**गास** - पुं० ఆపద; సంకటము.

**गाह** - पुं० చేతి పట్టు; చందాదారుడు; మొసలి; లోతు स्त्री० చోటు; స్థానము; సమయము.

**गाहना** - स०क्रि० స్నానము చేయుట; లోతు కనుగొనుట; చిలుకుట.

**गाहा** - स्त्री० दे० गाथा.

**गाही** - स्त्री० ఒక విధమగు లెక్కింపు; చెయ్యి (ఐదు వస్తువుల సమూహము, ఇరువది చేతులు వంద)

**गाहे-ब-गाहे** - क्रि०वि० कभी कभी ; అప్పుడప్పుడు.

**गाहेमाहे** - क्रि०वि० అప్పుడప్పుడు; నెలకొక పర్యాయము.

**गिंजना** - अ०क्रि० చెడిపోవువరకు నలప బడుట.

**गिंडुरी** - स्त्री० गेंडुरी ; చుట్టకుదురు.

**गिचपिच ; गिचर पिचर** - वि० జిగిబిగిగా నున్న; అస్పష్టముగానున్న.

**गिजा** - स्त्री० ఆహారము; భోజనము.

**गिजाफ** - पुं० అసత్యకథనము; అబద్ధము.

**गिजाल** - पुं० गजाल ; లేడిపిల్ల; జింకపిల్ల.

**गिटपिट** - स्त्री० నిరర్థక శబ్దజాలము.

**गिट्टी** - स्त्री० గులకరాయి; కంకరరాయి.

**गिडगिडाना** - अ०क्रि० బ్రతిమిలాడుట; ప్రాధేయపడుట.

**गिडगिडाहट** - स्त्री० మనవి; బ్రతిమిలాట; విన్నపము.

**गिद्ध** - पुं० उकाब ; రాబందు.

**गिनती** - स्त्री० లెక్కింపు; గొప్పతనము; సంఖ్య.

**गिनना** - स०क्रि० లెక్కించుట.

**गिनवाना ; गिनाना** - स०क्रि० లెక్కింప జేయుట.

**गिरगिट** - पुं० ఊసరవెల్లి.

**गिरजा** - पुं० క్రైస్తవుల గుడి లేక చర్చి.

**गिरदाब** - पुं० నీటి సుడిగుండము.

**गिरना** - अ०क्रि० పడుట; రాలుట.

**गिरफ्त** - स्त्री० पकड ; చేతిపట్టు; అరెస్టు.

**गिरफ्तार** - वि० పట్టుబడిన.

**गिरफ्तारी** - स्त्री० पकड ; పట్టుబడుట.

**गिरि** - पुं० పర్వతము; కొండ; स्त्री० కొండ ఎలుక; చిట్టెలుక; ఆడఎలుక.

**गिरिजा** - स्त्री० పార్వతి; గంగ.

**गिरमिट** - पुं० పెద్ద బరమా; ఒప్పంద పత్రము.

**गिरवी** - स्त्री० తాకట్టు; కుదవపెట్టిన వస్తువు.

**गिरह** - स्त्री० ముడి; మూట; చిక్కు; రెండు కణుపులు కలియుచోటు; గనుపు; జేబు; గజము (కొలత) లో 16వ భాగము.

**गिरहकर** - वि० జేబుదొంగ; కత్తిరింపు దొంగ.

**गिरहदार** - पुं० పలు కణుపులు గల లేక ముడులు గల.

**गिरहबाज** - पुं० ఒక విధమగు పావురము.

**गिराँ** - वि० ఎక్కువ వెలగల; ప్రియమైన; బహు మూల్యము గల.

**गिरा** - स्त्री० వాణి; వాక్కు; సరస్వతి.

**गिरानी** - स्त्री० గిరాకి; ఎక్కువ ధర; కరువు; దుర్భిక్ష.

**गिरामी** - वि० मशहूर ; ప్రఖ్యాతమైన; పూజ్యుడు.

**गिरी** - स्त्री० విత్తులోని పప్పు; గుజ్జు.

**गिरो** - पुं० दे० गिरवी.

**गिरोह** - पुं० झुंड ; గుంపు; సమూహము; మంద.

**गिर्द** - अव्य० సమీపమున; చుట్టుప్రక్కల.

**गिर्दबाद** - पुं० సుడిగాలి; చక్రవాతము.

**गिर्दावर** - वि० తనిఖీకై తిరుగు అధికారి.

**गिल** - स्त्री० गारा ; అడుసు; బంక మట్టి.

**गिलकारी** - स्त्री० అడుసుతో మెత్తుట.

**गिलटी** - स्त्री० గ్రంధి; వాపు; చంకమొదలగు చోట్ల వచ్చు బిళ్ళలు.

**गिलना** - स०क्रि० మింగివేయుట; మనస్సు లోనే ఉంచుకొనుట.

**गिलबिला** - वि० మృదువైన; మిక్కిలి మెత్తని.

**गिलबिलाना** - अ०क्रि० అస్పష్టముగా మాట్లాడుట.

**गिलम** - स्त्री० మెత్తని ఉన్ని కంబళి; దట్టమైన బొంత; రజాయి.

**गिलहरी** - स्त्री० ఉడుత.

**गिला** - पुं० దెప్పిపొడుపు; చాడి; ఫిర్యాదు; నింద.

**गिलाजत** - स्त्री० మురికి; మలము; పెంట; పురీషము.

**गिलाफ** - पुं० గలీబు (దిండు లేక పరుపు) పెద్దగుడ్డవర.

**गिलावा** - पुं० गारा ; అడుసు (సిమెంటు లేక మట్టి)

**गिलास** - पुं० లోటా; గ్లాసు.

**गिलोय** - पुं॰ తిప్పతీగ.

**गिलोला** - पुं॰ వడిశాలతో విసరు మట్టి (గుండు) గోలి.

**गिलौरी** - स्त्री॰ తమలపాకు కిళ్ళీ ; पुं॰गिलौरीदान ; కిళ్ళీ ఉంచు డబ్బా లేక పాత్ర.

**गिल्ला** - पुं॰ दे॰ गिला.

**गिल्ली** - स्त्री॰ गुल्ली ; బిళ్ళంగోడు; చిత్ర బిళ్ళ; గింజ; బెంక.

**गींजना** - स॰क्रि॰ నలుపుట; చిందర వందర చేయుట.

**गीत** - पुं॰; **गीति** - स्त्री॰ గీతము; గీతిక; పొగడ్త; యశోగీతము.

**गीदड** - पुं॰ నక్క; वि॰ పిరికిపంద.

**गीदी** - वि॰ పిరికివాడు; సిగ్గులేనివాడు; నపుంసకుడు.

**गीध** - पुं॰ రాబందు; గ్రద్ద.

**गीधना** -अ॰क्रि॰ ఒకసారి లాభము పొంది ఎల్లప్పుడు అలాగే లాభము పొందవలెనని కాంక్షించుట; కుతి కలుగుట; సంకోచించకుండుట.

**गीबत** - स्त्री॰ గైరు హాజరు; అనుపస్థితి; పిసాసితనము; చాడీలు చెప్పు ప్రవృత్తి.

**गीर** - वि॰ పట్టుకొనువాడు; ఉంచుకొను వాడు; తీసుకొనువాడు; स्त्री॰ సరస్వతి.

**गीर्वाण** - पुं॰ దేవత.

**गीला** - वि॰ తడసిన; నెమ్ముగల.

**गीलापन** - पुं॰ నెమ్ము; ఆర్ద్రత; తడి.

**गुंग ; गुंगा** - पुं॰ दे॰ गूँगा.

**गुंगी**-स्त्री॰రెండు తలల పాము; वि॰మూగది.

**गुंची** - स्त्री॰ ; **गुंजा** - स्त्री॰ గురిగింజ; గురిగింజ పొద.

**गुंजन** - पुं॰ కలవరము; ఝుంకారము; అస్పష్టగానము.

**गुंजाइश** - स्त्री॰ అవకాశము; వీలు.

**गुंजायमान** - वि॰ ఝుంకారము చేయుచున్న; రొదచేయుచున్న.

**गुंजार** - पुं॰ తుమ్మెదల ఝుంకారము; రొద.

**गुंठन** - पुं॰ ముసుగు; కప్పు (లు) ఆవరణ; దాచుట.

**गुंठा** - पुं॰ పొట్టి గుఱ్ఱము; वि॰ పొట్టి; మరుగుజ్జు.

**गुंडा** - वि॰ ధూర్తుడు; రౌడీ.

**गुंधना** - अ॰क्रि॰ (పిండి వగైరా) నీరు కలిపి మెత్తగా కలుపుట ; పూలు వగైరా దారముతో గ్రుచ్చుట లేక అల్లుట.

**गुंफन** - पुं॰ కూర్పు; మాటల కూర్పు.

**गुंफित** - वि॰ కూర్పబడిన; అలంకరింపబడిన.

**गुँबज ; गुँबद** -पुं॰ దేవాలయముపైన ఉండు

కలశము; గుమ్మటము; గుంబజము.

**गुबा** - पुं० బొప్పి; కణితి.

**गुइयाँ**-पुं० సఖుడు; చెలివాడు; स्त्री० సహచరి; చెలికత్తె.

**गुच्ची** - स्त्री० గోలీగుంట; ఆటగుంట.

**गुग्गुल** - पुं० గుగ్గిలము.

**गुच्छ ; गुच्छा** - पुं० గుత్తి.

**गुच्छेदार** - वि० గుత్తిగనుండు.

**गुजर** - पुं० నిర్వాకము; కాలక్షేపము; జరుగు బాటు; ప్రదేశము.

**गुजरबसर** - पुं० కాలక్షేపము; జరుగుబాటు.

**गुजर जाना** - मु० గతించుట; చనిపోవుట.

**गुजरना** - अ० क्रि० గడచుట; కాలము గడచుట; ఒకచోటు నుండి మరియొక చోటుకు వెళ్ళుట.

**गुजरगाह** - पुं० దారి; వచ్చేపోయే దారి; రహదారి.

**गुजश्ता** - वि० గడచిన.

**गुजारना** - स० क्रि० గడుపుట.

**गुजारा** - पुं० జరుగుబాటు; కాలక్షేపము; ఉదర పోషణకై ఇవ్వబడు బత్తెము.

**गुजारिश** - स्त्री० మనవి.

**गुजारिशनामा** - पुं० వినతి పత్రము.

**गुझिया** - स्त्री० కజ్జికాయ; ఒక విధమగు మిఠాయి.

**गुट ; गुट्ट** - पुं० చెడుపని చేయు నిమిత్తం ఏర్పాటు; కొద్దిమంది జనసమూహము; లేక దళము.

**गुटकना** - स० क्रि० గుటుక్కుని మింగి వేయుట; वि० పావురము కూయుట; పావురమువలె కూయుట.

**गुटका** - पुं० पुस्तिका ; చిన్న ఆకారము గల పుస్తకము.

**गुटरगूँ** - स्त्री० పావురపు కూత.

**गुटिका** - स्त्री० మందుకుప్పి; మాత్ర.

**गुट्टा** - वि० పొట్టి; మరుగుజ్జు.

**गुठ्ठल** - वि० జడుడు; మూర్ఖుడు; పెద్ద టెంకల.

**गुठली** - स्त्री० గింజ; టెంక.

**गुडबा** - पुं० గని ఉప్పులో వేసిన; ఉడికించిన పచ్చిమామిడికాయ.

**गुडगुडी** - स्त्री० ఒక విధమగు హుక్కా.

**गुडिया** - स्त्री० గుడ్డ బొమ్మ.

**गुड्डा** - पुं० పెద్దమగ ఆట బొమ్మ.

**गुड्डी** - स्त्री० గాలిపటము; చిన్న హుక్కా.

**गुण** - पुं० గుణము; దారము; నూలు; అల్లెత్రాడు లేక అల్లు దారము.

**गुणगान** - पुं० పొగడ్త; ప్రశంస.

**गुणग्राहक ; गुणग्राही**-पुं० గుణవంతుడు; ఆదరించువాడు.

**गुणादय** - वि० సద్గుణ సంపన్నుడు.

**गुणी** - वि० గుణములు కలవాడు; భూత వైద్యుడు.

**गुत्थमगुत्था** - पुं० గుద్దులాట; కలియబడి పోట్లాడుట.

**गत्थी** - स्त्री० చిక్కు; గుత్తి.

**गुदगुदा** - वि० మెత్తని; కందుగల; గుజ్జుగల.

**गुदगुदाना**-अ०क्रि० ; स०क्रि० చక్కిలిగింత పెట్టుట; మనస్సు చంచలమగుట లేక చంచలపెట్టుట.

**गुदगुदी** - स्त्री० చక్కిలిగింత; ఉల్లాసము, ఉత్సుకత.

**गुदडिया** - पुं० చింపిరి గుడ్డలు ధరించు వాడు లేక అమ్మువాడు.

**गुदडी** - स्त्री० చింపిరి గుడ్డల బొంత.

**गुदडी-बाजार** - पुं० పలురకముల చింపిరి గుడ్డలు, విరిగిన వస్తువులు అమ్ముచోటు.

**गुदडी का लाल** -मु०మట్టిలో మాణిక్యము.

**गुदा** - स्त्री० మలద్వారము.

**गुदाना** - स०क्रि० పచ్చ పొడిపించుట.

**गुदाम** - पुं० दे० गोदाम.

**गुनगुना** - वि० గోరువెచ్చని.

**गुनगुनाना** - अ०क्रि० గొణుగుట, అస్పష్ట స్వరమున పాడుట.

**गुनना** - स०क्रि० లెక్కించుట, ఆలోచించుట; పొగడుట.

**गुनह**- पुं०दे० गुनाह.

**गुनहगार** - वि०दे० गुनाहकार.

**गुना** - पुं० రెట్టింపు చేయు ఒక ప్రయత్నము. जैसे सातगुना ; आठगुना.

**गुनाह** - पुं०అపరాధము; దోషము; పాపము.

**गुनाहकार** - वि० పాపి; అపరాధి; దోషి.

**गुनी** - वि० दे० गुणी.

**गुपचुप** - स्त्री० పిల్లల ఒక ఆట. क्रि.वि. రహస్యముగా.

**गुप्त** - पुं० వైశ్యుల బిరుదు. वि० దాచబడిన, గుప్తమైన; గూఢమైన.

**गुप्तचर**-पुं०जासूस; గుప్తచరుడు; గూఢచారి.

**गुप्ती** - स्त्री० కత్తిగల చేతికర్ర.

**गुफा** - स्त्री० గుహ.

**गुफ्त** - स्त्री० మాట; కథనము.

**गुफ्तगू** - स्त्री० సంభాషణ; వార్తాలాపము.

**गुबरैला** - पुं० పేడపురుగు.

**गुबार** - पुं० దుమ్ము ; ధూళి ; వైరము ; మనస్సున దాగి ఉన్న కోపము.

**गुबारा** - पुं० గుమ్మటము.

**गुब्बारा** - पुं० ఒక విధమగు బాణాసంచా.

**गुम**-वि०గుప్తమైన; లోపించిన; అప్రకటితము.

**गुमटा** - पुं० బొప్పి; కదుము.

**गुम नाम** - वि० పేరు లేని లేక పేరు తెలియని.

**गुमराह** - वि० దారి తప్పిన; చెడు మార్గమున నడచువాడు.

**गुमसुम होना** - पुं० నష్టభ్రష్టమగుట.

**गुमटी** - स्त्री० ఇంటి నడికప్పు.

**गुमना** - अ०क्रि० పోగొట్టుకొనుట, అదృశ్యమగుట.

**गुमान** - पुं० గర్వము, అభిమానము, చెడు తలంపు.

**गुमानी** - वि० అహంభావి ; గర్విష్ఠి.

**गुम्मट** - पुं० గుమ్మటము.

**गुर** - पुं० సారము, మూలమంత్రము.

**गुरगा** - पुं० శిష్యుడు, నమ్మరాని నౌకరు.

**गुरदा** - पुं० మూత్రపిండము, సాహసము.

**गुरबत** - स्त्री० పరదేశ గమనము, పరదేశ నివాసము.

**गुराब** - पुं० మాలకాకి; ఒకవిధమగు పడవ.

**गुरिदा** - पुं० గుప్తచరుడు.

**गुरिया** - स्त्री० పూస.

**गुरु** - पुं० గురువు, బృహస్పతి; वि० బరువైన; గొప్ప.

**गुरुआइन** - स्त्री० గురువు గారి భార్య; ఉపాధ్యాయని.

**गुरुआई** - स्त्री० గురువు ధర్మము; నేరుపు.

**गुरुद्वारा** - पुं० గురువు ఉండు తావు.

**गुरुभाई** - पुं० సహాధ్యాయుడు.

**गुरुमुखी** - स्त्री० పంజాబీ భాష లిపి.

**गुरु** - पुं० ధూర్తుడు. **गुरु-घंटाल** - मु० మహాచతురుడు; ధూర్తాగ్రేసరుడు.

**गुरेरना** - स०क्रि० घूरना ; ఉరిమి చూచుట.

**गुर्ग** - पुं० నక్క; తోడేలు.

**गुर्जर** - पुं० గుజరాతు ప్రాంతపు వాడు.

**गुर्राना** - अ०क्रि० గుర్రుమని కోపముతో ఉరుముట.

**गुर्विणी** - वि० स्त्री० గర్భిణీ స్త్రీ.

**गुर्वी** - वि०स्त्री० బరువైన; విలువైన; ప్రధానమైన; గర్భవతి ; स्त्री० గురుపత్ని.

**गुल** - पुं० గులాబి పువ్వు; నవ్వునపుడు బుగ్గలయందు పడు గుంట, దీపపు కొడి; నిప్పు కణిక; కణిత; అల్లరి.

**गुल करना** - मु० దీపము ఆర్పుట.

**गुल खिलना** - मु० విచిత్రమైన ఘటన సంభవించుట; ఉపద్రవము కలుగుట.

**गुलकंद** - पुं० గుల కంద.

**गुलकारी**-स्त्री० లతలు; పువ్వులు చెక్కుట; వేయుట.

**गुलगपाडा** - पुं० విపరీతమైన గలాభా.

**गुलगुल**-वि०**गुलगुला;** మెత్తని; మృదువైన.

**गुलगुलाना** - स०क्रि० రసము పిండుటకు. పూర్వము పండును ఒత్తి మెత్తగా చేయుట.

**गुलचा** - पुं० ఆప్యాయముగా; ప్రేమగా బుగ్గలమీద వేళ్ళతో మెల్లిగా కొట్టుట.

**गुलचाना** - स०क्रि० చేతి వేళ్ళతో ఆప్యాయముగా బుగ్గలమీదమెల్లగా కొట్టుట.

**गुलचीं**-पुं० తోటమాలి; పూలు ఏరువాడు.

**गुलछर्रा** - पुं० అనుచితమైన భోగవిలాసము.

गुलछर्रा उडाना-मु०భోగవిలాసములో కాలము వెళ్ళ బుచ్చుట.

**गुलजार** - पुं० పూతోట ; वि०కన్నుల పండుగగా ఉండు.

**गुलझटी** - स्त्री० చిక్కుముడి; పీటముడి; ముడత.

**गुलदस्ता** - पुं० పూలగుత్తి ; పుష్పగుచ్ఛము.

**गुलदाऊदी** - स्त्री० చామంతి పువ్వు.

**गुलदान** - पुं० పూలు ఉండు పాత్ర; పూల పాత్ర ; Flower-vase.

**गुलदाना** - पुं० లడ్డూపూస లేక బూందీ.

**गुलदुम** - पुं० బుల్‌బుల్ పక్షి; పికిలి పిట్ట.

**गुलनार** - पुं० దానిమ్మ పువ్వు; దానిమ్మ పువ్వు రంగు.

**गुलफाम** - वि०గులాబి పువ్వువలె మృదువైన రంగుగల లేక శరీరము గల.

**गुलबकावली** - स्त्री० పసుపు మొక్క మాదిరి తెలుపు పసుపు పచ్చని సువాసన గల పూలు పూయు మొక్క.

**गुलबदन** - वि० పువ్వు వంటి మృదువైన సొగసైన శరీరము గల; బహుసుందరమైన

**गुलबर्ग** - पुं० గులాబి రేకు లేక ఆకు; పూరేకు.

**गुलरु** - वि० అందమైన; సొగసైన ముఖము గల.

**गुलरेज** - पुं० फुलझडी ; చిచ్చు బుడ్డి.

**गुलशन** - पुं० పూతోట; పుష్ప వాటిక.

**गुलशब्बो** - स्त्री० రజనీ గంధా అనబడు పువ్వు లేక పూతీగ.

**गुलाब** - पुं० గులాబి.

**गुलाबजल** - पुं० పన్నీరు.

**गुलाब - पाश** - पुं० పన్నీటి కూజా.

**गुलाम** - पुं० బానిస; దాసుడు; నౌకరు.

**गुलामी** - स्त्री० బానిసత్వము; దాసత్వము.

**गुलाल** - पुं० अबीर ; ఎర్రని బుక్కాపొడి.

**गुलिस्ताँ** - पुं० పుష్ప వాటిక.

**गुलू** - पुं० స్వరము; కంఠము; మెడ.

**गुलूबंद** - पुं० ఒక విధమగు నగ; ఆభూషణము.

**गुलूला**-पुं० ; **गुलेल**-स्त्री० ; **गुलेला**-पुं० వడిసెల (పిట్టలను పారదోలుటకు ఉపయోగించు); వడిసెల గడ్డ.

**गुलेलची ; गुलेलबाज** - पुं० बहेलिया ; పక్షివేటకాడు.

**गुल्फ** - पुं० శీలమండ లేక చీలమండ.

**गुल्म**-पुं० పొద; సేనాగుల్మము లేక విభాగము; ఒక విధమగు రోగము.

**गुल्लक** - पुं० గల్లా పెట్టె.

**गुल्ला** - पुं० గలాభా; మట్టిగొని; ఒక విధమగు మిఠాయి.

**गुल्लाला** - पुं० ఒక విధమగు ఎర్రని పుష్పము.

**गुल्ली** - स्त्री० గోటీ బిళ్ళ; బిళ్ళంగోడు; తేనెపట్టు, కణితి, టెంక.

**गुल्ली-डंडा** - पुं० గోడుంబిళ్ళ ఆట.

**गुसल** - पुं० స్నానము.

**गुसलखाना** - पुं० స్నానాల గది.

**गुसाँई** - पुं० गोसाई ; గోస్వామి; జితేంద్రియుడు; సాదువు.

**गुस्ताख** - वि० ढीठ ; నదురు బెదురులేని, అదుపు లేని ; అవిధేయుడు ; పొగరు బోతు ; వదరు బోతు.

**गुस्ताखी** - स्त्री० ढिठाई ; అవిధేయత; అమర్యాద ; పొగరుబోతుతనము.

**गुस्ल** - पुं० दे० गुसल.

**गुस्सा** - पुं० క్రోధము ; కోపము.

**गुस्सावर** - वि० కోపిష్ఠి.

**गुस्सैल** - वि० ముక్కోపి; చిర్రు బుర్రుమను స్వభావము గల.

**गुहना** - स० क्रि० पोहना ; గ్రుచ్చుట; కూర్చుట.

**गुहर** - पुं० गौहर ; ముత్యము; నగ.

**गुहराना** - स०क्रि० కేకవేసి పిలచుట.

**गुहा** - स्त्री० गुहा ; గుహ.

**गुहार** - स्त्री० गुहाई ; సహాయార్థము వేయు గావుకేక.

**गुहेरा** - पुं० गोह ; ఉడుము.

**गुह्य** -वि० पोशीदा ; గుప్తమైన; రహస్యమగు, దాచబడిన.

**गूँगा** - वि० मूक ; మూగ; మాట్లాడలేని.

**गूँच** - स्त्री० గురింద గింజ.

**गूँज** - स्त्री० ప్రతిధ్వని; తుమ్మెదల ఝుంకార ధ్వని.

**गूँजना** - अ० क्रि० ప్రతిధ్వనించుట.

**गूँथना** - स०क्रि० అల్లుట( జడ మొ ॥) దారముతో కూర్చుట; తడి పిండి మెదిపి బాగుగా కలుపుట.

**गूँधना** - स०क्रि० నీటిలో తడిపి పిండిమెదిపి సాగదీసి కలుపుట.

**गूगल** - पुं० గుగ్గిలము.

**गूजर** - पुं० ఒక గొల్లజాతి; ఒక క్షత్రియ జాతి.

**गूदड** - पुं० చింపిరి గుడ్డ.

**गूदा** - पुं० చేప; సారభాగము; గుజ్జు; మెదడు; విత్తులోని పప్పు.

**गून** - स्त्री० रस्सी ; పడవ లాగు పెద్ద త్రాడు లేక మోకు.
**गूनी** - स्त्री० गोनी ; నార సంచి; గోనె సంచి.
**गूलर** - पुं० మేడి (చెట్టు లేక పండు)
**गूलर का फूल** - मु० ఆకాశ కుసుమము; అలభ్యమగు వస్తువు.
**गूह** - पुं० మలము; మురికి; రెట్ట.
**गृध्र** - पुं० రాబందు; గ్రద్ద.
**गृह** - पुं० గృహము.
**गृह मंत्री** - पुं० దేశీయాంగమంత్రి.
**गृहस्थ** - पुं० గృహస్థుడు; కుటుంబీకుడు; ఇంటి యజమాని.
**गृहस्थी** - स्त्री० గృహస్థ ధర్మము; సంసారము; ఇంటిసామాను.
**गृहणी**-स्त्री० భార్య; యజమానురాలు.
**गेंगटा** - पुं० केंकडा ; ఎండ్రకాయ.
**गेंडना** - स०क्रि० గట్టువేయుట.
**गेंडली**-स्त्री० कुंडली ; చుట్టు; తాడుచుట్ట.
**गेंडा** - पुं० చెరుకు గడ పైభాగపు ఆకులు.
**गेंडुआ** -पुं० తలదిండు; పెద్ద బంతి.
**गेंडुरी ; गेंडुली** - स्त्री० చుట్టు కుదురు.
**गेंडुवा** - पुं० दे० गेंडआ.
**गेंद** - स्त्री० బంతి; చెండు.
**गेंदा** - पुं० బంతి పువ్వు లేక మొక్క.
**गेंगला** - वि० మూర్ఖుడు.
**गेदा** - पुं० రెక్కలు రాని పిట్ట.
**गेय** - वि० గేయము; పొగడదగిన.
**गेरना** - स०क्रि० క్రిందపడవేయుట; పార బోయుట; పారవేయుట.
**गेरुआ** - वि० కాషాయరంగుగల.
**गेरु** - स्त्री० ఎర్రమన్ను.
**गेसू** - पुं० కేశజాలము; జుట్టు; స్త్రీలనెత్తి జుట్టు.
**गेह** - पुं० గృహము; ఇల్లు.
**गेहनी ; गेहिनी** - स्त्री० గృహిణి; గృహ స్వామిని.
**गेही** - पुं० గృహస్థుడు.
**गेहुआ** - वि० बादामी ; గోధుమ వన్నెగల.
**गेहूँ** - पुं० గోధుములు.
**गैंडा** - पुं० ఖడ్గమృగము.
**गैंती** - स्त्री० कुदाल ; గడ్డపార; పార.
**गैना** - पुं० नाटा बैल ; పొట్టి ఎద్దు.
**गैब** - पुं० పరోక్షము; అదృశ్యత; అదృశ్య లోకము.
**गैबत** - स्त्री० చాడీ; పరోక్షమున చేయు నింద వేయు నింద.
**गैबदाँ**-वि० పరోక్షవిషయము తెలిసినవాడు; అదృశ్య లోకపు విషయమెరిగినవాడు.
**गैबानी** - स्त्री० నిర్లజ్జ స్త్రీ; కులట; పెద్ద విపత్తు.

**गैबी** - वि॰ పరోక్షసంబంధమైన; గుప్తమైన; తెలియని.

**गैपर** - पुं॰ ఏనుగు.

**गैया** - स्त्री॰ ఆవు.

**गैर** - वि॰ ఇతరుడు; పరాయివాడు; విరుద్ధ అర్థమునిచ్చు లేక నిషేధ వాచక శబ్దము.

**गैरआईनी ; गैर-कानूनी** - वि॰ చట్ట విరుద్ధమైన.

**गैर आबाद** - वि॰ మానవ నివాసములేని; దున్నని, నాటని; బంజరు భూమి.

**गैरत** - स्त्री॰ లజ్జ; సిగ్గు.

**गैर-मानकूला** - वि॰ స్థిరమైన; స్థావరము; స్థిరాస్తి.

**गैर-मनकहा**-स्त्री॰ పెళ్ళికాని స్త్రీ; ఉంపుడు కత్తె.

**गैर-मामल;गैर-मामूली**-वि॰ అసాధారణ మైన.

**गैर-मुनासिब** - वि॰ అనుచితమైన.

**गैर-मुमकिन** - वि॰ అసంభవము.

**गैर-वाजिब** - वि॰ అయోగ్యమైన.

**गैर-हाजिर** - वि॰ హాజరుకాని.

**गैर-हाजिरी** - स्त्री॰అనుపస్థితి;గైరు హాజరు.

**गैशतदार ; गैशतमंद** - वि॰ సిగ్గుగల; అభి మానము గల.

**गैरिक** - पुं॰ కాషాయరంగు మట్టి; ఒక ఖనిజ పదార్థము; బంగారము.

**गैहान** - पुं॰ ప్రపంచము.

**गैल** - स्त्री॰ దారి; మార్గము.

**गैला ; गैलरा** - पुं॰ బండి చక్రపుచాలు; బండిదారి.

**गैहरी** - स्त्री॰ నియత నియమము కంటె ఎక్కువా నిచ్చు శుల్కము.

**गोई** - स्त्री॰ ఎద్దులజత.

**गोंठ** - स्त्री॰ ధోవతి కుచ్చిళ్ళు.

**गोंठना**-स॰क्रि॰మొక్క పోవునట్లు చేయుట.

**गोंड** - पुं॰ మధ్య ప్రదేశములో కనిపించు ఒక అనాగరిక జాతి.

**गोंडा** - पुं॰ పశువుల దొడ్డి.

**गोंद** - पुं॰ జిగురు; బంక.

**गो** - स्त्री॰ ఆవు; ఇంద్రియములు.

**गोइठा** - पुं॰ उपला ; పిడక.

**गोइँदा** - पुं॰ గుప్తచరుడు; గూఢచారి.

**गोइंयाँ** - पुं॰ ; स्त्री॰ సహచరుడు; సఖుడు; సహచరి; సఖి.

**गोखरू** - पुं॰ పల్లేరుకాయ.

**गोखा** - पुं॰ కిటికి; ఇంటికప్పులోని అద్దపు కిటికి

**गोचर** - पुं॰ పచ్చికబీడు; वि॰ గోచరము కంటికి కనిపించు ; ఇంద్రియానుభూతి కలుగు.

**गोज** - पुं० अपानवायु ; అపాన వాయువు.
**गोजर** - पुं०.కాళ్ళజెర్రి.
**गोजी** - स्त्री० పెద్దకర్ర; లాఠీకర్ర; బాణాకర్ర
**गोट** - स्त्री० లేసు, జరి; గుడ్డ అంచు.
**गोठ** - पुं० గోశాల; పర్యటనము; గోష్టి; వినోదయాత్ర; షికారు.
**गोठिल** - वि० మొక్కబోయిన; మొద్దు బారిన.
**गोड** - पुं० కాలు; పాదము.
**गोडना** - स०क्रि० గునపముతో మట్టిని త్రవ్వి తిరగబోయుట.
**गोडा** - पुं० మంచపుకోడు; చిన్న గుల్మము.
**गोडारी पैताना** - स्त्री० మంచమునకు కాళ్ళ వైపు భాగము; చెప్పులు.
**गोडी** - स्त्री० లాభము.
**गोत** - पुं० గోత్రము; కులము.
**गोता** - पुं० डुबकी ; మునుక; మునుగు.
**गोता खाना** - मु० మునుగుట; మోస పోవుట.
**गोताखोर** - वि० మునకవేయువాడు; మునుగు వాడు.
**गोतामार** - पुं० సముద్రములో మునిగి ముత్యపు చిప్పలు మొ॥ తీయువాడు ; वि० మునకవేయువాడు.
**गोता लगाना**-स०क्रि०మునుకలు వేయుట.
**गोतिया** - पुं० గోత్రజుడు; సగోత్రీకుడు.
**गोतीत** - वि० అగోచరమైన; జ్ఞానేంద్రియ ములకు గోచరించని.
**गोद** - स्त्री० ఒడి; **गोद देना** - मु० పెంపక మిచ్చుట. **गोद भरना** - मु० సంతానము కలుగుట; **गोद लेना** ; దత్తత తీసికొనుట **गोद नशीन** - मु० దత్తుడు.
**गोदना** - पुं० పచ్చ; स०क्रि० పొడుచుట; పచ్చ పొడుచుట; మనస్సుకినాటుకొను పరి హాసము చేయుట.
**गोदनी** - स्त्री० పచ్చపొడుచుసూది; బొట్టు కడ్డీ
**गोदाम** - पुं० నిల్వకొట్టు
**गोदी** - स्त्री० गोद ; ఒడి.
**गोधा** - पुं० ఉడుము.
**गोधूलि ; गोधूली** - स्त्री० సాయం సమయము; సంధ్యాసమయము; పచ్చిక బీళ్ళనుండి ఆవులు తిరిగి వచ్చువేళ.
**गोन** - स्त्री० గోనె సంచి; బస్తాసంచి; పడవ త్రాడు.
**गोनिया** - पुं० ధాన్యపు బస్తాలు మోయు వాడు; ఎడ్లపై బరువు వేయువాడు; త్రాటితో పడవలాగువాడు; జట్టుకూలి.
**गोनी** - स्त्री० సంచి; గోనెసంచి.
**गोपन** - पुं० గుప్తముగా నుంచుట; సాకుట.

**महेन्द्री**–स्त्री॰ ఇంద్రునిభార్య-శచీదేవి.

**महेरा**–पुं॰ఒకవిధమైన పక్వానము; మజ్జిగ

**महोदधि**–पुं॰ సముద్రము.

**महोदय**–पुं॰ మహాశయుడు;మహాను భావుడు.

**माँ**–स्त्री॰ మాత; తల్లి.

**माँग**–स्त्री॰ అడుగుడు; యాచన;ఆవ శ్యకత; పాపిడి.

**माँगना**–स॰क्रि॰అడుగుట; యాచించుట; కోరుట.

**माँछ**–पु॰ मछली ;చేప.

**माँजना**–स॰क्रि॰ తోముట; శుభ్రపరచుట

**माँजा**–पु॰ చేపలకు మత్తు కలిగించు తొలకరివాన.

**माँझ**–स्त्री॰ भीतर; లోపల ; पु॰ తేడా; అంతరము.

**माँझा**–पुं॰ నదిలోని లంక.

**माँझिल**–क्रि॰वि॰ మధ్యన; మధ్యకు సంబంధించినదిగా; మధ్యనున్న.

**माँझी**–पु॰ పల్లెమనిషి; పడవనడుపువాడు లేక తోయువాడు.

**माँड**–पु॰ గంజి.

**माँडना**–स॰क्रि॰మర్దించుట; పిండిబాగుగ కలిపి సాగదీయుట; మెదుపుట; కాళ్ళతో తొక్కి నునుపుట.

**मांडलिक**–पु॰మండలమునకు అధిపతి; చిన్న సామంతరాజు.

**माँडव**–पु॰ వివాహమండపము.

**माँडी**–स्त्री॰ माँड ;గంజి.

**माँत**–वि॰ మత్తెక్కిన; పిచ్చెక్కిన.

**माँतना**–अ॰क्रि॰ మదించుట; పిచ్చెక్కుట.

**माँद**–वि॰ కళావిహీనమైన; విషాదముగల; ఓడిన; स्त्री॰ అడవి మృగములుండు సొరంగము; గుహ.

**माँदगी**–स्त्री॰ రోగము; జబ్బు.

**माँदा**–वि॰అలసియున్న; మిగిలి ఉన్న; రోగి

**माँपना**–अ॰क्रि॰ పూర్తిగా నిషాలోనున్న.

**मांसल**–वि॰ అంగప్రత్యంగములు కండలు తిరిగి ఉన్న; పుష్టిగానున్న.

**मा;माई**–स्त्री॰ చిన్నపూరీని అర్పించి వివాహసమయమున చేయుమాతృపూజ; కుమార్తె; బాలిక; తల్లి.

**माइका**–पु॰ दे॰ मायका.

**माई**–स्त्री॰ జనని; తల్లి.

**माईका लाल**–यौ॰ ఉదారహృదయుడు; వీరుడు; శూరుడు.

**माकूल**–वि॰ ఉచితమైన;సమంజసమైన; యోగ్యమైన; శ్రేష్ఠమైన.

**माखन**–पु॰ दे॰ मक्खन.

**माखना**–अ॰क्रि॰ చిరాకు పడుట; కోపగించుట.

**गोश-वारा** - पुं० కూడిక; ఒక విధమగు జిగురు; కర్ణకుండలములు; ముత్యపు చిప్పలోనున్న పెద్ద ముత్యము; తలపాగా అంచు; విడివిడిగా స్పష్టముగా వ్రాయబడిన పద్యలు.

**गोशा** - पुं० కోణము; దిశ; ఏకాంతము; మూల; వింటికొన.

**गोश्त** - पुं० మాంసము.

**गोश्त ख्वार** - पुं० మాంసాహారి; ఆమిష భోజి.

**गोश्तख्वारी ; गोश्तखोरी** - स्त्री० మాంసాహారము.

**गोष्ठ** - पुं० గోశాల; సమూహము; సలహా.

**गोष्ठी** - स्त्री० పణమర్మసభ; సంభాషణము.

**गोसा** - पुं० उपला ; పిడక.

**गोसाई ; गोस्वामी** - पुं० ఇంద్రియ నిగ్రహుడు; జితేంద్రియుడు; సాధువు; భగవంతుడు; గోస్వామి.

**गोह** - स्त्री० गोधा ; ఉడుము.

**गोहरा** - पुं० कंडा ; పిడక.

**गोहराना** - स०क्रि० సహాయమునకై పెద్దగా పిలుచుట; కేకవేయుట अ०क्रि० పెద్దగా అరచుట.

**गौं** - स्त्री० ప్రయోజనము; స్వార్థము; అదను.

**गौंघात** - स्त्री० సరైన అదను; సమయము.

**गौं निकलना** - मु० స్వార్థము సిద్ధించుట.

**गौं पडना** - मु० అవసరము కలుగుట.

**गौं का चार** - मु० స్వార్థపరుడు; స్వార్థి.

**गौ** - स्त्री० गैया ; ఆవు.

**गौख** - स्त्री० झरोखा ; చిన్నకిటికి.

**गौगा** - पुं० కోలాహలము; గలభా; పుకారు.

**गौगाई खबर** - स्त्री० अफवाह ; పుకారు.

**गौचरी** - स्त्री० పుల్లరి; ఆవుల పచ్చిక మేపుటకై ఇచ్చెడి పన్ను.

**गौज** - स्त्री० బడాయి; గప్పాలు; సంభాషణ

**गौण** - वि० అప్రధానమైన; గుణసంబంధమైన

**गौद** - पुं० గెల; గుత్తి.

**गौदुमा** - वि० गावदुम ; ఆవుతోకవలె.

**गौनहार** - स्त्री० అత్తవారింటికి వెళ్ళు పెళ్ళి కుమారునకు తోడుగా వెళ్ళు స్త్రీ.

**गौनहारिन ; गौनहारी** - स्त्री० పాట కచేరి వృత్తిగా చేయు స్త్రీ.

**गौना** - पुं० ద్విరాగమనము; వివాహానంతరము వరుడు వధువును తనతో కూడ తన ఇంటికి తీసుకు వెళ్ళు ఆచారము.

**गौर** - वि० గౌరవర్ణముగల; ఉజ్వలమైన వన్నెగల.

**गौर** - पुं० చింతనము; ధ్యానము; తదేక ధ్యానము.

**गौर तलब** - वि० ఆలోచించదగిన; విచారించ

దగిన; ధ్యానించదగిన.
**गौरैया** - स्त्री॰ गौरिया ; పిచ్చుక.
**गौस** - पुं॰ फरियाद ; మొర; మహమ్మదీయ సాధువులకు చెందు ఒక బిరుదు.
**गौहर** - पुं॰ मोती ; ముత్యము; తెలివి; రత్నము.
**गौहरी** - पुं॰दे॰ जौहरी.
**ग्रंथ** - पुं॰ పుస్తకము; గ్రంథము; ముడివైచుట; శిక్కులమత గ్రంథము.
**ग्रंथ साहब** - पुं॰ శిక్కులమత గ్రంథము.
**ग्रंथन** -पुं॰ గుచ్చుట; కుట్టుట; జోడించుట.
**ग्रंथि** - स्त्री॰ ముడి; చిక్కు.
**ग्रंथित** - वि॰ ముడివేయబడిన; కూర్చబడిన.
**ग्रसन** - पुं॰ మ్రింగుట ; గ్రహించుట ; గ్రహణము.
**ग्रसना** - स॰क्रि॰ మ్రింగుట; పట్టుకొనుట.
**ग्रसित** - वि॰ మ్రింగబడిన; గ్రహించబడిన; పట్టుకొనబడిన; పీడింపబడిన.
**ग्रस्त** - वि॰ दे॰ ग्रसित.
**ग्रहणि ; ग्रहणी** - स्त्री॰ అతిసార వ్యాధి.
**ग्रामीण ; ग्राम्य** - वि॰ గ్రామ సంబంధమైన.
**ग्रास** - पुं॰ కబళము; ముద్ద; గ్రాసము; గడ్డి.
**ग्राह** - पुं॰ మొసలి; పట్టు.
**ग्राहक** - पुं॰ చందాదారుడు; కొనువాడు.
**ग्राही** - पुं॰ గ్రహించువాడు; పట్టుకొను వాడు.
**ग्राह्य** - वि॰ గ్రహింపదగినది; స్వీకరించదగినది; పట్టుకొనదగినది.
**ग्रीवा** - स्त्री॰ गला ; మెడ; కంఠము.
**ग्लानि** - स्त्री॰ శైథిల్యము; దుఃఖము; తన చెడు ప్రవర్తన యెడల కలుగు దుఃఖము.
**ग्वाल ; ग्वाला** - पुं॰ గొల్ల మనిషి; గోపాలుడు.
**ग्वालिन** - स्त्री॰ గోపిక; గొల్ల స్త్రీ.
**ग्वैंडा** - पुं॰ गोइँडा ; గ్రామ పొలిమేర; గ్రామ సమీప భూమి.

## घ

**घँघरा** - पुं॰ ; **घँघरी** - स्त्री॰ दे॰ घाँघरा
**घँघोलना** - स॰क्रि॰ నీటిలో కలగలపుట; నీటిని కలయబరచి మురికి చేయుట.
**घंट** - पुं॰ చనిపోయిన వాని కర్మకాండ సందర్భమున రావి చెట్టుకు కట్టబడు జల పాత్ర; జీవిముంత.
**घंटा** - पुं॰ గంట; గంట కాలము.
**घंटा घर** - पुं॰ గడియారపు స్తంభము.
**घंटी** - स्त्री॰ చిన్నగంట; కాలి చిరుగజ్జె; కొండనాలుక; గంట ధ్వని; చిన్న ఇత్తడి లేక కంచు చెంబు.
**घट** - पुं॰ కుండ; ఘటము; శరీరము.
**घटक** - पुं॰ పెళ్ళిళ్ల పేరయ్య; వివాహ సంబంధములు కుదుర్చువాడు; దళారి.

**घटकना** - స॰క్రి॰ త్రాగివేయుట.

**घटती** - स्त्री॰ న్యూనత; హీనత.

**घटना** - अ॰क्रि॰ అగుట; జరుగుట; తగ్గుట; स्त्री॰ ఘటన; ఘట్టము; ఘటించినది.

**घटवाई** - स्त्री॰ పన్ను వసూలు చేయు రేవుకాపరి; రేవు పన్ను తగ్గుదల.

**घटवार** - पुं॰ రేవు దగ్గర దక్షిణ పుచ్చుకొను బ్రాహ్మణుడు; రేవు కూలి పుచ్చుకొను వాడు.

**घटहा** - पुं॰ రేవు గుత్తదారుడు; రేవు దాటించు పడవ.

**घटा** - स्त्री॰ మేఘము ; మేఘమాల ; సమూహము.

**घटाटोप** - पुं॰ నలువైపుల క్రమ్మిన మేఘ సమూహము.

**घटाना** - स॰क्रि॰ తగ్గించుట.

**घटाव** - पुं॰ తగ్గుదల.

**घटित** - वि॰ ఘటించిన; జరిగిపోయిన.

**घटिया** - वि॰ హీనమైన; తక్కువయిన; తుచ్ఛమైన.

**घटिहा** - वि॰ నీచుడు; ధూర్తుడు; వంచకుడు; వ్యభిచారి.

**घट्ठा** - पुं॰ శరీరముపై రాపిడివలన ఏర్పడు కాయ.

**घडनैल** - स्त्री॰ తాటిబొందలతో ఏర్పరచిన సంగడి లేక తెప్ప.

**घाड़ा** - पुं॰ కుండ.

**घड़िया** - स्त्री॰ మూస; మట్టికుంపటి; మూకుడు; చిన్నకుండ.

**घड़ियाल** - पुं॰ మొసలి; పూజా సమయమున మ్రోగించు గంట.

**घड़ियाली** - पुं॰ గంట వాయించువాడు.

**घड़ी** - स्त्री॰ గడియారము; గడియ కాలము; అదను సమయము.

**घड़ीभर** - क्रि॰वि॰ గడియకాలము; క్షణ కాలము.

**घड़ीसाज** - पुं॰ గడియారములు బాగు చేయువాడు.

**घड़ीसाजी** - वि॰ గడియారములు బాగు చేయు వృత్తి లేక పని.

**घड़ौची** - स्त्री॰ నీటిపాత్ర ఉంచు ముక్కాలి పీట.

**घतिया** - पुं॰ వంచకుడు; మోసగించువాడు.

**घतियाना** - स॰क्रि॰ దాచుట; మోసగించుట; తన వలలో వేసుకొనుట.

**घन** - पुं॰ మేఘము; పెద్ద సమ్మెట. वि॰ ఘనమైన; దృఢమైన; దట్టమైన.

**घनकना** - अ॰क्रि॰ గర్జించుట.

**घनघटा** - स्त्री॰ దట్టమైన కారు మేఘమాల.

**घन चक्कर** - वि॰ చపల చిత్తుడు; దేశదిమ్మరి;

మూర్ఖుడు; పుం ఒకవిధము బాణాసంచా.

**घनफल** - पुं॰ పొడవు; వెడల్పు; లావు లేక ఎత్తు ఈ మూడింటిని గుణించుటవలన వచ్చు ఫలము.

**घनसार** - पुं॰ కర్పూరము.

**घना** - वि॰ దట్టమైన.

**घनिष्ठ** - वि॰ సన్నిహితమైన; అంతరంగికమైన; గాఢమైన.

**घनेरा** - वि॰ ఒత్తుగానున్న; దట్టమైన; దృఢమైన.

**घपचियाना** - अ॰क्रि॰ తొట్రుపాటు పడుట; గాబరాపడుట.

**घपची** - स्त्री॰ రెండు చేతులతోనూ గట్టిగా పట్టినపట్టు.

**घपला** - पुं॰ గడబిడ ; గందరగోళము.

**घबडाना ; घबराना** - अ॰क्रि॰ కలత చెందుట; గల్లంతు పడుట; విసుగు చెందుట.

**घबराहट** - स्त्री॰ వ్యాకులత.

**घमंड** - पुं॰ గర్వము; అహంకారము.

**घमंडी** - वि॰ గర్విష్ఠి; అహంకారి.

**घमकना** - अ॰क्रि॰ గర్జించుట; स॰क्रि॰ గ్రుద్దుట.

**घमका** - पुं॰ గ్రుద్దుల ధ్వని; గ్రుద్దు.

**घमखोर** - वि॰ ఎండను సహించువాడు.

**घमर** - पुं॰ నగారా లేక పెద్ద డోలు మోత.

**घमरौल** - स्त्री॰ గడబిడ; కోలాహలము; గల్లంతు.

**घमासान** - वि॰ భయంకరమైన; पुं॰ భయంకర యుద్ధము; దొమ్మి.

**घमोरी** - स्त्री॰ **अम्हैरी ;** చెమటకాయలు; గ్రీష్మ పొక్కులు.

**घर** - पुं॰ ఇల్లు; నివాసస్థానము; జన్మస్థానము.

**घर आबाद करना** - स॰क्रि॰ ఇల్లు నిలబెట్టుట; ఒక ఇంటివానినిగా చేయుట.

**घर करना** - मु॰ నివసించుట; తావు ఏర్పరచుట.

**घर घालना**-मु॰ కొంప చెడగొట్టుట; నాశము చేయుట; వంశానికి మచ్చ తెచ్చుట.

**घर घालन** - वि॰ ఇల్లు నాశము చేయువాడు.

**घर घुसडा** - वि॰ ఆడంగి సింగడు.

**घरजाया** - पुं॰ ఇంటి బానిస

**घरनी** - स्त्री॰ గృహిణి; ఇల్లాలు.

**घर फोडी ; घर फोरी** - स्त्री॰ ఇంటిలో కయ్యము పెట్టు స్త్రీ.

**घरबसा** - पुं॰ రంకుమగడు; ఉపపతి.

**घरबार** - पुं॰ ఇల్లు వాకిలి; కుటుంబము; పిల్లజెల్లలు.

**घरबारी ; घरबारू** - पुं॰ గృహస్థుడు; పిల్లలు గలవాడు.

**घरवाला** - पुं० ఇంటి యజమాని; భర్త.
**घरवाली** - स्त्री० భార్య; ఇంటి యజమానురాలు.
**घराऊ** - वि० ఇంటికి సంబంధించిన.
**घराती** - पुं० కన్య పక్షమువారు.
**घराना** - पुं० खानदान ; వంశము; ప్రఖ్యాతమైన వంశము ; కులము.
**घरी** - स्त्री० दे० घडी.
**घरू** - वि० दे० घराऊ.
**घरेलू** - वि० ఇంటి సంబంధమైన; పెంపుడు.
**घरौंदा** - पुं० బొమ్మరిల్లు.
**घर्रा** - पुं० ఒకవిధమైనకాటుక శ్లేష్మము వలన గొంతులో గరగరలాడుట.
**घर्राटा** - पुं० दे० खर्राटा.
**घर्षण** - पुं० घरसा ; ఒరిపిడి.
**घलना** - अ०क्रि० కొట్లాట జరుగుట.
**घलाघली** - स्त्री० కొట్లాట; చితకబాదుట.
**घलुआ** - पुं० కొసరు.
**घसखुदा** - पुं० మూర్ఖుడు; గడ్డిదోకువాడు.
**घसना** - अ०क्रि० घिसना ; అరుగుట.
**घसियारा** - पुं० గడ్డిదోకువాడు; గడ్డి అమ్మువాడు.
**घसियारिन** - स्त्री० గడ్డిదోకు నది; గడ్డి అమ్మునది.
**घसीट** - स्त्री० గొలుసు కట్టు వ్రాత; ఈడ్పు.
**घसीटना** - स०क्रि० ఈడ్చుట; గొలుసు కట్టువ్రాత వ్రాయుట.
**घहरना ; घहराना** - अ०क्रि० గర్జించుట; ఉరుముట; గణగణ మ్రోగుట.
**घाँघरा** - पुं० ఒక విధమగు పరికిణి.
**घाँटी** - स्त्री० कौआ ; కొండనాలుక.
**घाई** - स्त्री० మోసము; గాయము; దెబ్బ; వేలికివేలికి మధ్య నుండు సందు.
**घाऊघप** - वि० గుట్టుగా పరులసొత్తును కాజేయువాడు.
**घाघ** - पुं० జిత్తులమారి; అనుభవశాలి; ఇంద్రజాలికుడు.
**घाघरा** - पुं० दे० घाँघरा.
**घाट** - पुं० ఘట్టము; రేవు; కొండలోయ स्त्री० చెడుపని; కపటము वि० తరిగిన; తక్కువ.
**घाटा** - पुं० నష్టము.
**घाटा उठाना** - पुं० నష్టపడుట.
**घाटिया** - पुं० తీర్థపురోహితుడు.
**घाटी** - स्त्री० కొండకనుమ; కొండలోయ.
**घात** - पुं० దెబ్బ; ఆఘాతము కీడు. स्त्री० స్వార్థసిద్ధికి అనువైన సమయము; పొంచియుండుట; ఎత్తు.
**घात में फिरना** - मु० తలపెట్టిన కీడు చేయు నిమిత్తం పొంచియుండుట; పొంచి

तिरुगुट.

**घातक** - पुं० హంతకుడు; చంపువాడు.

**घातिनी** - स्त्री० హంతకురాలు

**घाती** - पुं० విశ్వాస ఘాతకుడు.

**घान** - पुं० ; **घानी** - स्त्री० వాయి.

**घाम** - पुं० घूप ; ఎండ.

**घामड** -वि०ఎండ దెబ్బ తగిలిన; మూర్ఖుడు.

**घाय** - पुं० दे० घाव.

**घायल** - वि० దెబ్బతిన్న లేక దెబ్బ తగిలిన; గాయపడిన.

**घाल ; घाला** - पुं० घलुआ ; కొసరు.

**घालक**-पुं०చంపువాడు;నాశము చేయువాడు.

**घालना** -स०क्रि०చంపుట; వినాశపరచుట; చెడగొట్టుట; మిశ్రము చేయుట.

**घाव** - पुं० గాయము; घाव पर नमक छिडकना - मु० పుండు మీద కారం చల్లుట. घाव पूजना या भरना - मु० గాయము మానుట.

**घास** - स्त्री० గడ్డి; పచ్చిగడ్డి; మేత.

**घास-पात**-पुं०ఆకు అలము;చెత్తచెదారము.

**घास-फूस**-पुं० కలుపు మొక్కలు; అక్కరకు రాని వస్తువు.

**घास काटना** - मु० పనికిమాలిన పని చేయుట; తుచ్ఛమైన పనిచేయుట.

**घासलेट**-पुं०मिट्टी का तेल ; కిరసనాయిలు.

**घासलेटी** - वि०पुं० నికృష్టమైన; మురికిగా నున్న; పనికిమాలిన.

**घिग्धी** - स्त्री० हिचकी ; ఏడుపునందు వచ్చు ఎక్కిలి.

**घिग्घी बँधना** - अ०क्रि० ఎక్కిళ్ళు వచ్చుట; భయమువలన నోటమాట పెగలక పోవుట.

**घिघियाना**-अ०क्रि०దేవిరించుట; ప్రాధేయ పడుట.

**घिचपिच ; घिचर पिचर** - स्त्री० క్రిక్కిరిసి ఉండుట; గొలుసు కట్టు వ్రాత; ఇరుకు वि० క్రిక్కిరిసి ఉన్న; ఇరుకుగానున్న; అస్పష్టముగానున్న.

**घिन** - स्त्री० घृणा ; ఏవగింపు; అసహ్యము; కోత.

**घिनाना** - अ०क्रि० అసహ్యపడుట; ద్వేషించుట.

**घिनाना ; घिनौना** - वि० అసహ్యకరమైన; రోతపుట్టించు.

**घिन्नी** - स्त्री० గిలక; నూలు గిలక; దారము లేక త్రాడు చుట్టెడు చక్రము.

**घिय** - पुं० घी ; నెయ్యి.

**घिया**-स्त्री०लौकी;సొరకాయ, ఆనపకాయ.

**घिरना** - अ०क्रि०చుట్టబడుట; చుట్టుముట్ట బడుట; ఆవరింపబడుట.

**घिरनी** - स्त्री॰ दे॰ घिन्नी.

**घिर वाना** - स॰क्रि॰ ముట్టడింపజేయుట.

**घिराई** - पुं॰ చుట్టుముట్టడి; పశువుల మేపుడు కూలి.

**घिराव** - पुं॰ చుట్టుముట్టడి.

**घिसकना** - अ॰क्रि॰ చల్లగా జారుకొనుట; తొలగుట; జారిపోవుట.

**घिसना** - स॰क्रि॰ రుద్దుట; అరగదీయుట; अ॰क्रि॰ అరిగిపోవుట.

**घिसघिस** - स्त्री॰ పనిలో సడలింపు; వదలుట; జాప్యము.

**घिसपिस** - स्त्री॰ ఒరిపిడి; అన్యోన్యత.

**घसाई** - स्त्री॰ అరుగుడు; ఒరిపిడి; ఒరిపిడి పట్టినందుకు కూలి.

**घिसाव** - पुं॰ రాపిడి; ఒరిపిడి; రుద్దుడు.

**घिस्सा** - पुं॰दे॰ घिसाव.

**घी** - पुं - నెయ్యి. पाँचों ऊंगली घी में - मु॰ అమితమైన సుఖమబ్బుట.

**घी के दिए जलना** - मु॰ మనోరథము సిద్ధించుట.

**घुँइयाँ** - स्त्री॰ आरवी ; చామదుంప.

**घुँघची** - स्त्री॰ గురివిందగింజ లేక తీగ.

**घुँघनी** - स्त्री॰ సొతాళించిన శనగలు; భఠాణి వగైరా.

**घुँघरारे (बाल) ; घुँघराले** - वि॰ ఉంగరములు తిరిగిన (జుట్టు)

**घुँघरू** - पुं॰ అందియ; కాలికి కట్టు మువ్వ.

**घुंडी** - स्त्री॰ గుడ్డగుండీ; గుండ్రనిముడి.

**घुग्घू** - पुं॰ గుడ్లగూబ.

**घुघुआना** - अ॰क्रि॰ గుడ్లగూబ కూయుట - కూత.

**घुटकना** - स॰क्रि॰ గుటగుట త్రాగుట; మ్రింగుట.

**घुटकी**-स्त्री॰ కంఠనాళము; ఆహారనాళము.

**घुटना** - पुं॰ మోకాలు; अ॰क्रि॰ ఊపిరి సలపకపోవుట; మైత్రి కలుగుట.

**घुटन्ना** - पुं॰ మోకాళ్ళవరకు ఉండు లాగు.

**घुटवाना** -स॰क्रि॰ ఊపిరాడకుండా చేయించుట; గొంతుపిసికించుట తలగొరిగించుకొనుట.

**घुटाई** - स्त्री॰ గొంతు పిసుకు; చదును చేయుట లేక చదును చేయుటకు కూలి.

**घुटाना** - स॰क्रि॰ (గొంతు) నొక్కించుట.

**घुट्टी** - स्त्री॰ ఉగ్గు; గుటక.

**घुडकना** - स॰क्रि॰ కసరుట; అదిలించుట; బెదిరించుట.

**घुडकी** - स्त्री॰ బెదిరింపు; అదిలింపు.

**(बंदर) घुडकी**-मु॰ వేళాకోళపు బెదిరింపు.

**घुड दौड** - स्त्री॰ గుఱ్ఱపు పరుగు.

**घुडसवार** - पुं॰ గుఱ్ఱముపై నెక్కినవాడు;

గుఱ్ఱపు స్వారి చేయువాడు.

**घुडसार ; घुडसाल** - स्त्री॰ अस्तबल అశ్వశాల.

**घुण ; घुन** - पुं॰ కాష్ఠపు కీటకము; కొయ్యను తొలుచు ఒక పురుగు.

**घुनना** - अ॰क्रि॰ పురుగుతొలిచిన కారణముగా బోలగుట.

**घुन्ना** - पुं॰ తన చెడు భావములను మనసులోనే ఉంచుకొనువాడు; మితభాషి.

**घुप** - वि॰ కటిక చీకటిగానున్న; గాఢాంధకారముగానున్న.

**घुमक्कड** - वि॰ తిరుగుబోతు; అతిగా తిరుగువాడు.

**घुमटा** - पुं॰ తలతిరుగుడు; తలదిమ్ము.

**घुमडना** - अ॰क्रि॰ వర్షపు మబ్బు క్రమ్ముకొనుట.

**घुमरना** - अ॰क्रि॰ కర్ణకఠోరమైన శబ్దము చేయుట.

**घुमरी** - स्त्री॰ నీటిసుడి; తల తిరుగుట.

**घुमाना** - स॰क्रि॰ నలువైపుల త్రిప్పుట.

**घुमाव** - पुं॰ తిరుగుడు; మలుపు; చుట్టు.

**घुमाव-फिराव** - पुं॰ డొంక తిరుగుడు; పేచీమాట.

**घुरघुराना** - अ॰क्रि॰ గొంతులో గురగుర మనుట.

**घुरघुराहट** - स्त्री॰ గురగురధ్వని; గురగుర మనుట.

**घुरबिनिया** - स्त्री॰ పరిగ ఏరు స్త్రీ; పెంట; ధూళి; దుమ్ములోని వస్తువులు ఏరు స్త్రీ.

**घुलना** - अ॰क्रि॰ కలిసి మెలిసి పోవుట; లీనమైపోవుట; ద్రవ పదార్థములో కలసి పోవుట.

**घुलाना** - स॰क्रि॰ కరిగించుట; మేళవించుట; మెత్తపరచుట.

**घुसना** - अ॰क्रि॰ దూరుట; ప్రవేశించుట; చొచ్చుట.

**घुसाना** - स॰क्रि॰ చొచ్చుట; దూర్చుట; ప్రవేశింపజేయుట; గ్రుచ్చుట.

**घुसपैठ** - स्त्री॰ ప్రవేశము; చొచ్చు; చొరవ.

**घुसेडना** - स॰क्रि॰ द॰ घुसाना.

**घूँघट** - पुं॰ ముసుగు; **घूँघट काढना** - स॰क्रि॰ ముసుగు వేసుకొనుట.

**घूँघर** - पुं॰ మెలి తిరిగిన; వెంట్రుకలు; ఉంగరాల జుట్టు.

**घूँचा** - पुं॰ घूँसा ; గ్రుద్దు.

**घूँट** - पुं॰ గుక్క; గుక్కెడు; గుటక.

**घूँटना** - स॰क्रि॰ గుక్క వేయుట; త్రాగుట.

**घूँटी** - स्त्री॰ घुट्टी ; ఉగ్గు.

**घूँसा** - पुं॰ గ్రుద్దు.

**घूँसेबाजी** - स्त्री॰ ముష్టియుద్ధము; గుద్దు

లాటం.

**घूघू** - पुं० గుడ్లగూబ (పక్షి)

**घूम** - स्त्री० తిరుగుడు.

**घूमघुमारा** - वि० चक्करदार పెద్ద మలుపు గల; చుట్టు తిరుగుడు గల; మత్తెక్కిన.

**घूमघुमाव** - वि० दे० घूमघुमारा.

**घूमना**-अ०क्रि० తిరుగుట; చుట్టు తిరుగుట; సవారు చేయుట.

**घूर** - पुं० పెంటపోగు; చెత్త చెదారము.

**घूरना** - अ०क्रि० గుడ్లురిమి చూచుట; కోపముగా చూచుట; గుడ్లురుముట.

**घूरा** - पुं० పెంటపోగు.

**घूस** - स्त्री० లంచము; పందికొక్కు.

**घूसखोर** - वि० లంచగొండి.

**घृणा** - स्त्री० ఏవగింపు; ఘృణ; అసహ్యము; రోత.

**घृणित ; घृणास्पद** - वि० రోతైన; అసహ్యకరమైన; ఘృణాస్పదమైన.

**घृणी**-वि० అసహ్యించుకొనువాడు; ఏవగించుకొనువాడు.

**घृत** - पुं० घी ; ఘృతము; నెయ్యి.

**घेंटा** - पुं० పంది పిల్ల.

**घेघा** - पुं० ఆహారనాళము; అన్ననాళము; కంఠము వాయు జబ్బు.

**घेर** - पुं० చుట్టుకొలత; పరిధి.

**घेरघार** - स्त्री० నలువైపులనుండి చుట్టబడి; పరివ్యాప్తి; విస్తారము; బ్రతిమాలుట; ముఖస్తుతి.

**घेरना** - स०क्रि० చుట్టుముట్టుట; ఆవరించుట; ఆక్రమించుట.

**घेरा** -पुं० ఆవరణము; ప్రహరీ; చుట్టుకొలత.

**घैला** - पुं० కుండ; కలశము.

**घोंघा** - पुं० నత్తగుల్ల; గోధుమగింజపై పొట్టు; నిస్సారమైన మూర్ఖతగల.

**घोंघाबसंत** - वि० మహామూర్ఖుడు; పరమ మూర్ఖుడు.

**घोंचा** - पुं० గుత్తి; గెల; కొమ్ములు లేని ఎద్దు; బోడి ఎద్దు.

**घोंची** - स्त्री० బోడి ఆవు.

**घोंचू** - पुं० తెలివి లేనివాడు; మూర్ఖుడు; మతిమందుడు.

**घोंटना** - स०क्रि० గడగడ త్రాగుట; జీర్ణించుకొనుట; మ్రింగుట గొంతు నులుపుట; వల్లెవేయుట.

**घोंसला** - पुं० పక్షిగూడు.

**घोटना** - स०क्रि० నూరుట; రుబ్బుట; మెరుగు పెట్టు; చిత్రికపట్టుట; గొంతు నులుపుట; వల్లెవేయుట; క్షౌరము చేయించుట.

**घोटा** - पुं० క్షౌరము; పశువుల మందు

గొట్టము; మెరుగు పెట్టెడి పనిముట్టు.

**घोटनी** - स्त्री० పాత్రము.

**घोटाला** - पुं० గోల; గడబిడ.

**घोडा** - पुं० గుఱ్ఱము.

**घोडिया** - स्त्री० చిన్న గుఱ్ఱము; గోడను కొట్టు నంకె లేక మేకు.

**घोडी** - स्त्री० ఆడగుఱ్ఱము

**घोरिला** - पुं० పిల్లలు ఆడుకొను కొయ్య గుఱ్ఱము.

**घोल ; घोला** - पुं० పూర్తిగా కలిసి మెదిపిన పేయము; నీళ్ళు కలియని మజ్జిగ.

**घोष** - पुं० గొల్ల మనిషి; గొల్ల పల్లె; గోశాల; మేఘ గర్జన.

**घोषणा**-स्त्री० मुनादी ; చాటింపు; ప్రకటన.

**घोषी ;घोसी**-पुं० గొల్లమనిషి, పాలు; పెరుగు మొదలగు అమ్మువాడు.

**घौद** - पुं० పళ్ళగెల (అరటిమొ॥) లేక గుత్తి.

**घ्राण** - स्त्री० ముక్కు; వాసన; వాసన చూచు శక్తి.

**घ्राणेंद्रिय** - स्त्री० नाक ; ముక్కు.

**घ्राता** - वि० వాసనచూచువాడు.

## च

**चंग** -स्त्री० డప్పు మాదిరి ఒక చిన్న వాద్యము; గాలి పటము.

**चंगा** - वि० స్వస్థతగల; ఆరోగ్యము గల.

**चंगुल** - पुं० పంజా; పట్టు, వశము; పక్షుల గోరు ; అరి

**चंगुल में फँसना** - मु० చేతికి లేక చేతిలో చిక్కుట.

**चंगेर ; चंगेरी** - स्त्री० పూలు ఉంచు పాత్ర, పూబుట్ట; పిల్లలను పరుండబెట్టు వెదురు బద్దల ఉయ్యల.

**चंचरी ; चंचरीक** - स्त्री० తుమ్మెద; భ్రమరి; హోళి పండుగ దినముల పాడు ఒకపాట, హరిప్రియ అనబడు ఒక ఛందము - పద్యము.

**चंचु** - पुं० ఆముదపు చెట్టు; లేడి; स्त्री०चोंच; పక్షుల ముక్కు.

**चंट** - वि० ధూర్తుడు; పాషండుడు; జిత్తుల మారి.

**चंड** - वि० కఠోరమైన; తీక్షణమగు; క్రోధముగల, पुं० వేడిమి.

**चंडाल** - पुं० చండాలుడు; తుచ్ఛుడు, అంట రానివాడు.

**चंडाल चौकडी**-स्त्री० దుష్టసమూహము; రౌడీదండు.

**चंडालिनी** - स्त्री० దుర్మార్గురాలు; అంట రానిది; దుశ్చరిత్ర స్త్రీ.

**चंडावल** - पुं० సైన్యమునకు వెనుక భాగమున ఉండి పహారా కాయు వీరసైనికుడు.

**चंडू** - पुं० నల్లమందునుండి తయారగు ఒక మాదకపదార్థము.

**चंडूबाज** - पुं० త్రాగుబోతు.

**चंडूल** - पुं० ఒక విధమగు బూడిద రంగు పక్షి.

**चंद**-पुं० కొంత; కొన్ని; కొందరు ; చంద్రుడు; 'చందబరదాయి' అనబడు ఒకహిందీకవి.

**चंदन** - पुं० మంచి గంధము.

**चंदराना** - स०क्रि० తెలిసియే తెలియనట్లున నటిస్తూ మోసగించుట.

**चंदला** - पुं० బట్టతల గల.

**चंदवा** - पुं० నెమలి పురికన్ను; మేలుకట్టు; చాందిని.

**चंदा** - पुं० చంద్రుడు; చందా.

**चंदोवा** - पुं०दे० चंदवा.

**चंद्रबिंदु** - पुं० ' ँ '; అర్ధానుస్వార బిందువు.

**चंद्रवार** - पुं० సోమవారము.

**चंद्रहास** - पुं० రావణుని ఖడ్గము; ఖడ్గము.

**चंद्रातप** - पुं० వెన్నెల; ఆరుబయట.

**चंद्रिका** - स्त्री० వెన్నెల; నెమలి పురికన్ను.

**चंपई** - वि० సంపెంగ వన్నెగల.

**चंपक** - पुं० चंपा ; సంపెంగ.

**चंपत** - वि० गायब ; అదృశ్యమైన; అంతర్ధానమైన.

**चंपना** - अ०क्रि० బరువు; కృతజ్ఞత; సిగ్గు మొదలగు వలన కృంగిపోవుట.

**चंपू** - पुं० గద్య పద్య మిశ్రిత కావ్యము.

**चंबल** - स्त्री० ఒకనది; భిక్షాపాత్ర; నీటి వెల్లువ; వరద; వ్యవసాయము కొరకు నదిలోని నీరు పొలమునకు గూడ ద్వారా తోడిపంపుట.

**चँवर** - पुं० వింజామరము.

**चँवरदार** - पुं० వింజామరము వీచువాడు.

**चक** - पुं० చక్రవాక పక్షి; చక్రము.

**चकई** - स्त्री० చక్రావాక పక్షిణి.

**चकचून ; चकचूर** - वि० చూర్ణము చేయ బడిన; బహు అలసిన.

**चकती** - स्त्री० గుండ్రని లేక నాలుగు కోణ ములు గల పట్టీ లేక అతుకు గుడ్డముక్క.

**चकचूरना** - स०क्रि० చూర్ణము చేయుట; పొడిచేయుట.

**चकचौधना** - अ०क्रि० కళ్ళుమిరుమిట్లు గొల్పుట; ఆశ్చర్యపడుట.

**चकता** - पुं० ; **चकती** - स्त्री० మాసిక; అతుకు; మచ్చ, మరక.

**चकत्ता** - पुं० దద్దురు; శరీరము మీది గుండ్రని మచ్చ.

**चकनाचूर** - वि० బాగుగ పొడియైన; ఎక్కువగా అలసిపోయిన.

**चकपक** - वि० हक्काबक्का ; చకితుడైన;

స్తంభితుడైన.

**चकपकाना - अ॰क्रि॰** స్తంభించిపోయిన; అతిగా ఆశ్చర్యము నొందుట.

**चकरी - स्त्री॰** ప్రదక్షిణ.

**चकबंदी - स्त्री॰** భూమిని అనేక భాగము లుగా విభజించుట.

**चकबस्त - वि॰** చిన్నచిన్న ముక్కలుగా విభజింపబడిన భూమి. **पुं॰** కాశ్మీరు బ్రహ్మణులలో ఒకశాఖ.

**चकमक - पुं॰** చకుముకి రాయి.

**चकमा - पुं॰** మోసము; టక్కు.

**चकरबा - पुं॰** సంకట స్థితి; సందిగ్ధావస్థ; పోట్లాట.

**चकराना - अ॰क्रि॰** దిగ్భ్రమ జెందుట; తల తిరుగుట; ఆశ్చర్యము నొందుట.

**चकरानी - स्त्री॰ नौकरानी ;** పనికత్తె; దాసి.

**चकरी-स्त्री॰ चक्की ;** తిరుగలి; ఒక విధమగు ఆటబొమ్మ.

**चकला -पुं॰** రొట్టెలు ఒత్తు పీట లేక రాయి వేశ్యలుండు చోటు.

**चकलाना - स॰क्रि॰** మొక్క పీకివేరొకచోట నాటుట; వెడల్పు చేయుట.

**चकली - स्त्री॰** గంధపుసాన; నూతి గిలక.

**चकवा - पुं॰** చక్రవాకము.

**चकवाना -अ॰क्रि॰** ఆశ్చర్యమునొందుట.

**चकाचक-वि॰ लथपथ ;** బాగుగా తడిసిన; తృప్తినొందిన; పొట్టనిండుగ.

**चकाचौंध - स्त्री॰** కళ్ళుమిరుమిట్లు గొల్పుట; ఆశ్చర్యము నొందుట.

**चकाबू -पुं॰** చక్రవ్యూహం; పద్మ వ్యూహం.

**चकित - वि॰** చకితమగు; ఆశ్చర్యము నొందిన.

**चकिताई - स्त्री॰** ఆశ్చర్యము; విస్మయము.

**चकुला - पुं॰ चेंटुआ ;** పక్షి శావకము.

**चकोटना - स॰क्रि॰** గిల్లుట; గీరుట.

**चकोतरा- पुं॰** దబ్బకాయ; గజ నిమ్మకాయ.

**चकोर - पुं॰** చకోరపక్షి.

**चकोह - पुं॰ भंवर ;** నీటిసుడి.

**चक्क - पुं॰** చక్రవాక పక్షి; కుమ్మరి సారె లేక చక్రము.

**चक्कर - पुं॰** చక్రము; భ్రమణము; చిక్కు; నీటిసుడి.

**चक्कर खाना - अ॰क्रि॰** చక్రమువలె తిరు గుట; కలత జెందుట.

**चक्करदार - वि॰** చిక్కుతోకూడిన; చక్రము వలె చుట్టు తిరిగెడు; డొంక తిరిగెడు.

**चक्कर मारना - अ॰क्रि॰** వంకర టింకరగా తిరుగుట; ఇటు అటు తిరుగుట.

**चक्कर में आना या पडना - मु॰** మోస పోవుట; భ్రమించుట; పరిభ్రమించుట.

**चक्कर लगाना** - पुं० నలువైపుల తిరుగుట.

**चक्का** - पुं० చక్రము; కుమ్మరి సారె; గడ్డ; రాతి ముక్క.

**चक्की** - स्त्री० తిరుగలి.

**चक्कू** - पुं० చాకు.

**चक्र** - पुं० చక్రము.

**चक्षु ; चख** - पुं० నేత్రము.

**चख ; चख चख** - पुं० పోట్లాట; తకరారు; పరస్పర దూషణ.

**चखना** - स०क्रि० రుచి చూచుట.

**चखाचखी** - स्त्री० విరోధము; వైరము.

**चखाना** - स०क्रि० రుచి చూపుట.

**चगड** - पुं० జిత్తులమారి; ధూర్తుడు.

**चगताई ; चगत्ता** - पुं० మంగోలు వంశీయులు ; బాబరు, అక్బరు మొదలగు చెంగేజఖాన్ వంశీయులు.

**चचा** - पुं० తండ్రి సోదరుడు.

**चचींडा** - पुं० పొట్లకాయ.

**चची** - स्त्री० తండ్రి సోదరుని భార్య.

**चचेरा** - वि० అన్నదమ్ముల ; चचेरे भाई; అన్నదమ్ముల పిల్లలు.

**चट** - क्रि०वि० झट ; వెంటనే; తక్షణమే.

**चट कर जाना** -मु० పూర్తిగా తినివేయుట; పరాయి వాని వస్తువును మ్రింగివేయుట; అపహరించుట; తీసుకున్న వస్తువును తిరిగి ఇవ్వకపోవుట.

**चटक** - स्त्री० తళుకు బెళుకు; మొగ్గలు విచ్చుచప్పుడు; पुं० పిచ్చుక.

**चटकमटक** - स्त्री० సింగారము; అలంకరణ; ఒయ్యారము.

**चटकना** - स्त्री० చటుక్కున విరుగుట; పగులుట; కోపించుట; మెటికలు విరుచుట; చటమని మొగ్గలు వికసించుట पुं० చెంప దెబ్బ.

**चटकनी** - स्त्री० తలుపు గొళ్ళెము.

**चटका** - पुं० స్ఫూర్తి; తొందర.

**चटकाना** - स०क्रि० విరుచుట; మెటికలు విరుచుట; కోపము కలిగించుట; త్రుంచుట; రెచ్చగొట్టుట.

**चटकारा** - वि० రుచిగల; చంచలమైన; తీక్ష్ణమైన; లొట్టలు వేయు (తుదకు)

**चटकीला** - वि० भडकीला ; తళుకు తళుకుమను ; రుచిగల.

**चटनी** - स्त्री० పచ్చడి.

**चटपट** - क्रि० वि० झटपट ; వెంటనే; తక్షణమే.

**चटपटा** - वि० రుచిగల; కారము; పులుపు రుచిగల.

**चटपटी** - स्त्री० కలత; హడావిడి; వ్యాకులత वि०(स्त्री०) రుచిగల; ఘాటైన.

**चटवाना** - स०क्रि० నాకించుట; పదును పెట్టించుట; లంచమిచ్చుట.

**चटशाला ; चटसार** - स्त्री० పిల్లలబడి; చిన్న పిల్లల పాఠశాల.

**चटसे**-क्रि०वि०झट से ; వెంటనే; తక్షణమే.

**चटाई** - स्त्री० చాప.

**चटाना** - स्त्री०क्रि० दे० चटवाना.

**चटापटी** - स्त्री० తొందర; హడావిడి; వ్యాకులత; కలరా మొదలగు వ్యాధి సోకి కుప్పలు కుప్పలుగా ప్రజలు మరణించుట.

**चटावन** - पुं० అన్నప్రాశన.

**चटयल** - वि० मिचाट ; చెట్టు చేమాలేని (ప్రదేశము).

**चटु** - पुं० చాటుకారిత; ముఖస్తుతి.

**चटोरा** - वि० తిండివాపిరి; రుచి వాపిరి; లోభి.

**चटोरापन** - पुं० తిండి వాపిరితనము.

**चट्टा** - पुं० బొబ్బ; దద్దురు; మచ్చ; వాత; శిష్యుడు; ఆరు బయలు; వెదురు చాప.

**चट्टान** - पुं० పెద్ద రాతి బండ.

**चट्टा-बट्टा** - पुं० కొయ్యబొమ్మల సమూహము;గారడీవాని సంచీనుండి బయటకు తీయబడు గోలీలు.

**(एकही थैली के) चट्टे-बट्टे** - मु० ఒకేరకమైన మనుష్యులు.

**चट्टी** - स्त्री० కొయ్య చెప్పులు; మడమమీద లేని చెప్పులు ; పాదుకలు.

**चट्टू** - वि० दे० चटोरा.

**चड चड** - पुं० పెళపెళమనుట.

**चडी** - स्त्री० తన్ను; ఎగిరి తన్నుట.

**चड्डी** - स्त्री० పొట్టిలాగు; చడ్డీ.

**चड्डी** - पुं० ఒక విధమగు పిల్లల ఆట; వీపు మీదనెక్కి స్వారీ చేయునట్టి ఆట.

**चढत ; चढन** - स्त्री० దేవునికిచ్చు కానుక.

**चढना** -अ०क्रि० ఎక్కుట; వృద్ధినొందుట.

**चढाई** - स्त्री० ఆక్రమణ; దాడి; ఎక్కుడు; దేవునకిచ్చు కానుక లేక మొక్కు తీర్చుకొనుట.

**चढा-उतरी**-स्त्री० మాటి మాటికి ఎక్కుట దిగుట; ఎగుడు దిగుడు.

**चढा-उपरी ; चढा-चढी**-स्त्री० పోటాపోటి ; लाग-डाट.

**चढाना** - स० क्रि० ఎక్కించుట; ఎక్కుపెట్టుట; (బాణము) దేవునికి అర్పించుట; పూయుట; తాగుట.

**चढाव** - पुं० ఎక్కుడు; పెరుగుట; వృద్ధి.

**चढावा** - पुं० వివాహ సమయమున వధువుకు వరపక్షము వారు కానుకగా ఇచ్చు నగ.

**चढावा-बढावा देना**-मु० ఉత్సాహ పరచుట; ఆవేశపరచుట.

**चढैत** - पुं० ఎక్కువాడు.

**चणक** - पुं० चना; శనగలు.

**चतुरंग**-पुं० రథ,గజ, అశ్వ పదాదుల సైన్యము; చతురంగ సైన్యము.

**चतुर** - वि० చతుర్వము గల; జిత్తులమారి; బుద్ధి కుశలుడు.

**चतुराई** - स्त्री० चालाकी ; బుద్ధిగతనేర్పు; చాతుర్యము.

**चतुष्पद** - पुं० నాలుగు కాళ్ళుగలది - పశువు.

**चद्दर** - स्त्री० దుప్పటి.

**चनक** - पुं० चना ; శనగలు.

**चनखना** - अ०क्रि० नाराज होना ; కోపగించుట.

**चपकना** - अ०क्रि० चिपकना ; అంటుకొనుట.

**चपकलश;चपकुलिश**-स्त्री० ఇరకాటము; ఇబ్బంది; కాఠిన్యము; గొప్ప సమూహము - గుంపు.

**चपड-चपड** - स्त्री० కుక్కల కతుకుడు.

**चपडा** - पुं० శుభ్రపరచిన లక్కరేకు; ఒక ఎర్రని పురుగు.

**चपत** - स्त्री० चाँटा చెంపదెబ్బ.

**चपना** - अ० क्रि० ఒత్తిడికి లోనగుట; అణగుట; నలిగిపోవుట; సిగ్గుపడుట.

**चपनी** - स्त्री० మూకుడు; చిన్నగిన్నె (కప్పు) కొబ్బరి పెంకు కమండలము.

**चपरगट्टू** - पुं० దౌర్భాగ్యుడు.

**चपरना** - अ०क्रि० ఒండొరులు కలిసికొనుట; మోసగించుట; త్వరపడుట.

**चपरा** - अव्य० వెంటనే; తక్షణమే.

**चपरास** - स्त्री० బంట్రోతు ధరించు బిళ్ళ.

**चपरासी** - पुं० బిళ్ళబంట్రోతు.

**चपल** - वि० చంచలమైన; చపలమైన; తొందరగల.

**चपलता**- स्त्री० చాంచల్యము, అస్థిరత.

**चपला** - स्त्री० మెరుపు; లక్ష్మి; వేశ్య.

**चपाती** - स्त्री० ఒక విధమగు గోధుమ రొట్టె.

**चपाना** - स०क्रि० సిగ్గుపడునట్లు చేయుట; అణచునట్లు చేయుట; రెండు త్రాళ్ళను జోడించుట.

**चपेट** - स्त्री० దుముకుడు; చెంపదెబ్బ; అఘాతము; అదుము.

**चपेटना** - स०क्रि० పైనపడి అదుముట; బలవంతాన పారిపోవునట్లు చేయుట; భయపెట్టుట; కసరుట.

**चप्पन** - पुं० లోతులేని చిన్న గిన్నె.

**चप्पल** - पुं० చెప్పులు.

**चप्पा** - पुं० కొద్దిచోటు; జానెడు చోటు; బెత్తెడుచోటు.

**चप्पू** - पुं० పడవ తెడ్డు.

**चबक** - स्त्री० నొప్పి; తీపు; బాధ.

**चबकना** - अ०क्रि० తీపు పుట్టుట; నొప్పి పెట్టుట.

**चबाई** - पुं० चवाई ; चुगलखोर ; చాడీలు చెప్పుడు; చెడు ప్రచారము చేయువాడు.

**चबाना** - स०क्रि० నములుట.

**चबूतरा** - पुं० అరుగు; వేదిక.

**चबेना** - पुं० నములుడు పదార్థము; నమిలి తిను పదార్థము ; శనగలు; గుగ్గిలు మొ॥

**चबेनी** - स्त्री० అల్పాహారపు పదార్థములు.

**चभाना**-स० क्रि० खिलाना; తినిపించుట; భోజనము పెట్టుట.

**चभोरना** - स०क्रि० ముంచుట ( నీటిలో) తడుపుట; ముంచి తేల్చుట.

**चमक** - स्त्री० తళుకు; మెరుపు; కాంతి.

**चमक-दमक** - स्त्री० తళుకు బెళుకు; వెలుతురు ; तडक-भडक.

**चमकदार** - वि० తళుకు బెళుకుగల.

**चमकना** - अ०क्रि० తళుక్కుమనుట; మెరయుట.

**चमकीला** - वि०दे० चमकदार.

**चमगादड ; चमगीदड** - पुं० గబ్బిలము.

**चमचम** - स्त्री० ఒకవిధమగు బెంగాలు ప్రాంతపు మిఠాయి.

**चमचमाना** - स०क्रि० మెరపించుట; अ०क्रि० దీప్తి మంతమగుట.

**चमचा ; चम्मच** - पुं० చంచా.

**चमटना** - अ०क्रि० दे० चिमटना.

**चमडा** - पुं० చర్మము; తోలు; తొక్క.

**चमडा उधेडना या खींचना** - मु० తొక్క వలుచుట; చితకబాదుట.

**चमडी** - स्त्री० తోలు; తొక్క; చర్మము.

**चमत्कार** - पुं० వింత; చమత్కారము; తమాషా.

**चमत्कारी ; चमत्कृत** - वि० వింతైన; అద్భుతమైన.

**चमत्कृति** - स्त्री० चमत्कार - చమత్కారము.

**चमन** - पुं - పూతోట; ఉద్యానవనము.

**चमनिस्ताँ ; चमनिस्तान** - पुं० फुलवारी; పూతోట.

**चमर** - पुं० चँवर ; వింజామరము.

**चमरस** - पुं० చెప్పుపుండు; చెప్పు రాపిడి వలన కలుగు పుండు.

**चमरौंधा** - पुं० चमौवा ; చౌకబారు చెప్పులు.

**चमाचम** - वि० దగదగా మెరయు; దేదీప్య మానమైన.

**चमार** - पुं० తోలుపాదరక్షలు తయారు చేయు ఒక జాతి మాదిగ.

**चमारिन ; चमारी** - स्त्री० మాదిగ స్త్రీ.

**चमू** - स्त्री० सेना ; సైన్యము.

**चमेलिया** - वि० మల్లెమాదిరి.

**चमेली** - स्त्री० మల్లె.

**चमोटी** - पुं० కత్తికి పదును పెట్టెడు తోలు పట్టా.

**चमोटी** - स्त्री० కొరడా, సన్నని బెత్తము.

**चम्मच** - पुं०द० चंचा.

**चय** - पुं० సమూహము; కుప్ప; పోగు; దిబ్బ; అరుగు.

**चयन** - पुं० పోగుచేయు పని; సంగ్రహము; ఎన్నుట; ఏలుట; యజ్ఞము; క్రతువు సందర్భములో చేయు అగ్నిసంస్కారము.

**चर** - पुं - గుప్తచరుడు; గూఢచారి; वि०చరించునట్టి.

**चरई** - स्त्री० नाँद ; పశువులు నీళ్ళు త్రాగు తొట్టి; పశువులు మేతనుంచు తొట్టి.

**चरक**-पुं० గూఢచారి; దూత; ఒక ఆయుర్వే దాచార్యుడు.

**चरका** - पुं० స్వల్పమైన గాయము; వాత; మోసము ; నష్టము.

**चरख** - पुं० కుమ్మరి సారె; నూతి గిలక; రాట్నము.

**चरखा** - पुं० రాట్నము; నూతి గిలక.

**चरखी** - स्त्री० ప్రత్తిరాట్నము; బావిగిలక; కుమ్మరి సారె; చక్రము.

**चरचना** - स०क्रि० మంచి గంధము మొ॥ పూయుట.

**चरण** - पुं० పాదము; పద్యపాదము లేక చరణము.

**चरती** - पुं० వ్రతదినమున ఉపవాసము చేయనివాడు.

**चरना** - स०क्रि० పశువులు మేయుట.

**चरनी** - स्त्री० పశువుల మేత బీడు.

**चरपर** - पुं० చెంపదెబ్బ; మోసగాడు; ధూర్తుడు.

**चरपरा** - वि० ఘాటైన; కారమైన; బాధ అయిన.

**चरपराहट** - स्त्री० ఘాటుదనము; తీక్షణ మైన రుచి; కురుపు లేక పుండు తీపు; ద్వేషము.

**चरफराना** - अ०क्रि० బాధ లేక నొప్పితో తన్నుకొనుట.

**चरब** - वि० తీక్షణమైన; తీవ్రమైన; పదునైన.

**चरबाँक ; चरबाक** - वि० నేర్పుగల; చాతుర్యముగల; జంకులేని.

**चरबा** - पुं० खाका;నకలు; ప్రతిరూపము.

**चरबी** - स्त्री० క్రొవ్వు.

**चरम** - वि० తుది; కడపటి.

**चरबाई** - स्त्री० మేత; పుల్లరి.

**चरबाहा** - पुं० పశువుల కాపరి; పశువులను పచ్చిక బయళ్ళలో మేపువాడు.

**चरवैया** - पुं० గడ్డి మేయు నది (పశువు) పశువులను మేపువాడు.

**चरस** - पुं० మోటబాన; గంజాయి మొక్క నుండి తయారుచేయబడు ఒక మత్తు పదార్థము.

**चरसा** - पुं० పశుచర్మము; మోట లేక పెద్ద తోలు సంచి.

**चराई** - स्त्री० दे० चरवाई.

**चरागाह** - पुं० మేతబీడు; పచ్చికబీడు.

**चराचर** - वि० జడ; చేతనములు; पुं० సమస్త విశ్వము.

**चराना** - स०क्रि० మేపుట; పశువులను మేపుట; మాటల్లో దారి తప్పించుట; మోసగించుట.

**चरावर** - स्त्री० నిరర్థక ప్రసంగము; వట్టి వాగుడు.

**चरिंद ; चरिंदा** - पुं० మేతమేయు పశువు.

**चरिंद-परिंद** - पुं० పశుపక్ష్యాదులు.

**चरित** - पुं० ప్రవర్తన; నడవడి; జీవిత చరిత్ర; స్వభావము.

**चरितार्थ** - वि० సిద్ధించిన; కృతార్థతపొందిన.

**चरित्तर** - पुं० ధూర్తత; కపట పూరిత ప్రవర్తన.

**चरित्र** - पुं० స్వభావము; నడవడి; చరిత్రము.

**चरित्रवान** - वि० సచ్చరిత్రుడు; మంచి స్వభావము గల.

**चरी** - स्त्री० మేత; మేతబీడు.

**चरु** - पुं० హోమాన్నము; హోమాన్న పాత్ర; పచ్చికబీడు.

**चरेरा** - वि० కరుకుగానున్న; కర్కశమైన.

**चरैया** - वि० మేయునది; మేపువాడు.

**चर्ख** - पुं०दे० चरख.

**चर्खा** - पु०दे० चरखा.

**चर्चन** - पुं० గంధపు పూత.

**चर्चा** - स्त्री० వాదవివాదము; సంభాషణము; చర్చ; లేపనము.

**चर्चित** - वि० పూయబడిన; చర్చింపబడిన.

**चर्पट** - पुं० చెంపదెబ్బ; లెంపకాయ; తెరచిన అరచేయి.

**चर्ब** - वि० నున్నని; లావుగానున్న.

**चर्बजबाँ ; चर्बजबान** - वि० खुशामदी; ముఖస్తుతి చేయువాడు.

**चर्राना** - अ०क्रि० సరదాపడుట; కొద్దిగా నొప్పిపుట్టుట; ప్రబలమైన కోరిక కలుగుట.

**चर्वण** - पुं० నములుట; నములు పదార్థము; నెమర.

**चर्वित चर्वण** - पुं० నమలినది మరల నములుట; నెమరవేయుట; చేసిన దానినే మరలు చేయుట; చెప్పిన దానినే మరల

చెప్పుట

**चल** - वि० చంచలమైన, అస్థిరమైన.

**चलचलाव**-पुं० चलाचली ; ప్రయాణపు హడావిడి; ప్రస్థానము; మృత్యువు.

**चलता** - वि० వాడుకలో నున్న; ప్రచారములో నున్న.

**चलता करना** - मु० हटाना ; తొలగించుట; ప్రక్కన పెట్టుట, పారిపోవునట్లు చేయుట.

**चलता बनना** - पुं० వెళ్ళిపోవుట

**चलती** - स्त्री० ప్రతిష్ఠ; గౌరవము; మర్యాద.

**चलन** - पुं० పోకడ; ఆచారము; కదలిక.

**चलनसार**-वि० వాడుకలోనున్న; మన్నికగల.

**चलना** - अ०क्रि० నడచుట; వెళ్ళుట; సాగుట; జరుగుట.

**चलनी** - स्त्री०दे० छलनी.

**चलविचल** - वि० తారుమారైన; అవ్యవస్థితమైన; క్రమముగా లేని.

**चलाऊ** - वि० टिकाऊ-చాలా కాలముండు; మన్నికగల.

**चलाचली** - स्त्री० ప్రయాణపు హడావిడి; అందరూ కలసి ప్రయాణించుట; वि० ప్రయాణము కొరకు సన్నద్ధమైన.

**चलान** - पुं०दे० चालान.

**चलाना** - स०क्रि० నడిపించుట; కలియబెట్టుట; వాడుకలో పెట్టుట; తోలుట.

**चलायमान** - वि० నడుచుచున్నట్టి, చంచలమైన.

**चलाव** - पुं० వెడలుట; వెళ్ళుట; యాత్ర.

**चलावा** - पुं० ఆచారము; రివాజు; ఒక విధమగు దిగుడువు.

**चलित** - वि० నడుచుచున్న; అస్థిరమైన

**चवना** - स०क्रि० दे० चूना.

**चवन्नी** - स्त्री० పావలాబిళ్ళ; 25 పైసల నాణెము.

**चवाई**-पुं० चुगलखोर , చాడీలు చెప్పువాడు; దుష్ప్రచారము చేయువాడు.

**चवाव** - पुं० ప్రవాదము; పుకారు; అప్రతిష్ఠ; అపకీర్తి.

**चश्म** - स्त्री० आँख ; కన్ను.

**चश्मक**- स्त्री० కళ్ళజోడు; కంటిసైగ; వైమనస్యము; జగడము; పరస్పర దూషణ.

**चश्मदीद** - वि० కళ్ళారచూచిన.

**चश्मदीदगवाह** - पुं० ప్రత్యక్షసాక్షి

**चश्मनुमाई** - स्त्री० కంటి బెదిరింపు.

**चश्म-पोशी** - स्त्री० దోషముల యెడల ధ్యాసలేకపోవుట.

**चश्मा** - पुं० కళ్ళజోడు; జలస్రోతము.

**चसक** - स्त्री० కొద్దిపాటినొప్పి; पुं०చషకము; మధుపాత్ర

**चसकना** - पुं० నొప్పిపెట్టుట.

**चसका** - पुं० వ్యసనము, కుతి.

**चस्पाँ** - वि० అంటుకొనియున్న.

**चस्पीदा** - वि० అంటింపబడియున్న.

**चह** - स्त्री० గొయ్యి; पुं० నది ఘట్టమున పడవ ఎక్కుటకు ఉంచబడిన బల్లలచే కట్టబడిన అరుగు

**चहक** - स्त्री० పక్షుల కలరవము.

**चहकना** - अ०क्रि० పక్షులు కూయుట; పిట్టలు అరచుట.

**चहका** - पुं० బురద; ఇటుకలు పరచిన నేల.

**चहचहा** - पुं० పక్షుల కూత; నవ్వులాట; పకపకలు.

**चहबच्चा**-पुं० నీటికుంట; ధనము దాచుటకు ఏర్పరచిన పాతాళగృహము.

**चहल**-स्त्री० ఆనందోత్సాహము; ఆనంద కోలాహలము; శోభ. **कीचड;** బురద.

**चहल कदमी** - स्त्री० పచారు; షికారు.

**चहल-पहल** - स्त्री० ఆనంద కోలాహలము.

**चहला** - पुं० **कीचड ;** బురద; కీచము.

**चहली** - स्त्री० నూతి గిలక.

**चहार** - वि० నాలుగు; 4 సంఖ్య.

**चहारदीवारी** - स्त्री० ప్రాకారము; ప్రహరీ గోడ

**चहारशम्बा** - पुं० బుధవారము.

**चहुँ** - वि० चारों ; నాలుగూ.

**चहुँ ओर** - अव्य० నలుదిశల

**चहेटना** - स०क्रि० పిండుట; సారము తీయుట; అణుచుట.

**चहेता** - वि० ప్రియుడు.

**चहोडना ; चहोरना** - स०क्रि० మొక్కను పీకి మరొక చోట నాటుట, పాతుట.

**चाँई** - वि० మోసగాడు; ధూర్తుడు.

**चाँक** - पुं० కళ్ళములోని ధాన్యపు రాశిమీద ముద్రవేయు కొయ్య అచ్చు

**चाँकना** - स०क्रि० కళ్ళములోని రాశిమీద కొయ్య అచ్చుతో ముద్రవేయుట.

**चाँगला** - वि० వాకచక్యము గల; చాతుర్యము గల; ధూర్తుడు.

**चाँटा** - पुं० చెంపకాయ; చీమ.

**चाँड** - वि० ప్రబలమైన; स्त्री० ప్రబలమైన కోరిక, ఆవశ్యకత; పోటీగుంజ.

**चाँड सरना** - मु० కోరికతీరుట.

**चाँडाल** - पुं० అంత్యజుడు; క్రూరుడు.

**चाँद** - पुं० చంద్రుడు.

**चाँदना** - पुं० వెలుతురు; వెన్నెల.

**चाँदनी** - स्त्री० వెన్నెల.

**चाँदी** - स्त्री० వెండి.

**चाँप** - स्त्री० ఒత్తిడి; తొక్కుడు.

**चाँपना** - स०क्रि० నొక్కుట; అణచుట;

తొక్కుట.

**चाँच चाँच** - स्त्री० बकवास ; వాగుడు; నిరర్థక ప్రలాపము.

**चाक** - पुं० చక్రము; కుమ్మరి సారె; గిలక; సీమసున్నము. वि० తెగిన; పగిలిన.

**चाकना**-स०क्रि० దేనిమీదనైనూ హద్దులు ఏర్పరచుటకైగుర్తులు పెట్టుట.

**चाकर** - पुं० नौकर ; సేవకుడు.

**चाकरी** - स्त्री० नौकरी ; సేవ.

**चाकी** - स्त्री० తిరుగలి; వజ్రము; మెరుపు.

**चाकू** - पुं० చాకు; కత్తి.

**चाखना** - स०क्रि० दे० चखना.

**चाचा** - पुं० తండ్రి సోదరుడు.

**चाची** - स्त्री० తండ్రి సోదరుని భార్య.

**चाट** - स्त्री० ख्वाहिश ; కోరిక; ఆసక్తి; వ్యసనము.

**चाटना** - स०क्रि० నాకుట.

**चाटु** - पुं० ముఖస్తుతి.

**चाटुकार** - वि० चापलूस ; ముఖస్తుతి చేయువాడు.

**चाटुकारी** - स्त्री० चापलूसी ; ముఖస్తుతి.

**चातक** - पुं० చాతకపక్షి.

**चातुरी** - स्त्री० చాతుర్యము.

**चातुर्य** - पुं०दे० चातुरी.

**चादर** - स्त्री० దుప్పటి; ఉత్తరీయము.

**चादरा** - पुं० స్త్రీల ఉత్తరీయము; ఓణీ.

**चाप** - पुं० ధనస్సు; చాపము.

**चापट** - स्त्री० తవుడు; చిట్టు; ఊక.

**चापना** - स० क्रि दबाना ; ఒత్తుట; అణచుట.

**चापलूस** - स्त्री० खुशामदी ; ముఖస్తుతి చేయువాడు.

**चापलूसी** - स्त्री० खुशामद ; ముఖస్తుతి.

**चापल्य** - पुं० చాంచల్యము.

**चाबना** - स०क्रि० నములుట.

**चाबी** - स्त्री० कुंजी ; తాళపుచెవి.

**चाबुक** - पुं० कोडा ; కొరడా; ఉత్తేజపరచు ఉక్తి

**चाबुकदस्त** - वि० దక్షుడు; చురుకైనవాడు.

**चाभी** - स्त्री० दे० चाबी.

**चाम** - पुं० चमडा ; చర్మము; తోలు.

**चाम के दाम चलाना** - पुं० అన్యాయముగా వ్యవహరించుట; దుండగము చేయుట.

**चामर** - पुं० चंवर ; వింజామరము.

**चाय** - स्त्री० తేయాకు; తేనీరు; టీ.

**चार** - वि० నాలుగు.

**चार आँखे होना** - पुं० ఒకరినొకరు చూచుకొనుట; ప్రేమ జనించుట.

**चारजामा** - पुं० గుఱ్ఱపు వీపు మీద వేయు గుడ్డ జీను; గుఱ్ఱపు జీను.

**चारण** - पुं० వందిమాగధులు; భట్రాజులు.
**चारदीवारी** - स्त्री० ప్రహరీగోడ.
**चारनाचार** - क्रि०वि० విధిలేక; గతిలేక.
**चारपाई** - स्त्री० खाट ; మంచము.
**चारपाया** - पुं० నాలుగు కాళ్ళ జంతువు - పశువు.
**चारबाग** -पुं० నలువైపుల గల తోట; నాలుగు చదరపు గళ్ళు గల శాలువ; రుమాలు.
**चारबालिश** - पुं० గుండ్రని దిండు.
**चारयारी** - स्त्री० నలుగురు మిత్రుల చర్చ.
**चारा** - पुं० మేత; ఉపాయము; గతి.
**चाराजोई** - स्त्री० ఫిర్యాదు; దావా.
**चारित्र** - पुं० ప్రవర్తన; ఆచారము; నడవడి.
**चारु** - वि० అందమైన; पुं० బృహస్పతి.
**चर्वाक** - पुं० నాస్తిక మత ప్రవర్తకుడు లేక ప్రచారకుడైన చార్వాకుడు.
**चाल** - स्त्री० నడక ; నడత ; నడవడి ; ఆచారము.
**चाल-चलन** - पुं० ఆచరణ; నడత.
**चाल-ढाल** - स्त्री० వ్యవహారము; ప్రవర్తన.
**चालक** - पुं० నడుపువాడు.
**चालन** - पुं० గమనము;. సంచాలనము; తవుడు; జల్లెడ; కదిలించుట.
**चालनी** - स्त्री० छलनी ; జల్లెడ.
**चाल-बाज** - वि० ధూర్తుడు; వంచకుడు.
**चालान** - पुं० వస్తువుల పట్టీ; చలాను.
**चालिया** - वि० టక్కరి; జిత్తులమారి.
**चाव** - पुं० రుచి; ఉత్సాహము; అనురాగము; ఆసక్తి
**चावल** - पुं० బియ్యము.
**चाशनी** - स्त्री० బెల్లం పాకము లేక పంచదార పాకము.
**चासा** - पुं० నాగలితో భూమిదున్ను రైతు.
**चालीस** - पुं० నలుబది ; 40.
**चालीसा** - पुं० నలుబది దినముల కాలము; మండలము; నలుబది వస్తువుల సమూహము; నలుబది పద్యముల సంకలనము.
**चाह** - स्त्री० కోరిక; ఆసక్తి; ఆవశ్యకత; గౌరవము.
**चाहक** - पुं० కోరువాడు; కోరిక గలవాడు; ప్రేమించువాడు.
**चाहत** - स्त्री० కోరిక; ప్రేమ.
**चाहना** - स०क्रि० కోరుట; ప్రేమించుట; కోరిక; ఆవశ్యకత.
**चाहिए** - अव्य० వలయును; కావలయును; తగును.
**चाहे** - अव्य० లేనిచో; ఇష్టమైతే; ఇది కాని అది కాని.
**चिंउँटा** - पुं० గండు చీమ.
**चिंउँटी** - स्त्री० चींटी ; చిన్న చీమ.

**चिंउँटी की चाल** - मु० బహునెమ్మది నడక; సోమరి నడక.

**चिंउँटी के पर निकलना** - मु० ప్రాణం మీదికి వచ్చుట; ప్రాణాంతకమైన పని; చనిపోవుట.

**चिंघाड** - स्त्री० ఘీంకారము (ఏనుగు) పెద్ద అరుపు.

**चिंघाडना**-अ०क्रि० ఘీంకరించుట(ఏనుగు) పెద్దగా కేకవేయుట.

**चिंचा** - स्त्री० చింతచెట్టు; చింతపిక్క.

**चिंचिनी** - स्त्री० इमली का पेड या फल; చింతచెట్టులేక చింతకాయ; పండు.

**चिंतक** - पुं० మననము చేయువాడు; ఆలో చించువాడు.

**चिंतन** - पुं० ఆలోచన; చింతన; ధ్యానము.

**चिंतनीय** - वि० ఆలోచించదగిన; చింతించ దగిన.

**चिंता** - स्त्री० ఆలోచన; భావన; విచారము.

**चिंतित** - वि० ఆలోచనలోనున్న, చింతించు చున్న.

**चिंत्य** - वि० ఆలోచింపదగిన; విచారింప దగిన; సందిగ్ధమైన.

**चिंदी** - स्त्री० తునక; తునియ.

**चिंदी निकालना** - पुं० చాలా చిన్న తప్పును చూపించుట; కుతర్కము చేయుట.

**चिडवा** - पुं० అటుకులు.

**चिक** - स्त्री० వెదురు బద్దలతో తయారైన పరదా; కసాయివాడు.

**चिकट**-वि० गंदा; మురికి అయిన; మురికిగా నున్న.

**चिकटना**-पुं० మురికివలన లసలస లాడుట.

**चिकन** - पुं० లతలు; పూలుకుట్టబడిన నాజూకైన నేత వస్త్రము.

**चिकना**-वि० నునుపైన; మృదువైన; స్నిగ్ధమైన; శుభ్రమైన; సుందరమైన.

**चिकना घडा** - मु० సిగ్గులేని; లజ్జలేని.

**चिकनी चुपडी बातें** - मु० ముఖస్తుతి మాటలు.

**चिकनाई ; चिकनाहट**-स्त्री० మృదుత్వము; నునుపు; నిగనిగ.

**चिकनाना** - स०क्रि० నునుపుచేయుట; మెరిపించుట; **अ०क्रि०** నునుపెక్కుట; లావెక్కుట.

**चिकनिया** - वि० షోకిల్లా; పూలరంగడు.

**चिकरना**-अ०क्रि० चिंघाडना ; ఘీంకరించుట.

**चिकवा** - पुं० ఒక విధమగు పట్టువస్త్రము; కసాయివాడు.

**चिकुटी** - स्त्री० चुटकी ; చిటికె.

**चिकुर** - पुं० కేశములు; వెంట్రుకలు; ఉడుత;

కొండ.

**चिकोटी** - स्त्री० चुटकी ; చిటిక.

**चिक्कण ; चिक्कन** - वि० నునుపైన.

**चिचडी** - स्त्री० గోమారు.

**चिचियाना** - अ०क्रि० గోలచేయుట; కేకలు వేయుట.

**चिट** - स्त्री० पुरजा ; చీటీ ; పీలిక.

**चिटकना** - अ०क्रि० ఎండకు లేక చలికి పగులుట; కోపించుట.

**चिटनवीस** - पुं० చీటీలు వ్రాయువాడు, గుమస్తా.

**चिट्ठा** - पुं० జమఖర్చుల పుస్తకము.

**चिट्ठी** - स्त्री० खत ; ఉత్తరము.

**चिट्ठी-रसाँ** - पुं० डाकिया ; ఉత్తరములు బట్వాడా చేయు ఉద్యోగి.

**चिडचिडा**-पुं० రుసరుసలాడు; కస్సుబుస్సు మను; ముక్కోపి.

**चिडचिडाना** - अ०क्रि० కస్సుబుస్సు మనుట; చిటపటలాడుట.

**चिडकिडापन** - पुं० ముక్కోపము.

**चिडना** - पुं० चिउडा ; అటుకులు.

**चिडिया** - स्त्री० పక్షి; పిట్ట.

**चिडिया खाना** - पुं० జంతు ప్రదర్శనశాల.

**चिडीमार** - पुं० बहेलिया ; బోయవాడు; పక్షుల వేటగాడు.

**चिढ** - स्त्री० ఏవగింపు; విరక్తి; అసహ్యము; క్రోధము.

**चिढना**-अ०क्रि० కోపముతో మండిపడుట; కోపపడుట.

**चिढाना** - स०क्रि० విసిగించుట; కోపము వచ్చునట్లు చేయుట; వెక్కిరించి కోపము కలిగించుట.

**चित** - पुं० మనస్సు; చిత్తము; वि० వెల్లికిలిగా పడిన.

**चितउन ; चितवन** - पुं० క్రీగంటి చూపు.

**चितकबरा** - वि० బహువర్ణములుగల; విభిన్నమైన రంగులు గల.

**चितचोर** - वि० చిత్తమును; మనస్సును హరించువాడు; ప్రియుడు.

**चितरना** - स०क्रि० చిత్రములను వేయుట; వ్రాయుట.

**चितवन** - पुं०दे० चितउन.

**चिता** - स्त्री० చితి; స్మశానము; ప్రోగు.

**चिताना** - स०क्रि० चेतावना ; జాగ్రత్త పరచుట; హెచ్చరించుట.

**चितावनी** - स्त्री० चेतावनी ; హెచ్చరిక.

**चितेरा** - पुं० चित्रकार ; చిత్రకారుడు.

**चित्त** - पुं० మనస్సు; హృదయము; చిత్తము.

**चित्तवृत्ति** - स्त्री० చిత్తావస్థ; చిత్తము పోకడ.

**चित्ती** - स्त्री० చిన్నమచ్చ; చిన్నవాత.

**चित्र** - पुं० చిత్రము; బొమ్మ; చిత్తరవు.
**चित्रक** - पुं० చిత్రకారుడు; చిరుతపులి.
**चित्रकला** - स्त्री० చిత్రలేఖనము; ఒక లలితకళ.
**चित्रसारी** - स्त्री० పలురంగుల చిత్తరవులతో అలంకరింపబడిన కక్ష్యము.
**चिथडा** - पुं० చింపిరిగుడ్డ.
**चिथाडना** - स०क्रि० చించుట; అవమాన పరచుట; చీల్చిచెండాడుట.
**चिनक** - स्त्री० మంటతో కూడిన నొప్పి.
**चिनगारी** - स्त्री० నిప్పురవ్వ.
**चिनगी** - स्त्री० నిప్పురవ్వ; చురుకైన బాలుడు.
**चिनिया** - वि० తెల్లని; చైనాదేశపు.
**चिनिया बादाम** - पुं० मूँगफली; వేరుశనగ.
**चिन्ह** - पुं० గురుతు; ముద్ర.
**चिन्हाना** - स०क्रि० గుర్తుచేయుట; పరిచయము చేయుట; గురుతు పట్టించుట.
**चिन्हानी** - स्त्री० గుర్తు; స్మారక చిహ్నము.
**चिन्हार** - वि० परिचित ; పరిచితమైన.
**निन्हारी** - स्त्री० పరిచయము; ఎరుక.
**चिपकना** - अ०क्रि० అంటుకొనుట; లీనమగుట.
**चिपकाना** - स०क्रि० అంటించుట; లగ్నము చేయుట.
**चिपचिपा** - वि० జిగురుగానున్న; బంకగానున్న.
**चिपचिपाना** - पुं० అంటుకొనుట; జిగురుగా నుండుట.
**चिपचिपाहट** - स्त्री० జిడ్డుగానుండుట; బంకగానుండుట.
**चिपटना** - अ०क्रि० चिपकना ; అంటుకొనుట.
**चिपटा**-वि०అణిగియుండు ; **चिपटी नाक** - स्त्री० చప్పిడి ముక్కు.
**चिपटाना** - स०क्रि० चिपकाना ; అంటించుట.
**चिपडी** - स्त्री० పిడక.
**चिबुक** - पुं० ठोडी ; గడ్డము.
**चिमटना** - अ०क्रि० అతుక్కొని ఉండుట; అంటిపెట్టుకుని యుండుట; కౌగిలించుకొనుట.
**चिमटा** - पुं० పట్టుకారు ; పట్కారు.
**चिमटाना** - स०क्रि० అతికించుట; కౌగిలించుకొనుట.
**चिमनी** - स्त्री० పొగగొట్టము.
**चिर** - वि० చాలకాలపు.
**चिरकीन** - वि० गंदा ; మురికిగానున్న.
**चिरकुर** - पुं० పాత చింపిరి పీలిక.
**चिरना** - अ०क्रि० చినుగుట; పగులుట; చీలుట.

**चिरबाना** - स॰क्रि॰ చీల్చించుట.

**चिराई** - स्त्री॰ చీల్చుట; చీల్చు మజూరి.

**चिराग** - पुं॰ దీపము.

**चिराग बढाना** - मु॰ దీపమును ఆర్పుట.

**चिरागदान** - पुं॰ दीवट ; దీపపుశెమ్మె.

**चिरायंध** - स्त्री॰ చర్మము; వెంట్రుకలు; మాంసము మొదలగునవి తగలబడునప్పుడు వ్యాపించు దుర్గంధము.

**चिरायता** - पुं॰ నేలవేము మొక్క.

**चिरैया** - स्त्री॰ दे॰ चिडिया.

**चिरौरी** - स्त्री॰ వినయ పూర్వకమైన ప్రార్థన; దేవిరింపు.

**चिलक** - स्त्री॰ चमक ; తళుకు-బెళుకు; మెరుపు; ఉండి ఉండి బాధించునొప్పి; ద్యుతి.

**चिलकना** - अ॰ क्रि॰ మిణుక్కుమని కాంతించుట; ఉండిఉండినొప్పి బాధించుట.

**चिलगोजा** - पुं॰ मेवा ;ఎండు ఫలములు.

**चिलचिलाना** -अ॰क्रि॰ ఎండ మిటమిటలాడుట.

**चिलडा** - पुं॰ चीला ; ఒకరకమైన తినుబండారము; పేక్వానము.

**चिलबिला ; चुलबुला** -वि॰ చంచలమైన; కొంటె; తుంటరి.

**चिलम** - स्त्री॰ చిలుముగొట్టము.

**चिलमची** - स्त्री॰ ఒకవిధమగు డేకిసా పుక్కిలింతకు; కాళ్ళు కడుగు కొనుటకు ఉపయోగించు పాత్ర.

**चिलमन** - स्त्री॰ चिक ; వెదురు బద్దల పరదా.

**चिल्लड** - पुं॰ పేను మాదిరి తెల్లటి పురుగు - ఈపి.

**चिल्ला** - पुं॰ 40 దినములు నిర్వహించు మహమ్మదీయులకు సంబంధించిన పుణ్యకార్యపు ప్రతిబంధకము; మినుములేక పెసర అట్టు.

**चिल्ले का जाडा** - मु॰ ఎముకలు కొరుకు చలి.

**चिल्लाना** - अ॰क्रि॰ అరచుట; బిగ్గరగా కేకవేయుట.

**चिल्लाहट** - स्त्री॰ గోల; అరుపు; సందడి; గలభా.

**चिहुँक** - स्त्री॰ పక్షికూత.

**चिहुँकना** - अ॰क्रि॰ పక్షులు అరచుట; పక్షులు కూయుట.

**चिहुँकना** - अ॰क्रि॰ चौकना ; ఉలిక్కిపడుట.

**चीं-चपड** - स्त्री॰ వ్యతిరేక కథనము; నిషేధము.

**चींटा** - पुं० चिउँटा ; గండుచీమ.

**चींटी** - स्त्री० చిన్న చీమ.

**चीक** - स्त्री० చీత్కారము; పెద్ద అరుపు.

**चीकट** - पुं० నూనె మడ్డి; वि० మురికైన.

**चीख** - स्त्री० అరుపు; కేక.

**चीखना** - अ०क्रि० అరచుట; కేకవేయుట; स०क्रि० రుచి చూచుట.

**चीख-पुकार** - स्त्री० అల్లరి; గలభా.

**चीखुर** - पुं० गिलहरी ; ఉడుత.

**चीज** - स्त्री० వస్తువు; సొమ్ము; ఆభూషణము; విషయము; సామగ్రి.

**चीड** - पुं० ఒకవిధమగు కలప వృక్షము; జాజికాయ చెట్టు.

**चीता** -पुं०చిరుతపులి;वि०ఆలోచింప బడిన.

**चीत्कार** - पुं० పెద్దకేక; చీత్కారము.

**चीचडा ; चीचरा** - पुं० दे० चिचडा.

**चीन** - पुं० - చైనాదేశము.

**चीना-बादाम** - पुं०मूंग-फली; వేరుశనగ.

**चीनिया** - वि० చైనాదేశమునకు సంబంధించిన.

**चीनिया-बादाम** - पुं०दे० चीना-बादाम.

**चीनी**-स्त्री० పంచదార; वि० చైనాదేశమునకు సంబంధించిన

**चीन्हना** - पुं० पहचानना ; గుర్తుపట్టుట.

**चीपड** - पुं० కంటిపుసి.

**चीमड**-वि० लचीला ; లాగినా; సాగదీసినా; వంచినా; విరగనటువంటిది.

**चीर** - पुं० వస్త్రము; చెట్టు బెరడు; నారచీరము. स्त्री० చీలుడు; కోత.

**चीरना** - स०क्रि० చీల్చుట; కోయుట.

**चीर-फाड** - स्त्री० శస్త్రచికిత్స.

**चील** - स्त्री० గ్రద్ద.

**चीरा** - पुं० ఒకవిధమగు తలపాగా వస్త్రము; గ్రామపు పొలిమేరలో పాతబడిన రాయి లేక స్తంభము; కోసిచేయబడినగాయము.

**चीलार ; चीला** - पुं०दे० चिल्लड.

**चील्ह** - स्त्री० चील ; గ్రద్ద.

**चीवर**-पुं० బౌద్ధభిక్షులు ధరించు వస్త్రము.

**चुंगल** - पुं०दे० चंगुल.

**चुंगी** - स्त्री० టోలుగేటు పన్ను; చిటికెడు పదార్థము.

**चुंघाना** - स०क्रि० चुसाना ; పీల్చి త్రాగించుట.

**चुंबक** - पुं० సూదంటురాయి.

**चुंबन** - पुं० ముద్దు; స్పర్శ; ముద్దుపెట్టుకొనుట.

**चुंबित** - वि० తాకబడిన; ముద్దుపెట్టబడిన.

**चुंबी** - वि० ముద్దుపెట్టుకొనువాడు; తాకువాడు.

**चुआई** - स्त्री० బొట్లు బొట్లుగా కారుట;

కారుడు.

**चुआना** - अ०क्रि० కారునట్లు చేయుట.

**चुकता** - वि० తీర్చ (బాకీ) బడినట్టిది; ?; బాకీలేనట్టిది; మిగిలిలేనట్టిది.

**चुकना** - अ०क्रि० ముగియుట; తీరుట; బాకీ లేకపోవుట; పొరబడుట.

**चुकाई** - स्त्री० పరిష్కారము; ముగింపు.

**चुकाना** - स०क्रि० (బాకీ) తీర్చుట; ముగించుట; పరిష్కరించుట.

**चुक्कड** - पुं० कुल्हड ; చిన్నమట్టి పిడత.

**चुगना** - स०क्रि० (పక్షులు) గింజలు ముక్కుతో తీసుకుని మింగుట లేక తినుట.

**चुगलखोर** - पुं० కొండెములు చెప్పువాడు.

**चुगलखोरी** - स्त्री० కొండెములు చెప్పుట.

**चुगली** - स्त्री० కొండెము; చాడీ.

**चुचकारना** - स०क्रि० पुचकारना ; లాలించుట; బుజ్జగించుట.

**चुचकारी** - स्त्री० पुचकारी ; లాలన; బుజ్జగింపు.

**चुचाना** - अ०क्रि० కారుట; स०क्रि० కార్చుట.

**चुचुक** - पुं० చన్ను మొన.

**चुटका** - पुं० చిటికెడు పదార్థము.

**चुटकी** - स्त्री० చిటిక.

**चुटकी लेना** - मु० मजाक करना; వేళాకోళమాడుట.

**चुटकुला** - पुं० హాస్యోక్తి; వింతమాట.

**चुटकुला छोडना** - मु० వినోదకరము మాట అనుట.

**चुटिया** - स्त्री० పిలక; జుట్టు.

**चुटीला** - वि० గాయపడిన; దెబ్బతినిన; శ్రేష్ఠమైన.

**चुडिहारा** - पुं० గాజుల బత్తుడు; గాజులు అమ్మువాడు.

**चुडैल** - स्त्री० పిశాచి; కురూపి; క్రూర స్వభావము గలది.

**चुनचुना** - वि० చిమచిమలాడెడు; మంట పుట్టెడు ; पुं० నులి పురుగు.

**चुनचुनाना** - अ०क्रि० చిమచిమలాడుట; శరీరమంతయు ఏదో గుచ్చుకొనుచున్నట్లు బాధ కలుగుట.

**चुनट ; चुनन** - स्त्री० ముడతలు; కుచ్చెళ్ళు.

**चुनना** - स०क्रि० ఏరుట; ఎన్నుట; క్రమముగా సర్దుట; కుచ్చెళ్ళు పెట్టుట.

**चुनरी** - स्त्री० అద్దకపు చీర; కలంకారి చీర; ఒక విధమగు రత్నము.

**चुनवाना** - स०क्रि० ఏరించుట; ఎన్నుకొనునట్లు చేయుట.

**चुनांचे** - अव्य० इसलिए ; కాబట్టి; కనుక.

**चुनाव** - पुं० ఎన్నిక.

**चुनिंदा** - वि० ఎన్నుకొనిన; ఏరుకొనబడిన; శ్రేష్ఠమైన.

**चुनी** - स्त्री० రత్నపు తునక; నూక; రంపపు పొట్టు.

**चुनौटी** - स्त्री० తడిసున్నపు బరిణ.

**चुनौती**-स्त्री० ललकार ; సవాలు; ఛాలెంజి.

**चुन्नी** - स्त्री० चुनी ; రత్నపు తునక; నూక; రంపపు పొట్టు.

**चुप** - स्त्री० మౌనము; वि० మెదలకుండా ఉన్న; మౌనము వహించిన.

**चुपका** - वि० खामोश ; మౌనముగా నున్న.

**चुपकी** - स्त्री० चुप्पी ; మౌనము.

**चुपचाप**-क्रि०वि० మెదలకుండా; నిశ్శబ్దముగా.

**चुपडना** - स०क्रि० పూయుట; రాయుట; గుద్దుట; దోషమును దాటవేయుట; ముఖస్తుతి చేయుట; నెయ్యి పూయుట; (రొట్టెపైరా)

**चुपाना** - स०क्रि० నిశ్శబ్దముగానుంచుట; अ०क्रि० నిశ్శబ్దముగా నుండుట.

**चुप्पा** - वि० మితభాషి; తక్కువ మాటాడు వాడు.

**चुप्पी** - स्त्री० మౌనము.

**चुप्पी साधना** - मु० మౌనము వహించుట.

**चुबलाना** - अ०क्रि० చప్పరించుట.

**चुभकना** -अ०क्रि० మాటిమాటికి నీటిలో మునుగుట.

**चुभकी** - स्त्री० गोता ; మునుగు.

**चुभना** - अ०क्रि० గుచ్చుకొనుట; నాటుకొనుట; చొచ్చుట; లీనమగుట.

**चुभाना ; चुभोना** - स०क्रि० గుచ్చుట; చొప్పించుట; నాటుట.

**चुभीला** - वि० గుచ్చుకొనునట్టి; నాటుకొనునట్టి.

**चुमकार** - स्त्री० पुचकार ; ముద్దులాట; మురిపము.

**चुमकारना** - स० क्रि० पुचकारना ; మురిపము చేయుట; బుజ్జగించుట; ముద్దులాడుట.

**चुमकारी** - स्त्री० दे० चुमकार.

**चुम्मा** - पुं० चूमा ; చుంబనము; ముద్దు.

**चुर** - पुं० గుహ, క్రూరమృగములు ఉండు చోటు ; పదిమంది కూర్చుండు చోటు.

**चुरना** - अ०क्रि० ఉడుకుట; రహస్య సమాలోచన జరుగుట; स०क्रि० ఉడికించుట.

**चुरमुर** - वि० పెళ్ళుమని విరుగు.

**चुरमुरा** - वि० పెళుసైన.

**चुराना** - स०क्रि० దొంగిలించుట; ఉడకబెట్టుట.

**चुरूट** - पुं० పొగాకు చుట్ట.

**चुल** - स्त्री॰ खुजलाहट ; దురద.

**चुलबुल** -स्त्री॰ ఒయ్యారము; చాంచల్యము.

**चुलबुलाना** - अ॰क्रि॰ ఒయ్యారము పోవుట; ఒయ్యారపు చేష్టలు చేయుట.

**चुकबुलाहट**-स्त्री॰चुलबुलापन ; ఒయ్యారపు పోకడ; చిలిపితనము.

**चुल्ला ; चुल्ली** - वि॰ కొంటెవాడు; అల్లరి వాడు; పాషండుడు.

**चुल्लू** - पुं॰ చేర; चुल्लूभर ; చారెడు.

**चुल्लू भर पानी में डूब मरना** - मु॰ సిగ్గుతో కుమిలిపోవుట.

**चुवाना**-स॰क्रि॰ బొట్టుబొట్టుగా కార్చుట.

**चुसकी** - स्त्री॰ పీల్చుట; గుటకమెల్లిమెల్లిగా పీల్చి త్రాగుట.

**चुसना** - अ॰क्रि॰ పీల్చబడుట.

**चुस्त** - वि॰ చురుకైన; చాకచక్యముగల.

**चुस्ती** - स्त्री॰ చురుకుదనము; జాగరూకత; చాకచక్యము.

**चुहचुहाता** - वि॰ రసవంతమైన; మనోహరమైన; ఆనందదాయకమైన.

**चुहचुहाना** - अ॰क्रि॰ పక్షులు కూయుట; రసము కారుట; ఆహ్లాదకరముగా నుండుట.

**चुहल** - स्त्री॰ పక్షులకూత; వేళాకోళము; మనోరంజనము.

**चुहलबाज** - वि॰ పరిహాసము చేయువాడు; వేళాకోళమాడువాడు.

**चुहलबाजी** - स्त्री॰ పరిహాసము.

**चुहिया** - स्त्री॰ ఆడుఎలుక; చిట్టెలుక.

**चूँ** - पुं॰ పక్షిపిల్లల అరుపు.

**चूँकि** - क्रि॰वि॰ क्योंकि ; ఎందుకనగా; ఏలననిన.

**चूँच** - स्त्री॰ दे॰ चोंच.

**चूँदरी** - स्त्री॰ दे॰ चूनरी.

**चूक** - स्त्री॰ పొరబాటు; తప్పు.

**चूकना**-अ॰क्रि॰పొరబడుట; గురి తప్పుట; తప్పిపోవుట.

**चूका** - पुं॰ ఒక విధమగు గోంగూర; పుల్ల గోంగూర.

**चूची** - स्त्री॰ చన్ను; చనుమొన.

**चूजा** - पुं॰ కోడిపిల్ల.

**चूडांत** - पुं॰ తురీయావస్థ; చరమ సీమ वि॰ చివరి హద్దుకు చేరిన.

**चूडा**-पुं॰ శిఖరము; జుట్టుముడి; కంకణము.

**चूडाकरण ; चूडाकर्म** - पुं॰ పుట్టువెంట్రుకలు తీయు సంస్కారము; శిరోజఖండన సంస్కారము.

**चूडामणि** - पुं॰ శిరోభూషణము; గురి వింజ.

**चूडी** - स्त्री॰ చేతి గాజు.

**चूड़ीदार** - वि॰ గాజువలెగుండ్రని; గాజులు ధరించియున్న.

**चूत** - पुं॰ ఆమ్రవృక్షము; మామిడిచెట్టు; स्त्री॰ స్త్రీ యోని; భగము.

**चूतड** - पुं॰ నితంబము (లు) పిరుదులు.

**चूतिया** - वि॰ बेवकूफ ; మూర్ఖుడు; ఏమీ తెలియని.

**चून** - पुं॰ పిండి; చూర్ణము.

**चूना** - पुं॰ సున్నము; अ॰क्रि॰ కారుట.

**चूनी** - स्त्री॰ మెతుకు; కెంపుతునక.

**चूमना** - स॰क्रि॰ ముద్దుపెట్టుకొనుట.

**चूमा** - पुं॰ चुम्मा ; చుంబనము; ముద్దు.

**चूर** - पुं॰ చూర్ణము; రంపపుపొట్టు; దుమ్ము; वि॰ మదించిన; మత్తెక్కిన; నిమగ్నమైన; చూర్ణింపబడిన.

**चूरन**-पुं॰ రంపపు పొట్టు; చూర్ణము; మందు పొడి

**चूरना** - पुं॰ చూర్ణించుట; పొడిచేయుట.

**चूल** - पुं॰ శిఖ; జుట్టు; स्त्री॰ కొయ్యమేకు.

**चूल्हा** - पुं॰ పొయ్యి.

**चूषण** - पुं॰ चूसना ; పీల్చుట.

**चूसना** - स॰क्रि॰ పీల్చుట; పిండుట.

**चूहा** - पुं॰ ఎలుక.

**चूहादान** - पुं॰ ; **चूहादानी** - स्त्री॰ఎలుకల బోను.

**चेचक**-स्त्री॰ शीतला ; మశూచి రోగము.

**चेचकरू** - वि॰ మశూచి మచ్చలు గలవాడు.

**चेटक** - पुं॰ సేవకుడు; గారడి; स्त्री॰ గారడీ వాని భార్య.

**चेटका** - स्त्री॰ చితి; శ్మశానము.

**चेटकी** - पुं॰ గారడి చేయువాడు.

**चेटिकी ; चेटी** - स्त्री॰ దాసి; పనికత్తె.

**चेत** - पुं॰ చైతన్యము; జ్ఞానము; జాగరణ.

**चेतन** - पुं॰ ప్రాణి; జీవి; वि॰ చైతన్యముగల.

**चेतनता** - स्त्री॰ చైతన్యము; జ్ఞానము.

**चेतना** - स्त्री॰ తెలివి; జ్ఞానము; చైతన్యము; अ॰क्रि॰ స్పృహలోనుండుట; स॰क्रि॰ ఆలోచించుట.

**चेतावनी** - स्त्री॰ तम्बीह ; హెచ్చరిక.

**चेप** - पुं॰ జిగురుగానుండు రసము.

**चेपदार** - वि॰ జిగురుగానున్న.

**चेर, चेरा**- पुं॰ నౌకరు; సేవకుడు; శిష్యుడు.

**चेरी** - स्त्री॰ దాసి.

**चेला** - पुं॰ శిష్యుడు.

**चेली** - स्त्री॰ శిష్యురాలు.

**चेष्टा** - स्त्री॰ ప్రయత్నము; చేష్ట.

**चेहरा** - पुं॰ ముఖము; ముందు భాగము.

**चेहरा उतरना** - मु॰ ముఖము వ్రేలాడవేసుకొనుట; దిగాలుపడుట.

**चेहरा तमतमाना** - मु॰ ముఖము ఎర్ర

బారుట; కోపముతో ముఖము ఎర్ర బారుట.

**चेहल-कदामी** - स्त्री० दे० चहल कदमी

**चैत** - पुं० చైత్రమాసము.

**चैत्य** - वि० చితికి సంబంధించిన पुं०దేవాలయము; సమాధి; బౌద్ధ భిక్షువు; బౌద్ధ విహారము; బుద్ధుని విగ్రహము.

**चैन** - पुं० విశ్రాంతి; సుఖము; శాంతి.

**चैला** - पुं० వంట చెరకు.

**चैली** - स्त्री० వంటచెరకు.

**चोंक** - स्त्री० ముద్దిడునప్పుడు బుగ్గమీదపడు పంటిగాటు.

**चोकर** - पुं० తవుడు; చిట్టు; పొట్టు.

**चोखा** - वि० విశుద్ధమైన; నిజాయతీగల; పదునైన్న అందమైన; వంకాయ బజ్జి.

**चोंगा** - पुं० గొట్టము; టెలిఫోను గొట్టము.

**चोंच** - स्त्री० పక్షుల ముక్కు.

**चोचला** - पुं० ఒయ్యారపు చేష్టలు; హావ బావములు.

**चोज** - पुं० చమత్కారము; వ్యంగ్యము.

**चोट** - स्त्री० దెబ్బ; గాయము; దెప్పిపొడుపు.

**चोटी** - स्त्री० శిఖ; జుట్టు; జుట్టుముడి.

**चोट्टा** - पुं० चोर ; దొంగ.

**चोदक** - पुं० తోలువాడు; ప్రేరేపించువాడు.

**चोदन** - पुं० తోలుడు; ప్రేరణ.

**चोदना** - स्त्री० ప్రేరణ; स०क्रि० సంభోగించుట.

**चोप** - पुं० వాంఛ; కోరిక; ఆసక్తి; ప్రేరణ.

**चोब** - स्त्री० గుడారపు నిట్రాట; డోలు లేక తాషామరపా వాయించు బెత్తము లేక కర్ర; బెత్తము; బంగారము లేక వెండి పూత పూయబడిన చేతి కర్ర.

**चोबदार** - पुं० బంగారు లేక వెండి పూత తొడిగిన చేతి కర్ర పుచ్చుకుని రాజు ఊరేగింపు లేక పెళ్ళి ఊరేగింపు ముందర నడచు అధికారి లేక నౌకరు.

**चोर** - पुं० దొంగ.

**चोर-बाजार** - पुं० దొంగవ్యాపారము; దొంగ మార్కెట్టు.

**चोरा-चोरी** - क्रि०वि० దొంగచాటుగా; రహస్యముగా.

**चोरी** - स्त्री० దొంగతనము.

**चोरी-चोरी** - क्रि०वि० దొంగచాటుగా.

**चोला** - पुं० ఫకీరులు; సాధువులు ధరించు శీలమండవరకు ఉండు ఒక విధమగు అంగరఖా; శరీరము.

**चोली** - स्त्री० अंगिया ; రవిక.

**चोली दामन का साथ** - मु० ఘనిష్ఠమైన సంబంధము.

**चोषण** - पुं० శోషణము ; పీల్చుట.

**चौंक**-स्त्री० ఉలికిపాటు; బెదురు; త్రుళ్ళింత.

**चौंकना** - अ०क्रि० ఉలిక్కిపడుట; బెదురుట; త్రుళ్ళిపడుట.

**चौंधियाना** - अ०क्रि० కన్నులు (ప్రకాశము వలన) మిరుమిట్లుగొలుపుట.

**चौंरी** - स्त्री० తెల్ల వెంట్రుకలున్న తోక గల ఆవు; ఈగలు తోలుటకు ఉపకరించు చిన్నకర్రకు కట్టినగుఱ్ఱపు తోకవెంట్రుకలు కట్టిన కుచ్చు.

**चौंसठ** - वि० అరువది నాలుగు; 64 సంఖ్య.

**चौक** - पुं० నాలుగు వీధుల కూడలి.

**चौकड़ी** - स्त्री० గుఱ్ఱపు నాల్గుకాళ్ళదౌడు; నల్గురి కుట్రదారుల సమూహము.

**चौकड़ी भरना** - मु० గుఱ్ఱము; లేడి మొ॥ఒకే పర్యాయము నాల్గుకాళ్ళు ఎత్తి పరిగెత్తుట.

**चौकड़ी-भूल जाना** - मु० మనస్సు చంచలమగుట; బుద్రుపని చేయక పోవుట.

**(चंडाल) चौकड़ी** - मु० రౌడీ గుంపు.

**चौकन्ना** - वि० सावधान ; భద్రముగా; జాగ్రత్తగల.

**चौकस** - वि० జాగ్రత్తపడిన; కట్టుదిట్టము గల.

**चौकसी** - स्त्री० జాగరూకత; అప్రమత్తత.

**चौका** - पुं० శుభ్రపరచిన హిందువుల వంటశాల లేక భోజనశాల; రొట్టెలు వత్తుటకు ఉపయోగపడు గుండ్రని కొయ్య పీట లేక రాయి.

**चौकी** -स्त्री० నలుచదరపు చిన్న కొయ్య పలక పీట లేక బల్ల; కాపలా; పోలీసుస్టేషను; పన్ను వసూలు చేయు చావడి లేక స్థానము.

**चौकीदार** - पुं० కాపలా మనిషి; పహరా కాయు జవాను.

**चौकीदारी** - स्त्री० కాపలా; పహరా; కాపలా కాయుట.

**चौकोन** - वि० నాల్గుకోణములు గల.

**चौकोर** - वि० दे० चौकोन.

**चौखट** - स्त्री० గడప; దర్వాజా చట్రము.

**चौखटा** - पुं० చిత్రములు మొదలగు అమర్చుటకు ఉపకరించు చట్రము.

**चौगान** - पुं० ఒక విధమగు 'పోలో' ఆట.

**चौगिर्द** - क्रि०वि० నలువైపులా.

**चौगुना** -वि०నాలుగు రెట్లు; నాలుగింతలైన.

**चौगोशिया** - वि० నాల్గుకోణములు గల.

**चौचंद** - पुं० అపకీర్తి; కళంకము ఆపాదించు పుకారు.

**चौड़ा** - वि० వెడల్పు గల.

**चौड़ाई** - स्त्री० వెడల్పు.

**चौतरा** - पुं०అరుగు.

**चौथ** - स्त्री० చవితి; నాల్గవ వంతు.

**चौथा** - वि० నాల్గవ.

**चौथाई** - स्त्री॰ నాల్గవ భాగము.
**चौथापन** - पुं॰ बुढापा ; వృద్ధాప్యము.
**चौदस** - स्त्री॰ చతుర్దశి.
**चौदाँत** - स्त्री॰ రెండు ఏనుగుల పోట్లాట.
**चौपट** - वि॰ నాశమైన; వినష్టమైన.
**चौपटा** - वि॰ నాశకుడు.
**चौपड** - पुं॰ పాచికల ఆట; పచ్చీసు ఆట; ఈ ఆట బల్ల.
**चौपथ** - पुं॰ चौराहा ; నాలుగు వీధుల కూడలి.
**चौपहल** - वि॰ నాలుగు పలకలగల.
**चौपाई** - स्त्री॰ ఒకవిధమగు హిందీ పద్యము.
**चौपाया** - पुं॰ जानवर ; పశువు.
**चौपाल** - पुं॰ పదిమంది కూర్చుండు చోటు; రచ్చ చావడి.
**चौपुरा** - पुं॰ నాలుగు మోటల బావి.
**चौफेर** - क्रि॰वि॰ నలువైపులా.
**चौबाई** - स्त्री॰ నలువైపులనుంచి వచ్చుగాలి; పుకారు; వదంతి.
**चौबीस** - वि॰ ఇరువదినాలుగు ; 24 సంఖ్య.
**चौमंजिला** - वि॰ నాలుగు అంతస్తులు గల.
**चौमास** - पुं॰ వర్షాకాలము.
**चौमासा** - पुं॰ వర్షఋతువు వర్ణన.
**चौमुख** - वि॰ నలువైపుల.
**चौमुहानी**-स्त्री॰चौक ; నాలుగు మార్గముల కూడలి.
**चौरस** - वि॰ సమతలమైన.
**चौरास्ता** - पुं॰ चौराहा ; నాల్గువీధులు కలియు చోటు.
**चौरा** - पुं॰ అరుగు; రచ్చచావడి; సాధువుల సమాధిపైని వేదిక.
**चौराहा** - पुं॰दे॰ चौरास्ता.
**चौरेठा** - पुं॰ రుబ్బిన బియ్యపు పిండి.
**चौर्य** - पुं॰ चोरी ; దొంగతనము; చౌర్యము.
**चौलडा** - पुं॰ నాలుగ పేటలహారము.
**चौलाई** - स्त्री॰ తోటకూర; ఆకుకూర.
**चौवा** - पुं॰ నాలుగు ముక్కలపేక ముక్క; పశువు; నాలుగు వ్రేళ్ళ సమూహము; బెత్త.
**चौसर** - पुं॰ పాచికల ఆట; పచ్చీసు; ఈ ఆటలకు ఉపకరించు బల్ల.
**चौहट्टा** - पुं॰दे॰ चौराहा.
**चौहत्तर** - वि॰ డెబ్బదినాలుగు; 74 సంఖ్య.
**चौहद्दी** - स्त्री॰ నలువైపుల ఎల్లలు లేక హద్దులు.
**चौहरा** - वि॰ నాలుగురెట్లు; నాలుగు పొరలు గల.
**च्युति** - स्त्री॰ पतन ; పతనము; స్ఖలనము; భ్రష్టత; లోపము.

## छ

**छंग** - पुं० गोद ; ఒడి.

**छँगा** - वि० ఆరు(వ్రేళ్ళు) గలవాడు.

**छँटना** - अ०क्रि० వేరగుట ; దూరమగుట; ఎన్నుకొనబడుట; శుభ్రమగుట క్షీణించుట.

**छँटा हुआ** - मु० ధూర్తుడు; చతురుడు; పాషండుడు.

**छँटवाना** - स०क्रि० ఏరించుట; వేరు చేయించుట.

**छँटा** - वि० ధూర్తుడు.

**छँटाना** - स०क्रि० दे० छँटवाना.

**छंद** - पुं० ఛందము; బంధము; కపటము; పద్యము.

**छः** - वि० ఆరు; 6 సంఖ్య.

**छकडा** - पुं० ఎద్దుబండి; ఎడ్లబండి.

**छकडी** - स्त्री० ఆరుగురు బోయిలు మోయు పల్లకి; ఆరు గుఱ్ఱముల బండి; ఆరు వస్తువుల సమూహము.

**छकना** - अ०क्रि० తృప్తినొందుట; మోసపోవుట; భ్రాంతి నొందుట; మత్తులో నుండుట.

**छकाछक** - वि० పూర్తిగా మత్తులోనున్న; సంతృప్తిచెందిన; సంపూర్ణముగా నిండిన.

**छकाना** - स०क्रि० ఇబ్బంది పెట్టుట; భ్రమింపజేయుట; వంచించుట; తృప్తి పరచుట.

**छकीला** - वि० తృప్తినొందిన; మత్తెక్కిన; మోసపోయిన; ఇబ్బంది పడిన.

**छक्का** - पुं० ఆరు వస్తువుల సమూహము; ఆరు చుక్కల పేక ముక్క; జూదము.

**छक्का छूटना** - मु० అధైర్యపడుట; ఆలోచన తట్టకపోవుట.

**छक्का पंजा** - मु० चालबाजी ; వంచన; మోసము.

**छगडा** - पुं० बकरा ; మేకపోతు.

**छगन** - पुं० ముద్దు బిడ్డ; గారాల బిడ్డ.

**छगली** - स्त्री० बकरी ; మేక.

**छगुनी** - स्त्री० చిటికిన వ్రేలు छँगुनी.

**छछिया** - स्त्री० छाछ ; మజ్జిగ; మజ్జిగ పిడత.

**छछूँदर** - पुं० చుంచెలుక.

**छछूँदर छोडना** - मु० నిప్పు పెట్టుట; గందరగోళము పుట్టించుమాట.

**छछूँदर के सिर में चमेली का तेल** - मु० దున్నకొమ్ముకి అత్తరు.

**छजना** - अ०क्रि० శోభిల్లుట; సరిపడుట; తగుట.

**छज्जा** - पुं० ఇంటిచూరు; ముందుకు చొచ్చుకొచ్చిన ఇంటి పైకప్పు భాగము లేక గోడ అంచు.

**छटकना** -अ०क्रि० చేజారిపోవుట; వశము తప్పుట; దూరదూరముగా తిరుగుట; దుముకుట.

**छटकाना** -स०क्रि० పట్టునుండి బలవంతాన విడిపించుకొనుట; తప్పించుకొనుట; నిర్బంధమునుండి ఒక్క ఊపుతో తప్పించు కొనుట.

**छटपट** - पुं० విలవిల తన్నుకొనుట.

**छटपटाना** - अ०क्रि० బాధలో విలవిలా తన్నుకొనుట.

**छटपटी** - स्त्री० గాబరా; వ్యాకులత.

**छटांक** - स्त्री० ఒకపాతతూకము; అయిదు తులముల తూనిక (రాయి)

**छटा** - स्त्री० ప్రకాశము; తేజస్సు; శోభ.

**छटैल** - वि० జిత్తులమారి.

**छठ** - स्त्री० షష్ఠి తిథి.

**छठा** - वि० ఆరవ.

**छठी** - स्त्री० శిశువు పుట్టిన ఆరవరోజున జరుగు పూజ.

**छठी का दूध याद आना** - मु० గీర అణగారుట; వళ్ళు పొగరు కుదురుట; నానా యాతనల పాలగుట.

**छठीबरही** - स्त्री० सालगिरह ; పుట్టిన రోజు పండుగ

**छड** - स्त्री० ఇనప చువ్వ; వెదురు చువ్వ.

**छडा** - पुं० కాలికడియము वि० ఒంటరిగా నున్న; ఏకాకి

**छडिया** - पुं० ద్వారపాలకుడు.

**छडी** - स्त्री० బెత్తము; చువ్వ.

**छत** - स्त्री० ఇంటికప్పు; पुं० గాయము.

**छतगीर** - पुं० **छतगीरी** - स्त्री० పైకప్పునకు క్రిందకట్టిన వస్త్రము చాందినీ మేలుకట్టు.

**छतना** - पुं० తేనె పట్టు; ఆకులగొడుగు.

**छतनार** - वि० దూరమువరకు గొడుగువలె వ్యాపించి ఉన్న తీగ విస్తృతమైన.

**छतरी** - स्त्री० छाता ; గొడుగు.

**छति** - स्त्री० क्षति ; హాని ; నష్టము.

**छतियाना** - स०क्रि० కౌగిలించుకొనుట; తుపాకి రొమ్ముకి ఆనించుట.

**छत्तीसी** - वि० మోసగత్తె; కులట; వ్యభిచారిణి

**छत्र** - पुं० ఛత్రము; రాజఛత్రము ; రక్షణ; గొడుగు.

**छत्रपति** - पुं० రాజు.

**छत्रभंग** - पुं० అరాజకత; ఆశ్రయహీనత.

**छत्रक** - पुं० గొడుగు; తేనెతుట్టె; కుక్క గొడుగు.

**छद** - पुं० మూత; ఆవరణ; కప్పు.

**छदाम** - पुं० పాతనాణెము; కానీలో నాల్గవ

వంతు.

**छद्म** - पुं० కపటము; నెపము.

**छद्मी** - वि० మారు వేషధారి; మోసగాడు; వంచకుడు;

**छन** - पुं० క్షణము.

**छनक**-क्रि०वि० క్షణకాలములో पुं० క్షణము; చెదురు.

**छनकना** - अ०क्रि० చెదురుట; చుంయి మనుట.

**छनकाना** - स०क्रि० చెడగొట్టుట; చుంయి మనుపించుట.

**छनछनाना** - अ०क्रि० వేడి పెనము మీద నీటి బొట్టు పడుట వలన చుంయ్యి చుంయ్యి మనుట.

**छनछबि** - स्त्री० మెరుపు.

**छनदा** - स्त्री० क्षणदा ; రాత్రి.

**छनना** - अ०क्रि० వస్త్రకాయము పట్టబడుట; మత్తుపదార్థము సేవింపబడుట.

**(गहरी) छनना** - मु० ప్రగాఢమైన మైత్రి గలుగుట; చెవిలో గుసగుస లాడుట; బూర్లెమూకుడునుంచి పక్వ తిను బండారములు వెలువడుట; పోట్లాడుట.

**छन्न** - वि० కప్పబడిన; దాచబడిన.

**छन्ना** - पुं० వస్త్రకాయపు గుడ్డలేక పాత్ర.

**छपछपाना** - स०क्रि० నీటిపై కాళ్ళు చేతులు తపతపకొట్టుట; కొద్దిగా ఈదుట.

**छपना** - अ०क्रि० అచ్చగుట; గురుతిడబడుట.

**छपरखट ; छपरखाट** - स्त्री० దోమతెర కట్టిన మంచము.

**छपरबंद ; छप्पर बंद** - वि० ఇంటి కప్పు నేయు; కప్పువేసుకొని లేకగుడిసె కట్టుకొని నివసించువాడు.

**छपरी** - स्त्री० झोंपडी ; గుడిసె.

**छपाई** - स्त्री० అచ్చు; ముద్రణ.

**छप्पन** - वि० ఏబదియారు; 56 సంఖ్య.

**छप्पय** - पुं० ఆరుపాదములు గల ఒకహిందీ ఛందము లేక పద్యము.

**छप्पर** - पुं० ఇంటికప్పు; చూరు.

**छबडा** - पुं० బుట్ట; తట్ట.

**छबि** - स्त्री० దీప్తి; శోభ.

**छबीला** - वि० సుందరమైన; సొగసైన.

**छब्बीस** -स्त्री० ఇరువదియారు ; 26 సంఖ్య.

**छमक** - स्त्री० స్త్రీల ఒయ్యారము; మిడిసిపాటు.

**छमछम** - पुं० గజ్జలు; అందెలమోత.

**छमाछमाना** - स०क्रि० ఘల్లుఘల్లుమనిపించుట.

**छमा** - स्त्री० क्षमा ; క్షమ.

**छमाछम** - स्त्री० ఘల్లుఘల్లుమనెడి ధ్వని;

నోలి మోత.

**छय** - **पुं॰** **क्षय** ; క్షయము; వినాశము.

**छर छराना** - **अ॰क्रि॰** చరచురలాడుట; చిమచిమలాడుట.

**छरहरा** - **वि॰** పలచని; అందమైన శరీరము గల; చురుకైన స్ఫూర్తిగల.

**छरा** - **पुं॰** త్రాడు; బెత్తము; స్త్రీల చీరముడి; లాగు; పరికిణీ మొదలగువాని బందు.

**छरीदा**-**वि॰** ఒంటరి; సామానులేని ఒంటరి ప్రయాణీకుడు.

**छल** - **पुं॰** దగా; మోసము; కపటము.

**छलकना** -**अ॰क्रि॰** తొణకుట; చిందుట.

**छल कपट** - **पुं॰** మోసము; కపటము.

**छलकाना**-**स॰क्रि॰** తొణికించుట; చిందించుట.

**छलछंद** - **पुं॰** దగా; కపటము.

**छलछलाना** - **अ॰ क्रि॰** జలజల నీరు పొర్లుట; కన్నీరొలుకుట.

**छलछाया** - **स्त्री॰** కపటజాలము; మాయా జాలము.

**छलछिंद्र** - **पुं॰दे॰** **छलछंद**.

**छलना** - **स॰क्रि॰** వంచించుట; మోస గించుట; **स्त्री॰** వంచన.

**छलनी** - **स्त्री॰** జల్లెడ.

**छलहाई** -**वि॰ स्त्री॰ चालबाज** ; వంచకురాలు; మోసగత్తె.

**छलहाया** - **वि॰ पुं॰ छली** ; వంచుకుడు దగాకోరు.

**छलाँग** - **स्त्री॰** కుప్పిగంతు.

**छलाई** - **स्त्री॰** పన్నుగడ; దగా.

**छलाना** - **स॰क्रि॰** మోసము చేయించుట.

**छलावा** - **पुं॰** వంచన; గారడి; కొరవి దయ్యము.

**छलिया ; छली** -**वि॰** మోసగాడు; టక్కరి.

**छलौरी** - **स्त्री॰** గోరుచుట్టు.

**छल्ला** - **पुं॰** ఉంగరము; బద్ధ ఉంగరము; గుండ్రని చిన్న వస్తువు.

**छल्लेदार** - **वि॰** ఉంగరములు తిరిగిన జుట్టు గల.

**छवना** - **पुं॰** పక్షిశావకము; దూడ; బిడ్డ.

**छना** - **पुं॰** కాలిమడిమ; దూడ.

**छवाना** - **स॰क्रि॰** ఇల్లు కప్పువేయించుట; ఇల్లు కప్పించుట.

**छवाई** - **स्त्री॰** ఇంటి కప్పువేత; ఇంటి కప్పు వేయుటకు కూలి.

**छनि** - **स्त्री॰** ద్యుతి; కిరణము; తళుకు; శోభ

**छवैया** - **पुं॰** ఇంటి కప్పువేయువాడు.

**छहर** - **स्त्री॰** పరివ్యాప్తి; చెల్లాచెదరు; చిందర వందర.

**छहरना** - **अ॰क्रि॰** చిందరవందరగుట; చెల్లా

చెదరుట.

**छहराना** - स०क्रि० చెల్లాచెదరు చేయుట.

**छहरीला** - वि० వ్యాపింపజేయువాడు; వ్యాపించునది; చురుకైన; అందముగా పొడవుగానున్న.

**छाँगना** - स०क्रि० కొమ్మలు ఛేదించుట.

**छाँगुर** - वि० ఆరువేళ్ళు గలవాడు.

**छाँट** - स्त्री० కత్తిరింపు; కత్తిరించి వేరు చేయుట; వాంతి; ఏరుడు; కత్తిరించి పనికిరానిదానిని దూరముగా నుంచుట.

**छाँटना** - स०क्रि० కత్తిరించివేరు పరచుట; ఏరి ఎన్నుకొనుట; శుభ్రపరచుట.

**छाँडना** - स०क्रि० छोडना ; విడిచి పెట్టుట; త్యజించుట.

**छाँद** - पुं० नोई ; పాలు పితుకునప్పుడు ఆవు వెనక కాళ్ళకు వేయు బంధము.

**छाँदना** - स०क्रि० బిగించి కట్టుట; గట్టిగా బంధించుట.

**छाँदस** - वि० ఛందస్సుకు సంబంధించిన; వేద సంబంధమైన पुं० చాందసుడు; బ్రాహ్మణుడు; ఛాందస బ్రాహ్మణుడు.

**छाँह** - स्त्री० छाया ; ఛాయ; ప్రతిబింబము; నీడ; ఆశ్రయము.

**छाँहगीर** - पुं० దర్పణము; రాజచక్రము; గొడుగు.

**छाक** - स्त्री० సంతుష్టి; మత్తు; పొలము కాపరికి పంపబడు మధ్యాహ్న భోజనము; చల్ది.

**छाकना** - अ० क्रि० మత్తుమైకములో నుండుట; తృప్తినొందుట; తల దిమ్మెక్కుట; కలతజెందుట.

**छाग** - पुं० बकरा ; మేక.

**छागल** - पुं० बकरा ; మేకతోలుతో చేయబడిన వస్తువు; स्त्री० కాలిపట్టా - ఒక విధముగు కాలినగ.

**छाछ** - स्त्री० మజ్జిగ.

**छाज** - पुं० చేట; ఇంటికప్పు.

**छाजन** - पुं० ఆచ్ఛాదనము; ఇంటికప్పు; నేత.

**छाजना** - अ०क्रि० నప్పుట; నచ్చుట; శోభిల్లుట.

**छाता** - पुं० గొడుగు; తేనెతుట్టె; వక్షస్థలపు కొలత.

**छाती** - स्त्री० सीना ; వక్షస్థలము; ఛాతి; రొమ్ము.

**छातीपर मूँग दलना** - मु०ఎక్కువ కష్టము కలిగించుట; పీడించుట.

**छातीपर साँप लोटना** - मु० భరింపరాని దుఃఖము వలన హృదయము కంపించిపోవుట.

**छात्र** - पुं० శిష్యుడు; విద్యార్థి.

**छात्रवृत्ति** - स्त्री० స్కాలర్‌షిప్పు; విద్యార్థి ఉపకారవేతనము.

**छात्रालय ; छात्रावास** - पुं० విద్యార్థుల వసతి గృహము.

**छान** - स्त्री० छादन ; ఇంటికప్పు.

**छानना** - स०क्रि० వస్త్రగాయము పట్టుట; జల్లించుట; వెడబోయుట; అన్వేషించుట; ఏరుట; ఎన్నుకొనుట; మత్తు పదార్థములు సేవించుట; పరిశీలించుట.

**छान-बीन** - स्त्री० వడపోత; విచారణ; తనిఖీ; పరిశీలన.

**छानबे** - वि० తొంబదియారు; 96 సంఖ్య.

**छाना** - अ०क्रि० వ్యాపించుట; వసించుట; स०क्रि० ఇల్లు కప్పుట పరచుట; వ్యాపింపజేయుట.

**छाप** - स्त्री० ప్రభావము; ముద్ర; గురుతు.

**छापना** -पुं० ముద్రించుట; అచ్చువేయుట; గురుతు పెట్టుట.

**छापा** - पुं० ముద్ర; మూస; అచ్చు.

**छापाखाना** - पुं० ముద్రణాలయము.

**छापामार** - वि० అకస్మాత్తుగా దాడిచేయువాడు.

**छाया** - स्त्री० నీడ; ఛాయ; అంధకారము; ఆశ్రమము.

**छायाग्रह** - पुं० आईना ; అద్దము.

**छायाचित्र ; छायापट** - पुं० ఫోటో.

**छायादार** - वि० నీడగల; నీడనిచ్చెడి.

**छायापथ** - पुं० ఆకాశగంగ ; నక్షత్ర సమూహము లేక గ్రహ సమూహము.

**छायवाद** - पुं० హిందీ సాహిత్య క్షేత్రమున ఒకప్పుడు ప్రచురితమైన, విశిష్టమైన సాహిత్య లేక కవిత్వ ధోరణి.

**छार** - पुं० క్షారము; ఉప్పు; ధూళి; బూడిద.

**छाल** - स्त्री० చర్మము; వల్కలము; బెరడు, తొక్క.

**छालना** - स०क्रि० ప్రక్షాళించుట; జల్లించుట.

**छाला** - पुं० బొబ్బ; పైతోలు; చర్మము.

**छालिया ; छाली** - स्त्री० सुपारी ; పోకకాయ; పోకచెక్క.

**छावनी** - स्त्री० సేనాశిబిరము; ఇంటికప్పు; కప్పు.

**छिगुनी** - स्त्री० చిటికెన వ్రేలు.

**छिछडा** - पुं० శిశ్నాగ్ర చర్మము లేక తోలు; పనికిరాని మాంసపు ముక్క.

**छिछला** - वि० లోతులేని ( నీరు); లోతు; బుద్ధిలేని.

**छिछोरपन ; छिछोरापन** - पुं० నీచత్వము; గాంభీర్యములేమి; వెకిలితనము.

**छिछोरा** -वि० ओछा ; నీచస్వభావముగల;

గాంభీర్యములేని స్వభావముగల; వెకిలి.

**छिजना** - अ॰क्रि॰ క్షీణించుట; తగ్గుట.

**छिटकना** - अ॰क्रि॰ పరివ్యాప్తినొందుట; వెదజల్లుట.

**छिटकना** - स॰क्रि॰ వెదజల్లుట.

**छिडकना** - स॰क्रि॰ వెదజల్లుట; నీరు జల్లుట.

**छिडकाना** - स्त्री॰ **छिडकवाना** - स॰क्रि॰ వెదజల్లించుట.

**छिडकाई** - स्त्री॰ **छिडकाव** - पुं॰ చల్లు (నీరు) ; తడుపు.

**छिडना** - अ॰क्रि॰ ఘర్షణ ప్రారంభముగుట; పోట్లాట ప్రారంభముగుట.

**छितराना** - स॰क्रि॰ చెల్లాచెదరు చేయుట; చల్లుట; अ॰क्रि॰ చిందర వందరగా పడి యుండుట.

**छिदना** - अ॰क्रि॰ తూట్లుపడుట; బెజ్జము పడుట; గాయపడుట.

**छिदाना** - स॰क्रि॰ రంధ్రము వేయించుట; గుచ్చింపజేయుట.

**छिद्र** - पुं॰ छेद ; రంధ్రము; బెజ్జము.

**छिन** - पुं॰ क्षण ; క్షణము.

**छिनकना**-अ॰क्रि॰ చీదిముక్కు శుభ్రపరచు కొనుట.

**छिनरा** -वि॰ వ్యభిచారి; లంపటుడు.

**छिनार ; छिनाल** - वि॰ स्त्री॰ వ్యభిచారిణి.

**छिनाला** - पुं॰ వ్యభిచారము; సంభోగము.

**छिन्न** - वि॰ తెగిన; తెగివేరుపడిన; ఖండింప బడిన.

**छिन्न-भिन्न** - वि॰ చిందరవందరైన; ముక్కముక్కలైన; నష్టభ్రష్టమైన.

**छिपकली** - स्त्री॰ బల్లి.

**छिपना** - अ॰क्रि॰ దాగుట; అస్తమించుట.

**छिपाना** - स॰क्रि॰ దాచుట; మూయుట.

**छिपारुस्तम** - पुं॰ విశిష్టమైన పాండిత్యము కలిగియు బహు సామాన్యునిగా కనిపించు వ్యక్తి; సద్గుణ సంపన్నునిగా కనిపించు దుర్మార్గుడు.

**छिपाव** - पुं॰ దాపరికము; గోపనము; చాటు.

**छिया** - स्त्री॰ అసహ్యాకరవస్తువు; ఏవగింపు కలిగించు వస్తువు.

**छिया छरद करना** - पुं॰ ఛీఛీ అనుట; ఘృణాస్పదముగా తలచుట; అసహ్యించుట.

**छिलका** - पुं॰ పై తోలు లేక తొక్క; దొప్ప.

**छिलना** - अ॰क्रि॰ గీరుకొనుట; తొక్క వేరగుట; గీసుకొనుట (చర్మము)

**छिलाई** - स्त्री॰ డోకుడు; చెక్కు లేక తోలు తీత; డోకుడు కూలి.

**छिलौरी** - स्त्री॰ छाला ; బొబ్బ.

**छींक** - स्त्री॰ తుమ్ము.

**छींकना** - अ०क्रि० తుమ్ముట.

**छींका**-पुं० सिकहर ; ఉట్టి; పశువుల ముట్టికి వేయు చిక్కము.

**छींट** - स्त्री० सीकर ; నీటి బిందువు; తుంపర; అద్దకపు బట్ట.

**छींटना** - स०क्रि० వెదజల్లుట; వ్యాపింప జేయుట.

**छींटा** - पुं० జలకణము; తుంపర; వ్యంగ్య కథనము.

**छींटे कसना** - मुं० వ్యంగ్యముగా మాట్లా డుట.

**छीछडा** - पुं० పనికిమాలిన; పనికిరాని; చిన్నమాంసపు తునక.

**छीछालेदर** - स्त्री० దర్గతి; దుర్దశ.

**छीजना** - अ०क्रि० క్షీణించుట; తగ్గుట; చెడిపోవుట; నష్టము కలుగుట.

**छीदा** - वि० అనేక బెజ్జములు గల; పల్చని.

**छीनना** - स०क्रि० బలవంతముగా లాక్కొ నుట; తీసుకొనుట; నరికివేరు పరచుట; తిరగలి రాయిని గరుకుగా చేయుట; దంపుట.

**छीना-झपटी** - स्त्री० ఒక వస్తువును ఒండొరులు బలవంతముగా లాక్కొను ప్రయత్నము.

**छीप** - वि० వేగమైన; स्त्री० మచ్చ; ఒక విధ మగు చర్మరోగము.

**छीबर** - स्त्री० పూతీగలు అద్దకము గల గుడ్డ; చీటిగుడ్డ

**छीमी** - स्त्री० బటాణి, కంది వగైరా కాయ; ఆవు చన్ను.

**छीर** - पुं० క్షీరము; పాలు.

**छीलना** - स०क्रि० తోలు తీయుట; చెక్కు తీయుట; డోకుట (గడ్డి)

**छीलर** - पुं० పల్లము; చిన్న గొయ్యి.

**छुआछूत** - स्त्री० అంటరానితనము; అస్పృశ్యత.

**छुआना** - पुं० తాకించుట; ఆనించుట.

**छुईमुई** - स्त्री० అత్తిపత్తి మొక్క; తాకగానే ముడుచుకొని పోవు ఒకమొక్క.

**छुच्छी** - स्त्री० సన్నని గొట్టము; ముక్కు పుడక ; लौंग.

**छुछुंदर** - पुं० **छछूंदर** ; చుంచు; చుంచెలుక.

**छुछुआना** - अ०क्रि० చుంచువలె అటూ - ఇటూ తిరుగుట; సోమరి తిరుగుడు తిరుగుట.

**छुटकारा** - पुं० విడుదల; విముక్తి; శలవు.

**छुटपन** - पुं० చిన్నదనము; బాల్యము.

**छुट्टा** - वि० కట్టుబడని; ఒంటరి; ఏకాకి.

**छुट्टी** - स्त्री० విడుదల; సెలవు.

**छुट्टीपाना** - अ०क्रि० జంజాటమునుండి

బైటపడుట.

**छुडवाना** - स०क्रि० విడుదల చేయించుట; విడిపించుట.

**छुडाई** - स्त्री० విడుదల; ముక్తి.

**छुडाना** - स०क्रि० విడుదల చేయించుట; వేరు చేయుట; వేరు పర్చుట.

**छुत** - स्त्री० క్షుధ; ఆకలి.

**छुतिहा** - वि० మైలపడిన; అంటుపడిన పుం౦చవిటినేల; ఉప్పు; చవుడు.

**छुद्र** - वि० क्षुद्र ; తుచ్ఛమైన.

**छुधा** - स्त्री० क्षुधा ; ఆకలి.

**छुपना** - अ०क्रि० दे० छिपना.

**छुरा** - पुं० కత్తి; పిడికత్తి; మంగలికత్తి.

**छुरी** - स्त्री० చిన్నకత్తి; చాకు.

**छुलाना** - स०क्रि० తాకించుట; ఆనించుట.

**छुहारा** - पुं० खजूर ; కర్జూరపు కాయ.

**छूँछा** - वि० బోలు అయిన; సారహీనమైన; బీద అయిన; రిక్తమగు.

**छूट** - स्त्री० మినహాయింపు; ముక్తి; విడుదల.

**छूटना** - अ०क्रि० వేరగుట; విడిపోవుట; బయల్దేరుట (రైలు మొదలగు)

**छूत** - स्त्री० అంటు; తాకుడు.

**छूना** - स०क्रि० తాకుట; ముట్టుకొనుట.

**छेंकना** - स०क्रि० ముట్టడించుట; అడ్డగించుట.

**छेक** - पुं० రంధ్రము; అడ్డము; పెంపుడు పశువు లేక పిట్ట.

**छेड** - स्त्री० సరసాలాపము; విసుగు.

**छेडखानी ; छेड-छाड** - स्त्री० మోటు సరసము; వేళాకోళము; రెచ్చగొట్టుట.

**छेडना** - स०क्रि० మోటు సరసమాడుట; వెకిలిగా ప్రవర్తించుట; ప్రారంభించుట; రెచ్చగొట్టుట ; రేకెత్తించుట.

**छेद** - पुं० రంధ్రము; కన్నము; గాయము.

**छेदना** - स०क्रि० ఛేదించుట; కోయుట; బెజ్జము చేయుట; గుచ్చుట; గాయపరచుట.

**छेना**-पुं० నీరు తీసివేసిన జున్ను ; स०क्रि०నరుకుట; గొడ్డలితో నరకుట.

**छेनी** - स्त्री० శానము; ఉలి.

**छेरा** - पुं० बकरा ; మేకపోతు.

**छेरी** - स्त्री० बकरी ; మేక.

**छेव** - पुं० గాయము; దెబ్బ; రంధ్రము.

**छेवना** - स्त्री० ताडी ; తాటికల్లు; स०क्रि०కోయుట; ఖండించుట;గురుతు వేయుట.

**छेवर** - पुं० చర్మము; తోలు; తొక్క.

**छैल** - पुं० సొగసుగాడు; పూలరంగడు.

**छैल-छबीला** - पुं० సొగసుగాడు; రసికుడు; విలాసి.

**छैला** - पुं० शौकीन ; షోకిల్లా; సొగసుగాడు.

**छोंकना** - स०क्रि० दे० छौकना.

**छोंडा** - पुं० मथानी ; కవ్వము.

**छोई** - स्त्री० खोई ; చెరకు పిప్పి.

**छोकडा ; छोकरा** - पुं० బాలుడు; అనుభవములేనివాడు.

**छोकडी ; छोकरी** - स्त्री० బాలిక; అనుభవములేనిది.

**छोटा** - वि० చిన్న; తుచ్ఛమైన.

**छोटापन** - पुं० అల్పత్వము; లఘుత్వము; బాల్యము; చిన్నతనము.

**छोटी हाजरी**-स्त्री० భారతదేశములో ఉండు ఐరోపా వాసుల ప్రాతఃకాల భోజనము.

**छोडना**-स०क्रि० విడుచుట; విడిచి పెట్టుట; వెడలుట.

**छोपना** - स० क्रि० पोतना ; పూతవేయుట; అలుకుట.

**छोर** - पुं० కొన; హద్దు; అంచు.

**छोरा** - पुं० लौडा ; బాలుడు; పోరిగాడు.

**छोल** - स्त्री० గంటు.

**छोलदारी** - स्त्री० చిన్నగుడారము లేక డేరా.

**छोलना** - स०क्रि० చీల్చుట.

**छोलनी** - स्त्री० చీల్చుసాధనము; అట్లకాడ; డోకుడు పార.

**छोह** - पुं० జాలి; మమకారము; దయ; ప్రేమ.

**छोहारा** - पुं० दे० छुहारा.

**छौंक** - स्त्री० बघार ; తిరగమూత; తాలింపు.

**छौंकना** - स०क्रि० बघारना ; తాలింపు వేయుట; తిరగమూత వేయుట.

**छौंडा** -पुं० खत्ता ; ధాన్యపు పాతర; బాలుడు.

**छौना** - पुं० మృగశావకము; లేడి పిల్ల; దూడ.

**छौलदारी** - स्त्री० दे० छोलदारी.

**छौवाना** - पुं० స్పృశించుట; ముట్టుకొనుట.

## ज

**जंग** - पुं० యుద్ధము; సమరము; త్రుప్పు.

**जंग-आलूदा** - वि० తుప్పుపట్టిన.

**जंगम** - वि० చరము; చలనముగల; జీవము గల पुं० తెలుగునాట ఒక జాతి శైవుడు.

**जंगल** - पुं० అడవి; వనము; బంజరు ప్రదేశము.

**जंगल में मंगल** - पुं० నిర్జన ప్రదేశములో హడావిడి; కోలాహలము.

**जंगला** - पुं० खिडकी ; కిటికి.

**जंगली** - वि० అడవి సంబంధమైన; అడవికి సంబంధించిన.

**जंगार** - पुं० तूतिया ; మైలతుత్తము.

**जंगी** - वि० యుద్ధ సంబంధమైన.

**जंगी जहाज** - पुं० యుద్ధనౌక.

**जंघा** - स्त्री० తొడ.

**जाल** - पुं० జంజాటము; చిక్కుస్థితి.

**चना** - अ०क्रि० అనిపించుట; ప్రతీత మగుట.

**जबील** - स्त्री० सोंठ ; శొంఠి.

**जाली** - वि० తగాదాలమారి; పోట్లాట గొడ్డు.

**जीर** - स्त्री० సంకెలు; గొలుసు; తలుపు గొళ్ళెము.

**तर** - पुं० యంత్రము; తాయత్తు.

**तर-मंतर**-पुं० యజ్ఞశాల; వేధశాల; మంత్ర విద్య; తాయత్తు; గారడీ.

**तु** - पुं० జంతువు.

**द** - पुं० పారశీకుల పవిత్రగ్రంథము; పారశీకుల మూలభాష.

**बाल** - पुं० బురద; అడుసు; పాచి; ఒక సుగంధమైన పుష్పము.

**बीर ; जंबीरी नींबू** - पुं० గజనిమ్మకాయ.

**बु** - पुं० నేరేడు.

**बुक** - पुं० పెద్దనేరేడు; నక్క.

**बू** - पुं० जामुन ; నేరేడు.

**भ** - पुं० దానవుడు; ఒకదైత్యుడు; గజనిమ్మ.

**भाई** - स्त्री० ఆవులింత.

**भाना** - अ०क्रि० ఆవులించుట.

**ई** - स्त्री० అంకురము; (బ్రాహ్మణునికి దానముగా నిచ్చు అంకురించిన యవ ధాన్యము.

**जईफ** - वि० ముసలి; వృద్ధాప్యము గల; బలహీనముగు.

**जईफी** - स्त्री० వృద్ధాప్యము; ముసలితనము.

**जक** - पुं० యక్షుడు; स्त्री० మొండిపట్టు; పరాజయము; మొండిపట్టుదల; పిసినారి.

**जकडना** - स०क्रि० **कसना** ; బిగించుట. अ०क्रि० అంగములు కొంకర్లు పోవుట.

**जकन** - पुं० **ठोडी** ; గడ్డము.

**जकना** - अ०क्रि० తత్తరపడుట; దిగ్భ్రమ జెందుట.

**जकर** - पुं० పురుషేంద్రియము; లింగము.

**जकात** - स्त्री० సుంకము; పన్ను; దానము.

**जकावत** - स्त्री० తీక్షణబుద్ధి; బుద్ధిమత్తు; తెలివి.

**जकी** - वि० బుద్ధిమంతుడు; తెలివైన.

**जखम** - पुं० దెబ్బ; గాయము; ఆఘాతము.

**जखमी** - वि० గాయపడిన.

**जखीम** - वि० మోటు; స్థూలమైన; బరువైన; లావైన.

**जखीरा** - पुं० కుప్ప; ప్రోగు; ఖజానా.

**जख्म** - पुं० గాయము; ఆఘాతము.

**जख्मी** - वि० దెబ్బతినిన; గాయపడిన.

**जग** - पुं० **जगत** ; జగత్తు; విశ్వము.

**जगत** - स्त्री० నూతి పళ్ళెము.

**जगतसेठ** - पुं० धन्नासेठ ; జగత్ప్రసిద్ధమైన శెట్టి; ధనవంతుడు.

**जगती** - स्त्री० ప్రపంచము; పృథ్వి.

**जगना** - अ०क्रि० మేల్కొనుట; ప్రజ్వరిల్లుట; జాగ్రత్తపడుట.

**जगमग ; जगमगा** - वि० తళతళలాడు; ప్రకాశించు.

**जगमगाना** - अ०क्रि० ప్రకాశించుట; తళతళలాడుట; మెరయుట.

**जगमगाहट** - स्त्री० దీప్తి; తళుకు; నిగనిగ.

**जगह** - स्त्री० చోటు; స్థానము; పదవి.

**जगह जगह** - क्रि०वि० పలుచోట్ల; ప్రతిచోట.

**जगात** - पुं० దానము; సుంకము.

**जगाती** - पुं० పన్ను వసూలుచేయువాడు; పన్ను వసూలు చేయుపని.

**जगाना** - स०क्रि० మేల్కొనుట; ప్రజ్వలింపజేయుట.

**जगीर** - स्त्री० दे० जागीर.

**जघन** - पुं० మొల; తొడ; నితంబము.

**जघचपला** - स्त्री० కామిని; వ్యభిచారిణి.

**जघन्य** - वि० అసహ్యమైన; నికృష్టమైన; నీచమైన.

**जचगी** - स्त्री० ప్రసవము.

**जच्चा** - स्त्री० బాలింతరాలు.

**जच्चाखाना** - पु० सौरी ; పురిటిల్లు; పురిటిగది.

**जच्चागिरी** - स्त्री० सोहर ; పురిటిపాట.

**जज** - पुं० న్యాయాధీశుడు; జడ్జి.

**जजमान** - पुं०दे० यजमान.

**जजा** - स्त्री० ప్రతిశోధము; ప్రతీకారము; బదులు.

**जजिया** - पुं० దండన; మహమ్మదీయ శాసన కాలమున అన్య మతస్థుల మీద విధింపబడిన పన్ను.

**जजीरा** - पुं० द्वीप ; ద్వీపము.

**जज्ब** - पुं० శోషణ; పీల్చుట; ఆకర్షణ.

**जज्बा**-पुं० ఆవేశము; ఉద్వేగము; ఉద్గారము.

**जज्बात** - पुं० ఆవేశపూరిత మాటలు.

**जटना**-स०क्रि० మోసగించుట; మోసగించి ధనము గుంజుట; పొదుగుట.

**जटल** - पुं० నిరర్థకవాగుడు; బడాయి; ప్రలాపము.

**जटा** - स्त्री० ఊడ; జడ.

**जटाजूट** - पुं० పొడుగాటి జడలు గలవాడు; శివుడు.

**जटाधारी** - पुं० శివుడు; కోడిపుంజు జూలు.

**जटिल** - वि० కఠినమైన; దురూహమైన पुं० జటాధారి; సన్యాసి.

**जठ़र** - पुं० కడుపు वि० జటిలమైన; ముసలి

యైన.

**जड** - पुं० జడపదార్థము **वि०** చైతన్యములేని; జీవములేని; చెవిటి; మూగ; మూర్ఖుడు.

**जडता** - स्त्री० జడత్వము; మూర్ఖత్వము.

**जडना** - स०क्रि० చెక్కుట; పొదుగుట (రత్నములు మొ॥) దిగగొట్టుట; చాడీలు చెప్పుట.

**जडाऊ** - वि० రత్నములు; మణులు మొ॥ పొదిగిన.

**जडाव** - पुं० నగిషీపని; రత్నములు మొదలగు పొదుగు పని.

**जडावर** - पुं० చలికాలమున ధరించు ఉన్ని వస్త్రములు ; వెచ్చదనము కలుగజేయు వస్త్రములు.

**जडिया** - पुं० రత్నములు మొదలగు పొదుగు వాడు; నగిషీ చెక్కువాడు.

**जडी** - स्त्री० बूटी ; మూలిక.

**जडैया** - स्त्री० जूडी ; చలిజ్వరము.

**जतन** - पुं० यत्न ; యత్నము.

**जतलाना ; जताना** - स०क्रि० చెప్పుట; తెలియజేయుట; హెచ్చరిక జేయుట.

**जति ; जती** - पुं० సన్యాసి.

**जत्था** - पुं० జట్టు; సముదాయము.

**जथा** - क्रि०वि० दे० थथा. पुं० జట్టు; సముదాయము; **स्त्री०** పెట్టుబడి ధనము; మూలధనము.

**जद** - पुं० తండ్రి తండ్రి; పితామహుడు, తాత.

**जद** - स्त्री० దెబ్బ; ఆఘాతము; లక్ష్యము; నష్టము.

**जदल** - पुं० యుద్ధము.

**जद्दा** - स्त्री० నాయనమ్మ; పితామహి.

**जद्दी** - वि० పితృసంబంధమైన; తండ్రి - తాతలకు సంబంధించిన.

**जन** - पुं० జనుడు; వ్యక్తి; మానవుడు; సేవకుడు.

**जन** - स्त्री० స్త్రీ; భార్య.

**जनक** - पुं० తండ్రి.

**जनखा** - पुं० हिजडा ; నపుంసకుడు.

**जनता** - स्त्री० ప్రజలు.

**जनना** - स०क्रि० ప్రసవించుట; పుట్టించుట; కనుట.

**जनपद** - पुं० జనపదము.

**जनप्रवाद** - पुं० వదంతి.

**जनमना** - अ०क्रि० పుట్టుట.

**जनमुरीद** - वि० భార్యాలోలుడు; భార్యా భక్తుడు.

**जनमुरीदी** - स्त्री० భార్యాలోలత్వము.

**जनरव** - पुं० పుకారు; అపవాదు.

**जनवास ; जनवासा** - पुं० పెళ్ళివారి విడిది ఇల్లు.

**जनसृति** - स्त्री० పుకారు; కింవదంతి.

**जनाई** - स्त्री० మంత్రసాని; మంత్రసానికిచ్చు మజూరి.

**जनाजा** - पुं० పాడె; శవము; శవపేటిక.

**जनानखाना** - पुं० అంతఃపురము; రాణి వాసము.

**जनाना**-स०क्रि० చెప్పుట; తెలియజేయుట; ప్రసవించుట; ప్రసవింప జేయుట.

**जनाना** - पुं० స్త్రీలకు సంబంధించిన ఆడంగి; నపుంసకుడు; దుర్బలుడు; పిరికిపంద.

**जनानापन** - पुं० ఆడంగిరేకిదనము.

**जनाब** - पुं० మహానుభావా, మహాశయా, అయ్యా, పూజ్యవ్యక్తిగృహద్వారము లేక గడప.

**जनि** - अव्य० नहीं ; లేదు; కాదు; पुं० జన్మ; स्त्री० స్త్రీ; భార్య ; తల్లి.

**जनित** - वि० పుట్టిన.

**जनी** - स्त्री० స్త్రీ; దాసి.

**जनु** - क्रि०वि० मानों ; వలె; అనునట్లు.

**जनून** - पुं० पागलपन ; పిచ్చి ; పిచ్చితనము.

**जनूनी** - पुं० पागल ; పిచ్చివాడు.

**जनूब** - पुं० దక్షిణదిక్కు.

**जनूबी** - वि० దక్షిణమునకు సంబంధించిన.

**जनेऊ** - पुं० యజ్ఞోపవీతము; జందెము.

**जनेत** -स्त्री० बरात ; వరపక్షపువారి యాత్ర.

**जन्नत** - स्त्री० बहिश्त ; స్వర్గము.

**जन्नती** - वि० పుణ్యాత్ముడు; స్వర్గవాసి.

**जन्मकुंडली** - स्त्री० జాతకచక్రము; జాతకము.

**जन्मपत्री** - स्त्री० दे० जन्मकुंडली.

**जन्य** - वि० జన్మించిన; జన్మసంబంధమైన. पुं० సామాన్యప్రజ; అపవాదు ; పుకారు; వార్త; యుద్ధము; తండ్రి; పుత్రుడు; విపణివీధి; తోడపెళ్ళికొడుకు.

**जन्या** - स्त्री० తోటిపెళ్ళికూతురు; పెళ్ళికుమార్తె చెల్లెలు.

**जपना** - स०क्रि० జపించుట.

**जपनी**-स्त्री० జపమాల; గోముఖి; జపమాల ఉంచు చిన్న సంచి.

**जफर** - पुं० యంత్రములు; తాయత్తుల తయారు చేయువాడు.

**जफर** - पुं० విజయము; లాభము.

**जफा** - स्त्री० కాఠిన్యము; అత్యాచారము సంకటము; అభ్యంతరము.

**जफा-कश** -वि० కష్టములు సహించువాడు

**जफीरी ; जफील** - स्त्री० ఈల శబ్దము ఈలవేయు గొట్టము.

**जब** - क्रि०वि० ఎప్పుడైతే.

**जब कभी** - क्रि०वि० ఎప్పుడైనా.

**जब-तब** - क्रिं॰वि॰ అప్పుడప్పుడు ; कभी-कभी.

**जबडा** - पुं॰ कल्ला ; దవుడ; అంకురము.

**जबर** - वि॰ ధృఢమైన; ప్రబలమైన; బలవంతుడు.

**जबरदस्त** - वि॰ ప్రచండమైన; ప్రబలుడు.

**जबरदस्ती** - स्त्री॰ ప్రాబల్యము; బలాత్కారము; అన్యాయము; బలవంతము.

**जबरन** - क्रिं॰वि॰ బలాత్కారముగా.

**जबल** - पुं॰ పర్వతము; కొండ.

**जबरा** - वि॰ బలవంతుడు; కంచరగాడిద.

**जबाँ ; जबान** - स्त्री॰ నాలుక; భాష; మాట.

**जबान-दराज** - वि॰ దురుసుగా మాట్లాడు.

**जबान-बन्दी**-स्त्री॰ లిపి బద్ధమైన వక్తవ్యము.

**जबानी** - वि॰ నోటితో చెప్పిన; మౌఖికము.

**जबीं** - स्त्री॰ నుదురు; మస్తకము.

**जब्त** - पुं॰ ప్రభుత్వము ద్వారా ఆస్తిని స్వాధీనపరచుకొనిన జప్తు.

**जब्ती** - स्त्री॰ జప్తు అగుట.

**जब्बार**-वि॰ జబరదస్తీ చేయువాడు; బలాత్కరించువాడు; पुं॰ భగవంతుని ఒక పేరు.

**जब्र** - पुं॰ బలప్రయోగము; జబరదస్తీ; బలాత్కారము.

**जब्रन** - क्रिं॰वि॰ బలవంతముగా; బల ప్రయోగము ద్వారా.

**जमजम** - पुं॰ మహమ్మదీయుల తీర్థస్థానమైన కాబా చెంతనున్న ప్రసిద్ధమైన బావి.

**जमजमी** - स्त्री॰ పవిత్ర జమజమ బావికి చెందిన పవిత్రమైన జలము నింపు పాత్ర.

**जमई** - वि॰ సమీకరించబడినది; జమ అయినది.

**जमघट** - पुं॰ గొప్ప జనసమూహము.

**जमजमा** - पुं॰ గానసభ; పాటకచ్చేరి.

**जमना** - अ॰क्रि॰ పేరుకొనుట; ఘనీభవించుట; తోడుకొనుట ; రక్తి కట్టుట.

**जमनौता** - पुं॰ జామినుగా ఉన్నందుకు జామీనుదారునికిచ్చు ప్రతిఫలసొమ్ము.

**जमहूर** - पुं॰ జనసమూహము; లోక సమూహము.

**जमहूरी**-वि॰ ప్రజా సమూహ సంబంధమైన; ప్రజాస్వామ్యమునకు సంబంధించిన.

**जमा** - स्त्री॰ కూడబెట్టిన ధనము - పద్దు; పెట్టుబడి वि॰ ఒకచోట కూడిన; పద్దులో జమకట్టిన.

**जमाई** - पुं॰ జామాత; అల్లుడు.

**जमात** - स्त्री॰ జన సమూహము; తరగతి; వర్గము.

**जमानत** - स्त्री॰ పూచీకత్తు; జామీను.

**जमानत-दार** - पुं॰ పూచీఇచ్చువాడు; జామీనుదారుడు.

**जमाना** - पुं० సమయము; కాలము; యుగము; జగత్తు. **स०क्रि०** తోడు పెట్టుట; గట్టిగా నెలకొల్పుట; స్థాపించుట; గడ్డకట్టించుట; కూడబెట్టుట.

**जमा-बन्दी** - स्त्री० రైతుల పన్ను వివరణ వ్రాసి ఉన్న కరణంగారి పద్దు పట్టి.

**जमाना-साज** - वि० లౌక్యుడు.

**जमाल** - पुं० సౌందర్యము; బహుసుందరమైన రూపము.

**जमामार** - वि० ఇతరుల సొత్తును అపహరించువాడు.

**जमाली** - वि० బహు అందమైనవాడు.

**जमाव** - पुं० ; **जमावट** - स्त्री० తోడు కొనుట (పెరుగు)

**जमावडा** - पुं० జనసమూహము; సమావేశము.

**जमीकंद** - पुं० सूरन ; కంద లేక కందగడ్డ - ఒక దుంప కూర.

**जमींदार** - पुं० భూస్వామి.

**जमीन** - स्त्री० భూమి; నేల.

**जमीनी** - वि० భూసంబంధమైన.

**जमीमा** - पुं० పరిశిష్టపత్రము; అనుబంధ పత్రము.

**जमीर** - स्त्री० మనస్సు; వివేకము.

**जमील** - वि० ఎక్కువ అందమైన; బహు సుందరమైన.

**जमैयत** - स्त्री० మనశ్శాంతి; సంతోషము; సైన్యము.

**जम्हाई** - स्त्री० ఆవులింత.

**जम्हाना** - अ०क्रि० ఆవులించుట.

**जम्हूरियत** - स्त्री० ప్రజాస్వామ్యము.

**जर** - पुं० వార్ధక్యము; వృద్ధాప్యము; జ్వరము; కర్షణ.

**जर** - पुं० బంగారము; సంపద.

**जरखेज** - वि० ఉర్వరమైన; సారవంతమైన.

**जरगर** - पुं० सुनार ; కంసాలి.

**जरगा** - पुं० గుంపు; జనసమూహము.

**जरठ** - वि० కర్కశమైన; కఠోరమైన; पुं० ముసలితనము; పురాతనమైన.

**जरतार** - पुं० జరీ.

**जरद** - वि० पीला ; పసుపుపచ్చని.

**जरदा** - पुं० ఒకవిధమగు బియ్యముతో తయారైన వ్యంజనము; తాంబూలముతో సేవించు పొగాకు; పసుపు పచ్చని గుర్రము.

**जरदार** - वि० अमरी ; ధనవంతుడు; సంపన్నుడు.

**जरदी** - स्त्री० जर्दी ; పసుపు పచ్చదనము.

**जरदोज** - वि० జరీపని చేయబడిన; पुं० జరీ పని చేయువాడు.

**जरदोजी** - स्त्री० జరీపని.

**जरना** - अ०क्रि० दे० जलना.

**जरपरस्त** - वि० ధనోపాసకుడు; పిసినిగొట్టు.

**जरब** - स्त्री० దెబ్బ; గాయము.

**जरबीला**-वि०चमकीला; తళుకు బెళుకు గల; సుందరమైన.

**जरर** - ఆఘాతము; దెబ్బ; నష్టము.

**जरा** - स्त्री० వార్ధక్యము; ముసలితనము.

**जरा** - वि० కొంచెము; కొద్ది; తక్కువ.

**जराअत** - स्त्री० వ్యవసాయము; కృషి; దున్నినాటు వేసిన చేను.

**जराफत** - स्त्री० పరిహాసము; వేళాకోళము; మనోరంజనము.

**जरायम** - पुं०(जुर्म का बहु०) ; పలు రకముల అపరాధములు.

**जरायम-पेशा** - पुं० దొంగతనము; దోపిడీ మొదలగు దుండగములు వృత్తిగా చేస్తూ జీవించువాడు.

**जरिया** - पुं० సంబంధము; సాధనము; ద్వారా; కారణము.अव्य०ద్వారా; గుండా.

**जरिदा** - वि० ఒంటరి; ఏకాకి.

**जरीब** - स्त्री० భూమి, పొలము మొదలగు వానిని కొలుచుగొలుసు.

**जरूर** - क्रि०वि० తప్పకుండా; తప్పక; నిస్సందేహముగా.

**जरूरत** - स्त्री० ఆవశ్యకత; ప్రయోజనము.

**जरूरी** - वि० తప్పనిసరియైన; అత్యవసరమైన.

**जरे-असल** - पुं० అసలు; మూలధనము.

**जरे-तावान**-पुं० నష్టపరిహార నిమిత్తమిచ్చు ధనము.

**जरे-सफेद** - पुं० चाँदी ; వెండి.

**जरे-सुर्ख** - पुं० सोना ; బంగారము.

**जर्क-बर्क** - वि० चमकीला ; మెరయు; తళుకు బెళుకుగల.

**जर्जर** - वि० జీర్ణమైన; జీర్ణించిన; చినిగిన.

**जर्दर** - वि० पीला ; పసుపు పచ్చని.

**जर्दी** - स्त्री० పసుపు పచ్చదనము.

**जर्फ** - पुं० గంగాళము; పాత్ర; సామర్థ్యము.

**जर्रा** - पुं० అణువు.

**जर्राही** - स्त्री०శస్త్ర చికిత్స वि० శస్త్రచికిత్సా సంబంధమైన.

**जर्री** - वि० బంగారపు.

**जल** - पुं० నీరు; జలము.

**जलगर्द** - पुं० నీటిపాము.

**जलचर** - पुं० జలచరము; జలచరములు.

**जलज** - पुं० కమలము; చేప; శంఖము; ముత్యము; నత్తగుల్ల.

**जलजला** - पुं० భూకంపము.

**जलद** - पुं० మేఘము.

**जलदस्यु** - पुं० నీటిదొంగ ; ఓడ, పడవ మొదలగు వానిలోని వస్తువులను అపహరించు దొంగ.

**जलधर**-पुं०**बादल**; మేఘము; సముద్రము.

**जलधि** - पुं० సముద్రము.

**जलन** - स्त्री० మంట ( బాధ) ; ఈర్ష్య.

**जलना** - अ०क्रि० మండుట; మాడుట; వెలుగుట; ఈర్ష్య పడుట.

**जलपना** - अ०क्रि० బడాయికొట్టుట; ప్రేలుట.

**जलपान** - पुं० అల్పాహారము.

**जलपात** - पुं० జలపాతము.

**जलवा** - पुं० दे० **जल्वा**.

**जलप्लावन** - पुं० జలప్రళయము; పెద్ద వరద.

**जलरूह** - पुं० **कमल** ; కమలము; తామర పువ్వు.

**जलसा** - पुं० ఉత్సవము; గోష్ఠి; జాతర.

**जलाना**-स०क्रि० వెలిగించుట; మాడ్చుట; మండించుట; ఈర్ష్యాద్వేషములు కలిగించుట.

**जलापा** - पुं० ఈర్ష్యాగ్ని; కడుపుమంట.

**जलाल** - पुं० తేజస్సు; ప్రతాపము; ప్రకాశము.

**जलावतन** - पुं० ద్వీపాంతర వాస శిక్ష; वि०దేశమునుండి వెడలగొట్టబడిన.

**जलावन** - पुं० **ईंधन** ; వంట చెరకు; కట్టె పుల్లలు.

**जलावर्तन** - पुं० **भँवर** ; నీటిసుడి.

**जलील** - वि० ప్రఖ్యాతమైన; ప్రతిష్ఠ పొందిన; పూజ్యమైన.

**जलील** - वि० నీచుడు; తుచ్ఛుడు; క్షుద్రుడు.

**जलूस ; जुलूस** - पुं० ఊరేగింపు; పట్టాభిషేక ఉత్సవము.

**जलोदर** - पुं० పొట్టకు సంబంధించిన ఒక రోగము.

**जलौका** - स्त्री० **जोंक** ; జలగ.

**जल्द** - क्रि०वि० తక్షణమే; తొందరగా; వేగిరముగా.

**जल्दबाज** - वि० తొందరపడువాడు; వేగిర పడువాడు; హడావిడి చేయువాడు.

**जल्दबाजी** - स्त्री० తొందరపాటు; హడావిడి.

**जल्दी** - स्त्री० త్వరితము; क्रि०वि० వేగముగా; త్వరగా.

**जल्पना** - अ०क्रि० ప్రేలుట; గప్పాలు కొట్టుట.

**जल्लाद** - पुं० హంతకుడు; ఉరితీయువాడు; वि० నిర్మముడు.

**जल्वा** - पुं० మెరుపు; శోభ; తళుకు - బెళుకు; వధువు వరుని ఎదుట మొట్ట మొదటిసారి ముఖము మీది ముసుగు తీసి ఉండుట.

**जल्वा-गाह** - स्त्री० ప్రథమ పర్యాయముగా ముఖవర్చస్సు చూపునిమిత్తం కూర్చుండు చోటు; ప్రపంచము.

**जल्सा** - पुं० ఆనందసమారోహము; ఆనం దోత్సవము.

**जवनिका** - स्त्री० दे० यवनिका.

**जवाँ** - वि० जवान - యువకుడు; వీరుడు; సిపాయి.

**जवाँ-मर्द** - वि० శూర - వీరుడు.

**जवाँ-मर्दी** - स्त्री० వీరత్వము; శూరత్వము.

**जवान** - वि० बहादुर ; వీరుడు; యువకుడు.

**जवानी** - स्त्री० యవ్వనము; యవ్వన తారుణ్యము.

**जवाब** - पुं० జవాబు; ప్రత్యుత్తరము.

**जवाब-तलब** - पुं० ప్రత్యుత్తరము అడుగ బడుట; వివరణ అడుగబడుట.

**जवाब-दावा** - पुं० వాది కోర్టులో దాఖలు చేసిన అర్జికి సమాధానముగా ప్రతివాది దాఖలు చేయు ప్రత్యుత్తరము.

**जवाब-देह** - वि० ఉత్తర దాయిత్వముగల; పూచీకర్త.

**जवाब-देही** - स्त्री० బాధ్యత; జవాబుదారి; ఉత్తరదాయిత్వము.

**जवाबी** - वि० జవాబుకు సంబంధించిన; జవాబు ఇవ్వవలసిన.

**जवार** - पुं० పరిసరప్రాంతము; ఇరుగు - పొరుగు ప్రదేశము.

**जवाल** - पुं० అవనతి; తగ్గుదల; జంజా టము.

**जवास; जवासा** - पुं० బ్రహ్మజముడు మొక్క; వేసవిలో పచ్చటిపూలు పూస్తూ నేవళముగానున్న యీ మొక్క వర్షా కాలము ప్రారంభము కాగానే మాడి నశించిపోవును.

**जवाहर ; जवाहिर** - पुं० రత్నము; మణి.

**जवाहिरात** - पुं० రత్న సమూహము; మణి సమూహము.

**जवैया** - वि० जानेवाला ; వెళ్ళువాడు.

**जशन ; जश्न** - पुं० ఉత్సవము; ఊరేగింపు; ఆనందోత్సవము.

**जस** - पुं० యశము; కీర్తి.

**जसीम** - वि० స్థూలకాయుడు.

**जस्ता** - पुं० తగరము.

**जहतिया**-पुं०సుంకమువసూలు చేయువాడు.

**जहद** - स्त्री० ప్రయత్నము; పరిశ్రమ.

**जहदना** - अ०क्रि० బురద అగుట; అలసి

పోవుట.

**जहदा** - पुं० कीचड ; బురద.

**जहन** - पुं - బుద్ధి; తెలివి.

**जहना** - स०क्रि० త్యజించుట; నాశము చేయుట.

**जहन्नुम** - पुं० दोजख ; నరకము.

**जहमत** - स्त्री० ఆపద; విపత్తు; సంకటము.

**जहर** - पुं० విషము; గరళము.

**जहर उगलना** - मु०కటువుగా మాట్లాడుట.

**जहर का घूँट पीना** - मु० అసహ్య ప్రసంగము విని లేక చూచి కోపమును మనస్సు లోనే అణుచుకొని ఉండుట.

**जहर-कातिल** - वि० ప్రాణఘాతకమైన; విషము.

**जहरदार** - वि० जहरीला; విషభరితమైన.

**जहरबाद** - पुं० ప్రాణఘాతకమైన కురుపు.

**जहर का बुझाया हुआ** - मु० దుండగము చేయువాడు; అరుచికరమైన విషయము.

**जहर-मोहरा**- पुं० సర్పవిషమును హరించు ఒక నల్లని రాయి; విషమును హరించు ఆకు పచ్చరాయి.

**जहरीला** - वि० విషభరితమైన; విషయుక్తము.

**जहल** - पुं०అజ్ఞానము; అమాయకత్వము.

**जहली**-वि०కలహప్రియుడు; వాగుడుకాయ; పెరివాడు.

**जहाँ** - क्रि०वि० ఎక్కడైతే.

**जहाँ** - पुं० जहान ; ప్రపంచము.

**जहाँ-गर्द** - वि० ప్రపంచ పర్యాటకుడు.

**जहाँगीर** - पुं० జహంగీరు చక్రవర్తి; वि० విశ్వవిజేత.

**जहाँ-दीदा** - पुं० ప్రపంచము చూచిన వాడు; అనుభవజ్ఞుడు.

**जहाँ-पनाह** - पुं० యావత్తు విశ్వమునకు ఆశ్రయదాత; చక్రవర్తులను సంబోధించు మాట.

**जहाज** - पुं० ఓడ.

**जहाजी** - वि० ఓడ సంబంధమైన ; पुं० నావికుడు.

**जहाद** - पुं० మహమ్మదీయులు ఇతర ధర్మావలంబులతో చేయు యుద్ధము.

**जहान** - पुं० दुनिया ; ప్రపంచము.

**जहालत** - स्त्री० बेवकूफी ; అజ్ఞానము; మూర్ఖత్వము.

**जहीन** - वि० బుద్ధిమంతుడు; మేధావి.

**जहीर** - पुं० సహాయకుడు; సహాయము చేయువాడు.

**जहूर** - पुं० ప్రకాశము; బహిర్గతమగుట.

**जहे** - अव्य० ధన్యధన్య ; భేష్ భేష్.

**जहे किस्मत** - पुं० గొప్ప అదృష్టము.

**जाफरान** - पुं० కేసరము; కుంకుమపువ్వు.

**जाफरी** - स्त्री० వెదురు బద్దల తెర లేక తడిక; బంతిపువ్వు.

**जाब-जा** - क्रि०वि० అక్కడక్కడ పలుచోట్ల.

**जाबित** -वि० సహనశీలుడు; ఓర్పుగలవాడు.

**जाबिता** - स्त्री०दे० जाब्ता.

**जाबिर** - वि० ప్రచండుడు; కర్కోటకుడు; అత్యాచారి.

**जाबिह** - पुं० కసాయివాడు; కటికవాడు.

**जाब्तगी** -स्त्री०చట్టప్రకారము; నియమానుకూలత.

**जाब्ता** - पुं० నియమము; చట్టము; వ్యవస్థ.

**जाब्ता-दीवानी**-पुं० యావత్తు ప్రజానీకపు ఆర్థిక వ్యవస్థకు సంబంధించిన చట్టము.

**जाब्ता-फौजदारी** - पुं० శిక్షాస్మృతి లేక దండనీతికి సంబంధించిన చట్టము.

**जाम** - पुं० प्याला ; చిన్న గిన్నె; కప్పు.

**जामदानी** - स्त्री०లతలు పువ్వులు అల్లబడిన వస్త్రము.

**जामा** - पुं० కట్టుబట్ట ; దుస్తు.

**जामन** - पुं० తోడు మజ్జిగ.

**जामे से बाहर होना** - मु० క్రోధముతో మండిపడుట.

**ामाता** - पुं० दामाद ; అల్లుడు.

**ामा -मसजिद** - स्त्री० ప్రధాన మసీదు.

**जामिक** - पुं० పహరానిచ్చువాడు; కావలి మనిషి.

**जामिन** - पुं० జామీను ఇచ్చువాడు; పూచీ వహించువాడు.

**जामिनदार** - पुं० दे० जामिन.

**जामिनी** - स्त्री० दे० जामानत.

**जामुन** - पुं० నేరేడు (చెట్టు)

**जाय** - स्त्री० जगह ; చోటు; స్థానము.

**जायका** - पुं० స్వాదము; రుచి.

**जायचा** - पुं० జన్మమండలి; జాతకము.

**जायज** - वि० ఉచితమైన; ఉపయుక్తమైన.

**जायजा** - पुं० పరిశోధన; ఖాతా పుస్తకముల పరిశోధన; బహుమానము; పారితోషికము.

**जायद** - वि० అవసరానికి మించియున్న; అతిరిక్తమైన.

**जायदाद** - स्त्री० ఆస్తి; సంపత్తి.

**जायपत्री** - स्त्री० జాపత్రి.

**जायफल** - पुं० జాజికాయ.

**जाया** - वि० నష్టభ్రష్టమైన; వినష్టమైన.

**जाया** - स्त्री० భార్య.

**जार** - पुं० వ్యభిచారి.

**जारज** - पुं० हरामजादा ; లంజకొడుకు.

**जारन** - पुं० ईंधन ; వంటచెరకు; కట్టెపుల్లలు.

**जारना** - स॰क्रि॰ जलाना ; కాల్చుట; అంటించుట; వెలిగించుట.

**जारिणी** - स्त्री॰ వ్యభిచారిణి.

**जारी** - वि॰ ప్రచారములోనున్న; చలామణిలోవున్న स्त्री॰ వ్యభిచారము.

**जारी** - स्त्री॰ रोना-पीटना ; ఏడుపు; రోదనము.

**जारूब** - पुं॰ झाड़ू ; చీపురు.

**जाल** - पुं॰ వల; ఉచ్చు; మోసము.

**जाल-साज** - वि॰ ఇతరులను మోసపుచ్చుటకై పన్నాగము పన్నువాడు.

**जाल-साजी** - स्त्री॰ కుట్ర; మోసము.

**जाला** - पुं॰ సాలెపురుగుగూడు; పశువుల ముట్టెకు తగిలించు చిక్కము.

**जालिग** - वि॰ దుండగములు చేయువాడు.

**जालिया** - वि॰ जालसाज ; వంచకుడు; దుష్టపన్నాగములు వేయువాడు.

**जाली** - वि॰ కృత్రిమమైన; నిజముకాని.

**जावित्री** - स्त्री॰ జాపత్రి.

**जावेद** - वि॰ శాశ్వితమైన; నికరముగా నుండు.

**जासु** - सर्व॰ దేనియొక్క; ఎవని యొక్క.

**जासूस** - पुं॰ గూఢచారి.

**जाह** - पुं॰ గొప్ప పదవి; ప్రతిష్ఠ; గౌరవము.

**जाह व जलाल** - व॰ పదవి; వైభవము.

**जाहिद** - पुं॰ సజ్జనుడు; సత్ప్రవర్తనగలవాడు.

**जाहिर** - वि॰ బహిరంగమైన; ప్రకటితమైన.

**जाहिरा** - वि॰ బహిరంగముగా.

**जाहिल** - वि॰ అజ్ఞాని; మూర్ఖుడు.

**जाही** - स्त्री॰ మల్లెజాతికి సంబంధించిన ఒకసుగంధిత పుష్పము.

**जाह्नवी** - स्त्री॰ గంగానది.

**जिंदगानी** - स्त्री॰ జీవితము; జీవనము.

**जिंदगी** - स्त्री॰ జీవితము; జీవనకాలము.

**जिंदा** - वि॰ జీవించియున్న.

**जिंदादिल** - वि॰ ఉల్లాసముగా ఉండు; సహృదయుడు; సాహసము గల.

**जिंदादिली** - स्त्री॰ సహృయయత; ఉల్లాసము; సాహసము.

**जिंदाबाद** - पुं॰ శాశ్వతముగా వర్ధిల్లుగాక.

**जिंस** - स्त्री॰ భోజనసామగ్రి; వస్తువు; రకము; సామగ్రి.

**जिक्र** - पुं॰ చర్చ; వర్ణన.

**जिगर** - पुं॰ హృదయము; మనస్సు; సాహసము.

**जगरी** - वि॰ అంతరంగికమైన; గాఢమైన; సన్నిహితమైన.

**जिगीषा** - स्त्री॰ విజయకాంక్ష; విజయము సాధించవలెనని కోరిక.

**जिगीषु** - वि॰ విజయము పొందవలెనని

కాంక్షించువాడు.

**जिच्च** - स्त्री॰ దిక్కుతోచని స్థితి; వివశత దిగ్బంధన.

**जिजिया** - पुं॰ మహమ్మదీయుల శాసన కాలములో పరధర్మావలంబులమీదవేసిన జుట్టు పన్ను.

**जिज्ञासा** - स्त्री॰ ఉత్సుకత; తెలిసికోవలెను కోరిక.

**जिज्ञासु** - वि॰ జిజ్ఞాసగల; తెలుసుకొనవలె ననే కోరికగల.

**जिठानी** - स्त्री॰ दे॰ जेठानी.

**जित** - वि॰ జయింపబడిన; ఓడిపోయిన.

**जितना** - वि॰ ఎంతైతే;

**जितने** - वि॰ ఏదైతే; ఎందరైతే.

**जितैया** - वि॰ జయించువాడు.

**जिताना** - स॰क्रि॰ జయింపజేయుట.

**जिद** - स्त्री॰ హఠము; మొండిపట్టు.

**जिद्दी** - वि॰ మొండిపట్టుదలగలవాడు; మొండి.

**जिधर** - क्रि॰वि॰ ఎక్కడైతే; ఎటువైపైతే.

**जिधर-तिधर** - क्रि॰वि॰ అచ్చటచ్చట; ఇటు అటు.

**जिन** - पुं॰ భూతము; జైనుల తీర్థంకరుడు; బుద్ధుడు; విష్ణువు वि॰सर्व॰ जिस का बहु॰ पुं॰ భూతము; ప్రేతము.

**जिन सवार होना** - पुं॰ అమితమైనకోపము వలన వివేక హీనుడగుట.

**जिना** - पुं॰ వ్యభిచారము.

**जिन्नी** - पुं॰ భూతవైద్యుడు; वि॰ భూత సంబంధమైన.

**जिबह** - पुं॰ గొంతుకోసి ప్రాణము తీయుట.

**जिमि** - क्रि॰वि॰ ఎటులైతే; ఏ ప్రకారమైతే.

**जिम्मा** - पुं॰ ఉత్తరదాయిత్వము; బాధ్యత; జవాబుదారి.

**जिम्मी** - पुं॰ మహమ్మదీయ శాసన శరణు జొచ్చి; జిజియా అనగా జుట్టు పన్ను ఇచ్చుకుంటూవున్న పరధర్మావలంబులు

**जिम्मेदार ; जिम्मेवार** - वि॰ జవాబుదారీ గల; బాధ్యతగల.

**जिय** - पुं॰ మనస్సు.

**जियन** - पुं॰ బ్రతుకు; బ్రతుకుతెరువు.

**जियाना** - स॰क्रि॰ బ్రతికించుట; పోషించుట.

**जियाफत** - स्त्री॰ ఆతిథ్యము; విందు.

**जियारत**-स्त्री॰ తీర్థయాత్ర; తీర్థ దర్శనము.

**जियारत गाह** - पुं॰ తీర్థస్థానము.

**जियारती** - वि॰ తీర్థయాత్రికుడు.

**जिरह** - स्त्री॰ సత్యమును తెలుసుకొనే ప్రయత్నములో తర్కించుట; వాదించుట.

**जिरह** - स्त्री॰ बख्तर ; కవచము.

**बिवरना**–स०क्रि० చిక్కుతీయుట;విడదీయుట; వెంట్రుకలు చిక్కుతీయుట.

**बिवराना**–स०क्रि० వెంట్రుకలు దువ్వించి చిక్కుతీయించుట.

**बिवाई**–स्त्री०కాలివేళ్ళు, అరికాలు పగులు రోగము.

**बिसमिल**–वि० గాయపడిన.

**बिसमिल्लाह**–पु० శుభారంభము.

**बिसरना**–अ०क्रि० విస్మరించుట;మరచిపోవుట.

**बिसरात**–पु० खच्चर; కంచరగాడిద.

**बिसराम**–पु० విశ్రామము.

**बिसहना**–स०क्रि०కొనుట; కావాలని వెంట వేసుకొనుట.

**बिसहर**–पु० సర్పము; పాము.

**बिसात**–स्त्री० అస్తిత్వము; సామర్థ్యము; విత్తము.

**बिसातबाना**–पु० తిరిగి అమ్మువాని వద్ద ఉండు వస్తువులు.

**बिसाती**–पु० సూదులు, దారము, గాజులు మొ॥ వస్తువులను తిరుగుచుఅమ్ము వాడు.

**बिसाना**–स०क्रि० వశపరచుకొనుట; వశము చేసుకొనేది अ०क्रि०విష ప్రభావము పడుట.

**बिसारद**–पु० दे० विशारद.

**बिसारना**–स०क्रि० మరిపించుట;స్మరణ లేకపోవుట; మరచిపోవుట.

**बिसासिन**–स्त्री० నమ్మరాని స్త్రీ.

**बिसाह**–पु० క్రయము; కొనుబడి.

**बिसाहनी**–स्त्री० కొనవలసిన వస్తువు.

**बिसूरना**–अ०क्रि० శోకించుట;వెక్కివెక్కి ఏడ్చుట; చింతించుట.

**बिस्तर**–पु० बिछौना; పక్క.

**बिस्तारना**–अ०क्रि० విస్తరించుట;स०क्रि० వ్యాపింపచేయుట.

**बिस्वा**–पु० బీఘా (ఒకరకపు పొలము కొలత)లో 20వ అంశము; వంతు.

**बीस बिस्वा**–पु० నిశ్చయముగ.

**बिहग**–पु० दे० विहग.

**बिहंगी**–वि० बेढगा ; కురూపి.

**बिहसना**–अ०क्रि० చిరునవ్వునవ్వుట.

**बिहरना**–पु० విహరించుట.

**बिहान**–पु० ప్రాతఃకాలము; రేపు.

**बिहाना**–स०क्रि० త్యజించుట;వదిలిపెట్టుట; अ०क्रि० గడచుట.

**बिहाल**–पु० వ్యాకులమైన; కలతజెందిన

**बिहिश्त**–वि० दे० बहिश्त.

**बिहीन**–वि० రహితమైన; లేని.

**बीं**–वि॰ చూచువాడు; దర్శకుడు.

**बींधना**–अ॰क्रि॰ చిక్కుకొనుట.

**बी**–स्त्री॰ స్త్రీ; మహిళ.

**बीघ**–पु॰ ఒక విధమగు పొలము కొలత.

**बीच**–पु॰ మధ్య; నడుమ.

**बीचि**–स्त्री॰ తరంగము; అల.

**बीचु**–पु॰ అవకాశము; తేడా.

**बीचोबीच**–क्रि॰वि॰ సరిగా మధ్యన; మధ్యలో.

**बीज**–पु॰ బీజము; విత్తు.

**बीजन**–पु॰ విజనము; విసన కర్ర.

**बीजु;बीजुरी**–स्त्री॰ दे॰ बिजली.

**बीजू**–वि॰ గింజనాటిన మొక్క (అంటు మొక్కకాని).

**बीट**–स्त्री॰ పక్షులరెట్ట.

**बीडा**–पु॰ తమలపాకు బీడా లేక కిళ్ళీ.

**बीडा उठाना**–पु॰ ఏదేని పనిచేయుటకు 'సంకల్పించుట లేక ప్రతిన పట్టుట.

**बीतना**–अ॰क्रि॰ సమయము గతించుట; గడచుట.

**बीधना**–अ॰क्रि॰ చిక్కుకొనుట.

**बीन**–स्त्री॰ వీణ.

**बीनना**–स॰क्रि॰ ఏరుట; ఎన్నుట.

**बीफै**–पु॰ గురువారము.

**बीबी**–स्त्री॰ భద్రమహిళ; స్త్రీ; భార్య.

**बीभत्स**–वि॰ ఏవగింపు కలిగించు; అసహ్యత కలిగించు.

**बीमा**–पु॰ ఆర్థికహాని జరగకుండు నిమిత్తము తీసికొను పూచీకత్తు.

**बीमार**–वि॰ జబ్బుగా నున్న; రోగగ్రస్తమైన

**बीमारी**–स्त्री॰ జబ్బు; రోగము.

**बीर**–पु॰ वीर; సోదరుడు स्त्री॰ సఖి.

**बीरव**–पु॰ సోదరుడు.

**बीर बहूटी**–स्त्री॰ ఆరుద్రపురుగు.

**बीरा**–पु॰ **बीरी**–स्त्री॰ తమలపాకుల కిళ్ళీ

**बीसी**–स्त्री॰ ఇరవైవస్తువుల సమూహము

**बीहड**–वि॰ మెరకపల్లములుగానున్న; చదునుగా లేని; వికటమగు वि॰ వేరు వేరుగానున్న.

**बुँद**–स्त्री॰ दे॰ बूँद

**बुँदकी**–स्त्री॰ గుండ్రని చిన్నబొట్టు; గుండ్రని వాతలేక మచ్చ.

**बुँदिया**–स्त्री॰ दे॰ बूदी.

**बुआ**–स्त्री॰ दे॰ बूआ.

**बुकचा**–स्त्री॰ మూట.

**बुकनी**–स्त्री॰ చూర్ణము; పొడి.

**बुकवा**–पु॰ నలుగుపిండి.

**बुक्का**–पु॰ అభ్రకపు చూర్ణము.

बुखार–पुं॰ జ్వరము; తాపము.
बुजदिल–वि॰ భీరువు; పిరికిపంద.
बुजुर्ग–वि॰ వృద్ధుడైన; పూజ్యుడైన; పూర్వీకుడు.
बुझना–अ॰क्रि॰ ఆరుట(దీపముమొ॥) మనోవేగము చల్లపడుట.
बुझाई–स्त्री॰ ఆర్పుడు.
बुझाना–स॰क्रि॰ ఆర్పుట; చల్లార్చుట.
बुडकी–स्त्री॰ डुबकी; మునుగు.
बुड्ढा–वि॰ ముసలి; వృద్ధావస్థలోనున్న.
बुढाना–अ॰क्रि॰ ముసిలగుట;ముసిలి తనము వచ్చుట.
बुढापा–पुं॰ ముసలితనము; వృద్ధావస్థ.
बुढिया–स्त्री॰ ముసలమ్మ.
बुढौती–स्त्री॰ ;వృద్ధాప్యము.
बुत–पुं॰ ప్రతిమ; మూర్తి; విగ్రహము.
बुतना–अ॰क्रि॰ दे॰ बुझना.
बुतपरस्त–पुं॰ విగ్రహారాధకుడు.
बुतशिकन–वि॰ విగ్రహములనుపడ గొట్టువాడు; విగ్రహారాధనకు విరోధి
बुताना–स॰क्रि॰ दे॰ बुझाना.
बुताम–पुं॰ బటను; చొక్కాగుండి.
बुत्ता–पुं॰ మోసము; దగా; నెపము.
बुदबुद–पुं॰ నీటిబుడగ.
बुद्ध–वि॰ జ్ఞానప్రబోధము కలిగిన; జ్ఞాని; పండితుడు.
बुद्ध–पुं॰ బౌద్ధమత ప్రవర్తకుడు;గౌతమ బుద్ధుడు.
बुद्धि–स्त्री॰ బుద్ధి; తెలివి.
बुद्धिमान–वि॰ బుద్ధిగల; బుద్ధిమంతుడు
बुद्धिमानी–स्त्री॰ తెలివి.
बुद्धू–पुं॰ అజ్ఞాని; మూర్ఖుడు; అమాయకుడు.
बुनना–स॰क्रि॰ నేయుట(వస్త్రము).
बुनाई–स्त्री॰ నేత; నేతకూలి.
बुनावट–स्त्री॰ నేతపద్ధతి.
बुभुक्षा–स्त्री॰ भूख; ఆకలి.
बुरका–पुं॰ ముసుగు; బురఖా.
बुरा–वि॰ చెడ్డ.
बुराई–स्त्री॰ చెడు; చెడ్డతనము; నైచ్యము; నింద; దోషము.
बुरादा–पुं॰ అంపపుపొట్టు.
बुर्ज–पुं॰ బురుజు; కోటబురుజు.
बुर्द–स्त्री॰ పైలాభము; అదనపు రాబడి; షరతు; పందెము.
बुलद–वि॰ ఎత్తైన; బరువైన; తీవ్రమైన.
बुलदी–स्त्री॰ ఎత్తు; తీవ్రత.
बुलबुल–स्त्री॰ కోకిల మాదిరి మధుర స్వరముగల ఒకపిట్ట.

**बुलबुला**–स्त्री॰ నీటిబుడగ.
**बुलवाना**–स॰क्रि॰ పిలిపించుట.
**बुलाना**–स॰क्रि॰ పిలుచుట; మాట్లాడించుట.
**बुलावा**–पु॰ పిలుపు; ఆహ్వానము.
**बुल्ला**–पुं॰ दे॰ बुलबुला.
**बुहारना**–स॰क्रि॰ చీపురుతో ఊడ్చి శుభ్రపరచుట.
**बुहारी**–स्त्री॰ చీపురుకట్ట.
**बूंद**–स्त्री॰ (నీటి) బిందువు; వీర్యము.
**बूँदें गिरना या पडना**–पु॰ చినుకులు పడుట; చిన్నవర్షము పడుట.
**बूंद भर**–पु॰ అతి స్వల్పముగా;బరువు తక్కువ.
**बूँदाबाँदी**–स्त्री॰ వర్షపు తుంపర.
**बूँदी**–स्त्री॰ బూంది; వానచినుకుబొట్టు.
**बू**–स्त्री॰ వాసన; గంధము; దుర్వాసన.
**बूआ**–स्त्री॰ తండ్రిసోదరి; మేనత్త.
**बूकना**–स॰क्रि॰ మెత్తగా విసురుట; కల్పించి చెప్పుట; మిడిమిడి జ్ఞానము ప్రదర్శించుట.
**बूचड**–पु॰ कसाई; కసాయివాడు; కటికవాడు.
**बूचडखाना**–पुं॰ కసాయిదుకాణము లేక కేంద్రము; పవువులు వధించు చోటు.
**बूचा**–वि॰ చెవులు తెగిన; కురూపి.
**बूझ**–स्त्री॰ తెలివి;గ్రహణశక్తి; సమస్య; చిక్కుప్రశ్న.
**बूझना**–स॰क्रि॰ తెలిసికొనుట; ఎరుగుట; అడుగుట.
**बूट**–पु॰ పచ్చిశెనగమొక్క; పచ్చిశనగగింజ
**बूटी**–स्त्री॰ వనమూలిక.
**बूडना**–अ॰क्रि॰ डूबना; మునుగుట; నిమగ్నమగుట.
**बूढा**–पु॰ ముదుసలి; వృద్ధుడు.
**बूता**–पु॰ బలము; శక్తి
**बूरा**–पु॰ శుభ్రపరచని గోధుమరంగుగల పంచదార.
**बूरानी**–स्त्री॰ బియ్యము వంకాయ కలిపి వండిన ఒక భోజ్య పదార్థము.
**बृंद**–पु॰ సమూహము; గుంపు.
**बृहद्**–वि॰ విశాలమైన; దృఢమైన; బలిష్ఠమైన.
**बेंट; बेंठ**–स्त्री॰ కొడవలి మొ॥ వాని పిడి
**बेडा**–वि॰ వంకరగానున్న;వక్రముముగా నున్న.
**बेंत**–पु॰ పేము; పేము బెత్తము.
**बेंदली**–स्त्री॰ బొట్టు బిళ్ళ లేక నగ.
**बेदा**–स्त्री॰ ముఖం మీది బొట్టు.
**बेंदी**–स्त्री॰ బొట్టు; సున్నా.

बे अव्य॰ వ్యతిరేక అర్థమునిచ్చు ఒక ఉపసర్గము; రహితమైన; లేని; లేక
बेंदली–स्त्री॰ బొట్టు బిళ్ళ లేక నగ.
अव्य॰ చిన్న పిల్లలు తుచ్ఛులుతిర స్కారము సూచించు శబ్దము.
बेअकल–वि॰ బుద్ధిలేని.
बेअदब–वि॰ మర్యాదలేని.
बेअसर–वि॰ ప్రభావములేని.
बेआबरु–वि॰ గౌరవములేని.
बेआब–वि॰ కాంతివిహీనమైన; తుచ్ఛమైన
बे ईज्जत–वि॰ గౌరవములేని.
बे ईमान–वि॰ నిజాయితీలేని.
बेउज्र–वि॰ ఏవిధమైన అభ్యంతరములేని.
बेकदर–वि॰ ప్రతిష్ఠ; గౌరవములేని.
बेकरार–वि॰ శాంతిసుఖములు లేని; వికలమైన.
बेकरारी–स्त्री॰ వ్యాకులత.
बेकल–वि॰ విశ్రాంతిలేని; వికలమైన.
बेकली–स्त्री॰ అశాంతి; వ్యాకులత.
बेकस–वि॰ సహాయములేని;నిస్సహాయ మగు; దీనుడగు.
बेकसूर–वि॰ దోషములేని; నిర్దోషి
बेकहा–वि॰ ఎవరిమాటనులక్ష్యపెట్టని.
बेकाबू–वि॰వశములోలేని; వశముతప్పిన.
बेकारा–वि॰ పనిపాటులేని.
बेकार–वि॰ పనిలేని.
बेकायदा–वि॰ నియమవిరుద్ధమైన.
बेखटेके–क्रि॰वि॰ నిస్సంకోచముగా.
बेखतर–वि॰ నిర్భయముగా.
बेखबर–वि॰ స్పృహలేని; జ్ఞానములేని.
बखौफ–वि॰ భయములేని; జంకులేని.
बेग–पु॰ వేగము; ప్రవాహము
पु॰ సంపన్నుడు; నాయకుడు; భర్త.
बेगम–स्त्री॰ గొప్పవాని;ఇల్లాలు;రాణి
बेगम–वि॰ దు:ఖములేని; ఇబ్బందిలేని.
बेगरज–वि॰ లక్ష్యపెట్టని; ఆవశ్యకతలేని.
बेगाना–वि॰ పరాయి; ఇతరమైన; పరిచయములేని.
बेगार–स्त्री॰ ఊడిగము; వెట్టిచాకిరి.
बेगारी–पु॰ ఊడిగము చేయువాడు; వెట్టిచాకిరి చేయువాడు.
बेगुनाह–वि॰ దోషములేని; పాపములేని
बेगैरत–वि॰ సిగ్గులేని; నిర్లజ్జయైన.
बेचना–स॰क्रि॰ అమ్ముట.
बेचारा–वि॰ దిక్కులేని; దీనస్థితిలోనున్న
बेचैन–वि॰ వికలమైన.
बेजड–वि॰ ఆధారములేని; పునాదిలేని
बेजबान–वि॰ నోరులేని; మూగ.
बेजा–वि॰ తగని; అనుచితమైన; చెడ్డ.
बेजान–वि॰ ప్రాణములేని; చనిపోయిన

**बेजाब्ता**–वि॰ చట్టవిరుద్ధమైన.
**बेजार**–वि॰ దు:ఖముగల; కుపితమైన; వికలమైన.
**बेजोड**–वि॰ అద్వితీయమైన; సాటిలేని.
**बेटा**–पुं॰ కుమారుడు; కొడుకు.
**बेटी**–पुं॰ కుమార్తె; కూతురు.
**बेठन**–पुं॰ మూటకట్టుటకు ఉపకరించు గుడ్డ.
**बेठिकाने**–वि॰ కొంపాగోడు ఏమీలేని; నివాసస్థానములేని.
**बेड**–पुं॰ చెట్టుచుట్టూవేసిన ఆవరణము; కంచె; దడి.
**बेडा**–पुं॰ సంగడి; తెప్ప; బల్లకట్టు; పడవల లేక ఓడల సమూహము.
**बेडा पार करना या लगाना**–मु॰ సంకటమునుంచి తప్పించుట;ఆపద నుండి రక్షించుట.
**बेडा डूबना**–पुं॰ విపత్తులో చిక్కుకొని నాశమగుట.
**बेडी**–स्त्री॰ ఖైదులకు వేయు సంకెళ్ళు.
**बेडौल**–वि॰ తీరుతెన్నూలేని; కురూపముగల
**बेढंगा;बेढब**–वि॰ వికృతాకారముగల; కురూపి అయిన.
**बेणीफूल**–पुं॰ శిరోమణి అనబడు సిరస్సున ధరించు ఒకనగ.
**बेतकल्लुफ**–वि॰ నిర్మొఖమాటి;నిస్సంకోచి; స్పష్టవాది.
**बेतमीज**–वि॰ సభ్యతలేని; మూర్ఖమగు; బుద్ధిలేని.
**बेतरह**–क्रि॰वि॰ అనుచితముగా అసాధారణముగా.
**बेतरीका**–क्रि॰वि॰ నియమవిరుద్ధముగా; అనుచితముగా.
**बेतहाशा**–क्रि॰वि॰ బహువేగముగా; బహువ్యగ్రముగా; తెలియకుండా; అనాలోచితముగా.
**बेताब**–वि॰ బలహీనమైన; వ్యగ్రతగల.
**बेतार**–वि॰ తీగలేని (టెలిగ్రాము తీగ మొ॥).
**बेतार का तार**–यौ॰ తీగద్వారా కాని తంతి.
**बेतुका**–वि॰ సామంజస్యములేని;పొందిక లేని; వికృతమైన.
**बेदखल**–वि॰ అధికారాచ్యుతమైన; ప్రవేశములేని; అధికారములేని.
**बेदखली**–स्त्री॰ అధకారములేమి;అధికారమునుండి తొలగింపు.
**बेदम**–वि॰ శ్వాసలేని; చనిపోయిన;మృతప్రాయమైన.
**बेदर्द**–वि॰ నిష్ఠురమైన; కఠోరమైన;కనికరములేని.
**बेदाग**–वि॰ మచ్చలేని; నిర్దోషమైన;నిరపరాధియగు.

**बेदाना**–वि॰ ఒక విధమగు శ్రేష్ఠమైన కాబూలీ దానిమ్మ.
**बेदाम**–वि॰ వెలలేని; వట్టినే.
**बेदार**–वि॰ జాగరూకముగానున్న;జాగ్రత్తగానున్న.
**बेधडक**–वि॰నిస్సంకోచముగ; జంకులేని
**बेधना**–स॰क्रि॰ చేధించుట; బెజ్జము చేయుట.
**बेधीर**–वि॰ ధైర్యములేని.
**बेन**–पु॰ పిల్లనగ్రోవి; మురళి; వెదురు.
**बेनजीर**–वि॰ సాటిలేని; అద్వితీయమైన
**बेनवा**–वि॰ దరిద్రమైన; బీద.
**बेनसीब**–वि॰ అదృష్టములేని.
**बेना**–पु॰ చేతి విసన కర్ర.
**बेनागा**–क्रि॰वि॰ నిరంతరముగా;నాగా లేకుండా.
**बेनिमून**–वि॰ అద్వితీయమైన.
**बेनिया**–स्त्री॰ చిన్న విసన కర్ర.
**बेनी**–स्त्री॰ జుట్టుముడి; వేణి.
**बेनियाज**–वि॰ ఏ విధమైన అవసరములు, బాధ్యతలులేని; పరమ స్వతంత్రమైన
**बेनु**–पुं॰ పిల్లనగ్రోవి; మురళి.
**बेपरवा;बेपरवाह**–वि॰ నిశ్చింతమైన; లక్ష్యపెట్టని.
**बेपीर**–वि॰ నిర్దయమగు; నిష్ఠురమగు.
**बेपेंदी**–वि॰ అడుగు భాగములేని.
**बेपेदी का लोटा**–पुं॰ ఎవరో ఏదో చెప్పి నంతనే తన అభిప్రాయములు మార్చు కొనువాడు.
**बेफायदा**–वि॰ లాభములేని;వ్యర్థముగా.
**बेफिक्र**–क्रि॰वि॰ నిశ్చింతగ; నిర్లక్ష్యముగ
**बेबस**–वि॰ పరవశుడైన.
**बेबसी**–स्त्री॰ పరవశత; వివశత.
**बेबाक**–वि॰బాకీతీర్చిన; ఋణముతీర్చిన
**बेबुनियाद**–वि॰ఆధారములేని; పునాదిలేని
**बेभाव**–वि॰ పరిగణింపబడని; హద్దులేని; వెలలేని.
**बेभावकी पडना**–मु॰ ఎక్కువ దెబ్బలు పడుట; చివాట్లు పడుట.
**बेमन**–वि॰ మనస్సులేని; మనస్సులగ్నము కాని.
**बेमरम्मत**–वि॰ చెడిపోయిన; మరమ్మత్తులేని
**बेमुरव्वत**–वि॰ ముఖమాటములేని; సంకోచములేని.
**बेमौका**–वि॰ అదను లభించని.
**बेमौसम**–वि॰ ఋతువుకానిది; ఋతువు కాకపోయినను లభించునది.
**बेर**–पु॰ రేగిపండు; సమయము; పర్యాయము.

**बेरहम**–वि॰ దయలేని.

**बेरा**–स्त्री॰ సమయము; ప్రాతఃకాలము.

**बेरुख**–वि॰ అవసరము పడినప్పుడు ముఖముచాటు వేయు; చిరుబురు లాడు.

**बेरोजगार**–वि॰పనిలేని; ఉద్యోగములేని

**बेल**–पुं॰ మారేడు स्त्री॰ లత; సంతానము; వంశము.

**बेलचा**–पुं॰ పార.

**बेलज्जत**–पुं॰ రుచిలేని.

**बेलदार**–पुं॰ త్రవ్వుపని చేయువాడు.

**बेलन**–पुं॰ అప్పడాలకర్ర.

**बेलना**–स॰क्रि॰ అప్పడాలకర్రతో వత్తుట (రొట్టె) పాడుచేయుట.

**बेलबूटेदार**–वि॰ లతాపుష్పముల అల్లికగల

**बेला**–पुं॰ మల్లెజాతిపువ్వు; సమయము; వేళ

**बेलाग**–वि॰ పూర్తిగా వేరైన; విశుద్ధమైన

**बेलौस**–वि॰ నిజమైన; శుద్ధమైన; ముఖమాటములేని.

**बेवकूफ**–वि॰నిర్బుద్ధి; తెలివిలేని; అజ్ఞాని

**बेवक्त**–क्रि॰वि॰ కుసమయమున; వేళకాని వేళలో.

**बेवफा**–वि॰కృతఘ్నుమైన; నిర్మొఖమాటి; చెడుప్రవర్తనగల.

**बेवरा**–पुं॰ వివరణ.

**बेवा**–स्त्री॰ విధవ; భర్తచనిపోయిన స్త్రీ.

**बेश**–वि॰ అధికము; ఎక్కువ.

**बेशऊर**–वि॰ తెలియని; సభ్యతలేని.

**बेशक**–क्रि॰वि॰ నిస్సందేహముగా; తప్పకుండా.

**बेशकीमत**–वि॰ ఎక్కువవెలగల; బహుమూల్యమైన.

**बेशरम**–वि॰ సిగ్గులేని.

**बेशी**–स्त्री॰ ఆధిక్యము.

**बेशुमार**–वि॰ అసంఖ్యాకమైన; లెక్కలేని

**बेसबब**–क्रि॰वि॰ అకారణముగా.

**बेसबरा**–वि॰ बेसब्र; ఓర్పులేని.

**बेसमझ**–वि॰ తెలివిలేని; మూర్ఖతగల.

**बेसर**–पुं॰ కంచరగాడిద; బేసరి; ముక్కుపుడక.

**बेसवा**–स्त्री॰ వేశ్య.

**बेसाहना**–क्रि॰वि॰ క్రయముచేయుట; కొనుట; కావాలని వెంట వేసుకొనుట

**बेसुध**–वि॰ స్పృహలేని; తెలివిలేని.

**बेसुर**:**बेसुरा**–वि॰ అపస్వరముగల; అదునులేని.

**बेसूद**–वि॰ వ్యర్థమైన; లాభములేని.

**बेहंगम**–वि॰ వికటమైన; పొందికలేని.

**बेह**–पुं॰ రంధ్రము; కంత.
**बेहड**–वि॰ दे॰ बीहड.
**बेहतर**–वि॰ మెరుగు.
**बेहतरी**–स्त्री॰ బాగు; శ్రేష్ఠత.
**बेहतरीन**–वि॰ సర్వశ్రేష్ఠమైన; ఉత్తమమైన
**बेहद**–वि॰ అపరిమితమైన; అపారమైన; హద్దులేని.
**बेहना**–पुं॰ దూదేకు జాతీయుడు.
**बेहबूदी**–स्त्री॰ మంచితనము;మెరుగుగా నుండుట.
**बेहया**–वि॰ సిగ్గులేని; సిగ్గుమాలిన.
**बेहयाई**–स्त्री॰ నిర్లజ్జత; సిగ్గుమాలినత.
**बेहाल**–वि॰ వ్యాకులతగల; వికలమైన.
**बेहिसाब**–वि॰ అపరిమితమైన; లెక్కలేని
**बेहूदा**–वि॰మర్యాదతెలియని; సభ్యతలేని
**बेहूदापन**–पु॰ **बेहूदगी**–स्त्री॰ అశిష్టత; అసభ్యత.
**बेहैफ**–वि॰ చింతలేని.
**बेहोश**–वि॰ స్మృహలేని; మూర్ఛపోయిన
**बोहोशी**–स्त्री॰ స్మృహలేమి; మూర్ఛ.
**बैंक**–पु॰ బ్యాంక్; अधिकोष.
**बैंगन**–पु॰ వంకాయ.
**बैंगनी**–वि॰ వంకాయ వన్నెగల; వంగ పండువన్నెగల.

**बै**–स्त्री॰ విక్రయము; అమ్మకము.
**बैठक**–स्त्री॰ కూర్చుండుస్థలము; పీట; ఒక విధమగు గుంజీ లేక ఆసనము.
**बैठना**–अ॰क्रि॰ కూర్చుండుట.
**बैठे बैठाए या बिठाए**–पु॰ అకారణముగా; అకస్మాత్తుగా; నిరర్థకముగా.
**बैठते उठते**–पु॰ ఎల్లప్పుడూ; సర్వదా.
**बैत**–स्त्री॰ పద్యములో రెండు పాదములు.
**बैद**–पु॰ వైద్యుడు.
**बैदई**–स्त्री॰ వైద్యము; చికిత్స.
**बैन**–पु॰ మాట; పలుకు.
**बैना**–पु॰ శుభకార్యసందర్భమునబంధు వులకు కానుకగా పంపుమిఠాయిలు.
**बैपार**–पु॰ వ్యాపారము; **बैपारी**–पु॰ వ్యాపారి.
**बैरंग**–पु॰ పోస్టు ఖర్చు ఇవ్వకుండా పంపిన ఉత్తరము.
**बैर**–पु॰ दे॰ वैर.
**बैरी**–वि॰ दे॰ वैरी.
**बैल**–पु॰ ఎద్దు; వృషభము.
**बैस**–स्त्री॰ వయస్సు; యవ్వనము.
**बैसना**–अ॰क्रि॰ కూర్చుండుట.

**बैसाखी**–स्त्री० కుంటివాని పోటీకర్రలు.

**बैसाना**–स०क्रि० కూర్చుండపెట్టుట.

**बोआई**–स्त्री० నాట్లపని; నాటినందులకు కూలి.

**बोझ**–पु० बोझा; భారము; బరువు.

**बोझना**–स०क्रि० బరువువేయుట.

**बोझिल**–वि० బరువైన; భారమైన.

**बोटी**–स्त्री० మాంసఖండము; మాంసపు ముక్క.

**बोटी बोरी सा काटना**–मु० శరీరమును ముక్కలుముక్కలుగా నరుకుట.

**बोडा**–पु० కొండచిలువ; బోసినోటివాడు; ఒక విధమైన కూరగాయ.

**बोतल**–स्त्री० సీసా.

**बोदा**–वि० అజ్ఞాని; మూర్ఖతగల;విస విసలాడు.

**बोध**–पु० జ్ఞానము; ఎరుక; తెలివి.

**बोधक**–वि० బోధించు; జ్ఞానము కలుగజేయు

**बोधगम्य**–वि० తెలియదగిన; తెలుసు కొనుటకు వీలుగానున్న.

**बोना**–स०क्रि० విత్తనమునాటుట;విత్తన ములు జల్లుట.

**बोबा**–पुं० चूची; చనుగుబ్బ.

**बोर**–पुं० ముంచు; ముంపు.

**बोरना**–स०क्रि० ముంచుట.

**बोरसी**–स्त्री० गोरसी; కుంపటి.

**बोरा**–पु० గోనిసంచి.

**बोरिया**–पु० బిస్తరు; పక్క.

**बोरिया बाँधना**–मु० ప్రయాణమునకు సిద్ధమగుట.

**बोरी**–स्त्री० చిన్నగోనిసంచి.

**बोल**–पु० మాట; పలుకు.

**बोल बाला**–पु० పలుకుబడి; మాటవిలువ

**बोलचाल**–स्त्री० సంభాషణ; మాట-మంతి; ప్రచారములోనున్నది.

**बोलता**–पु० బోధనాశక్తి; పలుకుశక్తి; ప్రాణము

**बोलती**–स्त्री० మాటాడుశక్తి.

**बोलती मारी जाना**–मु० నోటి నుండి మాట పెగలక పోవుట.

**बोली**–स्त्री० మాట; పలుకు; వాణి.

**बोली छोडना या मारना**–मु० ఎగతాళి చేయుట; అపహాస్యము చేయుట.

**बोवाना**–स०क्रि०నాటించుట; విత్తనములు నాటించుట.

**बोसा**–पुं० చుంబనము; ముద్దు.

**बोसीदा**–वि० పురాతనమైన.

**बोह**–स्त्री० गोता; మునగు; మునక.

**बोहनी**–स्त्री० బోణీ.

**बोहित**–पुं० పెద్దపడవ; ఓడ.

**बौड**–स्त्री॰ లత; తీగ.

**बौडना**–अ॰क्रि॰ లత మాదిరిగా పెరిగి వ్యాపించుట; రెమ్మలువేయుట.

**बौडी**–स्त्री॰ పిందె.

**बौखल**–क्रि॰वि॰ పిచ్చెక్కిన.

**बौखलाना**–अ॰क्रि॰ పిచ్చెక్కుట; మానసిక సంతులనము లేకపోవుట.

**बौछाड;बौछार**–स्त्री॰ వానజల్లు; వ్యంగ్యము; వెక్కిరింపు.

**बौना**–पु॰ మరుగుజ్జువాడు.

**बौर**–पु॰ మామిడిచిగురు.

**बौरना**–अ॰क्रि॰ మామిడిపూతవచ్చుట

**बौरा**–वि॰ పిచ్చిగల; అమాయకమైన; అబోధమైన.

**बौराई**–पु॰ పిచ్చి.

**बौराना**–अ॰क्रि॰ పిచ్చెక్కుట; स॰क्रि॰ పిచ్చెక్కించుట.

**बौरी**–स्त्री॰ పిచ్చిది.

**ब्यवहारी**–पु॰ వ్యవహర్త; వ్యాపారి.

**ब्याज**–पु॰ వడ్డీ; వృద్ధి.

**ब्याना**–स॰क्रि॰ ఈనుట.

**ब्यापना**–अ॰क्रि॰ వ్యాపించుట.

**ब्याल**–पु॰ दे॰ व्याल.

**ब्याली**–स्त्री॰ సర్పిణి.

**ब्यालू**–पु॰ రాత్రిభోజనము.

**ब्याह**–पु॰ వివాహము; పెళ్ళి.

**ब्याहता**–वि॰ పెళ్ళిచేసుకొనిన.

**ब्याहना**–स॰क्रि॰ పెళ్ళిచేసుకొనుట.

**ब्योतना**–स॰क्रि॰ కొలత ప్రకారము కత్తిరించుట.

**ब्योंताना**–स॰क्रि॰ శరీరపు కొలతప్రకారము గుడ్డ కత్తిరించుట.

**ब्योपार**–पु॰ दे॰ व्यापार.

**ब्योरना**–स॰क्रि॰ తలవెంట్రుకలచిక్కు తీసుకొనుట; వివేకముతో ఏదేని సమస్యను పరిష్కరించుట.

**ब्योरा**–पु॰ వివరణ; వివరము.

**ब्योरेवार**–क्रि॰वि॰ వివరణాత్మకముగా.

**ब्योहरिया**–पु॰ వడ్డీవ్యాపారి.

**ब्रह्मघोष**–पु॰ వేదధ్వని.

**ब्रह्मपद**–पु॰ మోక్షము.

**ब्रह्मर्षि**–पु॰ బ్రాహ్మణ ఋషి

## भ

**भग**–पु॰ తరంగము; అల; పరాజయము.

**भगड**–वि॰ ఎక్కువగా భంగు త్రాగువాడు

**भंगिमा**–स्त्री॰ స్త్రీల హావభావములు.

**भगी**–पु॰ పాకీవాడు; वि॰ భంగు త్రాగువాడు.

भगुर–वि॰ నశించునట్టి; వంకర.
भगेड–वि॰ అతిగా భంగు త్రాగువాడు.
भंजक–वि॰ విరుచువాడు; భగ్నము చేయువాడు.
भजना–अ॰क्रि॰ విరుగుట; ముక్కలు ముక్కలగుట.
भजाना–स॰क्रि॰ విరుచుట; భగ్నము చేయుట; చిల్లర మార్చుట.
भटा–पु॰ बैगन ;వంకాయ.
भंड–पु॰ అపశబ్దములు మాటాడువాడు; అశ్లీలవచనములు పలుకువాడు.
भंडा–पुं॰ పాత్ర; వంటపాత్ర.
भंडा फूटना–पु॰ రహస్యము బైటపడుట
भडा–पु॰ భండారము; ధాన్యపుకొట్టు; ఖజానా.
भडारा–पु॰ సమూహము; గుంపు;సన్యాసులకు చేయువిందు.
भडारी–स्त्री॰ చిన్నకొట్టు; ధనాగారము; ధనాగారపు అధికారి.
भँवर–पु॰ నీటిసుడి; భ్రమరము.
भँवरजाल–पु॰ ప్రాపంచపు మాయాజాలము; చిక్కులు.
भँवारा–वि॰ తిరుగుబోతు.
भईया–पुं॰ సోదరుడు; సమవయస్కుల యెడల ఉపయోగించు ఆదరసూచక శబ్దము.
भकभकाना–अ॰क्रि॰ భగభగమని మండుట.
भकुआ–वि॰ మూర్ఖుడగు; మూఢుడగు
भकुआना–अ॰क्रि॰ గాబరాపడుట;నివ్వెరపోవుట.
भकोसना–अ॰क्रि॰త్వరత్వరగా బొక్కుట
भक्त–वि॰ విభజింపబడిన; భక్తిమార్గమున నడచు.
भक्षी–वि॰ భక్షించువాడు; తినువాడు.
भक्ष्य–वि॰ తినదగిన.
भख–पु॰ భక్ష్యము; ఆహారము.
भग–पु॰ సూర్యుడు; ఐశ్వర్యము; కోరిక.
भगत–वि॰ భక్తుడు; ఉపాసకుడు.
भगदड–स्त्री॰ పలాయనము; భయపడి నలువైపులా పరారగుట.
भगना–अ॰क्रि॰ दे॰ भागना.
भगल–पु॰ మోసము; కపటము; గారడీ; ఆడంబరము.
भगाना–स॰क्रि॰ వెడలుగొట్టుట; పలాయనపర్చుట.
भगिनी–स्त्री॰ సహోదరి; సోదరి.
भगोडा भग्गू–वि॰ పరారైన; పారిపోయిన; భీరువు.
भगौहाँ–वि॰ పారిపోవుటకు సిద్ధముగానున్న

**भग्नावशेष**–पु॰ శిథిలావశేషము.
**भचकना**–अ॰क्रि॰ విస్మైరపోయి ఉండుట; కాలుతిమ్మెరెక్కుట.
**भजनी**–पु॰ భజన చేయువాడు.
**भजाना**–अ॰क्रि॰ పారిపోవుట; स॰क्रि॰ వెడలుగొట్టుట; పారిపోయేటట్లు చేయుట
**भट**–पु॰ యుద్ధవీరుడు; సైనికుడు.
**भटकना**–अ॰क्रि॰ వట్టినేతిరుగుట;దారి తప్పి తిరుగుట.
**भटका**–वि॰ దారితప్పిన.
**भटकाना**–स॰क्रि॰ దారి తప్పించుట; తప్పుడు దారి చెప్పుట.
**भटा**–पु॰ दे॰ बैगन.
**भट्ट**–पु॰ బ్రాహ్మణులకు సంబంధించిన ఒక బిరుదు; యుద్ధవీరుడు; భట్రాజు
**भट्ठा**–पु॰ ఇటుకలు; బట్టీ మొ॥వి.
**भट्ठी**–स्त्री॰ పెద్దపొయ్యి.
**भट्टारक**–पु॰ ఋషి; విద్వాంసుడు; సూర్యుడు; రాజు; దేవత; वि॰ మాన్యుడు; ఆదరణీయమైన.
**भठियारा**–पु॰ సత్రవు వ్యవస్థాపకుడు.
**भडक**–स्त्री॰ తళుకు-బెళుకు; జ్వాల; జంకు; భయము; బెదురు.
**भडकदार**–वि॰ भडकीला ;తళుకు బెళుకుగల; మెరయు.
**भडकना**–अ॰क्रि॰ భగ్గుమనుట;సంకోచించుట; జంకుట; బెదురుట.
**भडकाना**–स॰क्रि॰ ప్రజ్వలింపజేయుట; రెచ్చగొట్టుట; ప్రోత్సహించుట.
**भडकीला**–वि॰ दे॰ भडकदार.
**भडभडाना**–स॰क्रि॰భడభడమను శబ్దము చేయుట; వృధాగా అతిగా మాట్లాడుట.
**भडभूँजा**–पु॰ శనగలు, పప్పు మొ॥ వేయించి అమ్ము ఒకజాతి.
**भडुआ**–पु॰ తార్పుడుగాడు.
**भडैत**–पु॰ అద్దెకుండువాడు.
**भणना**–स॰क्रि॰ చెప్పుట.
**भणित**–वि॰ చెప్పిన.
**भतार**–पु॰ భర్త.
**भतीजा**–पु॰ సోదరుని కుమారుడు.
**भतीजी**–स्त्री॰ సోదరుని కుమార్తె.
**भत्ता**–पु॰ నిర్ధారిత వేతనమునకు అదనముగా ఇచ్చు భత్యము, పైకము.
**भदत**–पु॰ బౌద్ధభిక్షువు; वि॰పూజ్యుడైన; మాన్యమైన.
**भदई**–स्त्री॰ భాద్రపదమాసములో తయారగు పైరు లేక పంట.
**भदेस**–वि॰చెడ్డ; అశ్లీలమైన; అనుచితమైన

**भद्दा–वि॰** చూచుటకు అందవికారముగా కనిపించు; కురూపమైన.

**भद्दापन–पु॰** సౌందర్యహీనత; అశ్లీలత; కురూపత.

**भद्र–वि॰** నాగరికతగల; సుశిక్షితమైన.

**भद्रता–स्त्री॰** నాగరికత; సజ్జనత్వము; సౌజన్యము.

**भनक–स्त्री॰**మాటల మందధ్వని; వదంతి

**भनकना–स॰क्रि॰** పలుకుట; చెప్పుట.

**भनभनाना–अ॰क्रि॰** ఝుయ్‌మని ధ్వని చేయుట; పలవరించుట.

**भनभनाहट–स्त्री॰** తుమ్మెదల ఝుంకారము

**भभकना–अ॰क्रि॰** భగభగ మండుట; వేడెక్కి పగులుట.

**भभकी–स्त्री॰** వట్టి బెదిరింపు.

**भभ्भड–स्त्री॰** పెద్ద సమూహము; విచ్చల విడిగానున్న జనసందోహము.

**भभूका–पु॰** జ్వాల; మంట.

**भभूत–स्त्री॰** విభూతి; భస్మము.

**भयातुर–वि॰** భయముతో వ్యాకులపడిన

**भयावह–वि॰** భయంకరమైన.

**भरंत–स्त्री॰** సందేహము; నింపుట; నిండుట

**भर–वि॰** మొత్తము; పూర్తిగ.

**भरण–पु॰** పోషణ; పాలన.

**भरता–पु॰** బజ్జి(వంకాయ).

**भरती–स्त्री॰** పూరణము (పూరించుట); నిండుట; ప్రవేశము.

**भरना–स॰क्रि॰** నింపుట; పూరించుట; పోయుట; తీర్చుట.

**भरनी–वि॰** పేక; నేత(బట్ట) లోని అడ్డ నూలు.

**भरपाई–स्त्री॰** బాకీ చెల్లింపు; చెల్లింపు రసీదు.

**भरपूर–वि॰** పూర్తిగా నిండిన; పరిపూర్ణముగ

**भरम–पु** భ్రమ; సంశయము; రహస్యము

**भरम गँवाना–पु** రహస్యము బైటపెట్టుట

**भरमना–अ॰क्रि॰** తిరుగుట; దారితప్పి తిరుగుట; భ్రమలో పడుట.

**भरमाना–स॰क्रि॰** భ్రమింపజేయుట; రెచ్చగొట్టుట **अ॰क्रि॰** ఆశ్చర్యపడుట.

**भरमार–स्त्री॰** బహు ఆధిక్యము; కోకొల్ల

**भरवाना–स॰क्रि॰** నింపింపజేయుట.

**भरसक–क्रि॰वि॰** వీలైనంతవరకు; శక్తి కొలది

**भराई–स्त्री॰** నింపుడు; నింపుడుకూలి.

**भराव–पु॰** నింపుడు.

**भरी–स्त्री॰** ఒక విధమగు తూకము-తులము

**भरोसा–पु॰** ఆసరా; ఆధారము;దృఢ విశ్వాసము.

**भर्ता**–पु॰ భర్త; పతి.
**भर्त्सना**–स्त्री॰ నింద; చీదరింపు; చివాట్లు.
**भर्राना**–अ॰क्रि॰ బొంగురు పోవుట (స్వరము)
**भलमनसाहत; भलमनसी**–स्त्री॰సౌజన్యము; సజ్జనత్వము.
**भला**–वि॰ మంచి; శ్రేష్ఠమైన पु॰ కుశలము;మంచితనము अव्य॰ బాగు; సరే.
**भले ही**–पुं॰ అలాగే జరుగుగాక; ఏమీ నష్టము లేదు; మంచిదే.
**भलाई**–स्त्री॰మంచితనము; ఉపకారము
**भले**–क्रि॰वि॰ మంచిగా; మంచి విధముగా; పూర్తిగా; अव्य॰ బాగుబాగు.
**भव**–पु॰ ఉత్పత్తి; జన్మ; జగత్తు;ప్రపంచము; वि॰ శుభమైన; జన్మించిన.
**भवदीय**–सर्व॰ తమయొక్క; మాయొక్క
**भवबंधन**–पु॰ ప్రాపంచకపు జంజాటము; కష్టనష్టములు.
**भवभय**–पु॰జన్మమరణములకు సంబంధించిన భయము.
**भवितव्य**–पु॰ భవిష్యత్తు; కానున్నది.
**भवितव्यता**–स्त्री॰ ముందుజరగబోవునది; అదృష్టము; విధి.
**भविष्य**–पु॰ రాబోవుకాలము.
**भव्य**–वि॰ భవ్యమైన; దివ్యమైన;శుభప్రదమైన; భవిష్యత్తులో జరగునది.
**भसुड**–पु॰ ఏనుగు.
**भसुर**–पु॰ భర్త అన్నగారు-బావగారు.
**भस्म**–पु॰ భస్మము; బూడిద.
**भस्मक**–पु॰ ఆకలిరోగము.
**भस्मीभूत**–वि॰మంటలోపడి బూడిదఅయిపోయిన.
**भहराना**–अ॰क्रि॰ విరిగిపడిపోవుట;విరుచుకుపడిపోవుట.
**भाँम**–स्त्री॰ భంగు ఆకు.
**भाँज**–स्त्री॰చిల్లర; నోట్లు (డబ్బు) మార్పిడి; వట్టము.
**भाँजना**–स॰क्रि॰ మడత పెట్టుట; గద (వ్యాయామము) మొ॥ తిప్పుట.
**भाँटा**–पु॰ बैंगन ;వంకాయ.
**भाँड**–पु॰ పాత్ర; బాన; కుండ;విదూషకుడు; నిర్లజ్జుడు; వినష్టము.
**भाँडा**–पु॰ పాత్ర.
**भाँडे मे जीदेना**–मु॰ ఎవరినైనా ప్రేమించుట
**भाँडे भरना**–मु॰ పశ్చాత్తాపము నొందుట
**भांडागार; भांडार**–पु॰ భండారము; కోశము; ఖజానా.
**भाँति; भाति**–स्त्री॰ ప్రకారము; పద్ధతి; తీరు
**भाँपना**–स॰क्रि॰ దాగిన విషయమును గ్రహించుట; ఊహించి తెలిసికొనుట

**भाँवना**–स॰क्रि॰ తురుముట; తరణి పట్టుట.
**भाँवर**–स्त्री॰ ప్రదక్షిణ; వివాహసమయ మున వధూవరులు అగ్నిచుట్టూ ప్రద క్షిణ చేయుట.
**भा**–स्त्री॰ దీప్తి; కాంతి.
**भाई**–पु॰ సోదరుడు.
**भाईचारा**–पु॰ భాతృత్వము; సౌహార్ద్రత.
**भाईदूज**–स्त्री॰ కార్తీక శుక్ల విదియ నాడు వచ్చు పండుగ.
**भाईबिरादरी**–स्त्री॰ జాతిజనులు; తెగవారు
**भाऊ**–पुं॰ ప్రేమ; స్వభావము.
**भाखना**–स॰क्रि॰ చెప్పుట.
**भाखा**–स्त्री॰ భాష.
**भाग**–पुं॰ భాగము; ఖండము; భాగాహారము (గణితము); అదృష్టము.
**भागदौड**–स्त्री॰ दे॰ भगदड.
**भागना**–अ॰क्रि॰ పారిపోవుట.
**सिर पर पैर रखकर भागना**–मु॰ హడా విడిగా పారిపోవుట.
**भागनेय**–पु॰ మేనల్లుడు.
**भागफल**–पुं॰ భాగించిన మీదట లభించిన సంఖ్య.
**भागी**–पु॰ భాగస్తుడు; वि॰ అదృష్టవం తుడు.
**भाजक**–पुं॰ భాగించు సంఖ్య.
**भाजन**–पु॰ పాత్ర; పాత్రుడు; యోగ్యుడు.
**भाजी**–स्त्री॰ ఆకుకూర; కూరగాయలు.
**भाज्य**–स्त्री॰ భాజ్యము (గణితము) భాగించబడు సంఖ్య; విభజింపదగిన
**भाट**–पुं॰ భట్రాజు; వందిమాగదుడు.
**भाटा**–पुं॰ నీటిపొంగు తగ్గుదల.
**भाड**–पुं॰ ఒక విధమగు పెద్దపొయ్యి.
**भाड झोंकना**–मु॰ పనికిమాలినపని.
**भाड मे झोंकना**–मु॰ పారవేయుట; పోనిచ్చుట; వినష్టపరచుట.
**भाडा**–पुं॰ బాడుగ; అద్దె.
**भात**–पु॰ అన్నము.
**भाति**–स्त्री॰ శోభ; కాంతి.
**भाथा**–पुं॰ తూణీరము; అంబులపొది.
**भाथी**–स्त्री॰ కొలిమితిత్తి.
**भादों; भाद्रपद**–पु॰ భాద్రపదమాసము.
**भान**–पु॰ దీప్తి; కాంతి; మెరుపు; జ్ఞానము
**भानजा**–पु॰ మేనల్లుడు.
**भानना**–स॰क्रि॰ విరుచుట; భంగముచేయుట
**भानुमती**–स्त्री॰ గారడీస్త్రీ.
**भानु**–पुं॰ సూర్యుడు.
**भानुज**–पु॰ యముడు; శనీశ్వరుడు; కర్ణుడు
**भानुजा**–स्त्री॰ యమునానది.
**भानुतनया**–स्त्री॰ दे॰ भानुजा.
**भाप; भाफ**–स्त्री॰ ఆవిరి.

**भाभी**–स्त्री॰ అన్నభార్య; వదిన.

**भामिनी**–स्त्री॰ స్త్రీ.

**भाय**–पुं॰ సోదరుడు; వెల; ధర.

**भायप**–पु॰ दे॰ भाईचारा.

**भारती**–स्त्री॰ వాక్కు; మాట; వాణి; సరస్వతి

**भारी**–वि॰ బరువైన; బరువుగానున్న.

**भारी भरकम**–पु॰ విశాలమైన; బరువైన; మోటుగానున్న.

**भाल**–पु॰ ఫాలభాగము; లలాటము.

**भाला**–पु॰ బల్లెము; బరిసె.

**भाली**–स्त्री॰ బల్లెపుమొన.

**भालू**–पु॰ ఎలుగుబంటి.

**भावता**–पु॰ ప్రేమపాత్రుడు; ప్రియుడు वि॰ ఇంపైన; పసందైన.

**भाव**–पु॰ భావము; అభిప్రాయము; ప్రేమ; వెల; మూల్యము.

**भावज**–स्त्री॰ అన్నభార్య; వదిన.

**भावताव**–पु॰ వెల-గిల; ధర-గిర.

**भावना**–स्त्री॰ ధ్యాస; అభిప్రాయము; కోరిక; తలంపు.

**भावप्रवण**–वि॰ భావుకుడు.

**भाव्य**–वि॰ ఆలోచించదగిన.

**भाषण**–पु॰ ఉపన్యాసము.

**भाषांतर**–पु॰ అనువాదము; రూపాంతరము

**भाषा**–स्त्री॰ భాష.

**भाषित**–वि॰ చెప్పిన.

**भाषी**–पु॰ మాటాడువాడు; చెప్పువాడు.

**भाष्य**–पु॰ వ్యాఖ్య.

**भास**–पु॰ దీప్తి; ప్రకాశము; ప్రతీతి; సంస్కృతములో ఒకనాటకకారుడు

**भासित**–वि॰ మెరయుచున్న; ప్రకాశించు చున్న; ప్రకాశవంతమైన.

**भिगाना**–स॰क्रि॰ తడుపుట; నానబెట్టుట.

**भिंडी**–स्त्री॰ బెండకాయ.

**भिक्षु**–पु॰ బౌద్ధసన్యాసి.

**भिक्षुक**–पु॰ ముష్టివాడు.

**भिखमंगा; भिखारी**–पुं॰ బిచ్చగాడు.

**भिखारिन**–स्त्री॰ బిచ్చగత్తె.

**भिज्ञ**–वि॰ తెలిసిన.

**भिडत**–स्त्री॰ मुठभेड ; ఢీకొనుట.

**भिड**–स्त्री॰ वर्रे ; కందిరీగ.

**भिडना**–अ॰क्रि॰ ఢీకొనుట.

**भितरिया**–पु॰ దేవాలయ పూజారి.

**भित्ति**–स्त्री॰ గోడ.

**भित्तचित्र**–पु॰ గోడచిత్రము.

**भिदना**–अ॰क्रि॰ గుచ్చుకొనుట; గాయపడుట

**भिदुर**–पु॰ వజ్రము.

**भिनकना; भिनभिनाना**–अ॰क्रि॰ ఈగలు ముసురుట; ఏవగింపుపుట్టుట.

**भिनसार**–पु॰ ప్రాతఃకాలము; ఉదయపు సమయము.

**भिन्न**–वि॰ వేరైన; ఇతరమైన; భిన్నమైన.

**भिन्नता**–स्त्री॰ తేడా; అంతరము; భిన్నత

**भिन्नाना**–अ॰क्रि॰ దుర్వాసన వలన తల తిరుగుట.

**भिलनी**–स्त्री॰ ఒక తెగ అడవి జాతి స్త్రీ.

**भिश्त**–पु॰ స్వర్గము.

**भिश्ती**–पु॰ తోలుసంచితో నీళ్ళుమోయు వాడు.

**भींगना**–अ॰क्रि॰ दे॰ भीगना.

**भींचना**–स॰क्रि॰ లాగుకొనుట; బిగించుట (కౌగిలి మొ॥).

**भींजना**–अ॰क्रि॰ తడియుట;గద్గదమగుట

**भी**–अव्य॰ కూడ; అవశ్యము; వరకు.

**भीख**–स्त्री॰ బిచ్చము.

**भीगना; भीजना**–अ॰क्रि॰ తడియుట; తడిసిపోవుట.

**भीगी बिल्ली होना**–मु॰ భయముతో అణగిపోవుట; పూర్తిగా మౌనము వహించుట.

**भीड**–स्त्री॰ సమూహము; గుంపు; విపత్తు; సంకటము.

**भीडभडक्का; भीडभाड**–स्त्री॰ జన సమూహము; గుంపు.

**भीडा**–वि॰ సంకుచితమైన; ఇరుకైన.

**भीत**–स्त्री॰ గోడ; वि॰ భయపడిన.

**भीतर**–क्रि॰वि॰ లోపల.

**भीतरी**–वि॰ లోని; గుప్తమైన.

**भीति**–स्त्री॰ గోడ; భయము; వణుకు.

**भीनना**–अ॰क्रि॰ నిండుట; ఇముడుట.

**भीनी**–वि॰ సిక్తమైన; తడిసిన;తియ్య తియ్యని.

**भीम**–वि॰ భీషణమైన; విరాటమైన; पु॰ శివుడు;విష్ణువు; భీమసేనుడు.

**भीर**–स्त्री॰ భీరువు; పిరికిపంద; భయ పడిన.

**भीरु**–वि॰ कायर ; పిరికిపంద.

**भीरुता**–स्त्री॰ कायरता ;పిరికితనము.

**भीरे**–क्रि॰वि॰ సమీపమున; దగ్గరగ.

**भील**–पु॰ ఒక అడవిజాతి; భీల్.

**भीषण**–वि॰ భయంకరమైన.

**भुजना**–अ॰क्रि॰ दे॰ भूनना.

**भुक**–पु॰ ఆహారము; భోజనము.

**भुक्खड**–वि॰ ఆకలిగొన్న; తిండిబోతు; దరిద్రుడు.

**भुक्ति**–स्त्री॰ భోజనము; ఆహారము.

**भुखमरा**–वि॰ ఆకలితో చనిపోవు; తిండిబోతు

**भुगतना**–पु॰ సహించుట; అనుభవించుట

**भुगतान**–पु॰ తీర్పు; చెల్లింపు; అనుభవము

**भुच्च; भुच्चड**–वि॰ మూర్ఖుడు.

**भुजंग**–पु॰ సర్పము; పాము; ప్రియుడు; విటుడు.

**भुजपाश**–पु॰ गलबाँही ;మెడకౌగలించుకొనుట; మెడకౌగిలి.

**भुजबंद**–पु॰ बाजूबंद ;బాజాబందు.

**भुजाली**–स्त्री॰ ఒకవిధమైన వంకరకత్తి; చిన్నబరిసె.

**भुजिया**–पु॰ ఉప్పుడుబియ్యము; వేపుడుకూర

**भुट्टा**–पु॰ మొక్కజొన్నపొత్తి లేక కండె.

**भुचरा**–वि॰ పదనుపోయిన శస్త్రము; మక్కుపోయిన.

**भुनगा**–पु॰ ఒకవిధమగు ఎగిరే పురుగు.

**भुनना**–अ॰क्रि॰ వేయించబడుట; చిల్లర మార్చుట; చెక్కు; మొ॥ మార్చబడుట

**भुनाई**–स्त्री॰ వేపుడు; మార్పిడి; మార్చబడుట (చిల్లరమొ॥).

**भुनाना**–स॰क्रि॰ మార్పించుట; अ॰क्रि॰ చిల్లరలోనికి మార్చుట.

**भुरकना**–अ॰क्रि॰ ఎండి ఒరుగగవుట; చూర్ణము మొ॥ వెదజల్లుట.

**भुरकु**–पु॰ చూర్ణము.

**भुरकुस निकलना**–मु॰ పిండి పిండి అగుట; ఎముకలుపిండి అగునట్లుగా చితకబాదుట; వినష్టమగుట.

**भुरता**–पु॰ తొక్కి తయారుచేసినబజ్జీ.

**भुरभुरा**–वि॰ ఎండిపగులుటకు లేక విరుగుటకు సిద్ధముగానున్న.

**भुराई**–स्त्री॰ అమాయకత్వము; అబోధత

**भुलक्कड**–वि॰ అతిగా మరుపుగల; మరుపిష్టి

**भुलाना**–स॰क्रि॰ మరపించుట.

**भुलावा**–पु॰ టక్కరితనము; దగా;దారి తప్పించుట.

**भुव**–स्त्री॰ భూమి; కనుబొమ్మ; पु॰ అగ్ని

**भुवन**–पु॰ జగత్తు; లోకము.

**भुवाल**–पु॰ రాజు.

**भुवि**–स्त्री॰ భూమి; పృథ్వి.

**भुस**–पु॰ दे॰ भूसा.

**भूँकना**–अ॰क्रि॰ పెరుగుట వృధాగా వాగుట.

**भूँजना**–स॰क्रि॰ వేయించుట; కష్టపెట్టుట; వేధించుట; स॰क्रि॰ బోధించుట.

**भूँजा**–पु॰ నమలి తినుటకు ఉపకరించు వేయించిన శనగలు మొదలైనవి.

भू–स्त्री॰ భూమి.
भूकंप–पुं॰ భూకంపము.
भूख–स्त्री॰ ఆకలి; ఆవశ్యకత; కానుక.
भूखा–वि॰ ఆకలిగొన్న.
भूगर्भ–पु॰ భూమిలోపలిభాగము; విష్ణువు
भूगर्भशास्त्र–पु॰ భూతత్త్వశాస్త్రము; భూ సంబంధ విషయములను తెలుపు శాస్త్రము; Geology.
भूचाल; भूडोल–पुं॰ భూకంపము.
भूत–पुं॰ ప్రాణి; జీవి; పదార్థము;గడచిన కాలము.
भूत चढना या सवार होना–मु॰ మొండి పట్టు పట్టుట; కోపముతోమండి పడుట.
भूतत्वविद्या–स्त्री॰ दे॰ भूगर्भशास्त्र.
भूतपूर्व–वि॰ మాజీ; ఇంతకు పూర్వము.
भूतात्मा–पु॰ పరమేశ్వరుడు; శివుడు; జీవాత్మ.
भूति–स्त्री॰ వైభవము; ఐశ్వర్యము.
भूधर–पुं॰ పర్వతము; శేషనాగుడు; రాజు; విష్ణువు.
भूनना–स॰क्रि॰ వేయించుట; అతిగా కష్టపెట్టుట.
भूप; भूपति; भूपाल–पुं॰ राजा; రాజు.
भूमा–पु॰ పరమాత్ముడు; భగవంతుడు వి॰ బాగా ఎక్కువ.
भूमिका–स्त्री॰ ప్రస్తావన; భూమిక; వేషము (నాటకము మొ॥).
भूमिज–वि॰ భూమినుంచి ఉద్భవించిన
भूमिजा–वि॰स्त्री॰ భూమినుంచి పుట్టిన; సీతాదేవి.
भूर–वि॰ చాలాఎక్కువ.
भूरा–वि॰ బూడిద వన్నెగల पुं॰ ముడి పంచదార.
भूल–स्त्री॰ మరుపు; పొరపాటు; అశుద్ధి; దోషము.
भूल भुलैयाँ–स्त्री॰ మతిభ్రష్టముచేయు; పలు వంకరటింకర దారులు గల ప్రదేశము లేక భవనము.
भूवा–पु॰ దూది; वि॰ స్వచ్ఛమైన; తెల్లని.
भूशायी–वि॰ మరణించిన; భూమిమీద పడిన; భూమిమీద శయనించిన.
भूषा–स्त्री॰ అలంకరణము; ఆభూష ణములు.
भूषित–वि॰ అలంకృతమైన;అలంక రింపబడిన.
भूसा–पु॰ గొప్ప; ధాన్యపుపొట్టు,పొల్లు వగైరా.

**भूसी**–स्त्री॰ చిట్టు, తవుడు; ఊకమొ॥వి.
**भूसुर**–स्त्री॰ బ్రాహ్మణుడు.
**भृग**–पुं॰ భ్రమరము; తుమ్మెద.
**भृंगराज**–पुं॰ పెద్ద భ్రమరము; తుమ్మెద
**भृंगी**–स्त्री॰ తుమ్మెద; శివుని అనుచర సమూహము.
**भृकुटी**–स्त्री॰ కనుబొమ.
**भृत**–पुं॰ దాసుడు; वि॰ నిండియున్న; పోషించబడిన.
**भृति**–स्त्री॰ దాస్యము; నౌకరి; వేతనము; కూలి.
**भेंट**–स्त्री॰ కలయిక; కానుక.
**भेटना**–स॰क्रि॰ కలియుట;కౌగిలించు కొనుట; దర్శించుట.
**भेक**–पु॰ मेंढक; కప్ప.
**भेख**–पु॰ दे॰ भेष.
**भेजना**–स॰क्रि॰ పంపుట.
**भेजा**–पु॰ మెదడు.
**भेड**–स्त्री॰ भेडी; ఆడ గొర్రె.
**भेडियाधँसान**–पु॰ గుడ్డిగా అనుస రించుట.
**भेडा**–पुं॰ भेढा ; గొర్రెపొట్టేలు.
**भेडिया**–पुं॰ తోడేలు.
**भेद**–पुं॰ భేదము; తేడా; రహస్యము; ఛేదనము.
**भेदक**–वि॰ కంతలు పొడుచు పనిముట్టు; విరేచనముల మందు;ఛేదించు వాడు
**भेदन**–पुं॰ ఛేదించుట; భేదించుట.
**भेदना**–स॰क्रि॰ ఛేదించుట; రంధ్రించుట
**भेदिया**–पुं॰ గుప్తచరుడు; వేగులవాడు.
**भेदी**–पुं॰ दे॰ भेदक.
**भेदीसार**–पुं॰ రంధ్రములు చేయుపని ముట్టు; 'బరమ'.
**भेद्य**–वि॰ ఛేదించదగిన; బెజ్జము వేయు టకు వీలైన; ఛేదించదగిన.
**भेरी**–स्त्री॰ రణభేరి; రాండోలు.
**भेल**–वि॰ పిరికిపంద; బేలవాడు.
**भेली**–स्त्री॰ గుండ్రని బెల్లపు గుళిక; ఏదైనా గుండ్రని గుళిక.
**भेव**–पु॰ రహస్యము; సూక్ష్మకవిషయము
**भेष**–पुं॰ दे॰ वेष.
**भेषज**–पु॰ ఔషధము; మందు.
**भेषना**–स॰क्रि॰ వేషము వేయుట;వేషము మార్చుట.
**भेस**–पु॰ दे॰ वेष.
**भैंस**–स्त्री॰ महिषी; గేదె.
**भैंसा**–पु॰ महिष; దున్న; దున్నపోతు.
**भैन; भैना**–स्त्री॰ సోదరి.
**भैने**–पु॰ మేనల్లుడు.

**भैया**–पु॰ సోదరుడు; సమవయస్కువారిని సంబోధించు శబ్దము.

**भैयाचारी**–स्त्री॰ दे॰ भाईचारा.

**भैयादूज**–स्त्री॰ दे॰ भाईदूज.

**भैरव**–वि॰ భీషణమైన; భయంకరమైన; पु॰ భైరవుడు; శివుడు.

**भोंकना**–स॰क्रि॰ బరిసె మొ॥వానితో పొడుచుట; గాయపరచుట.

**भोंडा**–वि॰ కురూపముగల; అసహ్యమైన

**भोंदू**–वि॰ మూర్ఖమగు.

**भोंपा, भोंपू**–पु॰ పెద్దకూత (కారు, రైలు, మిల్లు మొ॥); ఒకవిధమగు వాద్యము

**भोक्ता**–पु॰ భుజించువాడు; ఆబ్దిక బ్రాహ్మణుడు.

**भोग**–पु॰ భోగము; విలాసము.

**भोगना**–स॰क्रि॰ అనుభవించుట; సహించుట.

**भोज**–पु॰ విందు.

**भोजन**–पु॰ భోజనము; ఆహారము.

**भोज्य**–वि॰ భుజింపదగిన; తినవలసిన

**भोर**–पु॰ ప్రాతఃకాలము; భ్రమ; దగా.

**भोला**–वि॰ అమాయకమైన;కల్లకపట మెరగని.

**भोलानाथ**–पु॰ శంకరుడు; శివుడు.

**भोलापन**–पु॰ అమాయకత్వము; సరళత; నిరాడంబరత.

**भोलाभाला**–वि॰ సరళస్వభావముగల; నిరాడంబరి; కల్లకపటమెరుగని.

**भौं**–स्त्री॰ दे॰ भौंह.

**भौंकना**–अ॰क्रि॰ दे॰ भूँकना.

**भौंर**–पु॰ తేనెటీగ; నీటిసుడి; నల్లగుఱ్ఱము

**भौंरा**–पु॰ తుమ్మెద; భ్రమరము; బొంగరము; రసికుడు.

**भौंरी**–स्त्री॰ పశువులసుడి; నీటిసుడి; అగ్ని చుట్టూ చేయు ప్రదక్షిణము.

**भौंह**–स्त्री॰ కనుబొమ; **भौंह चढाना या तानना**–मु॰ కనుబొమలు ముడిపడుట; కోపించుట.

**भौचक**–वि॰నిర్ఘాంతపోయిన;స్తంభించిన

**भौजाई, भौजी**–स्त्री॰ అన్నభార్య; వదిన.

**भौतिक**–वि॰ లౌకికమైన; శారీరకమైన.

**भौन**–पु॰ భవనము; నివాసము; ఇల్లు.

**भौम**–वि॰భూసంబంధమైన; భూమినుంచి ఉద్భవించిన; पु॰ మంగళగ్రహము

**भौमिक**–पु॰ జమిందారుడు; वि॰భూసంబంధమైన.

**भौसा**–पु॰ జనసమూహము; కోలాహలము.

**भ्रंश**–पु॰ అతఃపతనము; ధ్వంసము; వినాశము; वि॰ భ్రష్టమైన; చెడిన.

**भ्रमण**–पु॰ యాత్ర; పర్యటన.

**भ्रमना**–अ॰क्रि॰ తిరుగుట; పొరబడుట.

भ्रमर–पुं॰ भौरा; తుమ్మెద.

भ्रमाना–स॰क्रि॰ త్రిప్పుట; దారితప్పించుట.

भ्रष्टा–स्त्री॰ కులట; వేశ్య.

भ्रांत–वि॰ భ్రమించిన; మరచిన; వికలమైన

भ्रांति–स्त्री॰ భ్రమ.

भ्राता–पु॰ సహోదరుడు.

भ्रातृजाया–स्त्री॰ సోదరుని భార్య.

भ्रामक–वि॰ భ్రమింపజేయు; దారి తప్పించు; బెదిరించు.

भ्रू–स्त्री॰ भौंह; కనుబొమ.

भ्रूण–पु॰ స్త్రీగర్భము; గర్భములోని శిశు పిండము.

भ्रूभंग–पुं॰ కనుబొమలు ముడిపడుట; క్రోధము.

## म

मंकुर–पु॰ दे॰ मुकुर.

मंग–स्त्री॰ दे॰ माँग.

मंगता–पु॰ भिक्षुक; బిచ్చగాడు.

मँगनी–स्त्री॰ ఎరువువస్తువు; బదులు పుచ్చుకున్నవస్తువు; వివాహనిశ్చితార్థము; అడుగుట.

मंगल–पु॰ అభీష్టసిద్ధి; కల్యాణము.

मंगला–स्त्री॰ పార్వతి.

मँगवाना–स॰क्रि॰ అడిగించి తెప్పించుట; ఏదేని వస్తువు కొనిపించి తెప్పించుట.

मँगेतर–वि॰ వివాహ నిశ్చితార్థము అయిన వ్యక్తి.

मच–पु॰ ఎత్తుగా కట్టబడిన మండపము; చేలో కట్టబడిన మంచ లేక రంగ స్థలము; మంచము.

मंचक–पु॰ दे॰ मच.

मँजना–अ॰क्रि॰ తోమబడుట; శుభ్ర పడుట.

मंजरित–स्त्री॰ చిగిర్చిన; పల్లవించిన.

मंजरी–स्त्री॰ చిగురుటాకు; పల్లవము; లత.

मंजिल–स्त्री॰ యాత్రలలో మధ్యన బస చేయుస్థలము; మకాము; అంతస్తు.

मजीर–पु॰ కాలిఅందె.

मंजु–वि॰ సుందరమైన; మనోహరమైన.

मंजुल–वि॰ दे॰ मजु.

मंजूर–वि॰ అంగీకరించిన; స్వీకరింపబడిన

मंजूरी–स्त्री॰ స్వీకృతి; అంగీకారము.

मंजूषा–स्त्री॰ చిన్న పెట్టె లేక భరిణ.

मंझ–वि॰ మందమతి; అజ్ఞాని; पु॰ మధ్య

मंझधार–पु॰ ప్రవాహపు మధ్యభాగము.

मंझला–वि॰ మధ్య; మాధ్యమికము.

मंझार–क्रि॰वि॰ మధ్యన; మధ్యలో.

मंड–पुं॰ గంజి.

मंडई–स्त्री॰ झोंपडी; గుడిసె.

मडन–पुं॰ అలంకరణ; సింగారము; శాస్త్ర ప్రమాణమును పురస్కరించుకొని సమర్థించుట.

**मंडराना**–अ॰क्रि॰ ఏదేని వస్తువు చుట్టూ తిరుగుతూ ఎగురుట.

**मंडल**–पु॰ మండలము; పరిధి.

**मंडली**–स्त्री॰ సమూహము; పరిధి.

**मंडलीक**–पु॰ సామంతరాజు.

**मंडवा**–पु॰ మండపము.

**मंडित**–वि॰ అలంకరించబడిన; నిండియున్న; వ్యాపించియున్న.

**मंडी**–स्त्री॰ విపణివీధి; సంత.

**मंडुआ**–पु॰ చోళ్ళు; రాగులు.

**मंडूक**–पु॰ కప్ప; ఒక ఋషి

**मंतव्य**–पु॰ అభిప్రాయము.

**मंत्र**–पु॰ మంత్రము; రహస్యము; సలహా

**मंत्रतंत्र**–पु॰ మంత్రతంత్రములు.

**मंत्रणा**–स्त्री॰ పరామర్శ; సలహా;అభిప్రాయము.

**मंथन**–पु॰ చిలుకుట(పెరుగు)మంథనము; మననము.

**मंथन**–पु॰ కవ్వము;ఒక విధమగు జ్వరము; నెమ్మదియైన; సోమరియగు;మంద బుద్ధిగల; సూక్ష్మమైన.

**मंथान**–पु॰ కవ్వము.

**मंद**–वि॰ నెమ్మదియైన;శైథిల్యముగల; సోమరియగు.

**मंदभाग्य**–वि॰ దౌర్భాగ్యమైన;దుర్భాగ్యమైన.

**मंदाग्नि**–स्त्री॰ అజీర్ణరోగము.

**मंदार**–पु॰ మందారవృక్షము; జిల్లేడు; స్వర్గము; ఏనుగు.

**मंदिर**–पु॰ గృహము; దేవాలయము.

**मंदी**–स्त्री॰ ధర తగ్గుదల; చౌక.

**मंद्र**–पु॰ గంభీరమైనధ్వని;वि॰ గంభీరమైన; మనోహరమైన.

**मंशा**–स्त्री॰ కోరిక; అభిప్రాయము;ఆశయము.

**मंसब**–पु॰ పదవి; అధికారము; కర్తవ్యము.

**मंसबदार**–पु॰ గ్రామ మునసబు.

**मंसा**–स्त्री॰ दे॰ मशा.

**मंसूख**–वि॰ రద్దుచేయబడిన; తెగిఉన్న.

**मंसूबा**–पु॰ दे॰ मनसूबा.

**मँहगा**–वि॰ दे॰ महँगा.

**मआज-अल्लाह**–अव्य॰ భగవంతుడు రక్షించుగాక.

**मआनी**–पु॰ माने ;అర్థము; ఉద్దేశ్యము.

**मकई**–स्त्री॰ మొక్కజొన్న.

**मकडा**–पु॰ పెద్దసాలీడు.

**मकडी**–स्त्री॰ చిన్న సాలీడు.

**मकतब**–पु॰ పాఠశాల.

**मकदूर**–पु॰ సామర్థ్యము; శక్తి.

**मकफूल**–वि॰ తాకట్టు పెట్టబడిన.

**मकबरा**–पु॰ సమాధి.

मकबूल–वि॰ అంగీకరించబడిన;ప్రియమైన; మనోహరమైన.

मकरद–पु॰ తేనె; పుప్పొడి.

मकर–पु॰ మొసలి; పెద్ద తాబేలు; మోసము; కపటము; ఒయ్యారము.

मकर केतन; मलरकेतु–पु॰ మకరధ్వజుడు; కామదేవుడు.

मकसद–पु॰ అభిప్రాయము; ఉద్దేశ్యము

मकान–पु॰ గృహము.

मकाम–पु॰ दे॰ मुकाम.

मकु–अव्य॰चाहे;కాని; అయిన అగుగాక

मकुना–पु॰దంతములురాని మగ ఏనుగు; మీసములు రాని పురుషుడు.

मकुनी–स्त्री॰ శనగపిండి రొట్టె; కచౌడి.

मकूला–पु॰ లోకోక్తి; నానుడి.

मकोई–पु॰ అడవికామంచి పండు.

मकोडा–पु॰ చిన్నపురుగు.

मकोय–स्त्री॰ కామంచి మొక్కలేకపండు

मक्कार–वि॰ కపటి; దగాకోరు.

मक्खन–पु॰ नवनीत; వెన్న.

मक्खी–स्त्री॰ ఈగ.

जीती मक्खी निगलना–पु॰ తరువాత పశ్చాత్తాప పడవలసిన దుష్కర్మము కావాలని చేయుట.

मक्खी मारना या उडाना–पु॰ సోమరిగా నుండుట.

मक्खीचूस–पु॰ పిసిగిగొట్టు; పిసినారి.

मक्र–पु॰ మోసము; దగా.

मक्षिका–स्त्री॰ मक्खी ;ఈగ.

मख–पु॰ యజ్ఞము.

मखजन–पु॰ ఖజానా; ధనాగారము.

मखतूल–पु॰ నల్లపట్టు.

मखदूम–पु॰ యజమాని.

मखनिया–पु॰ వెన్న తయారుచేయులేక అమ్మువాడు.

मखमल–स्त्री॰ ముఖమల్ వస్త్రము.

मखलूक–स्त्री॰ సృష్టిలోని జీవరాసి.

मखशाला–स्त्री॰ యజ్ఞశాల.

मखौल–पु॰ ఎగతాళి.

मखौलिया–वि॰ వేళాకోళము చేయువాడు; విదూషకుడు.

मग–पु॰ रास्ता; దారి.

मगज–पु॰ दिमाग; మెదడు.

मगज खाना या चाटना–पु॰ వాగివాగి వేధించుట; విసిగించుట.

मगजपच्ची–स्त्री॰ ఎక్కువగాఆలోచించుట.

मगजी–स्त्री॰ వస్త్రము అంచున వేసిన సన్ననిగోటు.

**मगन**–वि॰ दे॰ मग्न.

**मगना**–पु॰ మగ్నమగుట; లీనమగుట.

**मगर**–पु॰ మొసలి; పెద్దచేప; अव्य॰ కాని.

**मगरमच्छ**–पु॰ మొసలి; తాబేలు; పెద్ద చేప.

**मगरिब**–पु॰ పశ్చిమదిశ.

**मगरूर**–वि॰ గర్విష్టి; దర్పముగల;గర్వముగల.

**मगरूरी**–स्त्री॰ గర్వము; దర్పము;అభిమానము.

**मग्न**–वि॰ తన్మయించిన; నిమజ్జితమైన; లీనమైన.

**मघवा**–पु॰ ఇంద్రుడు.

**मचक मचक**–स्त्री॰ ఒత్తిడి.

**मचकना**–स॰क्रि॰ గట్టిగాని ఒత్తుట; अ॰क्रि॰ ఊపుతో కదలుట.

**मचना**–अ॰क्रि॰ వ్యాపించుట;కోలాహలముగా ప్రారంభమగుట;అల్లరిఅగుట

**मचलना**–अ॰क्रि॰ మొరాయించుట; హఠము చేయుట.

**मचला**–वि॰ మొరాయించు;మాట్లాడవలసి నప్పుడు మౌనమువహించువాడు.

**मचलाई**–स्त्री॰ మారాము; మొరాయింపు

**मचलाना**–अ॰क्रि॰ వికారముపుట్టుట; स॰क्रि॰ మారాము చేయించుట.

**मचली**–स्त्री॰ दे॰ मिचली.

**मचान**–स्त्री॰ పైరు కావలికొరకు వేయు ఎత్తైన మంచె.

**मचाना**–स॰क्रि॰ కోలాహలంగా ఏదేని పని ప్రారంభించుట; వ్యాపింపజేయుట; గల్లంతు చేయుట.

**मचिया**–स्त्री॰ చిన్నమంచము; పీట.

**मच्छ**–पु॰ పెద్దచేప.

**मच्छड;मच्छर**–पु॰ దోమ

**मच्छी**–स्त्री॰ दे॰ मछली; చేప.

**मछुआ;मछुवा**–पु॰ చేపలు పట్టువాడు; పల్లెజాతివాడు; బెస్తవాడు.

**मजकूर**–वि॰ చర్చించబడిన; చెప్పబడిన पु॰ వ్రాయబడిన వివరణ.

**मजकूरी**–पु॰ సమన్లు అందజేయువాడు

**मजदूर**–पु॰ కూలిమనిషి; బరువులు మోయునౌకరు.

**मजदूरी**–स्त्री॰ కూలిపని; కూలి.

**मजनूँ**–पु॰ పిచ్చివాడు; లైలాప్రియుడు; ప్రియుడు.

**मजबूत**–वि॰ దృఢమైన; బలమైన.

**मजबूर**-वि॰వివశమైన; గత్యంతరములేని

**मजबूरी**–स्त्री॰ నిస్సహాయత; గత్యంతరములేమి.

**मजमा**–पु॰ జనసమూహము; సభ.

**मजमूआ**–पु॰ పలువస్తువుల పోగు;సంగ్రహము वि॰ పోగైన; పోగుచేసిన.

**मजमूई**–वि॰ సామూహికమైన.

**मजमून**–पु॰ విషయము; వ్యాసము.

**मजलिस**–स्त्री॰ సభ; ఉత్సవము;నాట్యరంగము.

**मजलूम**–वि॰పీడింపబడిన; వేధింపబడిన దౌర్జన్యపీడితమైన.

**मजहब**–पुं॰ మతము; సంప్రదాయము

**मजा**–पुं॰ రుచి; స్వాదము; ఆనందము; ఉల్లాసము.

**मजा चखाना**–पु॰ చేసిన దోష్ట్యమునకు దండించుట; **मजा आजाना**–पु॰ ఉల్లాసము కలుగుట;ఆనందము కలుగుట.

**मजाक**–पु॰ ఎగతాళి; వేళాకోళము.

**मजाकन**–क्रि॰वि॰ ఎగతాళికి;పరిహాసమునకు.

**मजाकिया**–वि॰ వినోదప్రియుడు.

**मजाज**–पुं॰ నియమానుసారము;ప్రాప్తించిన అధికారము.

**मजाजी**–वि॰ లౌకికమైన; కృత్రిమమైన.

**मजार**–पु॰ సమాధి; యోగిపుంగవుని సమాధి; पु॰ పిల్లి; మార్జాలము.

**मजारी**–स्त्री॰ పిల్లి.

**मजाल**–स्त्री॰ శక్తి; సామర్థ్యము;సాహసము.

**मजिल**–स्त्री॰ दे॰ मंजिल.

**मजीठ**–स्त्री॰ 'మంజిష్ఠము' అనబడు ఒకతీగ; దీని రెమ్మలతోనూ వేళ్ళతోనూ ఎరుపురంగు తయారగును.

**मजीरा**–पुं॰ కంచుతాళము(లు).

**मजूरी**–स्त्री॰ दे॰ मजदूरी.

**मजेदार**–पुं॰ రుచిగల; రుచికరము; ఉల్లాసకరమైన.

**मज्जन**–वि॰ స్నానము.

**मज्जा**–स्त्री॰ ఎముకల యందు ఉండు గుజ్జు.

**मझधार**–स्त्री॰ ప్రవాహపు మధ్యభాగము; ఏదేని కార్యమధ్య భాగములేకస్థితి.

**मझला;मझोला**–वि॰ నడుమ; మధ్యన

**मझोली**–स्त्री॰ ఒకవిధమగు ఎద్దుబండి

**मटक**–स्त्री॰ ఒయ్యారము; ఒయ్యారపు గతి లేకనడక.

**मटकना**–अ॰क्रि॰ ఒయ్యారముగానడుచుట; కులుకుట.

**मटका**–पुं॰ పెద్దకుండ.

**मटकाना**–स॰क्रि॰ ఒయ్యారము పోవుట; వగలు చేయుట స॰क्रि॰ వగలు ప్రదర్శింపజేయుట.
**मटकी**–स्त्री॰ పిడత; చిన్నకుండ.
**मटकीला**–वि॰ ఒయ్యారము పోవువాడు; వగలు పోవువాడు.
**मटमैला**–वि॰ బూడిద రంగుగల;ఖాకీ రంగుగల.
**मटर**–पु॰ బఠాణి.
**मटर गश्त**–पुं॰ షికారు; పచారు.
**मटियामेट**–वि॰ दे॰ मलियामेट.
**मटियाला,मटीला**–वि॰ दे॰ मटमैला.
**मट्टी**–स्त्री॰ दे॰ मिट्टी.
**मट्ठा**–पु॰ छाछ ;మజ్జిగ.
**मठ**–पु॰ సాధుసన్యాసుల నివాసమందిరము.
**मठिया**–स्त्री॰ చిన్న మఠము.
**मडई**–स्त्री॰ చిన్న మండపము; గుడిసె.
**मडवा**–पुं॰ दे॰ मंडप.
**मडैया**–स्त्री॰ दे॰ मडई.
**मढ**–वि॰మొరాయించి కూర్చుండువాడు
**मढना**–स॰क्रि॰ నలువైపుల చుట్టుట లేక అంటించుట; ఆరోపించుట;దోషారోపణ చేయుట.
**मढाई**–स्त्री॰ ఆరోపణ.
**मढी**–स्त्री॰ కుటీరము; గుడిసె.
**मणि**–स्त्री॰ రత్నము.
**मणी**–पुं॰ సర్పము.
**मतंग**–पु॰ ఏనుగు; మేఘము;ఒకబుుషి
**मत**–पुं॰ నిశ్చితమైన సిద్ధాంతము; అభిప్రాయము; సంప్రదాయము; ఓటు; क्रि॰वि॰వద్దు (నిషేధసూచకము).
**मतभेद**–पु॰ అభిప్రాయభేదము.
**मतलब**–पु॰అర్థము; తాత్పర్యము; ఆశయము; స్వార్థము.
**मतलबी**–वि॰ స్వార్థి; స్వార్థపరుడు.
**मतली**–स्त्री॰ दे॰ मिचली.
**मतवाला**–वि॰ నిషాలోనున్న; మత్తెక్కిన
**मताधिकार**–पु॰ ఓటు అధికారము.
**मतीरा**–पुं॰ పుచ్చకాయ.
**मतेई**–स्त्री॰ సవతితల్లి.
**मत्त**–वि॰ మత్తెక్కిన; ఉన్మత్తమైన;పిచ్చెక్కిన.
**मत्था**–पु॰ दे॰ माथा.
**मत्सर**–पुं॰ ఈర్ష్య; క్రోధము.
**मथना**–स॰क्रि॰ చిలుకుట(పెరుగుమొ॥) మధించుట; గౌరవించుట; पु॰ కవ్వము
**मथनी;मथानी**–स्त्री॰ కవ్వము.
**मद**–पुं॰ మదము; మత్తు; మద్యము; ఆనందము; దంభము ;स्त्री॰ ఖాతా; విభాగము.

मदकची;मदकी–वि॰ మాదకద్రవ్యములు, గోలు.
मदकल;मदकी–वि॰ మత్తెక్కిన;మదించిన.
मदखला–स्त्री॰ ఉంపుడుకత్తె.
मदद–स्त्री॰ సహాయము.
मददगार–वि॰ సహాయము చేయువాడు; సహాయకుడు.
मदमत्त–वि॰ మత్తుమదించిన; మత్తెక్కిన
मदरसा–पु॰ विद्यालय; పాఠశాల.
मदाखिलत–स्त्री॰ ప్రవేశించుట; ప్రవేశాధికారమును బలపరచుకొనుట.
मदार–पु॰ జిల్లేడు.
मदारी–पु॰ కోతులను, ఎలుగుబంట్లను ఆడించువాడు; గారడీవాడు.
मदिर–वि॰ మత్తెక్కించు.
मदिरा–वि॰ शाराब; మద్యము.
मदिराम–वि॰ మద్యపు మత్తులో లీనమైన
मदीय–वि॰ मेरा; నాయొక్క.
मदीला–वि॰ మత్తుకలుగజేయు.
मदीयून–वि॰ బాకీ ఉన్న; ఋణగ్రస్తుడు.
मद्दत–स्त्री॰ मदद;సహాయము; ప్రశంస; పొగడ్త.
मद्धम–वि॰ मध्धिम; మధ్యస్థము.
मद्य–वि॰ మద్యము.
मद्यप–वि॰ మద్యమును సేవించువాడు.
मधु–पु॰ మద్యము; తేనె; वि॰ తియ్యని; రుచిగల.
मधुकर–पु॰ తుమ్మెద; లంపటుడు.
मधुकरी–स्त्री॰ మధూకరం; వండిన పదార్థముల భిక్ష.
मधुप–पु॰ తుమ్మెద; తేనెటీగ; ఉద్ధవుడు.
मधुमक्खी–स्त्री॰ दे॰ मधुप.
मधुपर्क–पु॰ దేవతలకు అర్పించు పెరుగు, నెయ్యి, జలము; తేనె, పంచదారసమ్మేళనము.
मधूक–पु॰ मधुआ; ఇప్ప చెట్టు.
मन–पु॰ మనస్సు; చిత్తము; కోరిక;సంకల్పము; అభిప్రాయము.
मन के लड्डू खाना–मु॰ గాలిమేడలు కట్టి సంతోషించుట.
मनदेना–पु॰ మనస్సు లగ్నము చేయుట;
मन बढ़ाना–पु॰ ఉత్సాహపరచుట.
मन में बसना–पु॰ నచ్చుట.
मन भरना–पु॰ నమ్మకముకలుగుట; నిశ్చయము కలుగుట.
मन भर जाना–पु॰ తృప్తిజెందుట; వెగటుపుట్టుట.
मन मैला करना–मु॰ అసంతుష్టమగుట.
मन मोटा होना–मु॰ విచారించుట.
मनमाना–वि॰ స్వేచ్ఛానుసారము;ఇష్టానుసారము.
मनका–पु॰ పూస; రుద్రాక్ష; జపము.

**मन कामना**–स्त्री० మనోకామన.

**मनकूला**–वि० చరము; జంగమము.

**मनकूला जायदाद** –यौ० చరాస్తి.

**मनकूला गैर**–पु० స్థిరాస్తి.

**मनगढंत**–वि० కల్పితమగు; కపోల కల్పితమగు.

**मनचला**–वि० నిశ్చయమగు;సాహసి యగు; రసికుడు.

**मनचाहा**–वि० వాంఛితమైన.

**मनचीतना**–स०क्रि० మనస్సుకుబాగని పించుట.

**मनचीता**–वि० दे०मनचाहा; మనస్సులో ఆలోచించిన.

**मनजर**–पु० దృశ్యము.

**मनन**–पु० చింతన; బాగా అధ్యయనించుట

**मनभाया**–वि० మనస్సుకు నచ్చిన;మనో నకూలమైన.

**मनभावता**–वि० మంచిగా అనిపించు; ప్రియమైన.

**मनमुटाव**–पु० వైమనస్యము; దుర్భావము

**मनमोदक**–पु०గాలిమేడ;గొంతెమ్మకోరిక

**मनमौजी**–वि० మనస్సుకు నచ్చినట్లుగా పనిచేయు.

**मनरोचन**–वि० సుందరమైన;మనోహర మైన.

**मनवाना**–स०क्रि० ఒప్పించ ప్రయత్నిం చుట; బ్రతిమాలుట.

**मनशा**–स्त्री० కోరిక; అభిప్రాయము; సంకల్పము.

**मनसब**–पु० పదవి; హోదా; పని;అధి కారము.

**मनसबदार**–पु० పదవిలో నున్నవాడు; హోదాపరుడు.

**मनसा**–स्त्री० కోరిక;మనోరథము; అభిప్రా యము; वि०మానశికమైన; क्रि०वि० మనసుద్వారా.

**मनसिज**–पु० కామదేవుడు.

**मनसूख**–वि० అప్రామాణికమైన;త్యజిం చిన; రద్దైన.

**मनसूबा**–पु०యుక్తి; నిశ్చయము; తలంపు; సంకల్పము;**मनसूबा बाधना**–पु० యుక్తి ఆలోచించుట.

**मनस्वी**–वि०బుద్ధిమంతుడు; స్వేచ్ఛావాది

**मनहूस**–वि० అశుభమైన; చెడ్డ; అశోభ నీయము.

**मना**–वि० నిషిద్ధము; త్యాజ్యము; వారింప బడిన.

**मनादी**–स्त्री० दे० मुनादी.

**मनाना**–स०क्रि० ఒప్పించుట;బ్రతిమా లుట; మ్రొక్కుకొనుట.

**मनावन**–पु० బ్రతిమాలుడు; మొక్కుబడి

**मनाही**–स्त्री० నిషేధము; అవరోధము; చెయ్యవద్దని ఆదేశము.

**मनिहार**–पुं॰ గాజులబత్తుడు.

**मनी**–स्त्री॰ అభిమానము; అహంకారము; स्त्री॰ వీర్యము.

**मनीषा**–स्त्री॰ బుద్ధి; మేధస్సు.

**मनीषि; मनीषी**–वि॰ బుద్ధిమంతుడు; మేధావి; జ్ఞాని; పండితుడు.

**मनु**–अव्य॰ दे॰मानो,–पु॰ మానవజాతికి మూలపురుషుడు.

**मनुजाद**–पु॰ మానవభక్షకుడు; రాక్షసుడు

**मनुहार**–स्त्री॰ అలక తొలగించుటకు చేయు ప్రార్థన.

**मनों**– अव्य॰मानो;అనునట్లు; వలె; ఇలా-అలా ఉన్నదా అన్నట్లు.

**मनोज्ञ**–वि॰ మనోహరమైన.

**मनोनीत**–वि॰ మనస్సుప్రకారము;ఎన్ను కొనబడిన.

**मनोमालिन्य**–पु॰ ద్వేషము; వైరము.

**मनोरजन**–पु॰ మనోవినోదము;ఆహ్లాదము.

**मनोरथ**–पु॰ మనోకామన; అభిలాష

**मनोरम**–वि॰ అందమైన; మనోహరమైన

**मनोवेग**–पु॰ మనోవికారము-భావము.

**मानौती; मन्नत**–स्त्री॰ మొక్కు;సంకల్పం; మొక్కుబడి.

**मफरूर**–वि॰ పరారైన.

**मम**–सर्व॰ నాయొక్క.

**ममता**–स्त्री॰ మమత్వము; స్నేహము; ప్రేమ; వాత్సల్యము; మోహము.

**ममाखी**–स्त्री॰ मधुमक्खी ;తేనెటీగ.

**ममेरा**–वि॰ మేనమామకు జన్మించిన.

**मयक**–पु॰ चद्रमा; చంద్రుడు.

**मयद**–पु॰ సింహము.

**मय**–सर्व॰ दे॰ "मैं"

**मयगल**–पु॰ మత్తగజము.

**मयमत्त**–वि॰ మదించిన.

**मयसुता**–स्त्री॰ మండోదరి.

**मयस्सर**–वि॰ ప్రాప్తించిన; లభ్యమైన.

**मयूख**–पु॰ కిరణము; దీప్తి; తేనె.

**मयूर**–पु॰ मोर; నెమలి.

**मरकज**–पु॰ కేంద్రము.

**मरकत**–पु॰ पन्ना; పచ్చ;ఆకుపచ్చరత్నం.

**मरघट**–पु॰ శ్మశానము.

**मरज**–पुं॰ बीमारी; రోగము; జబ్బు.

**मरजाद**-पु॰ **मरजादा**–स्त्री॰ दे॰ मर्यादा

**मरजिया**–वि॰ చచ్చి బ్రతికిన;చావునుండి తప్పించుకున్న.

**मरजी**–स्त्री॰ కోరిక; ప్రసన్నత; స్వీకృతి; ఆజ్ఞ.

**मरतबा**–पु॰ పర్యాయము; తడవ; పదవి.

**मरदना**–स॰क्रि॰ మర్దించుట.

**मरदानगी**–स्त्री॰ పుంసత్వము; సాహసము; శౌర్యము; వీరత్వము.

**मरदाना**–वि॰ పురుష సంబంధమైన; పురుషుని వలె; వీరోచితమైన.

**मरदुम**–पु॰ आदमी ;మనిషి; మానవుడు.

**मरुदुम आजार**–वि॰ దుర్మార్గుడు; అత్యాచారి.

**मरदूद**–वि॰ నీచమైన; హేయమైన; త్యజింపబడిన.

**मरना**–अ॰क्रि॰ చనిపోవుట; చచ్చుట.

**मरना जीना**–पु॰ సుఖదు:ఖములు.

**(किसी पर) मरना**–पु॰ మోహింప బడుట

**मरभुक्खा**–वि॰ దరిద్రుడు; నిరుపేద; ఆకలిగొన్న.

**मरम**–पु॰ दे॰ मर्म.

**मरमर**–पुं॰ చలువరాయి.

**मरम्मत**–स्त्री॰ మరమ్మత్తు; బాగుచేత.

**मरसिया**–पु॰ శోకసూచకమైన కవిత్వము; శోకగీతము.

**मरहट**–पु॰ दे॰ मरघर.

**मरहठा**–पु॰ మహారాష్ట్రప్రాంతపు నివాసి.

**मरहबा**–अव्य॰ शाबाश ; ప్రశంసా సూచక శబ్దము-శబాష్

**मरहम**–पु॰ మలాము; గాయములపై రాయబడు ఒక లేపనము.

**मरहून**–वि॰ తాకట్టు పెట్టబడిన.

**मरहूम**–वि॰ చనిపోయిన; కీర్తిశేషులైన.

**मरातिब**–पु॰ పదవి; దర్జా; ఇంటి అంతస్థు; పతాకము.

**मरायल**–वि॰ పలుమార్లు దెబ్బలు తినిన; కొట్టబడిన; నిర్బలమైన पुं॰ నష్టము; లోటు.

**मराल**–पु॰ హంస; ఏనుగు; గుఱ్ఱము.

**मरिचा**–स्त्री॰ मिरिच या मिर्च ;మిరప; మిరియాలు.

**मरियल**–वि॰ దుర్బలమైన; చావుకి సిద్ధ ముగానున్న.

**मरी**–स्त्री॰ ఒక భయంకరమైనఅంటు వ్యాధి.

**मरीचि**–स्त्री॰కిరణము; కాంతి; ఒక ఋషి

**मरीचिका**–स्त्री॰ మృగతృష్ణ; ఎండ మావులు.

**मरीची**–पु॰ సూర్యుడు; చంద్రుడు.

**मरीज**–पु॰ రోగి; రోగగ్రస్తుడు.

**मरीना**–पु॰ఒక విధమగు మృదువైన పల్చని ఉన్ని వస్త్రము.

**मरु**–पु॰ ఎడారి; నిర్జన ప్రదేశము.

**मरुत्**–पु॰ వాయువు; ప్రాణము.

**मरुभूमि; मरुस्थल**–स्त्री॰ ఎడారి.

**मरोड**–पु॰ మెలిక; బిగువు; క్షోభము.

**मरोडना;मरोरना**–स॰क्रि॰ మెలిపెట్టుట; మర్దించిదు:ఖము కలిగించుట; మెలి పెట్టిచంపుట; పీడించుట. हाथमरोडना

**मर्ज**–पुं॰ दे॰ मरज.

**मर्तबान**–पु॰ ఊరగాయ పెట్టుజాడి.

**मर्द**–पु॰ మనుష్యుడు; పురుషుడు.

**मर्दुम**–पु॰ మనుష్యుడు; మానవుడు.

**मर्दुमी**–स्त्री॰ పుంసత్వము; పౌరుషము.

**मर्म**–पु॰ తత్వము; రహస్యము.

**मर्मज्ञ**–वि॰ మర్మము తెలిసినవాడు; తత్వము తెలిసిన.

**मर्मभेदी**–वि॰ గుండె బద్దలుకొట్టునది

**मर्यादा**–स्त्री॰సీమ; హద్దు; మర్యాద; ప్రతిష్ఠ

**मल**–पु॰ మలము;విష్ఠము; దుర్గుణము; మురికి.

**मलका**–स्त्री॰ అతి సౌందర్యవతి; మహా రాణి.

**मलगजा**–पु॰ వంకాయ బజ్జీలు; वि॰ నలుపబడిన.

**मलना**–स॰क्रि॰మర్దించుట; నలుముట; మాలిషు చేయుట.

**मलबा**–पुं॰ చెత్త-చెదారము; కసువు; భగ్న భవనపు విరిగిపడి పోయిన రాళ్ళు రప్పలు మొదలైనవి.

**मलमल**–स्त्री॰నాజూకైన వస్త్రము; మల్లు; గ్లాస్కో వగైరా.

**मलमास**–पु॰ అధికమాసము.

**मलय**–पु॰ పర్వతము; దక్షిణాదిన ఉన్న మలయ పర్వతము.

**मलयानिल**–पु॰ మలయ పర్వతవైపు నుండి వీచు సుగంధిత వాయువు.

**मलहम**–पु॰ दे॰ मरहम.

**मलाई**–स्त्री॰ మీగడ; మర్దన;మర్దించి నందులకు కూలి;తోమినందుకు కూలి.

**मलाट**–पु॰ వస్తువులను చుట్టుమందపు కాగితము.

**मलामत**–स्त्री॰ నిరసన; చివాట్లు;తిరస్కారము.

**मलार**–पु॰ వర్షాకాలములో పాడబడు ఒకరాగము (సంగీతము).

**मलार गाना**–पु॰ బహు ఆనందముతో చెప్పుట; ముఖ్యముగా పాడుట.

**मलाल**–पु॰ దు:ఖము; విషాదము.

**मलाह**–पु॰ दे॰ मल्लाह.

**मलिद**–पु॰ दे॰ मिलद.

**मलिक**–पु॰ రాజు; చక్రవర్తి.

**मलिका**–स्त्री॰ అధీశ్వరి; సామ్రాజ్ఞి;చక్రవర్తి భార్య.

**मलिन**–वि॰ మురికియైన; చెడ్డ.

**मलियामे**–पु॰मटियामेट; సర్వనాశనము; వినాశము; మట్టిపాలగుట.

**मलीदा**– నెయ్యి; పంచదారలతో చేసిన పొడిపొడి రొట్టె; ఒక ఖాద్య పదార్థము; ఒక విధమగు బహు కోమలమైన ఉన్ని వస్త్రము.

**मलीन**–वि॰ మురికియైన; విషాదముగ.

**मलूक**–वि॰ మనోహరమైన; ఒక విధమగు పక్షి లేక పురుగు.

**मल्ल**–पु॰ కుస్తీ వస్తాదు; పహిల్వాను; దీపపువత్తి; జ్వాల.

**मल्लयुद्ध**–पु॰ కుస్తీ.

**मल्लाह**–पु॰ माँझी; పడవ నడుపువాడు; పల్లెజాతి మనిషి.

**मल्लु**–पुं॰ మర్కటము; ఎలుగబంటి.

**मल्हाना;मल्हारना**–स॰क्रि॰ ముద్దులాడుట; ముద్దులతో లాలించుట

**मवक्किल**–पु॰ తన తరపున వకీలును నియమించు వాదిలేక ప్రతివాది.

**मवाजिब**–पु॰ నిశ్చితమైన సమయమున లభించు పదార్థము; వేతనము; జీతము.

**मवाजी**–वि॰ మొత్తము; సాధారణముగా సమానమైన; దాదాపు.

**मवाद**–पु॰ చీము; మసాలా సామగ్రి.

**मवास**–पु॰ ఆశ్రయము; శరణు;ఆశ్రయ స్థానము; కోట.

**मवेशी**–पु॰ పశువు; జంతువు.

**मवेशीखाना**–पुं॰ పశువులదొడ్డి

**मशक**–पु॰ मच्छर దోమ; स्त्री॰నీరు నింపుతోలు సంచి.

**मशक्कत**–स्ती॰ శ్రమ; కఠినపరిశ్రమ.

**मशगूल**–वि॰ కార్యనిమగ్నమైన.

**मशरिक**–पु॰ తూర్పుదిక్కు.

**मशरिकी**–वि॰ తూర్పుదిక్కునకు సంబంధించిన.

**मशरुह**–वि॰ స్పష్టము చేయబడిన;తేటతెల్లము చేయబడిన.

**मशवरा;मशविरा**–पु॰ సలహా; పరామర్శ

**मशहूर**–वि॰ ప్రఖ్యాతమైన.

**मशाल**–स्त्री కాగడా; **मशाल जलाकर या लेकर ढूँढना**–पु॰ బాగుగా వెతుకుట; గాలించుట.

**मशालची**–पुं॰ కాగడా పట్టుకొనిచూపించువాడు.

**मशीन**–स्त्री॰ యంత్రము; మిషను.

**मश्क**–पु॰ అభ్యాసము.

**मश्कूक**–वि॰ సందేహముగల; సందిగ్ధమైన.

**मश्शाक**–वि॰ అభ్యస్తమైన; దక్షతగల.

**मस**–स्त्री० ప్రకాశము; నూగు మీసము.
**मसें भीगना**–पु० నూగు మీసములు వచ్చుట; యవ్వనము వచ్చుట.
**मसक**–पु० मच्छड ;దోమ.
**मसकत**–स्त्री० दे० मशक्कत.
**मसकना**–स०क्रि० గట్టిగా నొక్కుటలేక రుద్దుట; పగిలేంత వరకు,చినిగేంత వరకు నొక్కుట లేక పిండుట.
**मसकला**–पु० కత్తులకు పదును పెట్టు ఒక పనిముట్టు.
**मसका**–पु० नैनूँ; నవనీతము; వెన్న.
**मसकान**–वि० దరిద్రుడు; నిస్పృహ యుడు; భోళామనిషి.
**मसखरा**–पु० ఎగతాళిచేయువాడు; పరిహాసము చేయువాడు.
**मसखरी**–स्त्री వినోదము; వేళాకోళము
**मसजिद**–स्त्री० మసీదు.
**मसनद**–स्त्री० పెద్దదిండు;రాజసింహాసనము.
**मसनवी**–स्त्री० ఒకవిధమైన అరబీ, ఉర్దూ భాషల పద్యశైలి.
**मसरफ**–पु० ఉపయోగము.
**मसरूफ**–वि० కార్యలగ్నమైన.
**मसल**–स्त्री० कहावत; నానుడి; లోకోక్తి; ఉదాహరణము.
**मसलन**–वि० ఉదాహరణార్థము.
**मसलना**–वि० చేతితో రుద్దుతూ నొక్కుట; పిండి కలిపి సాగదీయుట
**मसलहत**–स्त्री० వెంటనే బోధపడని గుప్తమైన యుక్తి; బహిర్గతముకాని శుభహేతువు.
**मसली**–पु० లోకోక్తి; ఆలోచించదగిన విషయము
**मसविदा**–पु० दे० मसौदा.
**मसहरी**–स्त्री० मच्छरदानी; దోమతెర.
**मसा**–पु० పులిపిరికాయ; సూరిడికాయ.
**मसान**–पु० मरघट; శ్మశానము.
**मसाना**–पु० మూత్రాశయము.
**मसाला**–पु० మసాలా సామాను;పోపు సామగ్రి.
**मसालेदार**–वि० మసాలా కలిసిన.
**मसि**–स्त्री० సిరా; కాటుక.
**मसिदानी**–स्त्री० సిరాబుడ్డి;కాటుక భరిణి
**मसियाना**–अ०क्रि० పూర్తిగానిండుట.
**मसीह, मसीहा**–पु०ఏసుప్రభువు; భగవంతుని దూత.
**मसूडा**–पु० పళ్లచిగుళ్ళు.
**मसूर**–पु० मसुरी; ఒక విధమగు పప్పు ధాన్యము; కంది పప్పు వలెఎరుపుగా నుండు ఒక పప్పుదాన్యము.
**मसूरा**–स्त्री० మసూరపప్పుతో తయారైన వడియము.

**विचारणीय** - वि० ఆలోచించదగిన.

**विचिकित्सा** - स्त्री० సందేహము.

**विच्छित्ति** - स्त्री० విచ్ఛేదము; వేర్పాటు; లోటు.

**विच्छिन्न** - वि० వేరుపరచబడిన; విభక్తమైన; అంతమైన.

**विच्छेद** - पुं० నాశము; తెగతెంపులు; వియోగము.

**विच्युत** - वि० రాలిపడిపోయిన.

**विछोह** - पुं० వియోగము.

**विजन** - वि० నిర్జనమైన; ఏకాంతమైన; पुं० విసనకర్ర; వ్యజనము.

**विजना** - पुं० వ్యజనము; విసనక్రర.

**विजया** - स्त्री० దుర్గాదేవి; భంగు.

**विजारत** - स्त्री० మంత్రి పదవి; మంత్రి కార్యాలయము.

**विजिगीषा** - स्त्री० విజయము పొందు కాంక్ష

**विजित** - वि० గెలిచిన; గెలవబడిన; పరాజిత మైన.

**विजेता** - पुं० జయించినవాడు.

**विज्ञ** - वि० బుద్ధిమంతుడు; విద్వాంసుడు; పండితుడు.

**विज्ञप्ति** - स्त्री० సూచన; విజ్ఞాపనము.

**विज्ञान** - पुं० శాస్త్రము; శాస్త్రజ్ఞానము.

**विज्ञापन** - पुं० అందరికి పత్రికల ద్వారా తెలియజేయబడు సూచన.

**विज्ञापित** - वि० విజ్ఞాపింపబడిన; తెలియ జేయబడిన.

**विट** - पुं० విటుడు; కాముకుడు.

**विटप** - पुं० చెట్టు; వృక్షము.

**विडंबना** - स्त्री० వెక్కిరింపు; అపహాస్యము; లజ్జాకర విషయము.

**विडरना** - अ०क्रि० చెల్లాచెదరగుట; పారి పోవుట; పరుగిడుట.

**विडारना** - स०क्रि० చెల్లాచెదరు చేయుట; పారద్రోలుట.

**विडाल** - पुं० दे० बिडाल.

**वितंडा** - स्त्री० వితండవాదము; హేతు పూర్వకముగా వివాదము.

**वितरण** - पुं० పంపిణీ; పంచుట; గానము చేయుట.

**वितरित** - वि० పంచబడిన; పంపిణీ చేయ బడిన.

**वितल**-पुं० పాతాళలోకములలో మూడవది.

**वितस्तित** - पुं० జానెడు.

**वितान** - पुं० चँदोवा ; డేరా; వ్యాప్తి; సమూహము.

**वितुंड** - पुं० ఏనుగు.

**वित्त** - पुं० ధనము; సంపత్తి.

**विभाग** - पुं० పంపిణీ; విభాగము; వితరణము.
**विभाजक** - वि० విభజించు.
**विभाजित** - वि० విభక్తమైన.
**विभाज्य** - वि० విభజింపదగిన; విభజింప వలసిన.
**विभाति** - स्त्री० శోభ.
**विभावरी** - स्त्री० రాత్రి; నక్షత్రముల కాంతి గల రాత్రి ; దూతి.
**विभासना** - अ०क्रि० మెరయుట.
**विभिन्न** - वि० విశిష్టమైన; పలువిధములైన.
**विभीषिका** - स्त्री० భయోత్పాదకము; భయానక దృశ్యము.
**विभूति** - स्त्री० ఆధిక్యము; అతిశయత; ఐశ్వర్యము; విభవము.
**विभूषित** - वि० అలంకృతమైన; ఆభూషణ ములతో శోభాయ మానమగు.
**विभोर** - वि० విహ్వలమైన; మగ్నమైన; వికల మైన.
**विभ्रम** - पुं० భ్రమణము; భ్రాంతి; శోభ; సౌందర్యము.
**विमंडित** - वि० అలంకృతమైన.
**विमत**-पुं०విసమ్మతి; వ్యతిరేకఅభిప్రాయము.
**विमनस्क** - वि० అన్యమనస్కమైన.
**विमर्श** - पुं० విమర్శ; సమీక్ష; పరామర్శ.
**विमर्ष** - पुं० విచారణ; ఆలోచన; వ్యాకు క్షోభ; ఉద్యోగము.
**विमल** - वि० స్వచ్ఛమైన; నిర్మలమైన; మనోహరమైన.
**विमला** - स्त्री० సరస్వతి.
**विमाता** - स्त्री० सौतेली माँ; సవతి
**विमार्ग** - वि० కుమార్గము; చెడుదారి
**विमुक्त** - वि० స్వతంత్రమైన; స్వచ్ఛంద
**विमुख** - वि० ముఖరహితమైన; ము తిప్పిన; అనుకూలమైన.
**विमुग्ध** - वि० బహు ముగ్ధమైన; భ్రాంత మత్తెక్కిన.
**विमूढ** - वि० భ్రాంతమైన; విశేష మోహింపబడిన; మూర్ఛజెందిన.
**विमोचन** - पुं० విముక్తి; విడుదల.
**विमोहक** - वि० మోహించువాడు; వి నిగా చేయువాడు.
**विमोहित** - वि० ముగ్ధమైన; స్పృహలో మూర్ఛచెందిన.
**विमौट** - पुं० పుట్ట; పుట్ట కలుగు.
**वियुक्त** - वि० ఎడబాసిన; వియుక్తమై
**वियोग** - पुं० విచ్ఛేదము; ఎడబాటు.
**वियोगिनी** - वि०/स्त्री० తన ప్రియుని భర్తను ఎడబాసిన స్త్రీ.
**वियोगी** - वि० (पुं०) తన ప్రియురా

భార్య నుండి వేరైన పురుషుడు.
**विरंचि** - पुं० బ్రహ్మ; విధాత.
**विरक्त** - वि० విముఖమైన; విరక్తినొందిన.
**विरचना** - स०क्रि० నిర్మించుట; అలంక రించుట; अ०क्रि० విరక్తమైన.
**विरचित** - वि० నిర్మితమైన; వ్రాయబడిన.
**विरत** - वि० విముఖమైన; విరక్తినొందిన; నివృత్తమైన; నిమగ్నమైన.
**विरद** - पुं० ప్రసిద్ధి ; ఖ్యాతి.
**विरदावली** - स्त्री० యశోగాథ; కీర్తికి సంబంధించిన కథ.
**विरमना** - अ०क्रि० లగ్నమగుట; మోహము తో ఆగిపోవుట.
**विरल** - वि० विरला ; దుర్లభమైన; అరుదైన.
**विरही** - वि० दे० विरल.
**विरही** - वि० వియోగి.
**विराग** - पुं० వైరాగ్యము.
**विराजना** - अ०कि० శోభిల్లుట; రాణిం చుట; ఆసీనమగుట.
**विराजमान,** - वि० శోభాయమానమైన; ప్రకాశించుచున్న; విరాజిల్లుచున్న.
**विराट** - पुं० బ్రహ్మదేవుని అనంతరూపము; वि० విరాటమైన; బృహదాకారముగల.
**विराध** - पुं० పీడనము; బాధ; వేధించువాడు.
**विराम** - पुं० ఆగుట; విశ్రాంతి; విశ్రాంతిం చుట; వాక్యావసానపు చిహ్నము.
**विरासत** - स्त्री० वरासत ; వారసత్వము.
**विरुद्ध** - वि० ప్రతికూలమైన; విరుద్ధమైన
**विरूप** - वि० కురూపము; వ్యతిరేకమైన.
**विरेचक** -वि० విరేచనము కలిగించు.
**विरोचन** - पुं० దీప్తి; ప్రకాశము; శోభ.
**विरोधाभास** - पुं० విరోధపు పొడను సూచించు అర్థాలంకారము.
**विलंब** - पुं० ఆలస్యము.
**विलंबना** - अ०क्रि० ఆలస్యమగుట; వ్రేలాడుట.
**विलंबित** - वि० వ్రేలాడుచున్న; ఆలస్యమైన
**विलक्षण** - वि० విశిష్టమైన; అసాధారణమైన
**विलखना** - अ०क्रि० విలపించుట.
**विलग** - वि० अलग ; వేరైన.
**विलगाना** - अ०क्रि० వేరగుట; వేరుగ కనిపించుట. स०क्रि० వేరు పరచుట; వే చేయుట.
**विलपना** -अ०क्रि० విలపించుట; ఏడ్చుట
**विलसना** - अ०क्रि० శోభిల్లుట; విలసిల్లుట; ఆనందించుట.
**विलाप** - पुं० రోదనము; ఏడ్పు.
**विलायत** - पुं० విదేశము; పరాయిదేశము
**विलायती** - वि० విదేశపు; పరాయి దేశపు
**विलासिनी** -स्त्री० అందమైన స్త్రీ; కామిని

వేశ్య.

**विलासी** - पुं० आराम तलब ; విలాస పురుషుడు; భోగి.

**विलिखित** - वि० వ్రాయబడిన; చెక్కబడిన.

**विलीन** - पुं० లుప్తమైన ; అదృశ్యమైన ; దాగియున్న.

**विलोचन** - पुं० నేత్రము; కన్ను.

**विलोचना** - स०क्रि० చూచుట.

**विलोम** - वि० విపరీతమైన; వ్యతిరేకమైన. पुं० పైనుంచి క్రిందకు వచ్చుట.

**विलोल** - पुं० చంచలమైన; అందమైన.

**विल्व** - पुं० दे० बिल्व.

**विवक्षित** - वि० ఆవశ్యకమైనది; వాంఛిత మైనది.

**विवर** - पुं० ఛిద్రము; కలుగు; పగులు; గుహ.

**विवर्ण** - पुं० కాంతివిహీనత; वि० నీచమైన; కాళావిహీనమైన.

**विवर्तन** - पुं० పరివర్తన; వినిమయము.

**विवश** -वि० గత్యంతరములేని; పరాధీనమైన; వివశమైన.

**विवसन** - वि० विवस्त्र ; నగ్నమైన.

**विवादास्पद** - वि० వివాదయుక్తమైన; వాదోపవాదములు జరగదగిన.

**विवादी** - वि० వివాదించు; కలహించు.

**विवाह** - पुं० పెండ్లి; పరిణయము.

**विवाही** - वि० వివాహమైన.

**विविक्त** - वि० చెల్లాచెదురైన; నిర్జనమగు; త్యక్తమైన. पुं० త్యాగి; సన్యాసి.

**विविर** - पुं० గుహ; బిలము.

**विवृति** - स्त्री० పరిభ్రమణము; భాష్యము; టీక.

**विवेक** - पुं० మంచి-చెడుల జ్ఞానము తెలిసినవాడు.

**विवेचन** - पुं० పరీక్షణ; బాగోగులు విచారించుట; మీమాంసము.

**विवेचनीय** - वि० వివరించదగిన; విచారించదగిన.

**विशद** - वि० స్పష్టమైన; వ్యక్తమైన; స్వచ్ఛమైన; అందమైన.

**विशारद** - पुं० పండితుడు; విద్వాంసుడు; దక్షుడు.

**विशिख** - पुं० బాణము.

**विशिष्ट** - वि० విలక్షణమైన; విశిష్టమైన.

**विशुद्ध** - वि० బహునిర్మలమైన; స్వచ్ఛమైన.

**विशृंखल** -वि० క్రమములేని; అస్తవ్యస్తమైన; ఇష్టానుసారము.

**विशेषज्ञ** - पुं० ఏదేని విషయమున విశేష జ్ఞానము గలవాడు.

**विशेष्य** - पुं० విశేషణముగల నామవాచకము.

**विश्रब्ध**-वि०విశ్వసనీయమైన; నిర్భయమైన.

**विश्रांत** - वि० విశ్రమించు; అలసిపోయిన; బడలిన.

**विश्रांति** - स्त्री० విశ్రమము; విశ్రాంతి.

**विश्री** - वि० కాంతి విహీనమైన.

**विश्रुत** - वि० ప్రసిద్ధమైన; విఖ్యాతమైన.

**विश्लिष्ट** - वि० విశ్లేషించబడిన; విశదీకరింపబడిన.

**विश्लेषण** - पुं० విశదీకరణము.

**विश्वंभर** - पुं० పరమేశ్వరుడు; విష్ణువు.

**विश्वंभरा** - स्त्री० పృథ్వి; భూమి.

**विश्वकोश** - पुं० సమస్త విషయముల గురించి విస్తృత వర్ణనగల గ్రంథము.

**विश्वलोचन** - पुं० సూర్యచంద్రులు.

**विश्वविद्यालय** - वि० అన్ని విధముల విద్యలను బోధించుటకు తగిన వ్యవస్థ కలిగియున్న ఉన్నత విద్యాపీఠము.

**विश्वसनीय** - वि० विश्वस्त ; విశ్వసించదగిన; నమ్మదగిన.

**विश्वासघात** - पुं० నమ్మకద్రోహము.

**विषण्ण** - वि० విషాదయుక్తమైన; విషాదముగల.

**विषधर** - पुं० సర్పము; పాము.

**विषम** - वि० असमान ; సమముగాలేని.

**विषयक** - वि० సంబంధముగల; సంబంధించిన.

**विषयी** - पुं० భోగవిలాసములో మెండుగా ఆసక్తిగలవాడు; కాముకుడు.

**विषाक्त** - वि० విషయుక్తమైన; విషము కలిసిన.

**विषाण** - पुं० పశువుకు సంబంధించిన కొమ్ము; 'శృంగము' అనబడు వాద్యము; పందికోర.

**विषाद** - पुं० ఖేదము; విషాదము; దుఃఖము.

**विषानन** - पुं० సర్పము.

**विष्ठा** - स्त्री० మలము; పెంట.

**विसर्ग** - पुं० దానము; త్యాగము; ఎడబాటు; మృత్యువు; మోక్షము; అక్షరము ప్రక్కన రెండు బిందులు ; ':'

**विसर्जन** - पुं० పరిత్యాగము; సమాప్తి; వెళ్ళిపోవుట.

**विसाल** - पुं० కలయిక; ప్రేమీ-ప్రేమికుల సంయోగము; మృత్యువు.

**विस्तीर्ण** - वि० విస్తృతమైన; విశాలమైన.

**विस्तृत** - वि० విశాలమైన.

**विस्मय** - पुं० ఆశ్చర్యము.

**विस्मरण** - पुं० మరుపు.

**विस्मृत** - वि० మరచిన; మరచిపోయిన.

**विस्मृति** - स्त्री० విస్మరణము; మరుపు.

**विहंग** - पुं० పక్షి; పిట్ట; బాణము.

**विहँसना** - अ०क्रि० दे० हँसना.

**विहसित** - पुं० మధ్యమశ్రేణి హాస్యము; ఒక మాదిరి చిరునవ్వు.

**विहान** - पुं० ప్రాతఃకాలము.

**विहित** - वि० వ్యవస్థింపబడిన; ఏర్పడ్డ; విహితమైన

**विहीन** - वि० రహితమైన; లేకుండా.

**विह्वल** - वि० వ్యాకులమైన, విహ్వలమైన.

**वीक्षण** - पुं० देखना ; చూపు.

**वीचि ; वीची** - स्त्री० అల; తరంగము.

**वीचिमाली** - पुं० సముద్రము.

**वीत** - वि० గడచిపోయిన; వదలి పెట్టబడిన; ముక్తమైన.

**वीतराग** - पुं० వైరాగి.

**वीथी** - स्त्री० మార్గము; దారి.

**वीर**-पुं० వీరుడు; శూరుడు; సాహసోపేతుడు.

**वीरा** - स्त्री० మద్యము.

**वीरान** - वि० ధ్వంసమైన; శ్రీహీనమైన.

**वीराना** - पुं० పాడుబడ్డ ప్రదేశము.

**वीरुध** - पुं० पेड पौधे ; మొక్క.

**वृसूल** - पुं० दे० उसूल.

**वृंद** - पुं० दे० बृंद.

**वृक** - पुं० भेडिया ; తోడేలు; నక్క.

**वृत्ति** - स्त्री० జీవిక; స్వభావము; ప్రకృతి; వృత్తి.

**वृत्त** - पुं० అంధకారము; శత్రువు; మేఘము.

**वृत्तहा** - पुं० वृत्तारि. ఇంద్రుడు.

**वृथा** - वि० వ్యర్థమైన; నిరర్థకమైన.

**वृश्चिक** - पुं० बिच्छू ; తేలు.

**वृष** - पुं० ఆబోతు; వృషభము.

**वृषी** - पुं० మయూరము; నెమలి.

**वेक्षण** - पुं० వీక్షణము.

**वेग** - पुं० వేగము.

**वेणी** - स्त्री० కేశజాలము; వేణి; జడ.

**वेणु** - पुं० వెదురు; పిల్లనగ్రోవి.

**वेतन** - पुं० జీతము; వేతనము.

**वेत्ता** - वि० తెలిసినవాడు; జ్ఞాత.

**वेत्र** - पुं० बेंत ; బెత్తము.

**वेदना** - स्त्री० బాధ; పీడనము; దుఃఖము.

**वेदिका** - स्त्री० పీఠము; పీఠిక; అరుగు; చర్చాగోష్ఠి ప్రదేశము.

**वेध** - पुं० ఛేదనము; యంత్రముల సహాయముతో నక్షత్రములను గమనించుట.

**वेधशाला** - स्त्री० గ్రహించుట; నక్షత్రములు మొదలగు వానిని గమనించి తెలుసుకొన నిమిత్తము ఏర్పడ్డ ప్రయోగశాల.

**वेला** - स्त्री० కాలము; సమయము; వేళ; సముద్రపు ఒడ్డు.

**वेश** - पुं० वेष ; వేషము; ధరించు డ్రస

**वेश्म** - पुं० ఇల్లు; గృహము.

**वेष्टन** - पुं० చుట్టు గుడ్డ.

**वेष्टित** - वि० చుట్టబడిన.
**वैकल्पिक** - वि० ఇష్టానుసారము ఎన్నుకొనదగిన.
**वैखरी** - स्त्री० వాక్‌శక్తి; వాగ్దేవి.
**वैखानस** - पुं० అడవిలో ఉండు ఒక విధమైన బ్రహ్మచారి.
**वैचित्र्य** - पुं० విచిత్రత.
**वैजयंती** - स्त्री० పతాక; జండా; ఒక విధముగు ఐదు రంగుల మాల (దండ).
**वैताल** - पुं० రాజుగారిని మేల్కొలుపు వంధిమా గధులు లేక వైతాళికులు.
**वैदग्ध्य** - पुं० విదగ్ధత; చాతుర్యము.
**वैदूर्य**-पुं० ఒక విధముగు రత్నము; వైఢూర్యము
**वैद्य** - पुं० వైద్యుడు.
**वैधक** - पुं० వైద్యశాస్త్రము; ఆయుర్వేద చికిత్సాశాస్త్రము.
**वैध** - वि० చట్టప్రకారమున్న.
**वैभव** - पुं० విభవము; గొప్పదనము.
**वैमनस्य** - पुं० వైరము; ద్వేషము; విరోధము.
**वैयत्किक** - वि० వ్యక్తిగతమైన; వ్యక్తికి సంబంధించిన.
**वैयाकरण** - पुं० వ్యాకరణ పండితుడు.
**वैर** - पुं० ద్వేషము; శత్రుత్వము; విరోధము.
**वैश्वानर** - पुं० అగ్ని; పరమాత్మ.
**वैषम्य** - पुं० విషమత.
**वैसा** - वि० ఆ మాదిరి.
**वैसे** - क्रि०वि० అలా.
**व्यंग्य** - पुं० వ్యంజనద్వారా వెలువడు అర్థము, ఎగతాళి; వెక్కిరింపు.
**व्यंजक** - पुं० వ్యక్తముగు లేక వ్యక్తపరచు క్రియ; 'క' నుంచి 'హ' వరకు ఉన్న అక్షరములు వ్యంజనములు ; వండబడిన కూర.
**व्यंजना** - स्त्री० అభిధా; లక్షణా; వ్యంజనా అనబడు మూడు శబ్దశక్తులలో మూడవది; అభిదా, లక్షణా శక్తులు అర్థవ్యక్తీకరణలో సాఫల్యము పొందనప్పుడు వ్యంజన శక్తిద్వారా శబ్దము యొక్క అస్సలైన అర్థము వ్యక్తమగును.
**व्यक्त** - वि० స్పష్టమైన; వ్యక్తమైన.
**व्यक्ति** - स्त्री० అభివ్యక్తి; पुं० మనిషి; ఒకే ఒక మనిషి.
**व्यक्तिगत** - वि० వ్యక్తికి సంబంధించిన; వ్యక్తిగతమైన.
**व्यक्तित्व** - पुं० విశిష్ట గుణముల ద్వారా వెల్లడియగు వ్యక్తి యొక్క స్వతంత్రమైన స్పష్టమైన సత్తా.
**व्यग्र** - वि० వ్యాకులమైన; కలతజెందిన వ్యగ్రమైన.
**व्यजन** - पुं० విసనకర్ర; వ్యజనము.
**व्यतिक्रम** - पुं० व्यत्यय ; క్రమహీనత;

విఘ్నము; అవాంతరము.

**व्यतिरेक** - पुं० అతిక్రమణ; భేదము; ఒక విధమగు అర్థాలంకారము.

**व्यतीत** - वि० గడచిపోయిన.

**व्यतीतना** - अ०क्रि० గడచుట.

**व्यतीत करना** - स०क्रि० గడుపుట.

**व्यथा** - स्त्री० క్లేశము; వేదన; దుఃఖము; బాధ.

**व्यथित** - वि० వేదన పొందుతున్న; బాధ పడు.

**व्यवधान** - पुं० ఆటంకము; హస్తక్షేపము; పరద.

**व्यवसाय** - पुं० జీవిక; వృత్తి; ఉద్యోగము.

**व्यवसायी** - पुं० ఏదేని ఉద్యోగము చేయు వాడు; వృత్తి పనిచేయువాడు.

**व्यवस्था** - स्त्री० ప్రబంధము; ఏర్పాటు.

**व्यवस्थापक** - पुं० ప్రబంధకర్త; ఏర్పాటు చేయువాడు.

**व्यवस्थित**-वि० వ్యవస్థీకరించబడిన; నియమ బద్ధమైన; ఏర్పాటుగావింపబడిన.

**व्यवहार** - पुं० వర్తనము; నడవడి; ధోరణి; వ్యవహారము.

**व्यष्टि** - पुं० ఒకే ఒక మనిషి; వ్యక్తి.

**व्यसन** - पुं० దురలవాటు; విషయ వాసనల యెడల అనురక్తి; వ్యసనము.

**व्यस्त**-वि० పనిలో నిమగ్నమైన; కలతజెందిన; వ్యాప్తమైన.

**व्याकुल** - वि० వ్యగ్రమైన; గాబరాజెందిన; ఆదుర్దాగల.

**व्याक्रोश** - पुं० తిరస్కారముతో కూడిన దెప్పిపొడుపు; అరుపు.

**व्याख्या** - स्त्री० భాష్యము; తాత్పర్యము; వ్యాఖ్య.

**व्याख्याता** - पुं० భాష్యకారుడు.

**व्याख्यान** - पुं० ఉపన్యాసము; వక్తృత.

**व्याघात** - पुं० విఘ్నము; ఆటంకము; ప్రహారము.

**व्याघ्र** - पुं० పెద్దపులి; వ్యాఘ్రము.

**व्याज**-पुं० కపటము; మోసము; విలంబము; నెపము.

**व्याध** - पुं० అడవి జీవులను వేటాడువాడు; పక్షుల వేటగాడు.

**व्याधि** - स्त्री० రోగము; జంజాటము.

**व्यापक** - वि० పరివ్యాప్తమైన; వ్యాపకమైన.

**व्यापना** - अ०क्रि० వ్యాపించుట.

**व्यापार** - पुं० క్రయ-విక్రయ కార్యము; కొనడము-అమ్మడము పని; పని-పాటు.

**व्यापन्न** -वि० విపత్తులోనున్న; గాయపడిన; గతించిన.

**व्याप्त** - वि० వ్యాపించియున్న.

**व्यायोग** - पुं० ఒక విధమగు దృశ్యకార్యము.

**व्याल** - पुं० పాము; పెద్దపులి; సింహము.

**व्यालू** - स्त्री० **ब्यालू** ; రాత్రిభోజనము.

**व्यावहारिक** - वि० వ్యవహారసంబంధమైన.

**व्यासंग** - पुं० అధికమగు ఆసక్తి; మనో యోగము.

**व्याहत** - वि० నిషిద్ధమైన; వ్యర్థమైన.

**व्युत्पत्ति** - स्त्री० ఏదేని విషయము లేక వస్తువు యొక్క మూల స్థానము.

**व्युत्पन्न** - पुं० ఏదేని శాస్త్రమున ప్రకాండ పాండిత్యము గల; శాస్త్ర పారంగతుడు.

**व्यूह** - पुं० సేనావిన్యాసము; నిర్మాణరచన; వ్యూహము.

**व्योम** - पुं० ఆకాశము; మేఘము; జలము.

**व्योरा** - पुं० **ब्योरा** ; వివరణ; వివరము.

**व्रज** - पुं० మథుర- బృందావన సమీప ప్రాంతము; గమనము; సమూహము; మంద.

**व्रजभाषा** - स्त्री० వ్రజమండలభాష.

**व्रण** - पुं० కురుపు; గాయము.

**व्रती** - पुं० వ్రతమాచరించువాడు.

**व्रात्य** - पुं० వడుగుకానివాడు; వర్ణసంకరుడు.

**व्रीडा** - स्त्री० **शर्म** ; సిగ్గు; లజ్జ.

**व्रीहि** - पुं० ధాన్యము; బియ్యము.

## श

**शंकर शैल** - पुं० కైలాసము.

**शंकरी** - स्त्री० పార్వతి.

**शंका** - स्त्री० అనుమానము; సందేహము; సంశయము.

**शंकालु** - पुं० సంశయస్తుడు; అనుమానస్తుడు.

**शंकित** - वि० అనుమానించు; శకించు.

**शंकु** - पुं० మొనగలవస్తువు; మేకు; గసిగ.

**शंठ** - पुं० నపుంసకుడు; మూర్ఖుడు.

**शंपा** - स्त्री० **बिजली** ; మెరుపు; నడుము.

**शऊर** - स्त्री० పనిచేయు వడుపు; తరహా; తెలివి.

**शऊरदार** - पुं० కార్యవిధానము తెలిసినవాడు; కార్య కుశలుడు.

**शक** - पुं० ఒక ప్రాచీన కాలపు జాతి; శకము; శతాబ్దము; శంక; సందేహము.

**शकट**-पुं० బండి; ఎద్దుబండి; ఒకరాక్షసుడు.

**शकठ** - पुं० మంచ.

**शकरकंद** - पुं० చిలకడదుంప.

**शकरलब** -वि० మధురభాషి; మనసు నొప్పించని మాటలు మాటాడువాడు.

**शकल**-स्त्री० ఆకృతి; ఆకారము; రూపము; పద్ధతి.

**शकाब्द** - पुं० శాలివాహనరాజు ప్రవర్తించిన శక సంవత్సరము; క్రీ.శ. 78 నుంచి లేక 79 మినహాయించిన శక శతాబ్దము

తెలియనగును.

**शकारि** - पुं० విక్రమాదిత్యుడు.

**शकील**-वि० మంచి ఆకారముగల; సుందర మైన.

**शकीह ; शकोह** - पुं० గొప్పదనము; ప్రతాపము; పలుకుబడి.

**शकुन** - पुं० साइत ; శకునము.

**शक्कर** - स्त्री० పంచదార; ముడి పంచదార.

**शक्की** - वि० అనుమానించు; సంశయించు.

**शक्त** - वि० శక్తిసంపన్నమైన; సమర్థమైన.

**शक्ल** - स्त्री० दे० शकल.

**शक्य** - वि० శక్తిగల; శక్యమైన; చేయదగిన.

**शक्र** - पुं० ఇంద్రుడు.

**शक्रचाप** - पुं० ఇంద్రధనస్సు.

**शख्स** - पुं० మానవ శరీరము; వ్యక్తి; మనిషి.

**शख्सियत** - स्त्री० వ్యక్తిత్వము.

**शख्सी** - वि० వ్యక్తి సంబంధమైన; వ్యక్తిగత మైన.

**शगल** - पुं० పనిపాటు; ఉద్యోగము; మనో రంజనము.

**शगाल** - पुं० నక్క; గుంటనక్క.

**शगुफ्ता** - वि० వికసించిన ; ప్రఫుల్లమైన; ఆనందమయమైన.

**शगूफा** - पुं० మొగ్గ; పువ్వు; అద్భుతమైన ఘటన.

**शग्ल** - पुं० दे० शगल.

**शचि ; शची** - स्त्री० ఇంద్రాణి; ఇంద్రుని భార్య.

**शजर** - पुं० వృక్షము.

**शजरा** - पुं० कुर्सीनामा ; వంశవృక్షము; కరణము తయారుచేసిన పొలముల పటము.

**शठ** - वि० ధూర్తుడైన; వంచకుడు; తుంటరియగు.

**शत** - वि० వంద; पुं० వంద సంఖ్య; '100'.

**शतक** - पुं० శతకము; శతాబ్ది.

**शतदल** - पुं० పద్మము.

**शतधा** - अव्य० వందలసార్లు; వందల ప్రకారము.

**शतपत्र** - पुं० కమలము; తెల్లగులాబి; నెమలి.

**शतरंज** - पुं० చదరంగము.

**शतरंजी** - स्त्री० చదరంగపు గళ్ళు గల చద రంగపు ఆట పట్టా.

**शतश:** - वि० వందలకొలది; వందరెట్లు.

**शताब्द** - वि० వందసంవత్సరములు గల.

**शताब्द** - पुं० ; **शताब्दी** - स्त्री० వంద సంవత్సరముల కాలము.

**शतायु** - पुं० వంద సంవత్సరములు గలవాడు.

**शतावधान** - पुं० ఒకే సమయమున వంద విషయముల యెడల ధ్యానమును

केंద్రీకరించువాడు.

**शदीद** - वि० కఠినమైన; దృఢమైన; కఠోర మైన.

**शनाख्त**-स्त्री०पहचान; గుర్తు; పరిచయము.

**शनासा** - वि० గుర్తించువాడు; గుర్తుపట్టు వాడు.

**शनि** - स्त्री० సూర్యమండలములోని ఆరవ గ్రహము; దురదృష్టము.

**शनैः** - अव्य० धीरे ; మెల్లిగా.

**शपथ** - स्त्री० ఒట్టు; శపథము; ప్రతిజ్ఞ.

**शफक** - स्त्री० సంధ్యారాగము; ప్రాతఃకాల మున, సాయంకాలమున ఆకసమున కాన్పించు ఎరుపు రంగు.

**शफकत** - स्त्री० దయ. కృప.

**शफतालू** - पुं० ఒక విధమగు పెద్ద బంగాళా దుంప.

**शफा** - स्त्री० ఆరోగ్యము.

**शफाअत** - स्त्री० కామన; వాంఛ; సిఫార్సు.

**शफाखाना** - पुं० ఆసుపత్రి; ఔషధాల యము.

**शफी** - वि० సిఫార్సు చేయువాడు; మధ్యలో వచ్చి నేరమును క్షమింపజేయువాడు.

**शफीक** - वि० దయాళుడు.

**शफूका** - पुं० दे० शगूफा.

**शफ्फाफ** - वि० స్వచ్ఛమైన; పారదర్శి.

**शब** - स्त्री० निशा; రాత్రి.

**शबनम** - स्त्री० మంచు; ఒక విధమగు బహుపల్చని వస్త్రము.

**शबनमी** - स्त्री० దోమతెర.

**शबल** - वि० పలురంగులు గల; రంగు రంగులు గల.

**शबाना** - क्रि०वि० రాత్రి సమయమున.

**शबाब** - पुं० యౌవనకాలము; సౌందర్యము; ఆరంభము.

**शबीह** - स्त्री० చిత్రము ; ఫొటో.

**शबे-जफाफ** - स्त्री० सुहागरात ; వధూ వరుల ప్రథమ సమాగమపు రాత్రి.

**शबेमाह** - स्त्री० వెన్నెల రాత్రి.

**शबेरोज** - अव्य० రాత్రింబవళ్ళు.

**शब्बो** - स्त्री० రజనీ గంధా; రేరాణి పువ్వు

**शम** - पुं० శాంతి; ఓర్పు.

**शमशेर** - स्त्री० ఖడ్గము; కత్తి.

**शमा** - स्त्री० మైనపు వత్తి.

**शमादान** - पुं० దీపపు శమ్మె.

**शमित** - वि० శాంతించిన.

**शम्स** - पुं० సూర్యుడు.

**शमी** - स्त्री० జమ్మిచెట్టు.

**शर** - पुं० బాణము; చితి.

**शरत** - स्त्री० ఆశ్వీజ, కార్తీక మాసముల వచ్చు శరదృతువు; సంవత్సరము.

**शरवत** - पुं० ఒక మధురమైన పానీయము.

**शरभ** - पुं० గున్నేనుగ; మిడత.

**शरम** - स्त्री० సిగ్గు; లజ్జ; ప్రతిష్ఠ; సంకోచము; గౌరవము.

**शरम से गडना या पानी पानी होना** - मु० బాగా సిగ్గుపడుట.

**शरमाऊ** - वि० दे० शरमीला.

**शरमाना** - अ०क्रि० సిగ్గుజెందుట; स०क्रि० సిగ్గుపడునట్లు చేయుట.

**शरमीला** - वि० సిగ్గుచెందు; సిగ్గుపడు; లజ్జగల.

**शरमिंदगी** - स्त्री० लाज ; సిగ్గు.

**शरमिंदा** - वि० సిగ్గుపడిన.

**शरमीला** - वि० త్వరగా సిగ్గుపడు.

**शरर** - पुं० అగ్నికణము.

**शरह** - स्त्री० భాష్యము; వ్యాఖ్య.

**शराफत** - स्त्री० సౌజన్యము; సజ్జనత; మంచితనము.

**शराब** - स्त्री० మద్యము; సారాయి.

**शराबखाना** - पुं० పానశాల.

**शराबखोर** - पुं० शराबी ; అలవాటుగా మద్యము సేవించువాడు.

**शराबखोरी** - स्त्री० మద్యపానము.

**शराबोर** - वि० तरबतर ; పూర్తిగా తడిసిన.

**शरार** - पुं० నిప్పురవ్వ; అగ్నికణము.

**शरारत** - स्त्री० కొంటెతనము; తుంటరితనము.

**शरासन** - पुं० ధనుస్సు.

**शरीअत** - स्त्री० మహమ్మదీయుల ధర్మశాస్త్రము.

**शरीक** - वि० కలసిన; సమ్మిళితమైన; पुं० సహచరుడు; భాగస్తుడు.

**शरीफ** - वि० కులీనస్తుడు; సభ్య పురుషుడు; పెద్దమనిషి.

**शरीफा** - पुं० శీతాఫలము.

**शर्करा** - स्त्री० పంచదార; ఇసుకరేణు.

**शर्त** - स्त्री० నిబంధన; షరతు.

**शर्तिया** - क्रि०वि० దృఢమైన; నిశ్చయపూర్వకముగా; वि० నిశ్చితమైన.

**शर्म** - स्त्री० दे० शरम.

**शर्वरी** - स्त्री० రాత్రి; సంధ్యాసమయము; స్త్రీ.

**शलगम ; शलजम** - पुं० ముల్లంగి మాదిరి ఒకవేరు కూర.

**शलभ** - पुं० మిడత.

**शलाका** - स्त्री० పొడుగైన ఇనుప చువ్వ; బాణము; పాచిక.

**शलाख** - स्त्री० दे० सलाख.

**शलूका** - पुं० పొట్టిచేతుల రవిక.

**शल्य** - पुं० ఎముక; బల్లెము; బాణము.

**शल्यकी** - स्त्री० साही ; ముళ్ళ పంది.

**शव** - पुं० लाश ; శవము.

**शश ; शशक** - पुं० खरगोश ; शसा ; కుందేలు.

**शशधर** - पुं० शशांक ; शशि; చంద్రుడు.

**शशशृंग** - पुं० కుందేటి కొమ్ము; ఏదేని అసంభవకార్యము.

**शशिकला** - स्त्री० చంద్రకళ.

**शशिधर** - पुं० శివుడు.

**शस्य** - पुं० పైరు; పంట; కొత్తగా మొలచిన గడ్డి; ధాన్యము.

**शह** - पुं० చక్రవర్తి; పెళ్ళి కొడుకు; వరుడు.

**शहजादा** - पुं० दे० शाहजादा.

**शहजोर** - पुं० ప్రబలమైన ; బలిష్ఠమైన.

**शहतीर** - पुं० దూలము.

**शहतूत** - पुं० दे० तूत.

**शहद** - पुं० తేనె ; మధువు.

**शहद लगाकर चाटना** - मु० పనికిమాలిన వస్తువులను భద్రముగా చూచుకొనుట.

**शहना** - पुं० పోలీసు అధికారి; శాసకుడు (వ్యంగ్యోక్తి); పన్ను వసూలు చేయువాడు.

**शहनाई** - स्त्री० సన్నాయి.

**शहबाला** - पुं० తోడపెళ్ళికొడుకు.

**शहर** - पुं० పట్టణము; నగరము.

**शहरपनाह** - स्त्री० రక్షణ నిమిత్తం నగరము చుట్టూ కట్టబడిన ప్రహారీ గోడ.

**शहरियत** - पुं० నాగరికత; నగర నివాసము.

**शहरी** - पुं० పట్టణము లేక నగరమునకు సంబంధించిన నాగరికుడు ; నగరవాసి.

**शहसवार** - पुं० గుఱ్ఱపు స్వారీలో ఆరితేరిన వాడు.

**शहादत**-स्त्री०సాక్షి; సాక్ష్యము; ప్రమాణము; పరమార్థము కొరకు తనని త్యాగము చేయు భావన.

**शहीद** - पुं० ఏదేని సమిష్టికార్యము కొరకు బలియైనవాడు.

**शाइस्तगी**-स्त्री० శిష్టత; సభ్యత; సౌజన్యము; మానవత.

**शाइस्ता** - वि० శిష్టవ్యవహారముగల; సభ్యత గల.

**शाक** - पुं० వండని కూరకాయ లేక ఆకు కూర.

**शाकल** - पुं० ఖండము; భాగము; తునక.

**शाकाहार** - पुं० కూరగాయల భోజనము.

**शाकिर**-वि०కృతజ్ఞతగల; ధన్యవాదములిచ్చు.

**शाकी** - वि० కొండెములు చెప్పువాడు; ఆర్తనాద ము చేయువాడు.

**शाख** - स्त्री० రెమ్మ; చిన్న కొమ్మ.

**शाख निकालना** - मु० తప్పులు వెదకుట; చూపించుట.

**शाखा** - स्त्री० వృక్షపు శాఖ; కొమ్మ; ఏదేని సంస్థ యొక్క విడి విభాగము.

**शाखामृग** - पुं० వానరము; కోతి.

**शागिर्द** - पुं० चेला ; శిష్యుడు.

**शागिर्दी** - स्त्री० चेलापन ; శిష్యరికము.

**शातिर** - पुं० తుంటరి; ఉత్తరములు తెచ్చువాడు; దూత.

**शाद**-वि०సంతోషముగానున్న; సంపన్నమగు.

**शादमान** - वि० खुश ; సంతోషము గల; సంతోషి.

**शादाब** - वि० సస్యశ్యామలముగానున్న.

**शादियाना** - पुं० మంగళవాద్యము.

**शादी** - स्त्री० ఆనందము; ఆనందోత్సవము; వివాహము.

**शादीमर्ग** - वि० అమితమైన ఆనందము వలన చనిపోయిన; स्त्री० ఆనందాధిక్యము వలన కలిగిన మృత్యువు.

**शान** - स्त्री० తళుకు-బెళుకు; అలంకరణ; కోలాహలము; ఆడంబరము; దర్పము; భవ్యత.

**शान-शौकत** - स्त्री० ఆడంబరము; తళుకు-బెళుకు.

**शाना** - पुं० దువ్వెన; భుజము.

**शानेसे शाना छिलना** - मु० తొక్కిసలాట గుంపు.

**शाबाशी**-स्त्री० वाहवाही ; ప్రశంస; పొగడ్త.

**शाम** - स्त्री० साँझ ; సాయంత్రము.

**शामत** - स्त्री० విపత్తు; దుర్గతి.

**शामत का घेर या मारा** - मु० దుర్గతి ఆసన్నమైన; మూడిన.

**शामत सवार होना या सिरपर खेलना** - मु० దుర్దశాగ్రస్తమైన; గండము ఆసన్నమైన.

**शामियाना** - पुं० ఒకవిధమైన గుడ్డ పందిరి; ఒకవిధమగు గుడారము.

**शामिल** - वि० కలసిన; కలసియున్న; సమ్మిళితమైన.

**शामिल-हाल** - वि० అన్నివేళల సహకరించు.

**शामिलात** - स्त्री० భాగము; వాటా.

**शायक** - पुं० तीर ; బాణము; ఖడ్గము.

**शायक** - वि० షోకిల్లా; సరదా పురుషుడు; వ్యసనపరుడు; ఆసక్తిగల.

**शायद** - अव्य० బహుశా; ఒకవేళ.

**शायर** - पुं० ఉర్దూ, పారసీ భాషల్లో కవితలల్లు వ్యక్తి; కవి.

**शायरा** - स्त्री० కవయిత్రి; స్త్రీ కవి.

**शायरी** - स्त्री० కవిత్వము; కావ్యరచన.

**शायी** - वि० నిద్రించు; పవళించు.

**शारंग** - पुं० दे० सारंग.

**शारंगपाणि** - पुं० విష్ణువు; రాముడు;

కృష్ణుడు.
**शारद**-वि० శరత్కాలమునకు సంబంధించిన.
**शारदा** - स्त्री० సరస్వతి; దుర్గాదేవి; శారదా లిపి- ఒక ప్రాచీనకాలపు లిపి.
**शारिका** - स्त्री० **मैना ;** మైనా అనబడు పక్షి.
**शारिवा** - स्त्री० **जवासा ;** బ్రహ్మజముడు మొక్క.
**शारीरिक** - वि० శరీర సంబంధమైన.
**शार्दूल** - पुं० చిరుత పులి; పెద్దపులి; సింహము.
**शाल** - पुं० ఒక విధమగు పెద్ద వృక్షము; టేకు చెట్టు; स्त्री० శాలువా.
**शाला** - स्त्री० ఇల్లు; భవనము; స్థానము.
**शालि** - पुं० ధాన్యము; చెరుకు; బాసమతి బియ్యము.
**शालीन** - वि० వినమ్రమైన; లజ్జగల; సమాన మైన; శిష్టాచారము గల; దక్షత గల.
**शावक** - पुं० బిడ్డ; పశు శావకము; పక్షి శావకము, కూన.
**शास्वत** - वि० నిత్యమైన; స్థిరమైన.
**शासन** - पुं० ఆజ్ఞ; ఆదేశము; శాసనము; అధికారము; దండన.
**शासित** -वि० శాసింపబడిన; దండింపబడిన.
**शास्ति** - स्त्री० శాసనము; దండన; శిక్ష.
**शास्त्रज्ञ** - पुं० శాస్త్రవేత్త; శాస్త్రజ్ఞుడు.
**शास्त्रोक्त** - वि० శాస్త్రములో చెప్పబడిన; శాస్త్రములలో చెప్పబడినట్లు.
**शाहंशाह** - पुं० రాజాధిరాజు; మహారాజు.
**शाहंशाही** - स्त्री० మహారాజత్వము; వాడుక భాషలో విశుద్ధత; విశిష్టత.
**शाह** - पुं० మహారాజు; మహమ్మదీయ సన్యాసులకు సంబంధించిన ఒక బిరుదు.
**शाहखर्च** - वि० మిక్కుటముగా ఖర్చు చేయు.
**शाहजादा** - पुं० మహారాజ కుమారుడు.
**शाहाना** - वि० రాజసముగల; రాజయోగ్య మైన.
**शाही** - पुं० రాజా మహారాజులకు సంబంధించిన.
**शिंजन** - पुं० మధుర ధ్వని; ఆభూషణముల గలగల ధ్వని.
**शिंजनी** - स्त्री० గజ్జ లేక గజ్జలు; ధనుస్సు నారి; ఉంగరము; కన్నీరు.
**शिकंजा** - पुं० నొక్కు లేక వత్తు ఒక యంత్రము; గానుగ.
**शिकन** - स्त्री० **सिकुडन ;** ముడత.
**शिकम** - पुं० ఉదరము; పొట్ట.
**शिकमी कारतकार** - पुं० తోటిరైతు నుంచి కొంత భూమిని పుచ్చుకున్న రైతు.
**शिकरम** - स्त्री० ఒక విధమగు బండి.

**शिकवा** - पुं॰ మొర; అభియోగము.
**शिकरा** - पुं॰ ఒక విధమగు డేగ.
**शिकस्त** - स्त्री॰ పరాజయము; ఓటమి.
**शिकस्ता** - वि॰ విరిగిన; పగిలిన; భగ్నమైన.
**शिकस्ता हाल** - पुं॰ గొలుసు కట్టు వ్రాత; దుర్గతిపాలైన.
**शिकायत** - स्त्री॰ ఉపాలంభము; చాడీ; నిందారోపణ; జబ్బు.
**शिकार** - पुं॰ వేట; మృగయ.
**शिकार खेलना** - मु॰ వేటాడుట.
**(किसी का) शिकार होना** - मु॰ వశ్య మగుట; చిక్కులు; చంప బడుట.
**शिकारी** - वि॰ వేటాడువాడు; వేటగాడు.
**शिक्षक** - पुं॰ ఉపాధ్యాయుడు; గురువు.
**शिक्षण** - पुं॰ విద్యాబోధనము.
**शिक्षा** - स्त्री॰ విద్య; చదువు.
**शिक्षार्थी** - पुं॰ విద్యార్థి.
**शिक्षित** - वि॰ చదువుకున్న; చదివిన; నేర్చిన.
**शिखंड** - पुं॰ నెమలి తోక; నెమలి పింఛము; శిఖ; జుట్టు; పిలక.
**शिखंडी** - पुं॰ మయూరము; నెమలి.
**शिखी** - वि॰ శిఖగలిగిన; పిలక ఉన్న; पुं॰ మయూరము; నెమలి; కోడిపుంజు.
**शिगाफ** - पुं॰ చీలిక; గాయము; పగులు.
**शिगूफा** - पुं॰ दे॰ शगूफा.
**शिताब** - क्रि॰ वि॰ త్వరగా; శీఘ్రముగా.
**शिताबी** - स्त्री॰ శీఘ్రత; తొందరపాటు; హడావుడి.
**शिथिल** - वि॰ వదులైన; అలసిన; సోమరి యగు; మెల్లిగ.
**शिद्दत** - स्त्री॰ విసురు; ప్రబలత; ఉగ్రత; ఆధిక్యము; వేగము.
**शिनाख्त** - स्त्री॰ పోలికగుర్తు; వివేకము.
**शिनासाई** - पुं॰ జ్ఞాపకము; పరిచయము.
**शिरकत** - स्त्री॰ ఉమ్మడి హక్కు; వాటా; ఉద్యోగము లో చేరుట.
**शिरमौर** - पुं॰ శిరోభూషణము; కిరీటము; శ్రేష్ఠమైన వ్యక్తి.
**शिरीष** - पुं॰ దిరిసెన చెట్టు.
**शिला** - स्त्री॰ పాషాణము; రాయి; బండ.
**शिला लेख** - पुं॰ శిలాశాసనము.
**शिलीमुख** - पुं॰ భ్రమరము; తుమ్మెద; బాణము.
**शिल्प ; शिल्पकला** - पुं॰ दस्तकारी ; హస్తకళ.
**शिल्पशास्त्र** - पुं॰ హస్తకళకు సంబంధించిన శాస్త్రము; వాస్తు శాస్త్రము.
**शिवा** - स्त्री॰ దుర్గాదేవి; పార్వతి; మోక్షము.
**शिवाला** - पुं॰ శివాలయము.
**शिविका** - स्त्री॰ పల్లకి; డోలి.

**शिविर** - पुं० గుడారము; సైన్యశిబిరము; కోట.

**शिशिर** - पुं० శిశిర ఋతువు; చలికాలము; చలి; మంచు.

**शिष्ट** - वि० సభ్యత గల; సజ్జనత్వము గల; ఋజు ప్రవర్తనగల.

**शिस्त** - स्त्री० शस्त ; చేపలు పట్టుగాలము.

**शीत ; शीतल** - वि० శీతలమైన; చల్లని; पुं० చలి; మంచు; తుషారము; రొంప.

**शीतला** - स्त्री० మసూచి రోగము; స్ఫోటకము.

**शीरा** - पुं० चाशनी ; బెల్లము లేక పంచదార పాకము.

**शीरीं** - वि० మధురమైన; ప్రియమైన.

**शीरींजबाँ** - वि० మధురవాక్కు గల; మధుర భాషి.

**शीरीनी** -स्त्री० మాధుర్యము; తియ్యదనము.

**शीर्ण** - वि० చినిగిన; పగిలిన; భగ్నమైన; చినిగి జీర్ణించిన; కృశించిన.

**शीर्ष** - पुं० సిరము; తల; కపాలము; కొన; అగ్రభాగము.

**शीर्षक** - पुं० हेडिंग ; శీర్షిక.

**शील** - पुं० నడక; నడత; ఆచరణము; స్వభావము; శీలము.

**शीलवान** - वि० మంచి నడత గల; సుశీలుడు.

**शीशम** - पुं० సంద్రచెట్టు.

**शीश महल** - पुं० అద్దాల మేడ.

**शीशा** - पुं० आइना ; అద్దము.

**शीशी** - स्त्री० సీసా.

**शुंठि ; शुंठी** - स्त्री० सोंठ ; శొంఠికొమ

**शुंड** - पुं० सूँड ; ఏనుగు తొండము.

**शुंडी** - पुं० ఏనుగు; మద్యము తయా చేయువాడు.

**शुक** - पुं० చిలుక; శిరీష వృక్షము; ‹ మహర్షి.

**शुक्ति** - स्त्री० सीप ; ముత్యపు చిప్ప.

**शुक्र** - पुं० శుక్ర గ్రహము; వీర్యము; శక్తి. पुं० ధన్యవాదము.

**शुक्रगुजार** - वि० కృతజ్ఞత గల.

**शुक्रगुजारी** - स्त्री० కృతజ్ఞత.

**शुक्रिया** - पुं० ధన్యవాదము; కృతజ్ఞత చెప్పుట.

**शुक्ल** - वि० తెల్లని; पुं० శుక్లపక్షము; బ్రాహ్మణులలో ఒక శాఖ.

**शुजा** - वि० వీరత్వము గల; వీరుడు.

**शुजाअत** - स्त्री० వీరత్వము.

**शुतुर** - पुं० ऊँट ; ఒంటె.

**शुतुर-कीना** - पुं० ఎల్లపుడు వైరభావ గలవాడు.

**शुतरमुर्ग** - पुं० నిప్పుకోడి.

**शुद** - वि० పనికిమాలిన; హేయమైన.

**शुदनी** - स्त्री० భవితవ్యత; జరగబోవు విషయము वि० సంభావ్యము.

**शुद-बुद** - यौ० ఏదేని విషయమున అల్ప జ్ఞానము.

**शुद्ध** - वि० పవిత్రమైన; స్వచ్ఛమైన.

**शुद्धपत्र** - पुं० తప్పొప్పుల పట్టిక.

**शुबहा** - पुं० సందేహము; శంక; భ్రమ; దగా.

**शुभा** - पुं० दे० शुबहा.

**शुभ्र** - वि० తెల్లని; స్వచ్ఛమైన; శుభ్రమైన.

**शुमार** - पुं० గణన; లెక్క లేక లెక్కించుట.

**शुरू** - पुं० ఆరంభము; ప్రారంభము.

**शुल्क** - पुं० సుంకము ; బాడుగ; కట్నము; అద్దె; పన్ను; వేతనము లేక ఫీజు.

**शुश्रूषा** - स्त्री० పరిచర్య.

**शूकर** - पुं० सूअर ; పంది.

**शूची** - स्त्री० सुई ; సూది.

**शूप** - पुं० सूप ; చేట.

**शूरा** - पुं० సామంత వీరుడు.

**शूर्प** - पुं० दे० सूप.

**शूल** - पुं० శూలనొప్పి; శూలము; త్రిశూలము; మృత్యువు.

**शूली** - पुं० మహాదేవుడు; శివుడు; स्त्री० పీడ; బాధ.

**शृंखल** - पुं० ఏనుగును కట్టు గొలుసు; వడ్డాణము; సంకెల.

**शृंखला** - स्त्री० క్రమము; గొలుసు; వడ్డాణము; పంక్తి.

**शृंग** - पुं० శిఖరము; పర్వత శిఖరము; పశువు కొమ్ము; బురుజు.

**शृंगारित** - वि० సింగారించబడిన.

**शृगाल** - पुं० सियार ; నక్క.

**शेख** - पुं० ముసల్మానుల నాలుగు తెగలలో మొట్టమొదటి తెగ; మహమ్మదీయుల మతగురువు.

**शेखचिल्ली** - पुं० ఆకాశరామన్న; గప్పాలు కొట్టువాడు वि० కొంటెవాడు; తుంటరి.

**शेखर** - पुं० శిరము; కపాళము; కిరీటము; శిఖరము.

**शेखी** - स्त्री० గర్వము; అహంకారము; దర్పము; గీర.

**शेखी बघारना, हाँकना या मारना** - मु० బడాయి కొట్టుట; కోతలు కోయుట.

**शेफ्ता** - वि० ఆసక్తిగల; వ్యభిచారి.

**शेर** - पुं० వ్యాఘ్రము; ఉర్దూ కావ్య రచనలో రెండు పాదములు గల ఒక పద్యము; సాహసోపేతమైన వీరుడు.

**शेर आबी** - स्त्री० మొసలి.

**शेर-बबर** - पुं० बाघ ; పులి; సింహము.

**शेरमर्द** - पुं० వీరుడు; శూరుడు.

**शेरवानी** - स्त्री० మోకాళ్ళ వరకు వ్రేలాడు ఒక విధమగు చొక్కా.

**शेवा** - पुं० పద్ధతి; తీరు; ప్రణాళి.

**शेष** - पुं० మిగిలిన వస్తువు; శేషించిన వస్తువు; తీసివేయగా మిగిలిన సంఖ్య; वि० మిగిలిన; చివరికి చేరిన; సమాప్తమైన.

**शै** - स्त्री० వస్తువు; పదార్థము; భూతము-ప్రేతము.

**शैतनत** - स्त्री० **शैतानी** ; దయ్యపు పోకడ; దుష్టత.

**शैतान** - पुं० భూతము; ప్రేతము; దుష్టుడు.

**शैतान की आँत** - मु० చాల పొడుగైన వస్తువు; చెడ్డమనిషి.

**शैतानी** - स्त्री० తుంటరితనము; కొంటె తనము; దౌష్ట్యము; वि० దయ్యపు.

**शैदा** - वि० ప్రేమించు; అనురక్తిగల.

**शैदाई** - पुं० ప్రేమికుడు; అనురక్తుడు.

**शैल** - पुं० పర్వతము; కొండ.

**शैलकुमारी** - स्त्री० పార్వతి.

**शैलगंगा** - स्त्री० గోవర్ధన పర్వతమునుండి వెలువడు ఒక నది.

**शैली** - स्त्री० రీతి; శైలి; వాక్య రచనా పద్ధతి.

**शैवलिनी** - स्त्री० నది.

**शैवाल** - पुं० **सेवार** ; నాచు; పాకుడు.

**शैशव**-वि० శిశుసంబంధమైన; पुं० బాల్యము; శైశవము.

**शोक** - पुं० మృతవ్యక్తికి సంబంధించిన రోదనము - శోకము.

**शोख** - वि० **ढीठ**; చంచలమైన; తుంటరియగు; పోకిరియైన; పొగరు గల ; ముదురు రంగుగల.

**शोखी** - स्त्री० **ढिठाई** ; తుంటరి తనము; పొగరు.

**शोच** - पुं० దుఃఖము; చింత.

**शोचनीय** - वि० దుఃఖించదగిన; చింతనీయము; చింతించదగిన.

**शोण** - पुं० ఎరుపురంగు; ఎర్రదనము.

**शोणित** - वि० ఎర్రని; पुं० రక్తము; నెత్తురు.

**शोथ** - पुं० **सूजन** ; వాపు.

**शोध** - पुं० శుద్ధ సంస్కారము; శుభ్రత; అన్వేషణ; పరీక్ష.

**शोधना** - स०क्रि० పరిష్కరించుట; సరిచేయుట; అన్వేషించుట; సంస్కరించుట.

**शोधित** - वि० సరిచేయబడిన; సంస్కరింపబడిన; శోధించబడిన.

**शोबदा** - पुं० గారడీ; ఇంద్రజాలము; దగా.

**शोबदा-गर ; शोबदा बाज** - पुं० గారడీ మనిషి; దగాకోరు.

**शोबा** - पुं० సమూహము; మంద; కాలువ.

**शोभन** - पुं० ఆభూషణము; నగ; దీప్తి; సౌందర్యము ; वि० శోభించుచున్న; మనో హరమైన.

**शोभा** - स्त्री० దీప్తి; కాంతి; అలంకరణ; శోభ.

**शोर** - पुं० గలభా; కోలాహలము; సందడి.

**शोरबा** - पुं० रसा ; ఏదేని పొంగించిన వస్తువులోని రసము.

**शोरा** - पुं० మట్టిలో లభించు ఒక విధమగు ఉప్పు; చవుడు.

**शोरिश**-स्त्री०అల్లరి; కోలాహలము; గలభా; తగాదా.

**शोला** - स्त्री० అగ్నిజ్వాల.

**शोशा** - पुं० బహిర్గతమైన ములుకు; అద్భుత మైన విషయము; విస్మయము కలిగించు విషయము.

**शोष** - पुं० శోషణము; క్షీణత; శరీరము శుష్కించుట.

**शोषक** - पुं० శుష్కింపజేయువాడు; పీల్చు వాడు.

**शोषित** - वि० శోషింపబడిన.

**शोहदा** - पुं० రౌడి; దురాచారి; దుండగుడు.

**शोहरत ; शोहरा** - स्त्री० ప్రసిద్ధి; ఖ్యాతి; జనరవము.

**शौक** - पुं० ఏదేని వస్తువులు పొందవలెనని గొప్ప కోరిక; రుచి; ఆకాంక్ష.

**शौकत** - स्त्री० బలము; సామర్థ్యము; ఆడంబరము; వైభవము.

**शौकिया** - वि० ఆకాంక్షగల.

**शौकीन** - पुं० భోగలాలసుడు; సరదా పురుషుడు.

**शौकीनी** - स्त्री० సరదా; భోగలాలసత.

**शौक्तिक** - पुं० మౌక్తికము; ముత్యము.

**शौच** - पुं० శుద్ధత; శుభ్రత; పవిత్రత బహి ర్భూమికి వెళ్ళుట ; కాలకృత్యములు.

**शौहर** - पुं० భర్త; పతి.

**श्मशानपति** - पुं० శివుడు.

**श्मशानयात्रा**-स्त्री०శవమును శ్మశానమునకు తీసుకు వెళ్ళుట.

**श्मश्रु** - पुं० మీసములు.

**श्यामटीका** - पुं० डिठौना ; దిష్టిబొట్టు.

**श्यामल** - वि० నల్లని; నలుపు, నీలము కలసిన వన్నెగల.

**श्यामा** - स्त्री० కృష్ణుని ప్రియురాలు రాధ; కోకిల; రాత్రి; స్త్రీ.

**श्येन** - पुं० बाज ; డేగ.

**श्रद्धा** - स्त्री० పెద్దల యెడల ఉండు గౌరవ భావము.

**श्रद्धालु** - वि० శ్రద్ధగల.

**श्रद्धेय** - वि० శ్రద్ధ పొందదగిన.
**श्रमजल ; श्रमवारि** - पुं० చెమట.
**श्रमण** - पुं० బౌద్ధ సన్యాసి.
**श्रमसीकर** - पुं० శ్రమచిందుట; చెమట.
**श्रमित** - वि० శ్రమించి అలసిపోయిన.
**श्रमी** - पुं० శ్రమజీవి; కష్టించి పనిచేయువాడు.
**श्रवणीय ; श्रव्य**- वि० వినదగిన; వినుటకు వీలైన.
**श्रांति** - स्त्री० పరిశ్రమ; అలసట.
**श्राद्ध** - पुं० శ్రద్ధాపూర్వకముగా చేయు కార్యము; శ్రాద్ధము; మృతవ్యక్తికి సంబంధించిన కర్మకాండ.
**श्रावणी** - स्त्री० శ్రావణ పూర్ణిమ; రక్షా బంధనము చేయు దినము.
**श्राव्य** - वि० వినసొంపైన.
**श्रीकंठ** - पुं० శివుడు; మహాదేవుడు.
**श्रीखंड** - पुं० మంచిగంధము; చందనము.
**श्रीखंडशैल** - पुं० మలయ పర్వతము; చందన వృక్షములు గల ; విష్ణు పర్వతము - మలబారు ప్రాంతములోనున్నది.
**श्रीपति** - पुं० విష్ణువు.
**श्रीफल** - पुं० నారికేళము ; కొబ్బరికాయ; • ఉసిరికాయ; సంపత్తి.
**श्रीमंत** - पुं० ఒక విధమగు స్త్రీల శిరోభూషణము; స్త్రీల శిరము మీది పాపిడి.
**श्रीहत** - वि० శోభారహితమైన.
**श्रुत** - वि० వినిన; వినియున్న; ప్రసిద్ధమైన.
**श्रेय** - वि० మంగళదాయకమైన; శుభప్రదమైన; पुं० సదాచారము కళ్యాణము.
**श्रोत** - पुं० చెవి; కర్ణము.
**श्रोता** - पुं० వినువాడు.
**श्रोत्रिय** - पुं० వేద విద్యా పారంగతుడు.
**श्लथ** - वि० వదులైన; శిథిలమైన; అశక్తమైన.
**श्लाघनीय** - वि० పొగడదగిన; ప్రశంసించ దగిన.
**श्लेघा** - स्त्री० ప్రశంస ; పొగడ్త.
**श्लेघ्य** - वि० ప్రశంసనీయమైన; శ్రేష్ఠమైన.
**श्लिष्ट** - वि० శ్లేషగల; శ్లేషార్థముగల; అంటి యున్న ; కలసియున్న.
**श्लील** - पुं० శిష్టమైన; ఉత్తమమైన; శుభమైన.
**श्वसुर** - पुं० ससुर ; భార్యతండ్రి ; మామ గారు.
**श्वश्रू** - स्त्री० सास ; భార్యతల్లి ; అత్తగారు.
**श्वान** - पुं० कुत्ता ; కుక్క.
**श्वापद** - पुं० క్రూరమృగము.
**श्वेत** - वि० सफेद ; తెల్లని.
**श्वेतांशु** - पुं० చంద్రుడు.

## ष

**षंड** - वि० నపుంసకుడు; ఆబోతు; శివుని పేర్లలో ఒకటి.

**षंडत्व** - पुं० नामर्दी ; నపుంసకత్వము.

**षट** - पुं० ఆరు ; ఆరు సంఖ్య ; 6.

**षटपद** - पुं० భ్రమరము; తుమ్మెద.

**षटमुख** - पुं० కార్తికేయుడు; కుమారస్వామి.

**षटरस** - पुं० दे० षडरस.

**षडयंत्र** - पुं० కుట్ర; కపట పథకము.

**षडरस** - पुं० ఆరు రకముల రుచులు ; మధురము; లవణము; కటువు; తిక్తము; కషాయము; ఆమ్లము.

**षड्रिपु** - पुं० ఆరు మనోవికారములు - కామ క్రోధలోభమదమోహమాత్సర్యములు.

**षष्ठ** - वि० ఆరవ.

**षोडश**-वि० పదహారు; పదహారవ ; पुं० పదహారు సంఖ్య; 16.

**षोडश शृंगार** - पुं० పదహారు రకముల అలంకరణములు; శృంగారము - పూర్ణ శృంగారము.

**षोडशी** -वि० (स्त्री०) పదిహారవ; పదహారు వత్సరముల వయస్సుగల ( యువతి).

**षोडशोपचार** - पुं० పదహారు దైవపూజా విధానములు - 1.ఆవాహనము. 2.ఆస నము 3.అర్ఘ్యము 4.పాద్యము 5.ఆచ మనము. 6.మధుపర్కము; 7.స్నానము; 8.వస్త్రాభరణము; 9.యజ్ఞోపవీతము 10.గంధము 11.పుష్పము 12.ధూప ము; 13.దీపము; 14.నైవేద్యము 15.తాం బూలము 16.ప్రదక్షిణ వందనము.

**षोषरी** - वि० (स्त्री०) బోలైన; బోలుగల.

**ष्ठीवन** - पुं० थूक ; ఉమ్మి; ఉమ్ముట.

# स

**संक** - स्त्री० दे० शंका.

**संकट**-वि० ఇరుకైన; पुं० విపత్తు; సంకటము.

**संकर** - वि० दोगला ; వర్ణసంకరమైన; వర్ణ సంకరము; విభిన్న వస్తువుల కలయిక.

**संकरता** - स्त्री० సాంకర్యము; కల్తీ.

**संकरा** - वि० సన్నిది; ఇరుకైన; पुं० కష్టము; విపత్తు.

**संकल** - स्त्री० తలుపు గొళ్ళెము; గొలుసు; పశువులను కట్టుగొలుసు.

**संकलन** - पुं० సంగ్రహము; కూర్పు; సంగ్ర హించుట; పోగుచేయుట; సంకలనము.

**संकलित**-वि०ఎన్నబడిన; సంగ్రహించబడిన; సమకూర్చబడిన.

**संकल्प** - पुं० ఏదేని కార్యము చేయవలెనని నిశ్చయము ; సంకల్పము; నిర్ధారణ.

**संकीर्ण** - वि० సంకుచితమైన; ఇరుకైన; అల్పమైన.

**संकीर्तन** - पुं० यश गान ; భజన.

**संकुचित** - वि० ముడుచుకొనిన; సంకు చితమైన; ఇరుకుగ.

**संकुल** - वि० సంకీర్ణమైన; పరిపూర్ణమైన; पुं० సమూహము; యుద్ధము; గుంపు.

**संकुलित** - वि० పరిపూర్ణమైన; వ్యాపించిన; దట్టమైన.

**संकेत** - पुं० इशारा ; సంకేతము; ఇంగితము.

**संकोच**- पुं० కుచించుట; ముడుచుకొనుట; సంకోచము; మొగమాటము.

**संकोचना** - अ०क्रि० సంకోచించుట; మొగమాటపడుట; ముడుచుకొనుట.

**संकोची** - वि० మొగమాటపడువాడు; సిగ్గునొందు; ముడుచుకొనిన; సంకోచించు.

**संक्रंदन** - पुं० ఇంద్రుడు.

**संक्रमण** - पुं० గమనము; నడక.

**संक्रामक** - वि० సంక్రమించు; తాకుడు వలన వ్యాపించు.

**संक्षिप्त** - वि० క్లుప్తముగ; ముక్తసరిగ; కొద్ది.

**संक्षेप** - पुं० కొద్దిలో ఏదేని విషయమును చెప్పుట; క్లుప్తముగా చెప్పబడిన లేక వ్రాయబడిన విషయము.

**संक्षेपण** - पुं० క్లుప్తపరచుట; సంక్షేపముగ వర్ణించుట; సంక్షేపణము.

**संक्षेपतः** - अव्य० కొద్దిలో; క్లుప్తముగా.

**संख** - पुं० दे० शंख.

**संखिया** - पुं० పాషాణము; ఒక విధముగు మహావిషము.

**संख्यक** - वि० సంఖ్యగల.

**संख्या** - स्त्री० అంకె.

**संग** - पुं० కలయిక ; సాంగత్యము; సహవాసము; రాయి; वि० కఠోరమైన; क्रि०वि० వెంట.

**संग लगना** - मु० వెంటుండుట ; వెంటబడుట.

**संगठन** - पुं० చెదిరియున్న శక్తులను లేక జనమును ఏకం చేసి ఒక సంఘముగా ఏర్పరచుట.

**संगठित** - वि० బాగుగా ఏకమైన.

**संगत** - स्त्री० సాంగత్యము; సహవాసము; సహవాసి; वि० తగిన; అనుకూలమైన.

**संगतराश** - पुं० రాయి చెక్కుడు పని చేయువాడు.

**संगति** - स्त्री० సాంగత్యము; కలయిక; తోడు.

**संगतिया ; संगती** - वि० సహచరుడు; సహవాసి; పాటకునితోటి వాద్యకులు.

**संगदिल** - वि० రాతి గుండెగల; దయలేని.

**संगम** - पुं० కలయిక; నిమజ్జనము.

**संगमर्मर** - पुं० స్వచ్ఛమైన చలువరాయి.

**संगमूसा** - पुं० ఒక విధమైన నున్నని బహుమూల్యమైన నల్లరాయి.

**संगयशब** - पुं० होलदिली ; ఒక విధమగు ఆకు పచ్చని బహుమూల్యమైన రాయి;

ఈ రాతి కడుగు నీరు లేక రుద్దిన నీరు త్రాగినగుండె దడ తగ్గునని ప్రతీతి.

**संगर** - पुं० సంగ్రామము; యుద్ధము.

**संगसार** - पुं० అపరాధిని రాళ్ళతో కొట్టి చంపుట.

**संगाती ; संगारी** - पुं० సహచరుడు; సహవాసి; స్నేహితుడు.

**संगिनि** - स्त्री० సహేలి; భార్య.

**संगी** - पुं० సహచరుడు; సహవాసి.

**संगीन** - पुं० తుపాకి చివరి భాగమున తగిలించబడు ఇనుప ములికి; वि० అసాధారణమైన రాతితో చేయబడిన; బలమైన మన్నికగల.

**संगृहीत** - वि० సంకలింపబడిన; పోగుచేయబడిన.

**संगेमसाना** - पुं० మూత్రములో రాళ్ళు ఉండు జబ్బు.

**संगोयन** - पुं० దాపరికము; దాచుట.

**संग्राम** - पुं० సంగ్రామము; యుద్ధము.

**संघटन** - पुं० కలయిక; సంయోగము ; दे० संगठन.

**संघर्ष ;संघर्षण** - पुं० రాపిడి; ప్రతియోగిత; రుద్దుడు; రాచుకొనుట.

**संघात** - पुं० ప్రహారము; దెబ్బ; హత్య; చావు; సమిష్టి; సమూహము; సంయోగము.

**संघाती** - पुं० సహచరుడు; సహవాసి; స్నేహితుడు.

**संघारना** - स०क्रि० సంహరించుట; వధించుట.

**संघाराम** - पुं० బౌద్ధసన్యాసుల విహారము; మఠము.

**संचय** - पुं० సమూహము; కుప్ప; సంచయనము.

**संचरित** - वि० సంచరించు.

**संचालक** - पुं० నడిపించువాడు; పరిచాలకుడు.

**संचालन** - पुं० పరిచాలనము; పనికొనసాగించుట.

**संचित** - वि० ప్రోగుచేసిన; కూడబెట్టిన.

**संचौनी** -स्त्री० సంగ్రహము; ఏకత్రీకరణము.

**संजात** - वि० జన్మించిన ; ప్రాప్తించిన.

**संजाफ** - पुं० అంచు; కొన; గోటు.

**संजाफी** - पुं० సగము ఎరుపు, సగము ఆకుపచ్చ వన్నెగల గుఱ్ఱము.

**संजीदगी** - स्त्री० వ్యవహారగాంభీర్యము.

**संजीदा** - वि० గంభీరమైన; తెలివిగల; తగిన; శాంతముగల ; సరిగా గురివేయు.

**संजीवन** - पुं० సవ్యముగ జీవితము గడుపుట; ప్రాణశక్తి కలుగజేయు.

**संजीवनी** - स्त्री० ప్రాణశక్తి కలుగజేయు ఒక కాల్పనిక ఔషధము; पुं० ప్రాణశక్తి కలుగ

జేయు నది.

**संजुक्त** - वि० दे० संयुक्त.

**संजूत** - वि० అప్రమత్తమైన; సన్నద్ధమైన.

**संजोग** - पुं० दे० संयोग.

**संजोना** - स०क्रि० అలంకరించుట; సింగారించుట; సిద్ధపరచుట.

**संज्ञा** - स्त्री० చైతన్యము; స్పృహ; బుద్ధి; జ్ఞానము; నామము; నామవాచకము.

**संज्ञाहीन** - वि० స్పృహలేని; చైతన్యములేని.

**संडमुसंड** - वि० లావుగ; బొద్దుగ; దృఢముగ.

**संडसा** - पुं० పట్కారు.

**संडा** - वि० బలిసిన; దృఢమైన.

**संडास** - पुं० శౌచకూపము; మరుగుదొడ్డి.

**संत** - पुं० సాధువు; సన్యాసి ; త్యాగి.

**संतत** - अव्य० ఎల్లప్పుడు; నిరంతరము.

**संतति** - स्त्री० సంతానము.

**संतप्त** - वि० ఎక్కువగా తపించిన; దుఃఖము గల; పీడించబడిన.

**संतरण** - पुं० తరించుట; బాగుగా ఈదుట; అద్దరికి దాటుట.

**संतरा** - पुं० కమలాఫలము.

**संतरी** - पुं० పహరా నిచ్చువాడు ; ద్వార పాలకుడు.

**संताप** - पुं० తాపము; జ్వలనము; క్లేశము.

**संतापित** - वि० दे० संतप्त.

**संतापी** - पुं० తాపము కలుగజేయువాడు.

**संती** - अव्य० బదులుగా; ద్వారా.

**संतुष्ट** - वि० తృప్తిజెందిన; ఒప్పుకొనిన.

**संतोख** - पुं० दे० संतोष.

**संतोष** - पुं० సంతృప్తి; ఓర్మి; తృప్తి; ఆనందము; సంతోషము.

**संतोषी** - पुं० ఎల్లప్పుడు సంతోషముగా నుండు వాడు.

**संत्रस्त** - वि० భయపడిన; భీతినొందిన; వ్యాకులమైన.

**संदर्भ** - पुं० ప్రసంగము; రచన; వ్యాసము; చిన్న పొత్తము.

**संदल** - पुं० శ్రీఖండము; మంచి గంధము.

**संदीपन** - पुं० ఉద్దీపనము; ఉత్తేజనము; శ్రీకృష్ణుని గురువు పేరు.

**संदूक** - पुं० పెట్టె; బోషాణము.

**संदूकचा ; संदूकची ; संदूकडी**-स्त्री० చిన్న ట్రంకుపెట్టె

**संदेसा** - पुं० మౌఖికమైన సమాచారము.

**संदेसी**-पुं०వార్తాహరుడు; సందేశవాహకుడు.

**संदेह** - पुं० శంక; సందేహము; సంశయము

**संदोह** - पुं० సమూహము; గుంపు.

**संधान** - पुं० లక్ష్యపెట్టుట; గురిపెట్టుట అన్వేషణ.

**संधानना** - स०क्रि० గురిపెట్టుట; గురిపెట్టి

బాణము వేయుట.

**संधाना** - पुं० खटाई ; ఆచారము.

**संधि** - स्त्री० కలయిక; సంయోగము; మైత్రి; సంధి.

**संन्यस्त** - वि० సన్యసించిన; సంలగ్నమైన; సన్నద్ధమైన.

**संपन्न** - वि० సంపదగల; ధనము గల.

**संपर्क** - पुं० సంసర్గము; సాంగత్యము.

**संपा** - स्त्री० शंपा या बिजली ; మెరుపు.

**संपात** - पुं० తటాలున పడిపోవుట; సంసర్గము; సంగమము; సమాగమము.

**संपादकीय** - वि० సంపాదకీయము; సంపాదకుడు వ్రాసిన వ్యాసము.

**संपादन** - पुं० పత్రికా సంపాదకుడు చేయు పని; వచ్చిన వ్యాసములను సవరించి ప్రచు రించుట.

**संपुट** - पुं० దోసిలి; దొన్నె; భరణి.

**संपुटी** - स्त्री० చిన్న గిన్నె.

**संपृक्त** - वि० సంపర్కము గల; కలిసిమెలిసిన.

**सँपेरा** - पुं० मदारी ; పాములవాడు.

**सँपोला** - पुं० సర్పశావకము; పాముపిల్ల.

**संप्रति** - अव्य० ఈ రోజుల్లో; ఈ మధ్యన; ఈ సమయమున.

**संप्राप्त** - वि० చేరియున్న; హాజరుగానున్న; ఘటించిన; ప్రాప్తించిన.

**संबंधी** - वि० సంబంధించిన; पुं० బంధువు; వియ్యంకుడు.

**संबद्ध** - वि० బంధింపబడిన; సంబంధము కలిగివున్న.

**संबल** - पुं० పాథేయము; దారి బత్యము.

**संबुद्ध** - पुं० జ్ఞానవంతుడు; జ్ఞాని; బుద్ధి మంతుడు.

**संभलना**-अ०क्रि० జాగ్రత్తపడుట; రక్షించు కొనుట; తేరుకొనుట; తెప్పరిల్లుట.

**संभव** - पुं० జన్మించుట; కాగలుగుట; కలయిక; वि० ఉత్పన్నమైన.

**संभवत:** - अव्य० కావచ్చు; బహుశా.

**संभवनीय** - वि० సంభవమైన.

**संभार** - पुं० ప్రోగుచేయుట; సన్నద్ధత; సామానులు; సామగ్రి; ఆడంబరము; పెంపకము.

**संभारना** - स०क्रि० दे० संभालना.

**संभाल** - स्त्री० రక్షణ; పోషణ; పాలన మొ॥ భారము.

**संभालना** - स०क्रि० నిర్వహించుట; సంబా ళించుట; సర్దుట; జాగ్రత్తపడుట ; తను నియంత్రించుకొనుట.

**संभाला** - पुं० చావు ముందు వచ్చు చైతన్యము; తెలివి.

**संभावना** - स्त्री० భావన; కల్పన; సంభవ

మగుట; అర్హత.

**संभावित ; संभाव्य** - वि० కల్పితమైన; సంభవమైన; ప్రతిష్ఠితమైన.

**संभूत** - वि० ఉత్పన్నమైన; యుక్తమైన; సహితమైన.

**संभूय समुत्थान** - पुं० వాటాదారుల ఉమ్మడి వ్యాపారము.

**संभ्रम** - पुं० గాబరా; వ్యాకులత; భయము; స్తబ్ధత.

**संभ्रान्त** - वि० కలతజెందిన; ఉద్విగ్నమైన; ప్రతిష్ఠగల; గౌరవనీయమైన.

**संयत** - वि० వశ్యమైన ; వ్యవస్థితమైన ; నిగ్రహించిన ; బద్ధమైన.

**संयम** - पुं० మనోనిగ్రహము; ఇంద్రియ నిగ్రహము.

**संयमनी** - स्त्री० యమపురి.

**संयमी** - वि० ఆత్మనిగ్రహి; మనస్సును, ఇంద్రియములను వశపర్చుకొనువాడు.

**संयुक्त** - वि० కలిసియున్న; సంబద్ధమైన; సహితమైన.

**संयुग** - पुं० సంయోగము; పోరాటము.

**संयुत** - वि० दे० संयुक्त.

**संयोग** - पुं० కలయిక; సమాగమము; సహవాసము ఆకస్మిక సంయోగము.

**संयोग से** - अ० దైవవశాత్తు; తలవని తలంపుగా.

**संयोजक** - पुं० కల్పునది; కల్పువాడు.

**संयोजन** - पुं० కలయిక.

**सँयोना** - स०क्रि० दे० सँजोना.

**संरक्षित** - वि० సురక్షితముగా నుంచబడి యున్న.

**संलक्ष्य** - वि० చూడవీలగు.

**संलग्न** - वि० అంటివున్న; సంబద్ధమైన; తీగాదాలో చిక్కుకొన్న.

**संलाप** - पुं० సంభాషణ.

**संवत** - पुं० సంవత్సరము; విక్రమాదిత్య కాలముతో ప్రారంభమైన కాలగణన.

**संवत्सर** - पुं० సంవత్సరము; వర్షము.

**सवरण** - पुं० ఆచ్ఛాదనము-కప్పుట; దాచుట; సవరించుట; నిగ్రహించుట.

**संवरना** - अ०क्रि० అలంకరింపబడుట; సరిగానుండుట.

**संवर्द्धन** - पुं० వృద్ధి; పోషణ; పెంపకము.

**संवाद** - पुं० సంభాషణ; వార్తాలాపము; సమాచారము.

**सँवारना** - स०क्रि० అలంకరించుట; సరి చేయుట.

**संवास** - पुं० సుగంధము; సువాసన; నోటి నుండి వెలువడు దుర్వాసన; ఉమ్మడి నివాస స్థానము.

**संवाहन** - पुं० మోయుట; తీసుకువెళ్ళుట; చేర్చుట.

**संविधान** - पुं० రాష్ట్ర, శాసన సంబంధమైన; చట్టసంహిత.

**संवृत** - वि० మూయబడివున్న; దాచబడిన.

**संवेद** - पुं० అనుభవము; జ్ఞానము; తెలివి; వేదన.

**संवेदन** - पुं० అనుభూతి; సుఖదుఃఖ అనుభూతి; వ్యక్తపరచుట.

**संवेद्य** - पुं० అనుభవించదగిన; చెప్పదగిన.

**संशय** - पुं० సందేహము; సంశయము.

**संशयात्मा** - पुं० ప్రతి విషయమును అనుమానించువాడు; సందేహించువాడు.

**संशयित** - वि० శంకించు; సందిగ్ధమైన.

**संशयी** - स्त्री० సందేహించువాడు; శంకించువాడు.

**संशुद्ध** - वि० సంశోధించబడిన.

**संशोधन** - पुं० సరిదిద్దుట; సరిచేయుట; సంశోధనము; పరిష్కరణము.

**संशोधित** - वि० సంస్కరింపబడిన; సరిదిద్దబడిన.

**संश्रित** - वि० శాస్త్రములో వచ్చివున్న; ఇతరుల ఆశ్రయములోనున్న.

**संश्लिष्ट** - वि० కలిసియున్న; అంటుకుని యున్న; కౌగిలిలోనున్న.

**संसद** - स्त्री० పరిషత్తు; రాజ్యసభ, లోకసభల సంయుక్తపరిషత్తు.

**संसर्ग** - पुं० సాంగత్యము; కలయిక; సహవాసము.

**संसार** - पुं० दुनिया ; ప్రపంచము; జగత్తు; గృహస్థి-సంసారము.

**संसृति** - स्त्री० జన్మపరంపర; అనాగమనము; సృష్టి.

**संस्करण** - पुं० సంస్కారము; పుస్తకముల ఒకసారి ముద్రణము; ఆవృత్తి.

**संस्कार** - पुं० సంశోధనము; సరిదిద్దుట; పరిష్కృతి.

**संस्मरण** - पुं० జ్ఞాపకమున్న స్వానుభవము; సంఘటన మొదలగునవి.

**संहरना** - अ०क्रि० సంహరించుట; स०क्रि० సంహరించబడుట.

**संहित** - वि० సంగ్రహించబడిన; సంకలించబడిన.

**संहिता** - स्त्री० సంకలనము; సంగ్రహము.

**सआदत** - स्त्री० అదృష్టము; బాగు.

**सआदतमन्द** - वि० అదృష్టవంతుడు; బుద్ధిమంతుడు; విధేయుడు; యోగ్యుడు.

**सई** - स्त्री० सफारिश ; సిఫార్సు; ప్రయాస; వృద్ధి; వికాసము.

**सईद** - वि० శుభప్రదమైన; అదృష్టము గల.

**सकट** - पुं॰ शकट ; బండి.

**सकत** - स्त्री॰ శక్తి; సామర్థ్యము.

**सकता** - स्त्री॰ సామర్థ్యము; అపస్మారము ; పద్యములో యతి; **सकता पडना**-मु॰ పద్యములో యతి భంగదోషము.

**सकना** - अ॰क्रि॰ సమర్థుడగుట; నిర్వహణ యోగ్యమగుట.

**सकपकाना** - अ॰क्रि॰ ఆశ్చర్యపడుట; నివ్వెరబోవుట; సంకోచించుట.

**सकरना** - अ॰क्रि॰ మంజూరగుట; స్వీకరింపబడుట.

**सकर्मक** - वि॰ కర్మయుక్తమైన.

**सकल** - वि॰ సమస్తము; మొత్తము.

**सकलात** - पुं॰ కప్పుకొను రజాయి; కానుక; ముఖము.

**सकाना** - अ॰क्रि॰ సంకోచించుట; సందేహించుట.

**सकाम** - पुं॰ కోరికగలవాడు; కాముకుడు.

**सकारना** - अ॰क्रि॰ స్వీకరించుట.

**सकारे** - क्रि॰वि॰ सबेरे ; ప్రాతఃకాలమున.

**सकालत** - स्त्री॰ బరువు; భారము.

**सकीम** - वि॰ రోగి; జబ్బుగానున్న.

**सकील**-वि॰ బరువైన; బరువుగల; భారమైన.

**सकुचना** - अ॰क्रि॰ సిగ్గుపడుట; సంకోచించుట; ముడుచుకొనుట.

**सकुचाई** - स्त्री॰ సంకోచము; లజ్జ.

**सकुचाना** - अ॰क्रि॰ సంకోచించుట; स॰क्रि॰ ముడుచుట; సంకోచింప జేయుట.

**सकुन ; सकुनी** - पुं॰ పక్షి; పిట్ట.

**सकून** - पुं॰ మానసిక శాంతి.

**सकूनत** - स्त्री॰ నివాస స్థానము.

**सकेलना** - स॰क्रि॰ పోగుచేయుట; ఏకత్ర పరచుట.

**सक्का** - पुं॰ తోలుసంచిలో నీరు నింపుకొని మోసుకొచ్చువాడు.

**सक्तु ; सक्तुक** - पुं॰ सत्तू ; పేలపిండి.

**सक्षम** - वि॰ సమర్థమైన.

**सखरी** - स्त्री॰ कच्ची रसोई ; అన్నము; పప్పు; తైల పక్వముగాని లేక ఘృత పక్వముగాని వంట.

**सखा** - पुं॰ సహవాసి; స్నేహితుడు.

**सखावत** - स्त्री॰ ఔదార్యము; దాతృత్వము.

**सखी** - स्त्री॰ సహవాసిని; స్నేహితురాలు; वि॰ దానశీలుడు; ఔదార్యముగల.

**सखुन** - पुं॰ సంభాషణ; వార్తాలాపము; కథనము; కవిత్వము.

**सखुन ताकिया** - पुं॰ तकिया कलाम ; ఊతపదము.

**सखुन फहम** - वि॰ మాటల మర్మము

తెలిసినవాడు; చతురుడు.

**सखत** - वि॰ కఠినమైన; కఠోరమైన; గంభీర మైన.

**सखती** - स्त्री॰ కాఠిన్యము; గాంభీర్యము; దృఢత.

**सखत दिल** - वि॰ కఠోర హృదయుడు.

**सख्य** - वि॰ సఖా సంబంధమైన.

**सख्यता** - स्त्री॰ స్నేహము; సాంగత్యము.

**सग** - पुं॰ కుక్క.

**सगबग** - वि॰ మునిగితేలుచున్న; నిండుగా నున్న; పరిపూర్ణమైన.

**सगबगाना** - क्रि॰वि॰ తొందరతొందరగా; వేగముగా; పూర్తిగా తడియుట; మునిగి తేలుట; తొట్రుపాటుపడుట; నివ్వెర పోవుట.

**सगा** - वि॰ స్వంత ; సయానా.

**सगाई** - स्त्री॰ వివాహ నిశ్చితార్థము; బాంధవ్యము.

**सगापन** - पुं॰ ఆత్మీయత; ఆత్మీయ బాంధవ్యము.

**सगोत्री** - पुं॰ సగోత్రీకులు; బంధువులు.

**सघन** - वि॰ దట్టమైన.

**सचमुच** - अव्य॰ వాస్తముగా; నిజానికి.

**सचाई** - स्त्री॰ వాస్తవికత; యథార్థత.

**सचान** - पुं॰ बाज ; డేగ.

**सचिक्कण** - पुं॰ బహుచిక్కన.

**सचिव** - पुं॰ కార్యదర్శి; స్నేహితుడు.

**सचेत** - वि॰ చైతన్యముగల; తెలివిగల.

**सचेष्ट** - वि॰ ప్రయత్నము.

**सच्चरित** - वि॰ మంచి నడవడిగల; సదాచారి.

**सच्चा** - वि॰ సత్యవాది; సత్యము; యథార్థత.

**सच्चाई** - स्त्री॰ సత్యసంధత్వము; యథార్థము.

**सच्छत** - वि॰ గాయపడిన.

**सज** - स्त्री॰ అలంకరణ ; ఆకృతి ; శోభ ; సౌందర్యము.

**सजग**-वि॰सावधान; జాగ్రత్తగల; తెలివిగల.

**सजदार** - वि॰ మంచి రూపముగల; అందమైన.

**सजधज** - स्त्री॰ సింగారము; అలంకరణ.

**सजन** - पुं॰ సజ్జనుడు; సుజనుడు; భర్త; ప్రియుడు.

**सजना** - स॰क्रि॰ అలంకరించుట;अ॰क्रि॰ అలంకరింపబడుట; पुं॰ ప్రియుడు.

**सजनी** - स्त्री॰ సఖి ; చెలికత్తె.

**सजवल** - पुं॰ తయారి; సన్నద్ధత.

**सजा** - स्त्री॰ దండన; శిక్ష; కారావాసము.

**सजाई** - स्त्री॰ అలంకరణ; సర్దుడు; అలంక రించినందుకు లేక సర్దినందుకు కూలి.

**सजागर** - वि॰ జాగ్రత్తగల; తెలివైన.

**सजाना** - स०क्रि० అలంకరించుట; సర్దుట; సింగారించుట.

**सजायाब** - वि० దండింప బడదగిన; శిక్ష అనుభవించిన.

**सजाव** - पुं० ఒకవిధమగు శ్రేష్ఠమైన పెరుగు.

**सजावल** - पुं० ప్రభుత్వపు పన్ను వసూలు చేయు అధికారి; తాహసీల్దారు; సిపాయి.

**सजावट** - स्त्री० అలంకరణ; సింగారము.

**सजावार** - वि० ఉచితమైన; తగిన; దండన పొందదగిన.

**सजीला** - वि० షోకిల్లా; అలంకరించుకొని తిరుగువాడు; మనోహరమైన.

**सजीव** - वि० ప్రాణముగల; చురుకైన; తేజస్సుగల.

**सजुग** - वि० सचेत ; చైతన్యముగల.

**सजोना** - स०क्रि० दे० सजाना.

**सज्ज** - पुं० दे० साज.

**सज्जा** - स्त्री० सजावट ; వేశభూష; శయ్య; అలంకారము.

**सज्जाद** -वि० నమస్కరించువాడు.

**सज्जादा**-पुं० जा-नमाज ; నమాజుచేయు నపుడు కూర్చుండు వస్త్రము; మహం తుని పీఠము.

**सज्जित** - वि० అలంకరించబడిన.

**सज्जी** - पुं० బూడిద వన్నెగల; ఒక విధమగు ఉప్పు.

**सटक** - स्त्री० మెదలకుండా జారుకొనుట; అదృశ్యమగుట; ఊగిసలాడు పల్చని బెత్తము; ఊచ.

**सटना** - अ०क्रि० ఆనుకొనుట; అంటు కొనుట.

**सटपट** - स्त्री० తొట్రుపాటు; సందిగ్ధావస్థ.

**सटपटाना** - अ०क्रि० दे० सिटपटाना.

**सटपटर** - वि० చిన్న-పెద్ద; సాధారణమైన.

**सटाना** - स०क्रि० ఆనించుట; కలుపుట.

**सटीक** - वि० టీకా సహితముగా; వ్యాఖ్యా సహితముగా ; తగినటువంటి; సరియైన.

**सट्टा** - पुं० కరారునామా; లాభము కొరకు క్రయ-విక్రయము చేయు వ్యాపారము.

**सट्टा-बट्टा** - पुं० కలుపుగోరుతనము; కొంటె ఆలోచన; తుంటరి తనము.

**सट्टी** - स्त्री० ఒకరకపు, ఒకేమోస్తరు వస్తువులు అమ్ము బజారు ; సంత.

**सट्टेबाज** - पुं० ధర గమనమును దృష్టిలో ఉంచుకొని క్రయ-విక్రయము చేయు వ్యాపారి.

**सठ** - पुं० दे० शठ.

**सठियाना** - अ०क्रि० 60 సం.ములు వయస్సువచ్చుట; వృద్ధుడగుట ; వృద్ధా ప్యముచే బుద్ధి తగ్గుట.

**सडक** - स्त्री० రాజమార్గము; రాజబాట.
**सडना** - अ०क्रि० కుళ్ళుట.
**सडान** - स्त्री० కుళ్ళు.
**सडाना** - स०क्रि० కుళ్ళు బెట్టుట.
**सडायँध** - स्त्री० కుళ్ళిన వస్తువులనుండి వచ్చు దుర్గంధము.
**सडाव** - पुं० सडान ; కుళ్ళు.
**सडियल** - वि० కుళ్ళిన; తుచ్ఛమైన.
**सत** - वि० दे० शत.
**सतनजा** - पुं० సప్త ధాన్యముల కలయిక.
**सतरंगा** - वि० ఏడు రంగులు గల ; पुं० ఇంద్రధనస్సు.
**सतर** - स्त्री० రేఖ; గీత; పంక్తి.
**सतराना** - अ०क्रि० కోపగించుట; చిరాకు పడుట.
**सतराहट** - स्त्री० కోపము ; క్రోధము.
**सतर्क** - वि० జాగ్రత్తగల; అప్రమత్తముతో నుండు.
**सतलडी** - स्त्री० ఏడు పేటల గొలుసు హారము.
**सतवंती** - वि० (स्त्री०) పతివ్రత; పాతివ్రత్య ము గల.
**सतसई** - स्त्री० సప్తశతి; ఏడు వందల పద్య ములు గల కావ్యము.
**सतह** - स्त्री० ఏదేని వస్తువు పైభాగము; పొడుగు-వెడల్పు గల మైదానము.
**सताना** - स०क्रि० వేధించుట; పీడించుట.
**सती** - वि० (स्त्री०) సాధ్వీ; పతివ్రత.
**सत्ता** - स्त्री० అస్తిత్వము; శక్తి; అధికారము; శాసనము.
**सत्ताशास्त्र** - पुं० పారమార్థిక అస్తిత్వమును గురించి వివరించు శాస్త్రము.
**सत्तू** - पुं० सतुआ ; పేలపిండి.
**सत्याग्रह** - पुं० ఏదేని న్యాయపూరిత కార్యము కొరకు చేయు శాంతియుతమైన పోరాటము.
**सत्यानाश** - पुं० సర్వనాశము; వినాశము.
**सत्र** - पुं० సత్రము; సదావర్తము; విద్యా సంస్థలలో నిశ్చితమైన శిక్షణకాలము.
**सत्व** - पुं० అస్తిత్వము; సత్తా; తత్త్వము.
**सत्संग** - पुं० మంచి సాంగత్యము.
**सद** - स्त्री० అలవాటు.
**सदका** - पुं० खैरात ; దానము; దిగదుడుపు.
**सदबर्ग** - पुं० పెద్ద బంతి పువ్వు.
**सदमा** - पुं० ప్రహారము; తోపుడు దెబ్బ; దుఃఖము.
**सदर**-वि० ప్రధానమైన; ముఖ్యమైన; पुं० పెద్ద అధికారి నివాస స్థానము; అధ్యక్షుడు.
**सदर आला** - पुं० ఉపన్యాయాధిపతి.
**सदर बाजार**-पुं० పెద్దబజారు, మార్కెటు;

**खरी सुनाना** - మంచి-చెడును లక్ష్యపెట్ట కుండాస్పష్టముగా చెప్పుట; చీదరించుట.

**खर्च उठाना**- ఖర్చు భరించుట; ఖర్చు మాని వేయుట.

**खर्च चलाना** - ఖర్చుపెట్టుటకు డబ్బు ఇచ్చుట.

**खर्च तोडना** - ఖర్చు తగ్గించుట.

**खर्ची पर जाना** - డబ్బుకొరకు పరపురుషు నితో సంభోగించుట

**खर्राटा भरना या लेना** - గుర్రుకొడుతూ హాయిగా నిద్రించుట.

**खल करना ; खरल करना** - మెత్తగా దంచుట.

**खलबली मचना** - కోలాహలము వ్యాపించుట

**खलल पडना** - విఘ్నము పడుట; ఆటంకము కలుగుట.

**खाक उडना** - ధ్వంసమగుట; కళంకిత మగుట.

**खसम करना** - ఎవరినైన భర్తగా గ్రహించుట.

**खाक उडाते फिरना** - బలాదూరు తిరుగుడు తిరుగుట; కష్టాలు పడుతూ తిరుగుట.

**खाक उडाना** - సోమరిగా తిరుగుట; నింద పొందుట; అపహాస్యము చేయుట.

**खाक में मिलना या मिल जाना** - ధ్వంస మగుట; నాశమగుట.

**खाकर डकार न लेना** - బాగుగా జీర్ణించుకొనుట.

**खाका उडाना** - అపఖ్యాతి కలుగజేయుట; అపహాస్యము చేయుట.

**खाकी अंडा** - జారజుడు; పనికిమాలిన వస్తువు.

**खाट-खटोला** - సంసార సామాను.

**खाट निकलना** - పాడె బయలుదేరుట.

**खाट से उतारा** - మరణాసన్నమగుట.

**खातिर जमा रखना** - విశ్వాసము ఉంచుట.

**खाते-पीते लाते भारना** - సంపద కలిగిన మీదట కూడ సుఖమైనస్థితి లేకపోవుట.

**खान-पान करना** - భోజన సంబంధము ఉండుట.

**खाना खराब करना** - కొంప ధ్వంసము చేయుట.

**खाने के दाँत और दिखाने के दाँत और होना** - లోపలవేరు; బయట వేరుగా యుండుట.

**खार खाना** - చెడు అనుకొనుట; కోపగించుట.

**खार गुजरना** - చెడు అనిపించుట.

**खार निकालना** - పగతీర్చుకొనుట.

**खाल खींचना** - చితకబాదుట.

**खालसा करना** - నాశము చేయుట.

**खालाजी का घर** - తేలికపని; అన్ని సదుపాయములు గల ప్రదేశము.

**खाली हाथ** - డబ్బులేనివాడు; ఆయుధ ప ాలు లేనివాడు; ఏ విధమైన కానుక వెంటలేనివాడు; బోలు మనిషి; ఏమీ ఇవ్వకుండా తీసుకోకుండా.

**खिचडी खाते पहुँचा उतरना** - బహుకోమలముగా; అతి నాజూకుగా నుండుట.

**खिचडी पकना** - కుట్ర జరుగుట; కుతంత్రపు సలహా ఇచ్చుట.

**खिचडी होना** - నలుపు-తెలుపు గల వెంట్రుకలు ఉండుట; కలసిపోవుట.

**खियानत करना** - పరసొత్తును హరించుట.

**खिलखिलाकर हँसना** - పకపకానవ్వుట.

**खिल्लियों में उडाना ; खिल्ली उडाना** - పరిహాసము చేయుట.

**खीर चढाना** - పిల్లవానికి అన్నప్రాశన చేయుట.

**खीरा-ककडी साझना** - అతిహీనమైనదనీ; తుచ్ఛమైనదనీ భావించుట.

**खीरे के मोल बिकना** - అతిచౌకగా అమ్ముడు బోవుట.

**खीस काढना** - పేద అయి ఇతరులను దేవిరించుట; పల్లుబయట పడేట్లునవ్వుట; చనిపోవుట.

**खुजलाना** - గురదపెట్టుట; పనిచేయుటకు కోరిక కలుగుట; ఏదైనా పొందవలెనని కోరికజనించుట.

**खुजली उठना** - కామేచ్ఛ కలుగుట.

**खुजली मिटना** - కామేచ్ఛ తీరుట; చితక బాదబడుట; దురదతీరుట.

**खुर्रे चने बन जाना** - నిర్మొఖమాటిగా తయారగుట.

**खुलकर** - ఆనందముగా; బాగుగ; ఏ బాధ లేకుండా.

**खुलकर कहना** - నిస్సంకోచముగా చెప్పుట; స్పష్టముగా; పూర్తిగా చెప్పుట.

**खुला हाथ** - దర్జాగా ఖర్చు చేయువాడు.

**खुली मुट्टी का होना** - ఉదారముగా వ్యవహరించుట.

**खुले मैदान ; खुले आम ; खुले खजाने** - అందరి సమక్షములో; బాహాటముగా.

**खुल्लम-खुल्ला कहना** - స్పష్టముగా చెప్పుట; అందరి ఎదుట చెప్పుట.

**खुशामदी टट्टू होना** - ముఖస్తుతి చేయువాడు; ఇచ్ఛకములాడువాడు.

**खुसर-फुसर करना** - కుట్ర పన్నుట;

హాస్యముగా మాట్లాడుట.

**खूँटा गाडना** - హద్దు నిర్ధారించుట; షరతు పెట్టుట; అధికృతము చేసికొనుట.

**खूँटी के बल कूदना** - ఇతరుల అండ చూచుకొని నిక్కుట.

**खूँटे पर मारना** - అవమానించుట.

**खूँटे से बाँधना** - వివాహమగుట.

**खून उतरना** - కోపముతో కళ్ళు ముఖము ఎర్రబారుట.

**खून करना** -హత్యచేయుట; చంపివేయుట.

**खून पानी एक करना** - ఎక్కువగా శ్రమించుట.

**खून खुश्क होना** - అతిగా భయపడుట.

**खून-खौलना** - నెత్తురు ఉడికిపోవుట; అతిగా క్రోధించుట.

**खून चूसना** - కష్టపెట్టుట; పీడించుట; నెత్తురు పీల్చుట.

**खून ठंडा होना** - భయపడుట.

**खून पानी हो जाना** - ఎంతో ఎక్కువ కష్టము కలుగుట.

**खून पीना** - చంపివేయుట.

**खून-पसीना एक करना** - ఎక్కువగా శ్రమించుట.

**खून सफेद होना या हो जाना** - క్రూరత్వము సహించుట.

**खून (सिर पर) सवार होना** - ఎవరినో చంపుటకు సిద్ధమగుట; ఇతరులు గుర్తుపట్టేటట్లుగా ఖూనీచేయుట; చావు సమీపించుట.

**खेत आना**-యుద్ధములో వీరగతి పొందుట.

**खेत कमाना** - బాగుగా దున్ని ఎరువువేసి బాగుగా పైరును పండించుట.

**खेत करना** - యుద్ధముచేయుట.

**खेत रहना** - యుద్ధములో చంపబడుట.

**खेल खराब करना** - పనిపాడు చేయుట; ఆటపట్టుట; పరిహాసము చేయుట.

**खेल खेलाना** - వ్యాకులపరచుట; ఆటల పట్టించుట.

**खेली खाई** - పురుష సమాగములో అనుభవముగల యువతి.

**खैर मनाना** - శుభము కోరుట.

**खोटा खाना** - చెడు మార్గమున వచ్చిన సొమ్ముతో జీవనము చేయుట.

**खोटी-खरी सुनाना** - చివాట్లు పెట్టుట.

**खोपडी खा जाना**-పనికిమాలినవాగుడులో విసిగించుట.

**खोपडी-गंजी करना** - కొట్టికొట్టి బట్టతల చేయుట.

**खोपडी चलना** - మతిచలించుట; పిచ్చివాడగుట.

**ख्याल में रहना** - జ్ఞాపకము ఉండుట.

**ख्याल रखना** - ధ్యాస ఉంచుట.

**ख्याल से उतरना या उतर जाना** - మరిచి పోవుట; మరచుట.

**ख्याली पोलाव पकाना** - గాలిమేడలు కట్టుట; కేవలము ఆలోచించుట.

**ख्वाब की बात** - కలలో మాట; అసంభవ మైన విషయము.

**ख्वाब हो जाना** - కలల జబ్బు కలుగుట.

## ग

**गंगई तरह बोलना** -ఎక్కువ మాట్లాడుట; అతిగా వాగుట.

**गंगा लाभ होना** - చనిపోవుట.

**गंजेडी पार** - స్వార్థపు సహచరుడు.

**गंदा करना या होना** - రహస్యము బయట పెట్టుట; గుట్టురట్టు చేయుట.

**गँवँसे** - మొదలకుండా పద్ధతి ప్రకారము.

**गंचक्का खाना ; गच्चा खाना** -మోస పోవుట.

**गजब इलाही** - ఈశ్వరకోపము.

**गजब करना** - అద్భుతమైన పనిచేయుట.

**गजबका** - విచిత్రమైన; అపూర్వమైన.

**गजबनाक होना** - క్రోధించుట.

**गज भर की छाती होना** - సాహసము కలుగుట.

**गजरदग** - చాలా పెందలకడ.

**गजर-बजर खाना** - అడ్డమైనవి తినుట.

**गट करना** - తినివేయుట.

**गट्ट करना या कर जाना** - కాజేయుట; మింగివేయుట.

**गठरी कर देना** - కాళ్ళూచేతులు విరగ గొట్టుట.

**गडंग मारना** - బడాయి కొట్టుట.

**गड्ड का गड** - బొత్తికి బొత్తి; చాలా ఎక్కువ.

**गडढा खोदना** - నష్టపెట్టుట; హాని కలుగ జేయుట.

**गड जाना** - సిగ్గుపడుట.

**गडे कोयले उखाडना ; गडे मुर्दे उखाडना**- గడచిపోయిన విషయాలు జ్ఞాపకము చేయుట.

**गत का होना** - బాగుపడుట; సరిగా అగుట

**गत बनाना या बना डालना** - దుస్థితి పట్టించుట; మందలించుట; చితక బాదుట; రూపము పాడుచేయుట.

**गत होना** - గతించుట; మరణించుట.

**गत्ताल खाते में जाना** - వ్యర్థమగుట.

**गटर-गों करना** - కాజేయుట; హస్తగతము చేసుకొనుట; భుక్తపరచుకొనుట.

**गदर मचाना** - ఎదిరించుట ; విద్రోహించుట.

**गदरा जाना** - యవ్వనదశ వచ్చుట.

**गदहे का हल चलना** - ధ్వంసమగుట; పాడైపోవుట.

**गदहेपर चढाना** - గాడిదపైనెక్కించుట; అపఖ్యాతిపరచుట.

**गनीमत समझना** - నయమనుకొనుట.

**गपड चौथ ; गप्पचौथ** - వ్యర్థప్రలాపము.

**गप्प मारना** - బడాయిలు కొట్టుట.

**गप्प लडाना; गप-शप या गप्प हाँकना** - వ్యర్థప్రలాపము చేయుట.

**गम खाना** - క్షమించుట; ఓర్పువహించుట.

**गया करना** - గయవెళ్ళి పిండదానము చేయుట.

**गया-गुजरा** - అధమమైన.

**गया बीता** - दे० गया गुजरा.

**गरजका बावला** - తన స్వార్థము కొరకు ఏమైనా చేయువాడు.

**गरज रखना** - కలిసిమెలిసి ఉండుట; స్వార్థము కలిగియుండుట.

**गरदन उठाना** - విరుద్ధమగుట; ఎదిరించుట; విద్రోహము చేయుట.

**गरदन नाचीज होना** - ప్రాణములకు విలువ లేకుండుట.

**गरदन नापना** - అవమానించుట.

**गरदन पर जुआ रखना** - బాధ్యత వహించుట; జమ్మేదారి అప్పగించుట.

**गरदन पर लेना** - బాధ్యత స్వీకరించుట.

**गरदन पर सवार होना** - వెంటపడుట; వెంటాడుట.

**गरदन में हाथ देना** - అవమానించుట; మెడమీద చెయ్యివేయుట; సహవాసము చేయుట; అర్ధచంద్ర ప్రయోగము చేయుట.

**गरदन हिलने लगना** - మెడవణకుట; వృద్ధుడగుట.

**गरदन हिलाना** - మెడఊపుట; ఒప్పుకొనక పోవుట.

**गरम मिजाज** - కోపిష్ఠి.

**गरम हो उठना** - కోపగించుట.

**गरमा-गरमी से** - కోపగించి; ఆవేశముతో; శీఘ్రముగా.

**गरियार बैल** - दे० अडियल यट्टू - నడుస్తూ నడుస్తూ ఆగిపోవు మొండి ఎద్దు.

**गर्क होना** - లీనమగుట; వినష్టమగుట.

**गर्द उडाना** - వినాశపరచుట.

**गर्द झडना** - దుమ్ముదులపబడుట; తెలియకుండా కొద్దిగా కొట్టుట.

**गर्दन पर छुरी फेरना** - ఎక్కువగా నష్టపెట్టుట; హాని కలుగచేయుట; హత్య

చేయుట.

**गर्दन रेतना** - హానికలుగజేయుట.

**गर्दनिया देना** - అర్ధచంద్ర ప్రయోగము చేయుట.

**गर्दिश आना** - విపత్తు కలుగుట.

**गर्म-सर्द उठाना** - సుఖదుఃఖములు అనుభవించుట.

**गर्म साँस छोडना** - వేడినిట్టూర్పు విడుచుట; నిరాశపడుట.

**गल गाजना** - సంతోషముతో గంతులు వేయుట.

**गल जाना** - వ్యర్థముగా వ్యయమగుట.

**गला काटना** - గొంతుకోయుట; ఎక్కువగా పీడించుట.

**गला घुँटना** - ఊపిరాడకపోవుట.

**गला घोंटना** - గొంతునులుమి చంపుట.

**गला छुडाना** - విముక్తినొందుట; వదిలించుట; ముక్తి కలుగచేయుట.

**गला भर आना ; गला भर्रा जाना** - గొంతుబొంగురుపోవుట; గద్గదమగుట.

**गलेका ढोल या ढोलना** - గుదిబండ; అత్యంత ప్రియమైన.

**गले का हार** - చాలా ఇష్టమైన; అంటిపెట్టుకు ఉండుట.

**गले पडना** - చంకనెక్కుట.

**गले बाँधना** - అయిష్టముగా నిచ్చుట; బలవంతము మీద ఇచ్చుట.

**गले मढना** - నెత్తినరుద్దుట; అయిష్టముగా పెళ్ళిచేసుకొనుట; మెడకికట్టుట.

**गले में जंजीर या तौक पडना** - వివాహమగుట; బంధింపబడుట.

**गले लगना** - కౌగిలించుకొనుట.

**गले लगाना** - ప్రేమించుట.

**गहकी पटना** - బేరము నిశ్చయమగుట.

**गहरा पेट** - మాటను జీర్ణము చేసుకొనువాడు; డబ్బు తీసుకొని తిరిగి ఇవ్వనివాడు; ఏదేని వస్తువు తీసుకొని వాపసు ఇవ్వనివాడు; తిండిపోతు.

**गहरा हाथ पडना** - ఎక్కువగా ధనము లభించుట.

**गहरी चाल चलना** - ఎక్కువగా మోసగించుట.

**गहरी छनना** - ఎక్కువగా స్నేహము కలుగుట; తృప్తితీర భంగు సేవించుట.

**गहरी छानना** - తృప్తితీరా భంగు సేవించుట.

**गहरी निगाह** - సూక్ష్మదృష్టి.

**गहरी बात** - సూక్ష్మ విషయము.

**गहरे उतरना** - విషయమును సూక్ష్మముగా పరిశీలించుట.

**गहरे लोग** - పెద్ద దగాకోరులు.

**गाँगू होना** - ప్రతి పనిలోను జాగుచేయు వాడు.

**गाँठ का पूरा आँख का आंधा** - ధన వంతుడు; కాని మూర్ఖుడు.

**गाँठखुलना** - సమస్య తీరుట.

**गाँठ पकडना या पकड जाना** - స్థిర పడుట; అయిష్టమగుట.

**गाँठ पर गाँठ पडना** - వైమనస్యము కలుగుట.

**गाँठ बाँधाना** - జ్ఞాపకముంచుకొనుట.

**गाँठ में बाँधना** - ఎల్లప్పుడు జ్ఞాపకముంచు కొనుట.

**गाँठ से** - తన దగ్గరనుండి.

**गाँडगरदन एक होना** - అతిగా అలసి పోవుట; ఎక్కువగా దెబ్బలు తినుట.

**गाँड दिखाना** - వీపు చూపించుట; పారి పోవుట.

**गाज गिरना** - పిడుగుపడుట; అనర్థమగుట.

**गाजर -मूली समझना** - తుచ్ఛమని తలచుట.

**गाडी-काटना** - నడుస్తున్న రైలు బండి నుంచి దొంగిలించుట; రైలు బండినుంచి కొన్ని పెట్టెలను వేరుపరచుట.

**गाडी-छूटना या छूट जाना** - రైలు బండిని అందుకొనలేకపోవుట; రైలు తప్పి పోవుట.

**गाढ पडना** - ఆపద కలుగుట.

**गाढा रंग चढना** - ఎక్కువగా ప్రభావితము చేయుట.

**गाढा समय** - చెడురోజులు.

**गाढी छनना** - గాఢమైన స్నేహము కలుగుట; చిక్కటి భంగు తయారగుట.

**गाढे का संगी ; गाढे का साथी** - కష్ట సమయమున స్నేహము పాటించువాడు.

**गाढे की कमाई** - కష్టించి సంపాదించిన సొమ్ము.

**गाढे पडना** - విపత్తులో చిక్కుకొనుట.

**गात से रहना** - గర్భము ధరించుట; కడుపు నిలుచుట.

**गाभ डालना** - గర్భపాతము జరుగుట.

**गाय होना** - అమాయకముగానుండుట.

**गारद करना** - నష్టభ్రష్టము చేయుట.

**गारद डालना** - జైలులో ఉంచుట.

**गाल करना** - బడాయి కొట్టుట; దుర్భాషలాడుట.

**गाल तोडना** - బలవంతముగా ముద్దుపెట్టుకొనుట.

**गाल फुलाना** - మూతిముడుచుకొనుట; అలుచుట.

**गाल बजाना** - పెద్ద పెద్దగా మాట్లాడుట.

**गाल सेंकना** - చెంపమీద కొట్టుట.

**गालियों का झाड बाँधना ; गालियों की बौछार करना** - తిట్లవర్షం కురిపించుట; ఎక్కువ దుర్భాషలాడుట.

**गाली पडना** - తిట్టు నిజమగుట; శాపము ఫలించుట.

**गाह-गाहे-गाहे-बेगाहे**-సమయాసమయమున; అవసరము వచ్చినపుడు.

**गिन-गिन कर दिन काटना** - చాలా దుఃఖముతో కాలము గడుపుట.

**गिनगिनकर देना**- అతిగా చివాట్లు పెట్టుట.

**गिनती कराने केलिए** - చెప్పడానికి, నామమాత్రానికి.

**गिनती में होना** - లెక్కలోనికివచ్చుట; మహత్త్వము కలిగియుండుట.

**गिने गिनाए** - బహుఅల్పముగా.

**गिरते-पडते** - ఓపికచేసుకుని.

**गिरफ्त करना** - దోషము లేకుండచేయుట.

**गिरह का बल होना** - డబ్బుచూసుకొని అభిమానించుట.

**गीदड बोलना** - దుశ్శకునమగుట; ధ్వంసమగుట.

**गीदड-भभकी** - ఒట్టి బెదిరింపు.

**गीली कहानी** - కరుణార్ద్రమైన కథ.

**गुड खाना गुलगुलों से धिनाना** - చిన్న తప్పుకి దూరంగానుండి పెద్ద తప్పు చేయుట.

**गुड-गोबर कर देना** - పూర్తి అయినపనిని పాడుచేయుట.

**गुडिया** - బహు అందమైన.

**गुड्डा बाँधना** - నిందించుట.

**गुण मानना** - కృతజ్ఞతతోనుండుట.

**गुदडी का लाल** - మట్టిలో మాణిక్యం; మూర్ఖునివలె కనిపిస్తూ బహు సమర్థవంతముగానుండుట.

**गुफा में बैठना** - సన్యసించుట.

**गुम करना** - కనిపించకుండా చేయుట.

**गुम-सुम बैठना** - మెదలకుండా ఉండుట.

**गुरूघंटाल होना** - అతితెలివిగా నుండుట; దగాకోరగుట.

**गुरू होना** - दे० गुरूघंटाल.

**गुर्दा तोडना** - గీర విరచుట; నిక్కు అణచుట.

**गुल कतरना** - దీపపుకొడి తీయుట; విచిత్రమైన పనిచేయుట.

**गुल करना** - దీపము ఆర్పుట.

**गुल खिलना**- విచిత్రసంఘటన జరుగుట; గందరగోళమగుట; జంజాటము కల్గుట.

**गुल-गपाड करना** - అల్లరిచేయుట.

**गुलाम का तिलाम** - బహుచిన్న నౌకరు.

**गुल्ली बाँधना** - యవ్వనము కలుగుట; ప్రౌఢమగుట.

**गुस्सा पीना** - క్రోధము దిగమ్రింగుట.

**गूँगे का गुड** - అనిర్వచనీయము.

**गुदा निकालना** - కీళ్ళు విరగగొట్టుట.

**गूलर का कीडा** - కూపమండూకము; అనుభవములేని.

**गूलर का फल फोडना** - గుట్టురట్టు చేయుట.

**गूलर का फूल होना** - దుర్లభవస్తువగుట.

**गूलर कोड कर जीव उडाना** - दे० गूलर का फल फोडना.

**गूह उछालना** - దోషారోపణచేయుట; అపఖ్యాతిపరచుట.

**गूह कर देना** - మురికివేయుట; గలీజు చేయుట.

**गूह का कीडा** - నీచాతినీచుడు.

**गूह-मूत करना** - పాకీదొడ్లు శుభ్రపరచుట.

**गूह में ढेला फेंकना** - అశుద్ధముమీద . గడ్డమువేయుట.

**गृद्ध दृष्टि होना** - కన్నువేసి యుండుట; పొందవలెనని వాంఛించుట.

**गेहूँ के साथ घुन पिसना** - పెద్దలతోపాటు పిన్నలు కూడ నాశమగుట.

**गैल जाना** - అనుకరించుట; అనుసరించుట.

**गोटी जमना** - ఉపాయము ఫలించుట.

**गोटी लाल होना** - లాభించుట.

**गोटी हाथ से जाना** - ఉపాయము వ్యర్థమగుట.

**गोठ पडना**-కాళ్ళమీదపడుట; ప్రార్థించుట.

**गोड पसारना** -కాళ్ళుజాపుట; చనిపోవుట.

**गोद पसार कर निनती करना** - కడు దీనముగా ప్రార్థించుట.

**गोद फलना ; गोद भरना** - సంతానము కలుగుట.

**गोद लेना**- దత్తత గ్రహించుట; పెంచు కొనుట.

**गोबर - गणेश होना - भोंदा या सुस्त होना** - మూర్ఖుడగుట.

**गोमुख नाहर** - గోముఖ వ్యాఘ్రము.

**गोलमाल करना** - కల్తీచేయుట; అవ్యవస్థ పరచుట; గల్లంతు మెదలకుండా తప్పు కొనుట.

**गोली मारना** - నిరాదరించి త్యజించుట; ఏవగించుట.

**गोहार मारना; गोहार लगाना** - సాయము కొరకు అరచుట.

**गौंका** - స్వార్థి; అవసరానికి.

**गौं का चार** - స్వార్థ సహచరుడు.

**गौं ताकना** - అనువు వెతుకుట.
**गौं निकलना** - పని జరుగుట.
**गौना देना** - మొట్ట మొదటిసారిగా వధువుని; వరుని వెంట అత్తవారింటికి పంపుట.
**ग्रंथ रंगना** - గ్రంధము వ్రాయుట.
**ग्राहक टूटना** - బేరగాళ్ళు తగ్గిపోవుట.
**ग्राहक पटाना** - బేరగానిని ఒప్పించుట; సంతోషపెట్టుట.

## घ

**घंट- बंधना** - ఇంటిలో ఎవరో చనిపోవుట; ఇంటిలో శవము లేచుట.
**घंटा हिलाना** - పనికిమాలినపని చేయుట.
**घटती के पहर चढना** - అంత్యకాలము సమీపించుట; చెడుకాలము దాపరించుట.
**घडी कूकना** - గడియారమునకు కీ ఇచ్చుట.
**घडी में घडियाल होना** - స్థితి మారడంలో విలంబము ఉండుట.
**घडी सायत पर होना** - చావు రోజు దగ్గర పడుట.
**घन चक्कर में आना** - కష్టాలలో చిక్కుకొనుట; భ్రమపడుట.
**घन चक्कर होना** - మూర్ఖుడగుట.
**घपची बाँध कर पानी में कूदना** - సంకల్పించి పనిలో లీనమగుట.
**घपले में पडना** - వ్యాకులపడుట; బాధపడుట.
**घमंड टूटना** - అహంకారము నశించుట.
**घमक्का खाना** - హాని సహించుట; గుద్దులతో మర్దించబడుట.
**घर आबाद करना** - వివాహము చేసుకొనుట; సంసారియగుట.
**घर उजडना** - కుటుంబము ధ్వంసమగుట; ఇంట్లోని వారందరిలో ఏకాభిప్రాయము లేకపోవుట.
**घर करना** - స్థిరపడుట.
**घर का अच्छा** - సంపన్నతగల.
**घर का आँगन हो जाना** - ఇల్లు నాశనమగుట.
**घर का उजाला**- వంశ ప్రతిష్ఠలు ఇనుమడింప జేయువాడు.
**घर का काट खाने दौडना** - ఇంటిలో ఇంకెవరూ లేకుండుట; ఇల్లు శూన్యముగా నుండుట.
**घर का दीपक बुझ जाना**- నిర్వంశమగుట.
**घर का रास्ता नापना** - తనపనితోనే సంబంధముంచుకొనుట.
**घर का रास्ता समझना** - బహు సులభమైన పని అనుకొనుట.
**घर का शेर** - ఇంటిలో సింహం కాని బయట పిరికిపంద.

**घर का होना न घाट का**- ఎక్కడా ఉపయోగ పడని.

**घर की बात** - మనలో మాట; రహస్య విషయము; కుటుంబపు విషయము.

**घर की पूंजी** - దగ్గరి డబ్బు.

**घर की मुर्गी** - స్వంత వస్తువు; పెరటి కూర.

**घर को सिर पर उठाना** - కుటుంబ సభ్యులందరిని కలతపెట్టుట.

**घर-घर के हो जाना** - కొంపాగోడు లేక పోవుట; అంతటా గౌరవము పొందుట.

**घर-घाट एक करना** - గడబిడ చేయుట; ఎక్కువగా శ్రమించుట.

**घर-घाट देखना** - యావత్తు ఇంటి స్థితి గమనించుట; అంతా పరిశీలించుట.

**घर चढकर लडने आना** - తగాదా పడుటకు ఇంటి మీదికి వచ్చుట.

**घर चलना** - జీవన నిర్వాహమగుట; ఇంటి వారందరిలో మా ఏకాభిప్రాయముండుట.

**घर जाना**-ఇల్లు నాశనమగుట; ఇంటివారంతా ఎక్కడికైనా వెళ్ళుట.

**घर तक पहुँचाना** - పూర్తిచేయుట; బుద్ధి సరిగానుండుట.

**घर फोडना** - కుటుంబములో కలహము సృష్టించుట.

**घर बंद होना** - ఇంటిలో నివారంతా చని పోవుట; ఇరుగుపొరుగుతో సంబంధము లేకపోవుట; ముందుకు సాగుటకు దారి లేకపోవుట.

**घर बनना** - సంపన్నమగుట; భవనము తయారగుట; ఇంటిలో నివారంతా కలిసిమెలిసి ఉండుట.

**घर बैठे ही नौकरी होना** - శ్రమించకుండా డబ్బు లభించుట.

**घरे बैठे शिकार खेलना** - పనిచెయ్యకుండానే డబ్బు సంపాదించుట.

**घर में थाम आना** - పెద్ద కష్టమును ఎదుర్కొనుట.

**घर समझना** - నిస్సంకోచముగానుండుట; నిస్సంకోచముగా వ్యవహరించుట.

**घर से बाहर पाँव निकालना** - తనశక్తిని మించి వ్యవహరించుట.

**घराटा भरना** - గాఢముగా నిద్రించుట.

**घाँइयाँ बताना** - మోసగించుట; దారి తప్పించుట.

**घाट-घाट का पानी पीना** - ఎక్కువగా అనుభవము గడించుట; పలు ప్రదేశముల పరిచయము సంపాదించుట.

**घाट लगना** - ఒడ్డుచేరుట; పని పూర్తి యగుట.

**घाटा भरना** - నష్టము పూరించుట.

**घात चलाना** - చేతబడి చేయుట.

**घात पर चढना ; घात में आना** - వశమగుట.

**घात में रहना**-అదనుకొరకు వేచియుండుట.

**घात लगना** - అదను లభించుట.

**घाव पर नमक छिडकना** - కష్టంమీదకష్టం కలుగజేయుట.

**घाव पर मरहम लगाना** - సానుభూతి వ్యక్తము చేయుట.

**घाव में जहर देना** - ఇంకా ఎక్కువగా కష్టము కలుగజేయుట; అరిష్టము కలుగ జేయుట.

**घाव हरा हो जाना** - దుఃఖమును తలచుకొని దుఃఖించుట.

**घास काटना** - సులభకార్యము చేయుట; చిన్న పని చేయుట; సంబాళించుకోకుండా త్వరత్వరగా పనిచేయుట; వ్యర్థముగా ప్రయత్నించుట.

**घिग्घी बँधना** - గద్గదమగుట; ఏడుపులో ఎక్కిళ్ళు వచ్చుట.

**घी का कुप्पा लुढकना** - ఎక్కువ నష్టము కలుగుట.

**घी का कुप्पा लुढकना या लुढक जाना** - గొప్పవాని మృత్యువు సంభవించుట.

**घी के दीए जलना** - ఆనందించుట; సంపద కలుగుట; కోరిక తీరుట.

**घी-खिचडी होना** - గాఢమైన స్నేహము కలుగుట.

**घी में पाँचों होना** - అత్యధికముగా లాభించుట.

**घुंडी दिल की खोलना** - మనస్సు విప్పుట; మనస్సును నిర్మల పరచుట.

**घुटना टेकना या टेक देना** - మోకాలి దండవేసి కూర్చొనుట; ఒంగి ప్రార్థించుట; ఓటమి స్వీకరించుట.

**घुटनों में सिर देना** - తలవంచి నిర్లిప్తముగా కూర్చొనుట; సిగ్గునొందుట.

**घुटा हुआ** - తెలివిమారిన దూకోరు.

**घुन लगना** - చింతతో క్షీణించుట.

**घुल घुलकर बातें करना** - అమితముగా కలిసిమెలిసి సంప్రదించుట.

**घुल घुल कर मरना** - కష్టాలు పడి పడి చనిపోవుట.

**घूँट पीना** - ఆక్రోశము; సహించుట.

**घूँसों का क्या उधार** - దెబ్బలాట పగ వెంటనే తీర్చుకోవాలి.

**घूरे के दिन फिरना** - తుచ్ఛాతి తుచ్ఛమైన వస్తువు లేక వ్యక్తి యొక్క అదృష్టము మారుతుంది.

**घोंघा-बसंत** - మహా మూర్ఖుడు.

**घोंघा होना** - మూర్ఖుడగుట.

**घोडा बेचकर सोना** - గాఢనిద్రలో నుండుట; నిశ్చింతగా నిద్రించుట.

**घोडे का रोग बंदर के सिर पडना** - ఒకరి తప్పును ఇంకొకరి నెత్తిన రుద్దుట.

**घोडे के आगे गाडी रखना** - తలక్రిందుల పనిచేయుట.

**घोडे चढना** - వివాహమగుట.

**घोल पीना** - ఏమీ తెలియకపోవుట; సహజముగా చంపివేయుట; షరబత్తు చేసి తాగుట.

**घोल-मट्ठा करना** - అల్లరిచేయుట; గల్లంతు చేయుట.

# च

**चंग चढना** - దర్జాగా ఉండుట; యశస్సు కలుగుట.

**चंगुल में पडना** - ఉచ్చులో చిక్కుకొనుట; వశమగుట.

**चंडाल चौकडी** - దుష్టమండలి; దుష్టుల సమూహము.

**चंदिया खुजलाना** - మాడు దురద పెట్టుట; దెబ్బలు తినాలనిపించుట.

**चंदिया मूँडना** - బాగా దోచుకొని పారి పోవుట; తలగొరిగించుకొనుట.

**चंपत बनना/होना** - అదృశ్యమగుట.

**चंबल लगना** - వరదవచ్చుట.

**चक जमना** - రంగు నిలుచుట; ప్రభావము పడుట.

**चकनाचूर करना** - ముక్కలు ముక్కలుగా చేయుట.

**चकमा खाना** - మోసపోవుట.

**चकमा देना** - మోసగించుట.

**चकमें में आना** - दे० चकमा खाना.

**चकाचौंधी आना** - తీవ్ర ప్రకాశమువలన కళ్ళు మిరుమిట్లు కలుగుట; మిరుమిట్లు గలకాంతివలన కళ్ళఎదుట అంధకారము వ్యాపించుట.

**चकोर होना** - ప్రేమికుడగుట.

**चक्कर देना** - తల తిరుగుట; తలనొప్పి కలుగుట; హైరానగుట; మోసగించుట.

**चक्की पीसना** - నిరంతరముగా పనిచేయుట.

**चटक जाना** - అలుగుట; కోపగించుట.

**चटकर जाना** - పూర్తిగా ఆచరించుట; పూర్తిగా మాయం చేయుట.

**चटनी कर डालना ; चटनी करना; चटनी बनाना** - సూక్ష్మించుట; నూరుట; చితకబాదుట.

**चटोरी जबान होना** - తిను కోరికకలుగుట.

**चट्टी भरना** - నష్టమును పూరించుట; దండించుట.

**चढा-बढा होना** - ప్రసిద్ధిజెందుట.

**चपत जमाना** - చెంపకాయకొట్టుట.

**चमगादड झूलना** - పాడుపడుట.

**चमार - सियार** - తుచ్ఛమైన.

**चरबा उतारना** - చిత్రమువేయుట; అనుకరించుట.

**चरबी छाना** - ఎక్కువగా లావగుట.

**चरबी बढना** - గర్వించుట.

**चराना** - మూర్ఖునిగా చేయుట.

**चल-चलाव लगना** - మృత్యువును సమీపించుట.

**चलता करना** - ముందుకు సాగుట; తాత్సారము చేయుట; మెల్లిగా జారుకొనుట.

**चलता - पुरजा होना** - చాకచక్యుడగుట.

**चलती गाडी में रोडा अटकाना** - జరిగే పనిలో ఆటంకము కలుగజేయుట.

**चलते बनना** - పారిపోవుట; ధూర్త ప్రలాపము చేయుట.

**चल निकलना** - పనిలో అభివృద్ధిని సాధించుట.

**चल बसना** - మరణించుట.

**चलित्तर उछलना** - చెడుగా వ్యవహరించుట.

**चश्मपोशी करना** - ఎదుటపడకుండుట; ముఖస్తుతి చేయుట.

**चस्का लगना या लग जाना** - కుతి కలుగుట; అలవాటుగుట.

**चहर देना** - ఆడంబరమగుట; అట్టహాసమగుట.

**चहल कदमी करना** - పచార్లు చేయుట.

**चहल पहल होना** - కోలాహలమగుట; వేడుక జరుగుట.

**चाँद का टुकडा** - బహు అందమైన.

**चाँद पर थूकना ; चाँद पर धूल डालना** - నిర్దోషికి దోషమారోపించుట.

**चाँदी का जूता मारना** - డబ్బు ఇచ్చి వశపరచుకొనుట.

**चाँदी काटना** - బాగుగా డబ్బు సంపాదించుట.

**चाक करना** - చీల్చుట; చింపుట.

**चाट पडना** - కుతి కలుగుట; అలవాటు అగుట.

**चादर उतारना** - అగౌరవపరచుట.

**चादर से बाहर पैर फैलाना** - శక్తికి మించి ఖర్చుచేయుట; మర్యాదను ఉల్లంఘించుట.

**चाभी घुमाना** - పరిస్థితిని ప్రభావితము చేయుట.

**चाम के दाम चलाना**-అన్యాయము చేయుట; ఎక్కువగా లాభము సంపాదించుట.

**चार आँखें करना** - కంటితో కన్ను కలుపుట; చూపులో చూపు కలుపుట.

**चार के कंधे पर चढना** - చనిపోవుట.

**चार चाँद लगाना** - అమితముగా గౌరవించుట; శోభను ఇనుమడింపజేయుట.

**चार दिन का मेहमान होना** - కొద్దిరోజుల పాటు జీవించుట.

**चार दिन की चाँदनी** - కొలది కాలపు సుఖము.

**चार-पाँच करना** - ఏదో వంక నెపము పెట్టుట; మాట పెంచుట; వితండ వాదము చేయుట; గడబడి చేయుట.

**चारपाई पकडना ; चारपाई पर पडना** - రోగ గ్రస్తమగుట; నిద్రించుట; పవళించుట.

**चारा डालना** - ఎవరినైనా వశము చేసుకొనుటకు కొంత ఖర్చుపెట్టుట.

**चारा पास न होना** - విధిలేకపోవుట; శక్యము కాకపోవుట.

**चारों खाने चित्त होना** - అకస్మాత్తుగా దుర్వార్త విని మూర్ఛపోవుట.

**चाल चलना** - మోసముతో పనిపూర్తి చేసికొనుట; మోసగించుట.

**चाल पट पडना** - ఉపాయము పనిచెయ్యక పోవుట; మంచి రోజులు గడచిపోవుట.

**चाला निकालना** - ముహూర్తము నిశ్చయించుట.

**चिंउटा-मुड होना** - గుద్దులాటగుట; పరస్పరముగా ప్రేమ గాఢమగుట.

**चिंउटे को पर निकलना** - మరణా సన్నమగుట; చివరి సమయాన కొంటి పని చేయుట.

**चिंदी चिंदी करना** - చింపిరితుంపర్లు చేయుట.

**चिकना घडा होना** - ఎవరిమాట ప్రభావితము చెయ్యకపోవుట; నీచ స్వభావమగుట.

**चिकना-चुपडा होना** - అలంకరించబడియుండుట; శుభ్రముగానుండుట.

**चिकनी-चुपडी बातें करना** - తియ్యని మాటలు మాటాడుట.

**चिट्ठी करना** - డబ్బు ఇవ్వమని వ్రాతపూర్వముగా ఆజ్ఞాపించుట.

**चिडिया का दूध** - అసంభవ వస్తువు.

**चिडिया नोचन** - నలువైపులనుంచి బాకీ ఇవ్వమని తగాదా పెట్టుట.

**चितवन चढाना** - కనుబొమ్మలు ముడీవడుట; కోపగించుట.

**चिराग गुल पगडी गायब** - అదనుదొరకగానే సొత్తు అపహరించుట.

**चिराग तले अँधेरा होना** - గౌరవనీయమైన వ్యక్తివలనే చెడు సంభవించుట; విరుద్ధమైన విషయము జరుగుట.

**चिराग बढाना या बढा देना** - దీపము ఆర్పుట.

**चिराग शेर करना** - కాంతిని తీవ్రతరము చేయుట.

**चिल्ले का जाडा** - తీవ్రమైన చలి.

**चीं-चपड करना** - వ్యతిరేకించుట; ప్రతివాదము చేయుట.

**चील के घोंसले से मांस छीनना**- దుష్కర కార్యము చేయుట.

**चुगली करना ; चुगली खाना** - చాడీలు చెప్పుట.

**चुटकियाँ लेना** - వేళాకోళము చేయుట; పరిహాసము చేయుట.

**चुटकियों में उडाना** - నిర్లక్ష్యము చేయుట; పరిహాసములో వదలివేయుట; సులభమనుకొనుట; సులభముగా నెరవేర్చుట.

**चुटकियों में होना** - త్వరగా అగుట; సులభముగా అగుట.

**चुटकी देना** - చిటికవేయుట.

**चुटका आम होना** - వడలిన మామిడికాయ మాదిరి చిక్కిపోవుట.

**चुटकी माँगना** - బిచ్చమడుగుట.

**चुटकी लेना** - వెక్కిరించుట.

**चुटकुला छोडना** - సమయానుకూలముగా వ్యంగ్యోక్తివేయుట; హాస్యోక్తి వేయుట.

**चुनौती देना** - సవాలు చేయుట.

**चुभती हुई आँख देखना** - మర్మభేది దృష్టి ప్రసరించుట.

**चुल्लुओं रोना** - ఎక్కువగా విలపించుట.

**चुल्लू भर पानी में डूब मरना** - ఎక్కువగా సిగ్గుచెందుట.

**चूँ-तक या भी न करना**-ఎంతమాత్రమూ అభ్యంతర పెట్టకుండుట.

**चूडियाँ ठंडी करना**- భర్త చనిపోయిన తరువాత భార్య గాజులు పగలగొట్టుకొనుట - వైధవ్యము పొందుట.

**चूतड दिखाना** - వీపుచూపించుట; భయపడి పారిపోవుట.

**चूतड सिकोडना** - మెల్లిమెల్లిగా నడచుట.

**चूतिया बनाना** - మూర్ఖునిగా చేయుట.

**चून के बराबर नून खाना** - అధికముగా అనుభవము గడించుట; దీర్ఘ ఆయువు కలిగి అధికముగా అనుభవం గడించుట.

**चूमकर छोड देना** - పని ప్రారంభించి వదిలి పెట్టుట.

**चूर कर देना** - నజ్జునజ్జుచేయుట; పాడు

చేయుట.

**चूर चूर हो जाना**- ఎక్కువగా అలసిపోవుట.

**चूल उठना** - దురదపెట్టుట; గులపెట్టుట.

**चूल बैठना** - లెక్కలు సరిపోవుట.

**चूल्हे में जाना** - వినష్టమగుట.

**चूल्हे से निकलकर भाड में पडना** - చిన్న ఆపదనుంచి పెద్ద ఆపదలో చిక్కుకొనుట.

**चेहरा उतरना** - ముఖము వేలాడుట.

**चेहरा तमतमाना** - కోపముతో ముఖము ఎర్రబారుట.

**चेहरा बिगडना** - ముఖము పీక్కుపోవుట.

**चेहरे पर हवाइयाँ उडना** - ముఖము కాంతి విహీనమగుట.

**चैन की बंशी बजाना** - జీవితము ఆనందముతో గడుపుట.

**चैन पडना** - శాంతి లభించుట.

**चोंचले बघारना** - ఒయ్యారము పోవుట.

**चोटी का पसीना एडी पर आना** - అధికముగా శ్రమించుట.

**चोर की दाढी में तिनका होना** - అపరాధే స్వయంగా సంశయించుట.

**चोर-चोर मौसेरे भाई होना ; चोर-चोर चचेरे भाई होना** - దొంగలు ఒకరికొకరు పినతల్లి-పెత్తల్లి లేక పినతండ్రి పెత్తండ్రి పిల్లలు అవుతారు ; అంతా ఒకే మాదిరిగా వ్యవహరించువారు.

**चोरी-चोरी** - చాటుగా.

**चोला छोडना** - మరణించుట.

**चोली-दामन का साथ** - గాఢమైన స్నేహము.

**चौकडा भरना** - కుప్పిగంతులు వేయుట.

**चौकडी - भूल जाना** - గిరమరచిపోవుట; ఏ ఉపాయము తట్టకపోవుట.

**चौकन्ना होना** - జాగ్రత్తపడుట; సావధానమగుట.

**चौका करना** - నాలుగు వేళ్ళమీద దారము చుట్టుట.

**चौका बर्तन करना** - అంట్లుతోమి అలుకుట.

**चौखट पर माथा रगडना**- నౌకరు మాదిరి అగుట.

**चौथका चाँद देखना** - వృథాగా కళంకము పొలగుట.

**चौपट करना** - నాశముచేయుట; వినష్టపరుచుట.

**चौमुखा दिया जलना** - దివాళాఅగుట; అధికముగా వ్యయమగుట.

## छ

**छँटा हुआ** - చతురుడు; ధూర్తుడు; జిత్తుల

మారి.

**छकडा लादना** - బండిమీద సామాను ఎక్కించుట.

**छक्का पंजा करना** - జూదమాడుట.

**छक्का पंजा भूलना** - ఎత్తు పనిచేయక పోవుట.

**छक्के छुडाना** - నిర్వీర్యపరచుట; ఓడించుట.

**छक्के छूटना** - ధైర్యసాహసములు లేకపోవుట; కార్య భారమువలన అతిగా అలసిపోవుట.

**छछूँदर छोडा** - గల్లంతుచేయుట; పుకారు వ్యాపించుట.

**छठीका दूध निकलना** - ఎక్కువ కష్టము కలుగుట.

**छठी का दूध याद आना** - గట్టిగా శ్రమించుట; అనుభవించిన సుఖము మరచి పోవుట; అధికముగా కష్టము కలుగుట.

**छठी में नहीं पडना** - అదృష్టములో లేకపోవుట; స్వభావమునకు ప్రతికూలముగా.

**छठे-छमासे** - అప్పుడప్పుడు.

**छत बंधना** - మబ్బువేయుట.

**छप्पर टूट पडना** - విపత్తు సంభవించుట; ఆపద కలుగుట.

**छप्पर फाड कर देना**- ప్రయాసపడకుండానే ఇచ్చుట.

**छल-छंद** - మోసము; జిత్తులు.

**छलाँग मारना** - దుముకుట; ఎక్కువ వృద్ధిజెందుట.

**छाँह में कमाना** - హాయిగా కూర్చొని డబ్బు సంపాదించుట.

**छाए रहना**- ప్రభావము ఉండుట; మనస్సులో ధ్యాస ఉండుట.

**छाजों में मेह बरसना** - కుండపోతగా వర్షించుట.

**छाती उमड आना** - మనస్సు ఉప్పొంగి పోవుట; ప్రేమలేక జాలివలన గద్గద మగుట.

**छाती के किवाड खोलना** - మనస్సులోని మాటను స్పష్టముగా చెప్పుట; మనస్సుని ముక్కలు ముక్కలుగా చేయుట; ఆనందము కలుగజేయుట.

**छाती गज भर की होना** - ఆనందము; గౌరవము కలుగుట.

**छाती छलनी होना** - కష్టాలు అనుభవిస్తూ గాబరాజెందుట.

**छाती जुडाना** - కోరిక తీరుట; మనస్సు చల్లపడుట.

**छाती ठंडी करना**-సంతోషించుట; సంతుష్ట పడుట.

**छाती पत्थरकी करना** - గుండెరాయి చేసు

కొనుట.

**छाती पर का पहाड** - ఎప్పుడూ బాధ కలిగించు; చింతకలిగించు సంఘటన.

**छाती पर कोदों दलना** - ఇతరుల ఎదుట తనను అవమానించుటకు వెక్కిరించు పనిచేయుట.

**छाती पर चढना** - బాధించుటకు సిద్ధ పడుట.

**छाती पर से बोझ उतरना** - చింతాముక్త మగుట.

**छाती पर दाल दलना** - दे० छाती पर मूँग दलना.

**छाती पर पत्थर रखना** - మెదలకుండా దుఃఖము సహించుట.

**छाती पर बाल होना** - ఉదారముగా నుండుట; విశ్వాసపాత్రుడగుట.

**छाती पर साँप लोटना** - బాధతో గుండె మండిపోవుట.

**छाती फुलाना** - నిక్కుట; గర్వించుట.

**छाती फूल उठना** - సంతోషము కలుగుట.

**छाती मजबूत होना** - ధైర్యసాహసములు కలుగుట.

**छाती में छुरी भोंकना** - అపకారము చేయుట; హాని కలిగించుట.

**छान डालना** - బాగుగా వెతుకుట.

**छानबीन करना**- అన్వేషించుట; గాలించుట.

**छिपे छिपे चोट करना** - చాటుతనముతో నష్టము కలిగించుట.

**छींकते नाक कटना** - సాధారణమైన పనికి దండన కలుగుట.

**छींटे कसना** - వ్యంగ్యోక్తులాడుట.

**छीछाले पर उडाना** - లోపము బయట పెట్టుట; గౌరవము లేకుండా చేయుట; వెక్కిరించుట.

**छीछालेदर होना** - దుర్దశాగ్రస్తమగుట; వెక్కిరింపబడుట; కఠోరముగా విమర్శింపబడుట.

**छुईमुई होना** - కాస్త విషయానికే గాబరా పడుట.

**छुरी फेरना** - ఇతరునికి హాని కలిగించుట.

**छूँछे हाथ** - వట్టిచేతులు - డబ్బులేనిచేతులు.

**छेडखानी करना-छेडछाड करना** ; అశిష్ఠమైన వేళాకోళము చేయుట.

**छोटे मुँह बडी बात करना** - తనహోదాను మించి మాట్లాడుట.

**छोह करना** - ప్రేమించుట.

**छोह दिखाना** - వట్టివట్టి ప్రేమ వలక పోయుట.

**छौना चढाना** - దేవతకు పందిపిల్లను బలి ఇచ్చుట.

# ज

**जंग चढना** - యుద్ధము చేయుట.

**जंगल जाना** - దొడ్డికి వెళ్ళుట; బహిర్భూమికి వెళ్ళుట.

**जांगल में मंगल होना** - నిర్జన ప్రదేశములో ఆనందోత్సవము జరుగుట.

**जंगल में रोना** - అరణ్యరోదన చేయుట; వ్యర్థముగా విలపించుట.

**जकड बंद करना** - బాగుగా వశపరచు కొనుట; గట్టిగా బంధించుట.

**जक पकडना** - మంకుపట్టు పట్టుట.

**जग-जाहिर** - అందరికి తెలిసిన.

**जगता** - ప్రభావశాలి.

**जड करना**-స్థిరపడుట; వేరునాటు కొనుట.

**जड पकडना** - दे० जड करना.

**जबडा तोड जवाब** - నోరుమూసే సమాధానము.

**जब-तब** - అప్పుడప్పుడు.

**जब देखो तब** - ఎల్లప్పుడు.

**जबान के नीचे जबान रखना** - చెప్పి తిరస్కరించుట.

**जबान चलना** - అపశబ్దములు వెలువడుట; అనరానిమాటలు అనుట; నోటినుంచి మాటలు వెలువడుట.

**जबान देना** - వాగ్దానము చేయుట; మాట ఇచ్చుట.

**जबान पर रहना** - ఎల్లప్పుడు జ్ఞాపకముండుట; ఎప్పుడూ చెప్పుట లేక అనుట.

**जबान बन्द होना** - ఓడిపోవుట.

**जबान बदलना** - ప్రతిజ్ఞ భంగపరచుట; మాటమార్చుట.

**जबान में लगाम देना** - తూచి తూచి మాట్లాడుట; మౌనము వహించుట.

**जबान लडाना** - వార్తాలాపము చేయుట; వాదవివాదము చేయుట; యాచించుట; అడుగుట.

**जबानी जमा खर्च करना** - పనిచెయ్యకుండా మాటలు మాత్రము చెప్పుట.

**जमाना देखना** - అనుభవము గడించుట.

**जमाने का** - ప్రాచీన కాలపు.

**जमाने की हवा लगना** - యువాలికి సంబంధించిన భావముల ప్రభావము పడుట.

**जमा मारना** - నమ్మకద్రోహముచేసి సొత్తు అపహరించుట.

**जमीन उठना** - పొలము కౌలుకు ఇచ్చుట.

**जमीन देखना** - ఓడుట; నేలపడుట; నేలచూపు చూచుట.

**जमीन पर पैर न पडना** - భూమిమీదకాళ్ళు పడకుండుట; విర్రవీగుట.

**जमीन में समा जाना** - అతిగా సిగ్గుపడుట.

**जय सीता राम होना** - సాధారణ పరిచయము కలుగుట.

**जरर पहुँचाना** - హానికలుగజేయుట; దెబ్బ కొట్టుట.

**जर्द पडना** - జబ్బుతో వాడిపోవుట.

**जर्दी छाना** - ముఖము పసుపు పచ్చగా అగుట; అతిగా భయపడుట.

**जलंधर होना** - ముసిలివాడగుట.

**जल उठना** - కోపముతో మండిపడుట.

**जलता घर छोडकर घूरा बुझाना** - అవసరమైన పనిమాని అనవసరమైన పనిచేయుట

**जलती आग बुझाना** - పోట్లాటను శాంతింపజేయుట.

**जलती हुई आाग से हाथ सेंकना** - ఇంకొకరి హానినుంచి లాభము పొందుట

**जल-भुन जाना** - కోపముతో ముఖము కందగడ్డ అగుట.

**जली-कटी सुनाना** - వెక్కిరింపు మాటలతో వేధించుట; దూషించుట, బెదిరించుట.

**जले पर नमक छिडकना** - दे० जले पर लोन लगाना.

**जले पर लोन लगाना** - కాలుతున్న వానిని ఇంకా కాల్చుట; కష్టంమీద కష్టం కలిగించుట.

**जले पाँव की बिल्ली** - తిరుగుబోతు స్త్రీ.

**जले फफोले फोडना** - దుఃఖించు వానిని ఇంకా దుఃఖపెట్టుట.

**जवाब तलब करना** - సంజాయిషీ అడుగుట; కారణము అడుగుట.

**जहन्नुम में जाना** - వినాశమగుట.

**जहमत उठाना** - కష్టము అనుభవించుట.

**जहर उगलना** - ఎక్కువ బాధకలిగించు మాటలు మాట్లాడుట.

**जहर का घूँट पीना** - క్రోధమును దిగమ్రింగుట.

**जहर खाना**-తనని తను నిందించుకొనుట; ఆత్మహత్య చేసుకొనుట.

**जहाँ का तहाँ रह जाना** - అక్కడికి అక్కడే ఉండుట; అంటిపెట్టుకు ఉండుట; వృద్ధిచెందకపోవుట.

**जहूर में आना** - బహిర్గతమగుట.

**जाँच-पडताल** - సోదా.

**जान कफस में फँसना** - కష్టాలలో చిక్కుకొనుట.

**जान का गाहक बनना** - వెంటాడుట; ప్రాణశత్రువగుట; ప్రాణాలు తీయుటకు సిద్ధపడుట.

**जान के लाले पडना** - ప్రాణంమీదికి

వచ్చుట; జీవించుట దుర్భరమగుట.

**जिद पकडना** - మకురపట్టు పట్టుట.

**जिन चढना** - దయ్యము పట్టుట.

**जिम्मे करना** - భారము అప్పగించుట.

**जिम्मे डालना** - అప్పు ఇచ్చుట.

**जिरह करना या काढना** - పరిహాసము చేయుట; వాదించుట.

**जिल्लत उठाना** - అవమానపడుట; వ్యాకుల పడుట.

**जिस गाँव में न जाना उस का रास्ता न पूछना** - చెయ్యుపనిలో అభిరుచి ఉంచు కొనకుండుట.

**जिस पत्तल में खाना उसी में छेद करना** - హితము చేయువానికి అహితము కలుగ జేయుట.

**जी उकताना ; जी उचटना** - మనస్సు లగ్నము కాకపోవుట.

**जी का गुबार निकालना** - మనస్సులోని ఆక్రోశము వ్యక్తము చేయుట.

**जी का जोखिम** - ప్రాణాపాయము.

**जीका बुखार निकालना** - दे० जी या दिल का गुबार निकालना.

**जी की जलन बुझाना** - మనస్సులోని దుఃఖము పారద్రోలుట.

**जी को जी समझना** - కనికరించుట; జాలిపడుట.

**जी खट्टा करना** - ద్వేషించుట; ఏవగించుట; మనస్సుని విరగొట్టుట.

**जी खट्टा - मीठा होना** - నోరూరుట.

**जी खट्टा होना** - మనస్సు విరిగిపోవుట; అరుచి కలుగుట; విముఖత్వము కలుగుట.

**जी चुराना** - మనస్సును మోహించుట; పనిమీద ధ్యాస లేకపోవుట.

**जी छोटा करना** - హీనాసితనము చేయుట; హతోత్సాహమగుట.

**जी छोड कर भागना** - సాహసము వదిలి పారిపోవుట.

**जी जीन लडाना** - మనస్ఫూర్తిగా పని చేయుట; ప్రాణములను లక్ష్యపెట్ట కుండుట.

**जी टूट जाना** - మనస్సు విరిగిపోవుట.

**जी तरसना** - పొందుటకు తహతహ లాడుట; నోరూరుట.

**जीता चुनवाना** - సహించరాని శిక్ష విధించుట.

**जीता-जागता** - ప్రత్యక్షముగా; సురక్షిత ముగా; సాహసోపేతుడు.

**जीती मक्खी घोंटना** - కాలాంతరమున హానికలిగించు పాపమును కావాలని

చేయుట; దోషముపై ధ్యాసలేకపోవుట.

**जी तोडकर काम करना** - మనస్ఫూర్తిగా శ్రమించుట.

**जी दुखाना** - కష్టపెట్టుట; మనస్సుకు బాధ కలిగించుపని చేయుట.

**जी देना** - ప్రాణము అర్పించుట.

**जी न होना** - మనస్సులేకపోవుట; స్వస్తత లేకపోవుట.

**जी पाना** - ఇతరుని స్వభావము లేక శీల మును తెలిసికొనుట; మనస్సులోని రహ స్యమును తెలిసికొనుట; ప్రేమించుట.

**जी पानी करना** - ఇతరునియెడల జాలి పడుట.

**जी फट जाना** - ప్రేమలో తేడా వచ్చుట; ఔదాసీన్యము కలుగుట.

**जी फडक उठना** - మనస్సు అకస్మాత్తుగా ఉల్లాసపడుట.

**जी फिसलना**-మనస్సుచలించుట; మోహిం చుట.

**जी बहलाना**-మనస్సుని రంజింప జేయుట.

**जी बिगडना** - రుచిలేకపోవుట; అరుచించుట.

**जी बैठा जाना** - మనస్సు ఉద్విగ్నమగుట; అపస్మారమువలె కలుగుట; ఉత్సాహము లేకపోవుట.

**जीभ करना** - పొగరుబోతు తనముగా సమాధానమిచ్చుట.

**जी भर आना** - అతిగా జాలిపడుట; అశ్రు పూరితమగుట.

**जी भरना** - తృప్తినొందుట; ముఖమొత్తుట; సందేహ నివృత్తమగుట.

**जीभ लपलपाना**-నోరూరుట; కరుచుట; కరుచుటకు తయారగుట.

**जी भारी करना या कर देना** - మనస్సు భార మగుట; నిర్లిప్తముగానుండుట; అస్వస్త మగుట.

**जी मचलना** - ఏదేని వస్తువుయెడల మనస్సు కలుగుట.

**जी में आना** - కోరిక కలుగుట; నచ్చుట.

**जी में गडना** - మనస్సులో నాటుకొనుట; నిశ్చయమగుట; ప్రభావితముచేయుట.

**जी लगना या लग जाना** - ఆసక్తికలుగుట; కుతూహలముతో నిరీక్షించుట.

**जी लरजना** - జంకుట; కంపించుట.

**जी ललचाना** - తహతహలాడుట; మనస్సు ఆకర్షితమగుట.

**जीवन भारी होना** - బ్రతుకు బరువగుట.

**जी से उतर जाना**-కోరికలేకపోవుట; ప్రతిష్ఠ లేకపోవుట; మనస్సునుంచి వేరగుట.

**जी हवा हो जाना** - గాబరా పడుట.

**जुटा देना** - పనిలో నిమగ్నముచేయుట; ప్రోగుచేయుట; సంఘటిత పరచుట.

**जुलाहे का गुस्सा दाढीपर उतारना** - అత్తమీద కోపము దుత్తమీద తీర్చుట.

**जुल्म टूटना** - పెద్ద విపత్తు సంభవించుట.

**जुल्म ढाना** - అత్యాచారముచేయుట.

**जुल्म देना** - దారి తప్పించుట; మోసగించుట.

**जूँ न रेंगना** - ప్రభావము లేకపోవుట.

**जूता - चलना** - చెప్పులతో కొట్టుకొనుట.

**जूता जडना** - చెప్పుదెబ్బకొట్టుట.

**जूता जडना** - చెప్పుదెబ్బ కొట్టుట.

**जूती की नोक पर मारना** - తుచ్ఛనిగా తలచుట.

**जेब गरम होना** - లంచము లభించుట; ఎక్కువగా లాభము కలుగుతుంది.

**जेहन लडना** - दिमाग लडना ; ఆలోచించుట.

**जैसा बोना वैसा काटना** - కర్మానుసారము ఫలము లభించుట.

**जो कहा जाए सो थोडा** - వర్ణనాతీతమగుట.

**जोगी का बैल होना** - వ్యర్థమగుట.

**जोगीडा गाना** - అశ్లీలమైనమాట చెప్పుట; బూతుల పంచాంగము విప్పుట.

**जोड का तोड मिलना** - తగినట్లుగా లభించుట; జోడా కుదురుట.

**जोड-तोड मिलाना**- ఉపాయము పన్నుట.

**जोडा खाना** - పశుపక్షాదులు సంభోగించుట.

**जोर करना** - శక్తిని వినియోగించుట.

**जोर चलना** - అధికారముసాగుట.

**जोरों पर होना** - శక్తిసంపన్నమగుట; తీవ్రముగానుండుట.

**जौ जौ का हिसाब लेना** - దమ్మిడీ- దమ్మిడీ లెక్కించుట.

**जौहर खुलना** - రహస్యము బయలు పడుట.

**ज्योति जगाना** - ఎరుకపరచుట.

**ज्यौनार बैठना** - అతిథులు భోజనమునకు కూర్చొనుట.

## झ

**झंखाड होना** - వయస్సుమారిపోవుట; వృద్ధుడగుట.

**झंझट मोल लेना** - తగాదా కొనితెచ్చుకొనుట.

**झंडा गाडना**- పూర్తిగా అధికారము లోనికి తెచ్చుకొనుట.

**झंडी दिखाना** - అదును సమయమున లేదు అనుట; జండాతో సంకేతము ఇచ్చుట.

**झंडे पर चढना** - కళంకితమగుట.

**झक झक करना** - అక్కరకు రాని తర్కము చేయుట; పోట్లాడుట.

**झक्कड चलना** - తీవ్రమైన తుపాను వచ్చుట.

**झक मारना** - విధిలేకపోవుట; వివశమగుట; కాలము వ్యర్థముగా పోగొట్టుకొనుట.

**झगडा पाक होना** - తగాదా తీరిపోవుట.

**झटका उठाना** - ఆపదను సహించుట.

**झटके का माल** - దొంగసొత్తు.

**झट से** - వెంటనే.

**झडबेरी का काँटा** - పోట్లాటమనిషి.

**झडी बाँधना** - పునరావృత్తిమీద పునరావృతము చేయుట.

**झडी लगाना** - నిరంతరముగా వర్షించుట.

**झपट्टा मारनां**- ఒక్క ఊపులో లాక్కొనుట.

**झमेले में फैसना** - ఇరకాటములో చిక్కుకొనుట.

**झाँई आना** - తలతిరుగుడు.

**झाँसा देना** - రెచ్చగొట్టుట; మోసగించుట.

**झाड – झटक कर** - ఏదో విధముగా; అడిగి లేక దొంగిలించి.

**झाड–फानूस लगाना** - అతిగా అలంకరించుట.

**झाड–फूँक करना** - మంత్రములతో భూత ప్రేతములను పారద్రోలుట.

**झाडा फिरना** - మరుగుదొడ్డికి వెళ్ళుట.

**झिडकी देना** - బెదిరించుట; మందలించుట.

**झूठ–सच कहना** - మోరపెట్టుట; కొండిగములు చెప్పుట.

**झूठा ठहरना** - అబద్ధము ఋజువగుట.

**झूम झूम कर** - నిషా ఎక్కి; ఊగుతూ.

**झूला मार जानार** - పక్షవాతము వచ్చుట.

**झोंक में** - ఆవేశములో.

**झोल बैठाना** - కోడిపెట్టచేత పొదిగించుటకు గుడ్లు వేయుట.

**झोल मारना** - రెచ్చగొట్టుట.

**झोली डालना या डाल लेना** - ముష్టిజోలి ధరించుట.

**झोली भरना या भर देना** - జోలి నింపుట; బిచ్చమువేయుట; పొట్టనిండా తినుటకు సరిపడ భోజనము పెట్టుట.

**झौवा भर** - గంపెడు.

## ट

**टंटा खडा करना** - పోట్లాటలేపుట; తగాదా పడుట.

**टक टकी बाँध कर देखना – एक टक देखना** - రెప్పఆర్పకుండా చూచుట.

**टकसाल का खोटा** - పుట్టు దురాచారి; చెల్లనినాణెము.

**टकसाली बात करना** - ప్రామాణికమైన విషయము చెప్పుట.

**टकसाली भाषा** - ప్రామాణికమైన భాష.

**टका पास न होना** - నిష్టదరిద్రుడు.

**टका सा जबाव देना** - వెంటనే తిరస్కరించుట; తనకు తెలియదని నిష్కర్షగా చెప్పుట.

**टकासा मुँह लेकर रह जाना** - మూతి ముణుచుకొని ఉండిపోవుట.

**टके को न पूछना** - ప్రతిష్ఠ లేకపోవుట.

**टके सेर बिकना** - అతి చౌకగా అమ్ముడు పోవుట.

**टक्कर का** - సమానమైన ఉజ్జి.

**टक्कर लगाना** - ఎదిరించుట.

**टक्कर लडाना** - ఢీకొట్టుకొనుట.

**टट्टी कमाना** - మరుగుదొడ్డి శుభ్రపరచుట.

**टट्टी की आड में शिकार खेलना** - ఇంకొకరికి వ్యతిరేకముగా; చాటున కుతంత్రము చేయుట.

**टन हो जाना** - వెంటనే చనిపోవుట.

**टपक पडना** - అకస్మాత్తుగా ఊడిపడుట - వచ్చుట.

**टप्पा उलटना** - దివాళా అగుట.

**टप्पा देना** - అంగలు, పంగలు వేయుట.

**टर टर करना** - వ్యర్థముగా ప్రలాపించుట.

**टर्र निकल जाना** - గర్వము నశించుట.

**टल - जाना** - జారుకొనుట.

**टस से मस न होना** - స్థిరముగానుండి పోవుట; బెల్లంకొట్టిన రాయివలె ఉండి పోవుట.

**टाँक रखना** - జ్ఞాపకము నిమిత్తము నోటు చేసుకొనుట ; వైమనస్యము ఉంచు కొనుట.

**टाँका भरना** - కుట్టుట.

**टाँके मारना** - దూరదూరముగా త్వర త్వరగా సూదికుట్టువేయుట.

**टाँग अडाना** - అడ్డంకివేయుట; అనవసర ముగా జోక్యము చేసుకొనుట; తెలియని చోటుకిచొచ్చుకొని పోవుట.

**टाँग खींचना** - కళంకపరచుట.

**टाँग तले से निकलना** - కాలిక్రింద బలా దూరమగుట; ఓటమి ఒప్పుకొనుట.

**टाँग देना** - వ్రేలాడగట్టుట; ఉరితీయుట.

**टाँग पसार कर सोना** - కాళ్ళు జాపుకుని పరుండుట - నిద్రించుట; నిశ్చింతగా నిద్రపోవుట.

**टाँगे तोडना** - కాళ్ళు విరగగొట్టుట; అవమానించుట; వివశపరచుట.

**टाँट खाली रहना** - ఏమీ అర్థము చేసుకొనక పోవుట.

**टाँट खुजलाना** - వళ్ళు దురదపెట్టుట; దెబ్బలు తిను కోరిక కలుగుట.
**टाट उलटना या उलट जाना** - దివాళా అగుట; ఎక్కువగా నష్టము కలుగుట.
**टाट में पाट की बखिया करना** - చెడు వస్తువుకి మంచి అలంకరణచేయుట.
**टँ टाँ मचाना** - అల్లరి చేయుట; హంగామా చేయుట.
**टाल करना या कर देना** - కుప్పపోయుట.
**टाल जाना** - అస్వీకరించుట.
**टिड्डी-दल** - పెద్దగుంపు.
**टिमटिमाता दिया** - ఆరిపోవుటకు సిద్ధము గానున్న దీపము.
**टीका कढाना** - వారసత్వము పొందుట.
**टीका-टिप्पणी करना** - విమర్శించుట.
**टीप -टाप करना** - అక్కడక్కడ సంస్కరించుట.
**टीम-टाम रखना** -గొప్పదర్జా చూపించుట.
**टीस उठना** - నొప్పి కలుగుట.
**टीस मारना** - తియ్యతియ్యని నొప్పి కలుగుట.
**टुकडे केलिए तरसना** - బొత్తిగా తిండి లేనివాడు.
**टुक-सा** - కొద్దిపాటి.
**टुकुर-टुकुर ताकना** - రెప్ప ఆర్పకుండా చూచుట; జాలిగొలుపు చూపులతో చూచుట.
**टूक-टूक होना** - ముక్కలు ముక్కలగుట.
**टूटे फूटे स्वर में** - అస్పష్ట స్వరముతో.
**टेटुवा दबाना** - గొంతు పిసుకుట.
**टें टें करना** - వ్యర్థముగా మాట్లాడుట; గీర పోవుట.
**टेक निभाना** - తన ప్రతిజ్ఞను పూరించుకొనుట; తన మకురపట్టును సాధించుకొనుట.
**टेढा पडना** - నిక్కుట; కఠోరమగుట; కొంటెతనము చేయుట.
**टेढी अँगुली से घी निकालना** - ఆవశ్యకత ననుసరించి వ్యవహరించుట; దూర్ద్వారా పని సాధించుట.
**टेढी आँखों से देखना** - ద్వేషము వహించుట; ఈర్ష్య వహించుట.
**टेढी खीर** - కఠినకార్యము.
**ठेढी चितवन** - ప్రేమ దృష్టి; ద్వేషపూరిత దృష్టి.
**टोक में आना** - దిష్టి తగులుట.
**टोटका करने आना** - వచ్చి వెంటనే వెళ్ళపోవుట.
**टोटा उठाना** - నష్టపోవుట.
**टोना करना** - మంత్ర[illegible]

వైద్యము చేయుట.

**टोपी उछालना** - అవమానించుట.

**टोपी बदलना** - అధికారి లేక శాసకుడు అగుట; స్నేహితుడగుట.

**टोह मिलना** - జాడతెలియుట.

**टोह में रहना** - అన్వేషణలోనుండుట.

## ठ

**ठंढ पडना** - చలివేయుట.

**ठंढा पड जाना** - చనిపోవుట; ధైర్యము వీడిపోవుట; కోపము శాంతించుట; తగ్గుముఖము పట్టుట.

**ठंढी आगम में जलना** - విరహాగ్నిలో వ్యాకుల మగుట.

**ठंढी गरमी** - కృత్రిమప్రేమ.

**ठंढी साँस खींचना ; ठंढी साँस भरना या लेना** - నిట్టూర్పు విడుచుట.

**ठकुर-सुहाती करना** - ముఖస్తుతిచేయుట.

**ठट्ठा उडाना** - ఎగతాళిచేయుట; పరిహాసము చేయుట.

**ठन जाना** - నాశమగుట.

**ठन ठन गोपाल होना** - చేతిలో చిల్లిగవ్వ లేకుండుట; దరిద్రుడగుట.

**ठसक दिखाना** - గీరపోవుట; అభిమానముతో కూడినచేష్టలు చేయుట.

**ठसाठस भरना** - ఎక్కువగా గుంపు ఏర్పడుట; కుక్కి-కుక్కి-నింపుట.

**ठाट-बाट से रहना** - దర్జాగా ఉండుట.

**ठाली होना** - ఉద్యోగము లేకుండుట.

**ठिकाना ढूँढना** - బ్రతుకుతెరువు వెతుక్కొనుట.

**ठिकाना लगना** - నివాసస్థానము లభించుట.

**ठिकाने की बात** - తెలివైనమాట.

**ठीक आना** - సరిపడుట.

**ठीक उतरना** - సరిపోవుట; అనుకున్నది అగుట; సరి అగుట.

**ठीक करना** - సరిచేయుట; హైరానుచేసి పాడుచేయుట.

**ठेंगा दिखाना** - వెక్కిరించుట; తిరస్కరించుట.

**ठोकर उठाना**-కష్టపడుట; హాని భరించుట.

**ठोकर देना** - కాలితో తన్నుట; హాని కలిగించుట; చీదరించుట; అగౌరవపరచుట.

**ठौर रहना** - చంపబడుట; చనిపోవుట.

## ड

**डंक मारना** - తేలు కుట్టుట.

**डंका पीटना या पीट देना** - ఢంకామీద దెబ్బకొట్టిచెప్పుట; చాటింపువేయుట.

**डंके की चोट पर** - ఢంకామీద దెబ్బకొట్టి; చాటించి.

**डंड भरना** - జుర్మానా భరించుట.

**डंडी मारना** - తక్కువ తూచుట.

**डकार न लेना** - డబ్బు తీసుకుని ఇవ్వకుండుట; చేసినపని చెప్పకుండుట.

**डगर बताना** - దారిచెప్పుట; ఉపాయము చెప్పుట.

**डट कर खाना** - పొట్టనిండా భుజించుట.

**डट जाना** - స్థిరముగా ఎదుట నిలబడుట; స్థిరపడుట.

**डाँट-डपट करना** - మందలించుట.

**डाँट बताना** - చివాట్లు పెట్టుట.

**डाँड लेना** - అర్థదండన విధించుట - గ్రహించుట.

**डाक लगना** - ఎడతెరిపిలేకుండా డోకుల గుట.

**डाका डालना** - దొంగిలించుట; దోచు కొనుట.

**डाका पडना**- దొంగలు దోచుకొనుట.

**डाढ मार कर रोना** - వెక్కివెక్కి ఏడ్చుట; ఎక్కువగా విలపించుట.

**डाली देना** - గొప్ప అధికారికి పళ్ళు-ఫలములు మొ॥వి కానుకగా ఇచ్చుట.

**डावाँडोल रहना** - అస్థిరముగానుండుట; ఊగిసలాడుట.

**डीठ बाँधना** - కనికట్టు చేయుట.

**डील डौल का होना** - పెద్దగా పెరిగి బలశాలియగుట.

**डूबते को तिनके का सहारा होना** - అసహాయనికి ఏదో ఒక ఆధారము కలుగుట.

**डूबते को थाह मिलना** - ఆపదలో ఆధారము లభించుట.

**डूबा आसामी** - దివాళా తీసినవాడు.

**डेढ ईंट की मस्जिद जुदा बनाना** - పరస్పరము కలహించుట.

**डेढ चावल की खिचडी पकाना** - తన అభిప్రాయము వేరుగా నుంచుకొనుట.

**डेरा डालना** - మకాము చేయుట.

**डोर पर लगाना** - దారికి తెచ్చుట.

**डोर मजबूत होना** - జీవించు కాలము ఇంకా ఉండుట.

**डोर लगना** - ప్రేమించుట.

**डोरा डालना** - తన ప్రేమపాశమున బంధించుట.

**डौंडी पीटना** - చాటింపువేయుట; అందరికి చెప్పుట.

**डौल पर लाना** - ప్రయోజకునిగా చేయుట; ఉపయోగపడునట్లు తయారుచేయుట.

**डौल लगाना** - ఉపాయము చేయుట; యుక్తిపన్నుట.

**डौल होना** - యుక్తితోచుట.

**ड्यौढी - पार न करना** - గడపదాటకుండుట; కూపస్తమండూకమగుట.

## ढ

**ढंक का होना** - సరి అగుట.

**ढंग निकालना** - దారితీయుట; యుక్తికనుగొనుట.

**ढंग से बरतना** - మితవ్యయముతో ఇముడుట; సరిగా వ్యవహరించుట.

**ढकोसला होना** - ఆడంబరమగుట.

**ढब आना** - పనిచేయు విధానము తెలియుట; వ్యవహరించు పద్ధతితెలియుట.

**ढब की बात** - అనువు విషయము; సమంజసమైన మాట.

**ढब पर चढना** - వశమగుట.

**ढर्रा डालना** - అలవాటుచేయుట.

**ढर्रे पर आना** - చెడినపనిని సమకూర్చుట.

**ढह पडना - ढय पडना** - హఠాత్తుగా వచ్చి మకాము చేయుట; పడిపోవుట.

**ढाई ईंट की मस्जिद अलग बनाना** - అందరిని వ్యతిరేకించి వేరుగా నుండుట.

**ढाई चावल की खिचडी अलग पकाना**- తన అభిప్రాయమును భిన్నముగా నుంచుకొనుట.

**ढाक के तीन पात होना** - పరిమిత కుటుంబ మగుట; ఎప్పటినుంచో పేదానుండుట; ఎప్పుడూ ఒకే మాదిరిగానుండుట.

**ढाढस देना** - ధైర్యము కలుగజేయుట; ఓదార్చుట.

**ढाढस बँधना** - ధైర్యము కలుగుట.

**ढा देना** - పడవేయుట; ముగించివేయుట.

**ढिंढोरा पीटना** - చాటింపువేయుట.

**ढील डालना** - ఆహ్వానములో లోటు చేయుట.

**ढीला पड जाना** - సుస్తీఅగుట; బలహీనపడుట; మెత్తపడుట.

**ढीली आँख** - మదిరనేత్రము; మత్తెక్కిన కన్ను.

**ढेर करना** - చంపి పారవేయుట.

**ढेर हो जाना** - పడి చనిపోవుట.

**ढोल ढमक्का** - బాజాలు, హంగామా.

**ढोलाबंदी करना** - హద్దుకిగుర్తులువేయుట.

## त

**तंग आना** - విసిగిపోవుట; కలతజెందుట.

**तंग करना** - వేధించుట.

**तंग-दिल होना** - పిసనారియగుట.

**तंग रहना** - పేదగానుండుట; ఇబ్బందిలోనుండుట.

**तंगहाथ होना** - చేతిలో డబ్బు లేకపోవుట; దగ్గర డబ్బు లేకపోవుట.

**तंग होना**- బిగుతు అగుట; ఇరుకు అగుట; చిన్నదగుట.

**तंत निकालना** - మూలము తెలియుట; ఉద్దేశ్యము తెలియుట.

**तम्बू तानना ; तम्बू बनाना** - డేరా వేయుట; శాసించుట.

**तकदीर खोटी होना** - చెడు రోజులు దాపరించుట.

**तकदीर जागना** - మంచిరోజులు వచ్చుట.

**तकदीर ठोंकना** - అదృష్టమును దూషించుట.

**तकलीफ उठाना** - దుఃఖము సహించుట.

**तकल्लुफ करना** - మొగమాటము పడుట.

**तकल्लुफ का** - శ్రేష్ఠమైన.

**तकिया-कलाम होना** - మాటిమాటికి ఊతపదమువాడుట.

**तख्ता उलटना** - అయినపని పాడగుట; రాజ్యశాసనములో మార్పువచ్చుట.

**तजवीज करना** - తీర్పు ఇచ్చుట; చేయుట.

**तडक कर जवाब देना; तडख कर बोलना** - నిర్మొఖమాటముగా సమాధానమిచ్చుట.

**तडी जडना ; तडी देना** - దగాచేయుట - టోపీ పెట్టుట.

**तन देना** - ధ్యాసఉంచుట.

**तन-मन से करना** - మనస్ఫూర్తిగా పని చేయుట.

**तपाक बदलना** - క్రోధించుట.

**तपौनी का गुड खाना** - దూకోరు అగుట; దొంగ అగుట.

**तबीयत आना** - ప్రేమ కలుగుట; మనస్సు లగ్నమగుట - ప్రేమ జనించుట.

**तबीयत फडक उठना** - ఉత్సాహము కలుగుట; ఆవేశము కలుగుట; ఆనందము కలుగుట.

**तबीयत होना** - కోరిక కలుగుట; నచ్చుట.

**तबेलेकी बला बंदर के सिर जाना** - ఒకరి విపత్తు ఇంకొకరికి మళ్ళుట.

**तमा देना** - లంచమిచ్చుట.

**तमाम करना**- పూర్తిచేయుట; అంతము చేయుట.

**तरतीब देना या दे देना** - అలంకరించుట; క్రమానుసారము సర్దుట.

**तर माल उडाना** - రుచిగల పౌష్టిక ఆహారము ఆరగించుట.

**तरसा-तरसा कर देना** - ఊరించి ఊరించి ఇచ్చుట.

**तरसा तरसा कर मारना** - కష్టము కలిగించి కలిగించి చంపుట; ఊరించి ఇవ్వకుండుట.

**तरारा भरना** - వేగముగా పరిగెత్తుట.

**तरीका बरातना** - నియమపాలనచేయుట.

**तरी होना** - ఆనందము కలుగుట; ధనము కలుగుట.

**तरे बैठना** - భర్త అగుట.

**तरेर कर देखना** - కోపముతో చూచుట.

**तलब करना** - హాజరు పరచుట; కబురు పంపుట; అడుగుట లేక అడిగి తెప్పించుట.

**तलवा छलनी होना** - నడచినడచి కాళ్ళు బలపముకట్టుట; కాళ్ళుబొబ్బలెక్కుట.

**तलवार का पानी पीना** - యుద్ధము చేయుట.

**तलवार के घाट उतारना** - ఖడ్గముతో చంపుట.

**तलवार पर मख मलका गिलाफ चढा होना** - బయటికి మంచిగా కనిపించినా నిజానికి క్రూరమైన గోముఖ వ్యాఘ్రము.

**तलवे चाटना** - ముఖస్తుతి చేయుట.

**तलवों की आग माथे तक पहुँचना** - అరికాళ్ళమంటనెత్తికిమ్మట; ఎక్కువగా కోపము లేక ఈర్ష్య కలుగుట.

**तलवों में से तेल निकालना** - అతిగా పీనాసితనము పోవుట; ఎంత దూరమైనా నడిచేవెళ్ళుట.

**तलवों से आँखें मलना** - ప్రేమ భావము వ్యక్తము చేయుట; బహు దైన్యము చూపించుట.

**तवे की बूँद होना** - ఏమాత్రమూ ప్రభావితము కాకుండుట; సంతోషము కలుగజేయునంతఅల్పమగుట; క్షణభంగురము.

**तशरीफ रखना ; तशरीफ लाना** - విరాజిల్లుట; కూర్చుండుట; (గౌరవముగా సూచించు).

**तशरीफ ले जाना** - వేంచేయుట; వెళ్ళిపోవుట (గౌరవముగా)

**तसल्ली दिलाना** - ధైర్యము కలుగజేయుట; ఓదార్చుట.

**तह करके रखना** - అనావశ్యకమగుట; మడతపెట్టి జాగ్రత్తగా నుంచుట.

**तह का सच्चा** - నిష్కపటమైన.

**तह की बात** - యథార్థ విషయము; మనస్సులోనిమాట; రహస్యము.

**तह को पहुँचना** - మూలము వరకు చేరుట; యథార్థమును తెలిసికొనుట; మనస్సు జాడతీయుట.

**तहलील करना** - జీర్ణించుకొనుట.

**तहसील करना** - వసూలు చేయుట.

**ताँता बाँधना** - నిరంతరము వస్తూవుండుట.

**ताँता बाँधना** - పంక్తి బద్ధమగుట; వరుసగా నిలబడుట; పెద్దగుంపు ఏర్పరుట.

**ताँतिया जवान** - ఒక్క మనిషి; దుర్బలుడు.

**ताक-झाँक करना** - అనువుకొరకు వెతుకుట; ఇటు అటు చూచుట.

**ताक पर रखना** - ఉపయోగించకుండుట; తొలగించుట.

**ताक में रहना**- అవకాశము కొరకు చూచుట.

**ताकीद कर देना** - ఏదేని పనికొరకు ప్రేరేపించుట.

**ताजा करना** - గుర్తుచేయుట; నీరు మార్చుట.

**ताड का तिल करना** - పెద్ద విషయాన్ని చిన్నదని తలచుట.

**ताड जाना** - ఊహించి తెలిసికొనుట.

**तान कर तमाचा देना** - గట్టిగా లెంపకాయ వేయుట.

**तान कर सोना** - నిశ్చింతగా నిద్రించుట.

**ताना देना** - ఎత్తిపొడుచుట; వ్యంగ్యముగా మాట్లాడుట.

**ताबड-तोड** - ఒకదానిమీద ఒకటి నిరంతరముగా.

**तार टूटना** - విఘ్నమగుట; అంతరాయము కల్గుట.

**तार-तार रोना** - ఎక్కువగా ఏడ్చుట.

**तार निकालना** - జాడతీయుట; కూపీ తీయుట.

**तारीफ करते मुख सूखना ; तारीफ के पुल बाँधना** - అపరిమితముగా ప్రశంసించుట.

**तारों की छाँह**-పెందలకడ; తెల్లవారుజాము.

**ताल उठाना** - పాట ప్రారంభమగుట.

**ताल-मेल खाना** - ఒకే స్వభావమగుట; సరిపడుట.

**तालू में दाँत जमना** - కష్టకాలము వచ్చుట.

**ताव आना** - ఆవేశము కలుగుట; కోపము వచ్చుట.

**ताव दिखाना** - అహంకారమిశ్రిత క్రోధము వ్యక్తము చేయుట; దర్పాచూపించుట.

**ताव पर** - అవసర సమయమున; కోరిక సమయమున.

**ताव में आना** - అహంకారపూరిత క్రోధముతో నిండిపోవుట; ఆవేశయుక్తమైన క్రోధము వచ్చుట.

**तिकडम भिडाना** - ఆకతాయితనముతో యుక్తిపన్నుట.

**तिजोरी में होना** - వశమగుట.

**तिडी-भूल जाना** - స్పృహలేకపోవుట.

**तिनक जाना** - చిరాకుపడుట; కోపపడుట.

**तिनका दाँतों में पकडना** - వినమ్రముగా ప్రార్థించుట; దీనముగా ప్రార్థించుట.

**तिरछी आँखों से देखना** - క్రోధ దృష్టితో

చూచుట; అనిష్టము చేయుట; సైగ చేయుట.

**तिरिचा चरित्तर** - స్త్రీల రహస్యము; స్త్రీల విచిత్ర స్వభావము; ఒయ్యారపు ఆడంబరము.

**तिल तिल का हिसाब** - పైసా పైసా లెక్క.

**तिलमिला उठना** - కొంకెర్లుపోవుట.

**तिहाई मारी जाना** - పైరుకాకపోవుట; పైరు పండకపోవుట.

**तीतर कर देना** - పారద్రోలుట.

**तीन तेरह करना** - వేరువేరుచేయుట.

**तीन तेरह में न रहना** - ఏ గలాటాలోనూ లేకుండుట; పనికిమాలిన పనులతో జోక్యము లేకుండుట

**तीन – तेरह होना** - చెల్లాచెదరగుట.

**तीन लोकों से न्यारी मथुरा बसाना** - అందరినుంచి వేరుపడుట.

**तीर चलाना** - ఉపాయము ఆలోచించుట; లక్ష్యపెట్టుట; పడవేయుట; విసురుట.

**तीर हाथ से निकल जाना** - స్థితి వశము తప్పుట.

**तीसमारखाँ बनना** - గొప్పవీరుడగుట; తనవీరత్వపు బడాయిలు కొట్టుట.

**तुम–ताम करना** - తిట్టుట.

**तुम डाल–डाल हम पात–पात** - తెలివిగల; ఎక్కువగా చాతుర్యము కలిగి జాగ్రత్త పడిన.

**तुर्रा कूटना** - కొరడా దెబ్బలు కొట్టుట; కొట్టిగుట్టమును స్వారీచేయించుట.

**तुर्रा यह कि** - ఇంకా ఇంత; ఇంత అయినప్పటికి.

**तुल हुए** - తూచబడిన; ఉచితమైన; సన్నద్ధమైన.

**तू–तडाक से बोलना** - చాలా అసభ్యముగా మాట్లాడుట.

**तूती – बोलना** - ప్రభావితము చేయుట; దర్జాగా వుండుట.

**तू–तू मैं–मैं होना**-పోట్లాడుట;కొట్లాడుట.

**तूफान आना** - తుపాను వచ్చుట; ఆపద కలుగుట.

**तूफान जोडना** - మిథ్యాకళంకము ఆపాదించుట; వట్టొట్టి దోషారోపణ చేయుట.

**तेरा–मेरा करना** - వ్యామోహములో చిక్కుకొనుట; ఏదేని వస్తువు కొరకు జగడమాడుట.

**तेल जल चुकना** - సమాప్తమగుట; కాలమాసన్నమగుట.

**तेली का बैल होना** - ఎల్లప్పుడు పనిలో నిమగ్నమగుట.

**तेवर चढना ; तेवर बदलना** - కనుబొమ్మలు

ముడివడుట; కోపించుట.

**तेवर बुरे दीखना ; तेवर बुरे नजर आना** - ప్రేమలో మార్పువచ్చుట; క్రోధించుట.

**तैश में आना** - కోపించుట.

**तोड - जोड करना** - బేరమాడుట.

**तोताचश्म होना** - నిర్మొఖమాటి అగుట.

**तोता पालना** - రోగము ముదురుట; శత్రువును పోషించుట; చెడు అలవాటును పెరగనిచ్చుట.

**तोते उड जाना** - గాబరాజెందుట

**तोते की तरह आँखें फेरना ; तोते की तरह आँखें बदलना** - నిర్దయతో వ్యవహరించుట; అసభ్యముగా వ్యవహరించుట

**तोबा करना** - ఇంకచెయ్యనని ఒట్టుపెట్టుకొనుట.

**तोरई छौकना** - మాటకు వేరే అర్థము చెప్పుట.

**तौर-बेतौर होना** - స్థితి చింతా జనకముగా మారుట; వాలకము సరిగా లేకుండుట.

**त्राहि त्राहि मचाना**- హాహాకారము వచ్చుట.

## थ

**थइली भर लेना** - ఏదో ఒకటి తిని పొట్ట నింపుకొనుట.

**थक कर चूर होना** - అతిగా అలసిపోవుట.

**थपेडे खाना** - విపత్తులో పడుట.

**थर-थर करना** - వణికి పోవుట.

**थरथरी छूटना या छूट जाना** - భయముతో కంపించిపోవుట.

**थान का टर्रा होना** - తన ఇంటి దగ్గరే బలము ప్రదర్శించుట; శక్తిచూపించుట.

**थाली का बैंगन** - శంకించు స్వభావము గలవాడు; తన స్వంత ఆలోచన లేక సిద్ధాంతము లేనివాడు.

**थाली-लोटा तक बिकना** - దివాళా అగుట; దరిద్రుడగుట.

**थाह न होना** - అంచనాలేకపోవుట.

**थाह पाना** -స్థితిని గురించి సరియైన అంచనా వేయుట; ఆధారము లభించుట.

**थाह लेना** - ఎదుటివాని రహస్యమును కనిపెట్టుట; లోతు తెలిసికొనుట.

**थिगली लगाना** - దుర్గమ ప్రదేశములోనికి కూడా చేరుటకు ఉపాయము కని పెట్టుట.

**थुडी थुडी करना** - ఛీ ఛీ అనుట; చీదరించుట.

**थुथना फुलाना** - కోపగించుట.

**थूककर चाटना**- ప్రతిజ్ఞ ప్రకారము ఆచరించకుండుట; ఇచ్చినది తిరిగి తీసుకొనుట; మాట ప్రకారము ఉండకపోవుట.

**वक्त आ पहुँचुना** - చావుకాలము దగ్గర పడుట.

**वक्त काटना** - ఏదో విధముగా కాలము గడుపుట.

**वक्त हाथ से दे देना** - అదనుపోగొట్టు కొనుట.

**वली लंगर** - నకిలీ సాధువు.

**वारे-न्यारे करना** - ఎక్కువగా లాభము గడించుట; ధనసంపన్నుడగుట.

**वास्ता देना** - సహాయమును అర్థించుట.

**वास्ता रखना** - సంబంధము ఉంచు కొనుట.

**वाही-तबाही बकना** - అక్కరకురాని అసభ్యమైన వాగుడు వాగుట.

## श

**शंकर की लकडी; शक्कर की लकडी** - చెరుకు గడ.

**शंकर होना** - బోళాగాయుండుట.

**शऊर पकडना** - తెలివి సంపాదించుట; తెలివిమీరుట.

**शगूफा खिलना** - వింతసంఘటన సంభవించుట.

**शगूफा दिखाना** -గండములో చిక్కించుట.

**शबाब आना**- అందముకలుగుట; శోభిల్లుట

**शमा बढाना** - దీపము ఆర్పుట.

**शमा से पानी पानी होना** - అతిగా సిగ్గు పడుట.

**शर्म थूक कर खा जाना** - సిగ్గు ఏమాత్రము లేకపోవుట.

**शहद लगाकर चाटना**-సోమరిగాఉంచుట; ఉపయోగించలేకపోవుట.

**शहादत देना** - సాక్ష్యమిచ్చుట.

**शादी मर्ग हो जाना या होना** - అతి ఆనందము వలన చనిపోవుట.

**शमिल हाल**-కష్ట-సుఖములలో సహచరుడు నిజమైన మిత్రుడు.

**शामी लगाना** - గుఱ్ఱముకాళ్ళకు నాడాలు వేయించుట.

**शीर और शक्कर होना** -కలిసిమెలిసి పోవుట.

**शीशी सुँथाना** - మూర్ఛ తెప్పించుట.

**शेखी किरकिरी होना** - గీరవీగిపోవుట; అభిమానము భంగమగుట.

**शेखी निकलना या निकल जाना** - అవమానపడుట.

**शेर-बकरी का एक घाट पानी पीना** - అందరికి ఒకే మాదిరి అధికారములు - సదుపాయముల ఉండుట.

**शैतान का कान फूँकना** -చెడు ఆలోచనలో లీనమగుట.

**शैतान का बच्चा** - నీచుడు; తుంటరి.

**शैतान की खाला** - గయ్యాళి స్త్రీ.

**शौक पूरा करना** - కోరిక తీర్చుకొనుట.

**शौक फरमाना** - అనుభవించుట; అనుభూతి పొందుట.

**शौक से** - ఆనందముగా; సంతోషముగా.

**श्रीगणेश करना** - ఏదేని పని ప్రారంభించుట.

**श्रेय पाना** - ఏదేని పనిచేసినందుకు ఘనత పొందుట.

**श्वास रहते** - ప్రాణము ఉండగా; జీవిత పర్యంతము.

**श्वेत यश** - నిర్మలమైన యశస్సు.

## ष

**षट्रस भोजन** - షడ్రసోపేత భోజనము.

**षडयंत्र रचना** - కుట్రపన్నుట.

**षडराग करना** - గడబిడ చేయుట.

## स

**सँकरा जीवन** - విషాదమయ జీవితము.

**संख बजाना** - ఏడ్చుట; శంఖము పూరించుట.

**संग डोलना** - వెంటవెంట తిరుగుట.

**संगत करना** - సాంగత్యములోనుండుట.

**संग दिल होना** - నిష్ఠురమగుట; కఠోరమగుట.

**संसार की हवा लगना** - ప్రపంచానుభవము కలుగుట; వ్యవహారచాతుర్యము కలుగుట.

**सखुन डालना** - అడుగుట; యాచించుట.

**सख्ती करना** - నిర్దయగా వ్యవహరించుట; కఠోరముగా వ్యవహరించుట.

**सगाई करना** - పెళ్ళిచేసుకొనుట; స్నేహము చేసికొనుట.

**सटक्का मारना** - వేగముగా వెళ్ళిపోవుట; గబగబా మాట్లాడుట.

**सट्टा-बट्टा लगाना** - పని సరంజామ ఏర్పరచుకొనుట.

**सट्टी मचाना** - గంభా చేయుట.

**सठिया जाना** - బుద్ధిమందగించుట; అరువది సంవత్సరములు దాటుట.

**सडक नापना**-పనిలేని తిరుగుడు తిరుగుట.

**सत निकल जाना** - సత్తువలేకపోవుట.

**सतपर रहना** - పాతివ్రత్యముతో ఉండుట; తనమాట ప్రకారముండుట.

**सत्तर चूहे खाए होना** - మంచి-చెడు అన్నిరకముల పనులు చేసి యుండుట.

**सत्ता चलना** - అధికారము చలామణి అగుట.

**सत्तू घोलना** - అక్కరకురాని పని చేయుట.

**सत्तू बाँधके पीछे पडना** - దృఢసంకల్పముతో వెంటాడుట.

**सत्यानाश करना** - సర్వనాశము చేయుట.

**सदा देना** - బిచ్చమడుగుట; బిచ్చమెత్తుట.

**सनसना जाना** - భీతినొందుట; భయముతో నిశ్చేష్టమగుట.

**सनीचर आना** - చెడు సమయము వచ్చుట; విపత్తు సంభవించుట.

**सन्नाटा खींचना** - నిశ్శబ్దముగానుండుట; మౌనము వహించుట.

**सन्नेटे में आ जाना** - ఆశ్చర్యమునొందుట; కలతచెందుట.

**सपर जाना** - మరణించుట.

**सपाटा मारना** - ఉరుకులు పరుగులు తీయుట; వ్యాయామము చేయుట.

**सफाई करना या कर देना** - విస్పష్టపరచుట; ధ్వంసము చేయుట.

**सफाई देना** - సంజాయిషీ ఇచ్చుట.

**सफेद बालों की लाज रखना** - వృద్ధాప్యమును గౌరవించియుండుట.

**सबक देना** - ఉపదేశించుట; జ్ఞాపకముంచుకొనుటకు పాఠము ఇచ్చుట.

**सबक पढाना** - ప్రేరేపించుట; దారిమళ్ళించుట; నేర్పుట; చదువు చెప్పుట.

**सब नौबत होना** - దుర్దశాగ్రస్తమగుట.

**सबील पिलाना** - ఏమీతీసుకోకుండా త్రాగు నీరు ఇచ్చుట; ముహరము నెలలో పాలు శరబత్తు త్రాగుటకు ఇచ్చుట.

**सब्ज कदम होना** - నిక్షేపరాయుడిపాదమగుట; దుశ్శకునమగుట.

**सब्ज बाग दिखाना** - వట్టి వట్టి ఆశ కలిగించుట; దగా చేయుట; ధైర్యము చెప్పుట.

**सब्ज होना** - సంతోషముతో ఉబ్బిపోవుట.

**सब्रकर बैठना** - ఓర్పుకొనియుండుట.

**समझ लेना** - పగతీర్చుకొనుట.

**समय आ जाना** - కాలము సమీపించుట; మృత్యువు దగ్గరపడుట.

**सरकार की मेहमानी खाना** - కైదు శిక్ష అనుభవించుట.

**सरनाम करना** - ప్రసిద్ధపరచుట.

**सरनाम होना** - ప్రసిద్ధినొందుట.

**सरसरी तौरपर नजर डालना** - పైపైన చూచుట.

**सराप का कुत्ता होना** - స్వార్థమిత్రుడగుట.

**सर्दी पडना** - చలివేయుట.

**सलाम कर के चल देना** - నమస్కారము చేసి వెళ్ళిపోవుట; దుఃఖముతో వెళ్ళిపోవుట.

**सलामती से** - కుశలముగా.

**सलाम बोलना** - పిలుచుట.

**सवा सोलह आना** - సంపూర్ణముగా; తక్కువలేకుండా.

**सस्ते छूटना** - కఠిన కార్యము సులువుగా నెరవేరుట.

**सही पडना** - సరిగా ఉండుట.

**साँच को आँच न होना** - నిజాయితీ మనిషికి ముప్పు ఉండకపోవుట.

**साँचे ढलना** - పోతపోసినట్లుగా; చాలా అందముగానుండుట.

**साँठ-गाँठ करना** - కుట్రపన్నుట.

**साँप के मुह की छछूँदर होना** - ఇరువైపుల స్థితి అనిష్టకారమగుట.

**साँप-छछूँदर की दशा होना** - సందిగ్ధ ములో పడుట.

**साँप साँप बात करना** - బహునెమ్మదిగా మాట్లాడుట.

**साँसा पडना** - విపత్తు సంభవించునని అనుమానము కలుగుట.

**साठे पर पाठे होना** - వార్ధక్యములో కూడ శక్తి వంచనలేకుండుట.

**सात घाटों का पानी पीना** - ప్రాపంచక అనుభవములో దిట్ట అగుట.

**सात-चौदह की सैर कराना** - జైలుకి పంపుట.

**सात-पाँच करना** - మోసగించుట; అను మానించుట.

**सात बार नौ त्यौहार होना** - రోజూ పండుగ - ఉత్సవము జరుగుట.

**साथ देना** - సాంగత్యము చేయుట.

**साथ सोकर मुँह छिपाना** - సాంగత్యముండి కూడ రహస్యము చెప్పకపోవుట.

**साफ करना या कर देना** - చంపివేయుట; పూర్తిగా తినివేయుట.

**साब का पडना** - పనికలుగుట.

**सामना करना** - ఎదిరించుట.

**साया डालना** - నీడ ఇచ్చుట; ఆశ్రయ మిచ్చుట; సహాయమిచ్చుట.

**सिक्का बैठना** - అధికారము స్థిరపడుట; ప్రభావము పడుట.

**सिट्टी-पिट्टी गुम होना** - భయమువలన స్పృహ తప్పుట.

**सितारा डूबना** - దురదృష్టము సంభవిం చుట.

**सिमट जाना** - సంకోచించుట; సిగ్గుపడుట.

**सिर आँखो पर** - సాదరముగా.

**सिर आसमान से लगना** - అతిగా గర్విం చుట.

**सिर ओढना** - బాధ్యత వహించుట.

**सिर करना** - నెత్తిన రుద్దుట; తలదువ్వు కొనుట.

**सिर की बला** - తగుగండము.

**सिर खपाना** - ఎక్కువగా ఆలోచించుట.

**सिर खाना** - విసిగించుట; కలతపెట్టుట.
**सिर चढना** - నెత్తికెక్కుట; కొంటెతనము చేయుట; బలి అగుట.
**सिर नपाना** - నమస్కరించుట; సిగ్గు జెందుట; ఓడించుట.
**सिर पडना** - నెత్తినపడుట; బాధ్యత పై పడుట.
**सिर पर कफन बाँधना** - ప్రాణత్యాగము నకు సిద్ధపడుట.
**सिर पर ठीकरा फोडना** - అపరాధిగా నిర్ణ యించబడుట.
**सिर पर सेहरा होना** - కీర్తి పొందుట.
**सिरपरस्ती करना** - రక్షించుట; కాపాడుట.
**सिर फिरना** - బుద్ధి భ్రష్టమగుట.
**सिर फेरना** - ప్రేమించుట; తిరస్కరిం చుట; సుముఖముగానుండకపోవుట.
**सिर मढना** - दे० सिर डालना.
**सिर माथे पर बैठाना** - అధికముగా (శ్రద్ధగా) సత్కరించుట.
**सिर मुडाते ओले पडना** - ఆరంభంలోనే పనిభంగపాటు కలుగుట.
**सिर सूँघना** - ఆశీర్వదించుట.
**सिर से तिनका उतारना** - ఉపకారమునకు బదులుగా ఉపకారము చేయుట.
**सिर से बला टालना** - గండము తొలగిం చుట; అయిష్టముగా పనిచేయుట.
**सिर हथेली पर लिए फिरना** - మృత్యు లెక్కపెట్టకపోవుట.
**सीधा करना** - దారికి తెచ్చుట.
**सीधा दिन** - శుభదినము.
**सीधा-साधा** - నిరాడంబరముగు.
**सीधी अँगुली धी निकालना** - సునాయ సముగా పనినెరవేర్చుట.
**सीना चौडा होना** - గర్వము కలుగుట.
**सीनाज़ेरी करना** - బలాత్కరించుట జబర్దస్తీ చేయుట.
**सुख में राते होना** - బాగుగా సుఖపడుట.
**सुध-बुध जाती रहना** - స్పృహలేకపోవుట
**सुध रखना** - జ్ఞాపకముంచుకొనుట.
**सुनहरा मौका** - అదునైన అవకాశము.
**सुनी-अनसुनी करना** - వినికూడ ఆపేక్ష ధ్యాసలేకుండుట.
**सुन्न हो जाना** - నిశ్చేష్టమగుట; నివ్వె పోవుట.
**सुबकियाँ लेना** - వెక్కివెక్కి ఏడ్చుట.
**सुबह का दीपक होना** - కళావిహీనమగుట.
**सुराग मिलना** - జాడతెలియుట.
**सुर्खरू होना** - యశస్వియగుట.
**सुर्खाब का पर लगा होना** - ఏదో విశేష ముండుట; విశేష విషయముండుట.

**सुलूक से रहना** - కలిసి మెలిసి యుండుట.

**सुस्त होना** - బలహీనమగుట; సోమరి యగుట.

**सुहाग उडना** - వైధవ్యము పొందుట.

**सूखी हँसी** - వట్టివట్టి నవ్వు.

**सूद-दर-सूद लेना** - చక్రవడ్డీపుచ్చుకొనుట.

**सूप भर** - చాటెడు; చాలా ఎక్కువ.

**सूरज को दीपक दिखाना** - బాగుగా ప్రసిద్ధి చెందిన వానిని పరిచయము చేయుట.

**सूरज पर थूकना ; सूरज पर धूल फेंकना** - నిర్దోషికి ఏదో దోషమాపాదించి అప్రతిష్ఠ పాలుచేయుట.

**सूरत करना** - ప్రయత్నించుట.

**सूरत दिखाना** - ఉపాయము చెప్పుట.

**सूली चढाना** - ఉరిశిక్ష వేయుట.

**सेंक-साँक करना** - శోగమాపించుట.

**सेंध लगाना** - కన్నము వేయుట.

**सेमर का फूल होना** - మోసగించు వస్తువు అగుట; భ్రమకలిగించు వస్తువు.

**सेर को सवासेर मिलना** - తనకంటె పెద్ద వాడు తటస్తపడుట; చిన్న ధూర్తునికి పెద్ద ధూర్తుడు తటస్థపడుట.

**सेहरा बँधना** - బాసిక కట్టబడుట; పెళ్ళి అగుట; విజయుడగుట.

**सैकडों घडेपानी पडना** - ఎక్కువగా సిగ్గు చెందుట.

**सैन करना** - సైగచేయుట.

**सोंठ की नास लेना ; सोंठ के लड्डू खाना** - మౌనము వహించుట.

**सोजरा करना** - వేశ్య సహవాసము చేయుట.

**सोने में सेहागा होना या हो जाना** - బహుమూల్య వస్తువుకు ఇంకా మెరుగు కలుగుట.

**सोलह आने ; सोलहों आने** - సంపూర్ణముగా.

**सौ बात की एक बात** - అసలు విషయము; సారాంశము.

**सौ-सौ चूहा खाकर बिल्ली का हज करने चलना** - మోసగించుట; ఆడంబరము చేయుట.

**स्याही आना** - వార్ధక్యము కలుగుట.

**स्यापा पडना** - మృత్యుశోకములో ఏడుస్తూ విలపించుట.

**स्वाँग करना** - ఇంకొకని వేషమువేయుట; అనుకరించుట; అభినయించుట.

**स्वाहा होना** - వినష్టమగుట.

## ह

**हंगामा मचाना** - గలభా చేయుట; గల్లంతు చేయుట.

**हँडा फोडना** - గుట్టురట్టు చేయుట.

**हँसी उडाना** - పరిహాసము చేయుట; వెక్కిరించుట.

**हँसी-ठठोली** - వేళాకోళము; వెక్కిరింత; వినోదము.

**हक अदा करना** - కర్తవ్యము పాటించుట.

**हक दबाना** - ఇతరుని అధికారము లేక సొత్తును భుక్తము చేసుకొనుట.

**हकीकत में** - నిజానికి.

**हक्का-बक्का रह जाना** - నివ్వెరపోవుట.

**हग मारना** - అతిగా భీతినొందుట.

**हजम कर के उकार तक न लेना** - ఇతరుల సొత్తును పూర్తిగా భుక్తము చేసికొనుట.

**हडप करना** - దొంగిలించి భుక్తము చేసి కొనుట.

**हत्थे चढना** - వశమగుట.

**हथकंडा** - తుంటరి యుక్తి.

**हथिया लेना** - భుక్తపరచుకొనుట.

**हथियार डाल देना** - ఓటమి అంగీకరించుట.

**हथेली का आँवला** - కరతలామలకము; సమగ్రముగా విశదమైన విషయము; సహజముగా ప్రాప్తించిన వస్తువు.

**हथेली खुजलाना** - అరచేయి దురద పెట్టుట; ఏదో లభించునని శుభ శకునము కలుగుట.

**हथेली पर जान रखना** - ప్రాణములన లక్ష్యపెట్టకపోవుట.

**हबर-हबर करना** - త్వరత్వరగా బొక్కుట.

**हमराह होना** - సహయాత్రియగుట.

**हरताल फिर जाना** - పాడైపోవుట; వినష్టమగుట.

**हरदी-चूने-सा एक रंग हो जाना** - ఏ తేడా లేకుండుట.

**हरफ आना** - దోషము కలుగుట.

**हरा हो जाना** - తాజా అగుట; కోలుకొనుట.

**हलका करना** - అగౌరవపరచుట.

**हलका लहू होना** - నెత్తురు చూడగానే మూర్ఛనొందుట.

**हलवा निकालना** - చితకబాదుట.

**हलाकाग होना** - కలతజెందుట; విసుగు నొందుట.

**हलाल का** - న్యాయసంగతముగా ప్రాప్తించిన.

**हल्दी लगाकर बैठना** - సోమరిగా ఉండుట; గర్వముతో మిడిసిపడుట.

**हवस पकाना** - వ్యర్థకోరిక కోరుట.

**हवाई खबर** - గాలివార్త; పుకారు.

**हवा के बबूले फोडना** - గాలిలో మేడలు కట్టుట.

**हवा खाना** - వృథాగా వచ్చుట; వాయుసేవన నిమిత్తము తిరుగుట.

**हवाइयाँ उड़ना या उड़ाना** - ముఖము వాలి పోవుట; కళావిహీనముగుట.

**हवाई किला बनाना** - గాలిమేడలు కట్టుట.

**हवा बिगड़ना** -కాలములో మార్పువచ్చుట; వాతావరణము చెడిపోవుట.

**हवा लगना** - సాంగత్య ప్రభావము పడుట.

**हवाले करना**- అప్పగించుట; ఇచ్చివేయుట.

**हवास गुम होना** - స్పృహలేకపోవుట.

**हवासे बातें करना** - వేగముగా నడచుట.

**हाँडी में कालिख लगना** - భోజన వసతులతో సుఖముగానుండుట.

**'हाँ' में 'हाँ' करना** - ముఖస్తుతి చేయుట.

**हाथ आना** - లభించుట.

**हाथ उठाकर देना**-సంతోషముతో ఇచ్చుట.

**हाथ ऊँचा होना** - అదృష్టవంతుడగుట.

**हाथ कंगन को आरसी क्या होना ?** - ప్రత్యక్షముగానున్న దానిని ప్రమాణమేమిటి ?

**हाथ कमर पर रखना** - బాగా బలహీన పడుట.

**हाथ की कठपुतली होना** - పూర్తిగా వశములోనున్న.

**हाथ की मैल होना** - తుచ్ఛమైన వస్తువగుట.

**हाथ के ऊपर हाथ धरे बैठना** - సోమరిగా ఉండిపోవుట.

**हाथ छोटा होना** - పీనాసియగుట.

**हाथ झाड़कर चल देना** - చేతులు దులుపుకొని వెళ్ళిపోవుట - అంతా వదలిపెట్టి వెళ్ళిపోవుట.

**हाथ धो बैठना** - పోగొట్టుకొనుట.

**हाथ पर सरसों जमाना** - తొందరపడుట.

**हाथ पसारना** - యాచించుట.

**हाथ पसारे जाना** - మరణించుట.

**हाथ -पाँव फूलना** - చేతులు - కాళ్ళు ఉబ్బుట - గాబరాపడుట.

**हाथ बटाना** - సాయము చేయుట.

**हाथ बटोरना** - మితముగా ఖర్చు చేయుట.

**हाथ मलना** - విచారించుట; పశ్చాత్తాపడుట.

**हाथ में हाथ देना** - పెళ్ళిచేసికొనుట.

**हाथ रंगना** - లంచము పుచ్చుకొనుట.

**हाथ रोकना** - అతిగా ఖర్చుచేయుట; దెబ్బ నుండి రక్షించుకొనుట.

**हाथ लगाना** - మొదలుపెట్టుట; సాధించుట.

**हाथ साफ करना** - కష్టపెట్టుట; దొంగిలించుట.

**हाथ सैला होना** - దగ్గర డబ్బు ఉండుట.

**हाथ हिलाते आना** - చేతులూపుకుంటూ వచ్చుట; వట్టిచేతులతో వచ్చుట; అసాఫల్యముతో వచ్చుట.

**हाथी के खाए कैथ होना** - కరిభుక్త కపిత్థ మగుట; కరిమింగినవెలగపండు.

**हाथी पाँव पाना** - కఠినమైన శిక్షపొందుట.

**हाथों बिक जाना** - పూర్తిగా వశమగుట.

**हाथों - हाथ लेना** - ప్రేమించుట; ఎక్కువగా ఆదర సత్కారములు చేయుట.

**हामी भरना**-'అవు' నుట; అంగీకరించుట.

**हारिलकी लकडी होना** - ఆధారమగుట.

**हाल-बेहाल होना** - మంచిస్థితి చెడుస్థితిగా మారుట; చావుకి దగ్గరపడుట.

**हासिल होना** - లభించుట.

**हिचकी बँध जाना** - ఎక్కిలిమీద ఎక్కిలి వచ్చుట.

**हिजो करना** - దోషము ఎత్తిచూపుట.

**हियाव खुलना** - భయము పోవుట.

**हिरन हो जाना** - అదృశ్యమగుట; పారిపోవుట.

**हिल-मिल जाना** - కలిసిమెలియుట.

**हिसाब बैठना** - లెక్కసరిపోవుట; వీలుకలుగుట; నిశ్చయమగుట.

**हीरा खाना** - వజ్రము మ్రింగి (తిని) ప్రాణము త్యజించుట.

**हीरे का टुकडा** - బహుగుణవంతుడు - శీలవంతుడు.

**हीला - हवला करना** - టాలాటోలీ చేయుట.

**हुक्का-पानी बन्द करना** - జాతినుంచి బహిష్కరించుట.

**हुज्जत करना** - వితండవాదము చేయుట.

**हूँ न रह जाना** - అహంకారము నశించుట.

**'हूँ' से 'तू' करना** - తిరస్కరించుట; ఇష్టానికి భిన్నముగా సంచరించుట; కోపగించుట.

**हूर की बच्ची** - చాలా అందమైన పిల్ల.

**हृदय का काँटा निकलना** - దుర్భావము తొలగుట.

**हृदय से बोझ हटना** - చింతతొలగిపోవుట.

**हेकडी करना** - గీరపోవుట.

**हेकडी किरकिरी होना** - గీరవీగిపోవుట.

**हेकडी दिखाना** - డబాయించుట; భయపెట్టుట.

**हेठी होना** - అగౌరవమగుట; అవమానపడుట.

**हैसियत रखना** - హోదాచూపించుట; హోదాచూపుట.

**होंठ चबाना** - కోపగించుట.

**होंठों में मुस्कराना** - కించిత్తు మందహాసము చేయుట.

**हो पडना** - పోట్లాట - కొట్లాట జరుగుట.

**होड बाँधना** - పోటీపడుట.

**होम करते हाथ जलना** - మంచి పనికిచెడు ఫలితము లభించుట.

**होली करना** - వినష్టపరచుట; మంట పెట్టుట.

**होश उडना ; होश काफिर होना** - ఆశ్చ ర్యము కలుగుట; భీతినొందుట.

**होश दंग रह जाना ; होश दंग होना** - ఆశ్చర్య చకితమగుట.

**हो-हल्ला मचाना** -కోలాహలము చేయుట; గడబిడ చేయుట.

**हौआ होना** - బూచి అగుట.

**हौल आना** - భయపడుట.

**हौल दिल होना** - గాబరాపడుట.

**हौस बुझाना** - కోరిక తీర్చుకొనుట.

**हौसला निकालना** - కోరిక సాధించుట.

**हौसला होना** - ఆవేశము, కోరిక కలుగుట.

**हौरा – सौरा** - జగడము - జంజాటము.

# लोकोक्तियाँ – లోకోక్తులు - సామెతలు

## अ

**अंडा कोई सेवा, बच्चा कोई लेवे** - సొమ్ము ఒకడిది, సోకు ఒకడిది.

**अंत बुरे का बुरा** - చెడ్డవాని అంతం చెడ్డగానే ఉంటుంది.

**अंत लोभी महा दु:खी**-లోభము ఎక్కువైన కొద్దీ దుఃఖము కూడ ఎక్కువ అవు తుంది.

**अंधा क्या चाहे दो आँखें** - లేనిది, కావలసి నది కోరడం సహజం.

**अंधा बांटे खेडी फिर फिर अपने को दे** - వివేకహీనునికి పక్షపాతము ఉండడం సహజం.

**अंधा हादी बहरा मुर्शिद** - గురువు గుడ్డి, శిష్యుడు చెవిటి, దొందూ దొందే.

**अंधी आँख में काजल सोहे, लंगडे पाँव में जूता** - గుడ్డి కంటికి కాటుక, కుంటి కాలుకి బూటు, రెండూ విడ్డూరమే.

**अंधी पीसे, कुत्ता खाय** - అయోగ్యుని శ్రమ వృధా.

**अंधे आगे रोना, अपने दीदे खोना** - చెవిటి వాని ఎదుట శంఖము ఊదినట్లు.

**अंधे की जोरू का राग रखवाला** - నిస్సహా యునికి రక్షకుడు భగవంతుడే.

**अंधे की बीबी देवर रखवाला** - అనుప యుక్తమైన వ్యక్తికి పని అప్పగించిన పొర పాటు సంభమువచ్చు, గుడ్డివాని భార్యకు కాపలా మరిది.

**अंधे के आगे हीरा कंकड समान** - మూర్ఖునికి గుణము, అవగుణము అంతా సమానమే.

**अंधेके हाथ बटेर** - గుడ్డివాని చేతి అమూల్య వస్తువుకి విలువ లేదు.

**अंधे गाँव में काना राजा** - ఏ చెట్టులేని చోట ఆముదము చెట్టే మహా వృక్షము.

**अंधेर नगरी चौपट राजा; टेके सेर भाजी टके सेर खाजा** - దుశ్శాసుని రాజ్యములో గుఱ్ఱము - గాడిద సమానము.

**अंधों में काना राजा** - గుడ్డిలో మెల్ల; ఆముదము చెట్టే మహా వృక్షము.

**अकल उधारी ना मिलै हेत न हाट बिकाय** - బుద్ధి అప్పుకి దొరకదు, ప్రేమ బజారులో దొరకదు.

**अकल बडी या नकल** - బుద్ధి మంచిదా, నకలు మంచిదా? ఇతరులను అనుకరించడం కంటె తన బుద్ధితో పని చెయ్యడమే మెరుగు.

**अकल मंद को इशारा काफी** - చురుకైనవాడు సంకేతాన్ని బట్టే అర్థం చేసుకుంటాడు.

**अकेला चना भाड नहीं फोडता** - ఒంటరి మనిషి ఏమీ చెయ్యలేడు.

**अकेला बैल किस काम का** - ఒంటరి మనిషి ఏమీ చెయ్యలేడు.

**अकेली गई मैदान, लोग कहें भाग गई** - స్త్రీ బహిర్భూమికి వెడితే లేచిపోయిందంటారు.

**अकल की कोताही है, और सब कुछ है** - బుద్ధిలోటు తప్పమిగతాదంతా ఉంది.

**अकलमंद को इशारा, मूर्ख को तमाचा** - తెలివైన వానికి సంకేతము, మూర్ఖునికి చెంపకాయ.

**अकल बिरासत में नहीं मिलती** - బుద్ధి వారసత్వముగా లభించదు.

**अगहन में चूहे सात जोरू रखते हैं** - మార్గశిరమాసములో తిండికి లోటుండదు.

**अच्छा करो अच्छा पाओ** - మంచి పనికి మంచి ఫలితము లభిస్తుంది.

**अच्छे आदमी को एक बात और अच्छे घोडे को एक चाबुक** - మనిషికి ఒక మాట, పశువుకి ఒక దెబ్బ.

**अति परिचय ते होत सदा अनादर भाय** - కొత్తకు వింత పాతకు రోత.

**अदालत में जीता सो हारा, हारा सो मरा** - వ్యాజ్యములో గెలిచిన ఓడినట్లే, ఓడితే చచ్చినట్లే.

**अधजल गगरी छलकत जाए** - మిడిమిడి జ్ఞానము మిడిసిపడుతుంది.

अधिक जोगी मठ उजाड - సన్యాసుల సంఖ్య పెరిగితే మఠానికి చేటు.

अनपढ घोडे चढते है, पढे भीख माँगते है - చదువులేనివాడు ధనముతో తుల తూగుతుంటాడు, చదువుకున్నవాడు ముష్టి ఎత్తుకుంటాడు.

अनहोनी होती नहीं, होती होवनहार - జరగనిది జరగదు, జరగవలసింది జరుగు తుంది.

अपना अपना, पराया पराया - తనవాళ్ళు తనవాళ్ళు, పరాయి వాళ్ళు పరాయి వాళ్ళే.

अपना उल्लू कहीं नहीं गया - తన స్వార్థము కూడానే ఉంటుంది.

अपना नींगार, पराया दींगर ; अपना मीठा दूसरे का तीता - తన వస్తువు ఎప్పుడూ మంచి, ఎదుటవాని వస్తువు చెడ్డ.

अपना सोना अच्छा, तो सोनार क्या करेगा ? - మన బంగారము మంచిదైతే కంసాలి ఏంచేస్తాడు ?

अपनी अपनी डफली अपना अपना राग - ఎవరికివారే యమునాతీరే.

अपनी कुटिया घी की पुडिया - తన ఇల్లు స్వర్గము.

अपनी गरज को लोग गधा चराते हैं - వసుదేవుడు గాడిదకాళ్ళు పట్టుకున్నట్లు.

अपनी गली में कुत्ता भी शेर - స్థానబలిమి మహాబలిమి.

अपनी जान सबको गारी - తన ప్రాణము మీద తన తీపి.

अपनी नींद सोए, अपनी नींद उठे - తన ఇష్టానుసారము ఉండుట.

अपनी फूली न देखे, दूसरे का देंदर देखे - తన దోషముమీద చూపులేదు, ఇతరుల దోషాలమీదే చూపు.

अपनी बेटी सोना, दूसरे की नोना - తన వస్తువు బంగారం, ఇతరులది మట్టి.

अपने घर में दीया पहले, मन्दिर में बाद में - తన ఇల్లు చూచుకున్న తరువాత లోకము.

अपने दही को कोई खट्टा नहीं कहता - తన వస్తువుకి ఎవరూ వంకలు పెట్టరు.

अबरा की भैंस बियाय, सारा गाँव मेटिया लेके दौडे-వెర్రివాని పెళ్ళాము వాడంత టికి వదిన.

अबसर पर हाथ आए सो ही हथियार - అదనుకు అందిందే ఆయుధము.

## आ

आँख का अंधा, नाम नैनसुख - కళ్ళులేని వానిపేరు సునేత్రుడు.

आँख में किरकिरी नहीं सही जाती - కంటి

లోని నలుసు కలిగించుబాధ ఇంతంత కాదు; అడ్డుపడు శత్రువుని అంతము చేయువరకు నిద్ర పట్టదు.

**आग और काल कुछ नही छोडते** - నిప్పు, మృత్యువు దేనిని మిగిల్చవు.

**आगे कुआँ पीछे खाई** - ముందు నుయ్యి వెనుక గొయ్యి.

**आज सास की तो कल बहूकी** - ఇవ్వాళ అత్త పెత్తనమైతే రేపు కోడలి పెత్తనము.

**आटे के साथ घुन भी पिसता है** - చెడు సాంగత్యంలో నిర్దోషికి కూడ చేటు.

**आटे दाल का भाव** - సంసార చింత.

**आदमी इज्जत बिन कौडी का** - గౌరవము లేని మనిషి వ్యర్థము.

**आदमी को सौ माफ, औरत को एक नहीं** - మగవానికి ఎన్నిదోషాలు ఉన్నా పరవాలేదు, ఆడదానికి ఏ దోషము ఉండ కూడదు.

**आदमी होना बहुत मुश्किल है** - మనిషిగా నిలవడం బహు కష్టం.

**आफत यार परेखिए** - విపత్తు స్నేహితుని పరిక్షిస్తుంది.

**आम के आम गुठलियों के दाम** - రెట్టింపు లాభము కలుగుట.

**आलसी सदा रोगी**-సోమరికి ఎప్పుడూ జబ్బే.

## इ

**इन तिलों तेल नहीं निकलता**- పీనాసులు, దగాకోర్లు ఎందుకూ ఉపయోగపడరు.

**इराकी पर जोर न चला, गधी के कान उमेठे** - అత్తమీది కోపము దుత్తమీద తీర్చుకోవడం.

**इश्क अन्धा है** - ప్రేమ గుడ్డిది.

**इस कान सुनी, उस कान उडाई** - ఈ చెవితో విని ఆ చెవితో వదలి వేయుట.

**इस के पेट में दाढी है** - పిన్న వయస్సులోనే తెలివితేటలు అధికం.

**इहाँ कुम्हाड बतिया कोउ नाहीं** - ఇక్కడ బెదిరిపోయేవాళ్ళెవరూ లేరు.

## ई

**ईंट से ईंट बज गई**- భయంకరమైన యుద్ధము జరుగుట.

**ईगुर हो रहा/रही है** - బాగా బలిసి ఆరోగ్య ముగా ఉండుట.

**ईद के चाँद हो गाए** - త్వరగా కనిపించక పోవుట; అరుదుగా కనిపించుట.

**ईद पीछे टर, बरात पीचे धौंसा** - సంద ర్భము అయిపోయిన తరువాత ఏమైనా చెయ్యడము వృథా.

**ईसानी बिसानी** - ఈశాన్య దిశలో మెరుపు మెరిస్తే పంటలు బాగుగా ఉంటాయి.

## उ

उँगली-उँगली से कलाई भारी होती है - ఐకమత్యమే బలము.

उंगली पकडते पहुँचा पकडा - కాస్త ఆధారముదొరకగానే నెత్తికెక్కుట.

ऊँची दूकान, फीका पकवान - పేరు గొప్ప ఊరు దిబ్బ.

उकताने से गूलर नहीं पकते - తొందరపడితే పనులు కావు.

उखली में सिर दिया तो मूसलों से क्या डरना - సంకటాన్ని ఎదుర్కొనుటకు సిద్ధమైనప్పుడు భయము ఏల ?

उजडे गाँव में अरंड ही पेड - ఏ చెట్టులేని చోట ఆముదము చెట్టే మహావృక్షము.

उजबक की भैंस ब्याए, सारा गाँव दूध को धाए - వెర్రివాడి పెళ్ళాము వాడంతటికి వదిన.

उजला-उजला सभी दूध नहीं होता - తెల్లగా నున్నవన్నీ పాలు కావు.

उजाला हुआ और अंधेरा गया - మంచి రోజులు రాగానే కష్టాలన్నీ పోయినాయి.

उठाऊ का माल बटाऊ में जाए - ఊరకే వచ్చిన సొత్తు వృధాగా ఖర్చు అవుతుంది.

उडती चिडिया परखते है - బుద్ధిమంతులు ముఖం చూసి గుణాన్ని గ్రహిస్తారు.

उतने पाँव पसारिए जितनी चादर होए - శక్తికి మించి పోరాదు.

उतावला बावला - తొందరపాటు మనిషి - పిచ్చివాడు.

उद्योग नसीब का मूल है - ప్రయత్నము - కార్యశీలత అదృష్టానికి మారుపేరు.

उधार घर की हार - అప్పు కొంపకి చేటు.

उधार दो और बैर पालो - అప్పు ఇచ్చి విరోధము తెచ్చుకోవడం.

उधार स्नेह की कैंची है - అప్పు స్నేహానికి చేటు.

उनके पेशाब में चिराग जलता है - వాడి ఉచ్చ దివిటీగా వెలుగుతోంది.

उपदेश की अपेक्षा दृष्टान्त अच्छा - ఉపదేశముకంటె దృష్టాంతము మెరుగు.

उलटा चोर कोतवाल को डाँटे - తప్పుచేసి న్యాయాన్ని బెదిరించుట.

उलटी टाँग गले पडी - మంచికి పోతే చెడు ఎదురైంది.

उल्लू न देखे तो सूर्यका क्या दोष - గుడ్లగూబ చూడకపోతే సూర్యునికి వచ్చిన లోటు ఏమిటి ?

ऊँघ न देखे टूटी खाट, प्यास न देखे धोबी घाट - నిద్ర సుఖమెరగదు, ఆకలి రుచి ఎరగదు.

ऊँच निवास नीच करतूती - చూడబోతే గొప్పవాళ్ళు, చేసేవి పాడు పనులు.

ऊँचा फाटक ऊँची सान, करज मांग खाय बारहों मास - నియోగి ముష్టికి బనారసు సంచి.

ऊँचे से गिरा संभल सकता है, नजरों से गिरा नहीं सँभलता - పోయిన ఆస్తిని మరల సంపాదించుకోవచ్చు, కాని ప్రతిష్ఠ పోతే కోలుకోవడం సంభవం కాదు.

ऊँट किस करवट बैठता है - సుఖమువైపే చూపు.

ऊँट के मुँह में जीरा - వాములు తినే స్వాములకు పచ్చిగడ్డి ఫలహారమా!

ऊँट के विवाह में गधा गवैया - తొంటి చెయ్యి - లొట్టకన్ను, దొందూ దొందే.

ऊँट को ऊँट ही चूमता है - పెద్దవాళ్ళని పెద్దవాళ్ళే గౌరవిస్తారు; పండితుణ్ణి పండితుడే సత్కరిస్తాడు.

ऊधो को लेना न माधो को देना - ఇచ్చిపుచ్చుకోవటాలు బొత్తిగా లేకపోవుట, ఏ విధమైన సంబంధము లేకపోవుట.

ऊपर राम राम, भीतर कसाई काम - తేనెపూసిన కత్తి.

## ए

एक अंडा वह भी गंदा - ఒకే కుమారుడు; కాని పనికిమాలినవాడు.

एक अकेला, दो से ग्यारह - సంఘములోనే శక్తి.

एक अनार सौ बीमार - ఉన్నది ఒకే ఒకటి కోరువాళ్ళు అనంతం.

एक आँख आँख नहीं एक पूत पूत नहीं - ఒకే ఒక సంతానము కారణంగా అనర్థము జరుగు అవకాశము మెండు.

एक कहो और दस सुनो - ఒకటి అని పది పడుట.

एक कान से दु कान, दु कान से बियाबान - ఒక చెవిని పడితే రహస్యము వీధిని పడుతుంది, ఇద్దరికి తెలిస్తే సర్వనాశము.

एक चना भाड नहीं फोड सकता - ఏకాకి వల్ల ఏమీ కాదు.

एक तंदुरुस्ती हजार नियामत - ఆరోగ్యమే మహాభాగ్యము.

एक तो कडुवी लौकी दूसरे नीम चढी ; एक तो करेला कडवा, दूसरे नीम चढा - అసలే కోతి పైగా కల్లు తాగింది.

एक तो चुडैल, दूसरे चढा भूत - అసలే రాక్షసి అందులో ప్రేతసాంగత్యము.

एक थैली के चट्टे-बट्टे - ఒకే విధమగు స్వభావము గలవారు.

एक देश का बगला दूसरे में बकलोल

ఒక ఊరికాపు మరియొక ఊరికి వెట్టి.

एक नींबू मनों दूध फाड देता है - తులసి వనములో గంజాయి మొక్క.

एक पंथ दो काज - ఒక దెబ్బకు రెండు పిట్టలు.

एक परहेज लाख दवा - పథ్యము వెయ్యి ఔషధములకు సమానము.

एक बाना, एक निशाना ; एक निसाना एक ही बान - ఒకే మాట, ఒకే లక్ష్యం.

एक मुर्गी दो जगह जबह - ఒకే వ్యక్తి బహు ప్రదేశములలో పని చేయజాలడు.

एक म्यान में दो तलवारें नहीं रहतीं - ఒకే వస్తువు మీద ఇద్దరి అధికారము ఉండదు.

## ओ

ओट के पेट में बात नहीं पचती - నీచవ్యక్తి రహస్యాన్ని దాచలేడు.

ओल में से निकल कर चूल में पडना - చిన్న గండంలోంచి బయట పడి పెద్ద గండంలో చిక్కుకొనుట.

## औ

औंधा खाय लौंडा - తెలివి తక్కువవాడు మోసపోతాడు; శక్తిని మించిన పనిచేయబూనువాడు భంగపడతాడు.

औघट चले न चौपट गिरे - చెడుపని చేయనివానికి చెడు అంటదు.

औरत और ककडी की बेल जल्दी बढती है- స్త్రీ, దోసతీగ త్వరగా పెరుగుతాయి.

औरत का खसम मरद, और मरद का खसम रोजगार - ఉద్యోగము లేని పురుషుడు భర్తలేని స్త్రీ దశ ఒకే మాదిరిగా ఉంటుంది.

औरत की जात बेवफा होती है - స్త్రీ జాతి కృతఘ్నజాతి.

औरों का घी न माँ की बात - ప్రేమ, సేవలో తల్లి తరువాతే ఎవరైనా.

## क

कंजूस मक्खीचूस - బహు పీనాసి.

कंबल कंबल की गाँठ नहीं लगती - దుష్టుల మధ్యలో స్నేహము ఉండదు.

कचरे से कचरा बढे - కసువు పెరుగుతూనే వుంటుంది.

कच्ची हाँडी पर पडा दाग पकने पर भी नहीं मिटता - బాల్యావస్థలో పడ్డ అలవాట్లు పెద్దైన తరువాత కూడ పోవు.

कढी का-सा उबाल आया और चला गया - త్వరగా వచ్చే కోపము త్వరగానే పోతుంది.

कथनी से करनी बडी - చెప్పడంకంటె చెయ్యడం మెరుగు.

कद्दू के फूल - బహు సుకుమారమైన వ్యక్తి.

**कनक-कनक तें सौ गुनी मादकता अधिकाय** - డబ్బు తక్కువయితే మత్తెక్కించదు, డబ్బువలన అహంకారము కలుగుతుంది.

**कनखजूरे का एक पैर टूट जाए तो वह लंगडा नहीं होता** - కాళ్ళజెర్రికి ఒక కాలు విరిగినా కుంటి అనబడదు. బాగా ఉన్నవానికి కొద్ది నష్టము కలిగినా లెక్కలోనికి రాదు.

**कपडा पहने जाग भाता, खाना खाए मन भाता** - నలుగురికి నచ్చే వస్త్రములు ధరించాలి, మనస్సుకు నచ్చిన భోజనం చెయ్యాలి.

**कबहूँ बाँझ न जानई, तन प्रसूत की पीर** - గొడ్రాలుకి ఏం తెలుసు ప్రసవ పీడ.

**कबूतर अपने घर को पहचानता है** - ఆశ్రయదాత అందరికీ ఇష్టమే.

**कभी कागज की नाव भी चलती है** - మోసము, దగా ఎప్పుడూ పని చెయ్యవు.

**कभी गाडी गाव पर, कभी नाव गाडी पर** - బండిమీద బోటు, బోటు మీద బండి.

**कभी न होने की अपेक्षा विलम्ब से होना भला** - ఎప్పుడూ జరగకుండా ఉండే కంటే ఆలస్యముగా జరగడం మెరుగు.

**कभी लाख का कभी खाक का** - అవస్థ కనుసరించి వస్తువు ధరమారుతుంది.

**कमजोर की जोरू सब की भाभी** - బలహీనుని భార్య అందరికి వదిన.

**कमजोर को गुस्सा बहुत** - చేతకానివానికి కోపమెక్కువ.

**कमाई न धमाई माँग टीके जाई** - పని - పాటు లేని వానికి సింగారము ఎక్కువ.

**कमाए तो खसम, नहीं तो बेशरम** - సంపాద పరునికి విలువ ఉంటుంది. సోమరిని భార్య కూడ చీదరించుకుంటుంది.

**कमीने की दोस्ती जी का जंजाल** - నీచుని స్నేహము చేటు తెస్తుంది.

**करइ जो करम पाव फल सोई** - కర్మాను సారే ఫలము.

**कर का मनका छाँडि के, मनका मनका फेर** - ఆడంబరము వదిలి మనస్ఫూర్తిగా జపించు.

**करी बेगारी, हाथ न बिगाडी** - మనస్సు లగ్నము చేసి పనిసరిగా చెయ్యి.

**करे कल्लू, मरे उल्लू** - తప్పుచేసింది ఒకరు దండన అనుభవించినది వేరొకరు.

**कल का क्या भरोसा** - రేపు ఏం జరుగు తుందో ఎవరికి తెలుసు? భవిష్యత్తు మీద ఆధారపడవద్దు.

**कलयुगी जीव** - దుష్టజీవి.

**कलाल की दूकान पर पानी भी पीओ, तो शराब का गुमान** - తాటిచెట్టుక్రింద పాలుతాగినా కల్లే అనుకుంటారు.

**कल्ला चलै, सत्तर बला टलै** - భోజనం లభిస్తే అన్ని ఇబ్బందులు పోయినట్లే.

**कसाई का अनाज और पाडा खा जाए** - దుష్టవ్యక్తికి హానికలిగించే ధైర్యము ఎవరికి ఉండదు.

**कहना आसान है, पर करना मुश्किल** - చెప్పడం తేలిక చెయ్యడం కష్టము.

**कहने-कहने का अन्तर है** - ఒకే మాటని పలువిధాలుగా చెబితే అర్థం మారుతూ పోతుంది.

**कहने में मुलायम, टटोलने में कडी** - చూడడానికి అందముగానే ఉంది కాని వినియోగానికి పనికిరాదు.

**कहाँ राजा भोज, कहाँ गंगू तेली** - ఎంతమాత్రము పోలికలేదు.

**कहीं की बोली, कहीं की गाली** - ఒక ప్రదేశములో సాధారణముగా వాడబడు మాట ఇంకొక ప్రదేశములో తిట్టు.

**कहीं ठाकुर, कहीं माकुर** - ఒక ఊరి కాపు మరొక ఊరికివెట్టి.

**कहीं बबूल से भी बेर मिलते है?** - దుష్ట వ్యక్తివలన ఏ ప్రయోజనము సిద్ధించదు.

**काँख में लडका गाँव गुहार ; काँख में लडका शहर में ढिंढोरा** - చంకలో పిల్లవాడు, ఊరిలో చాటింపు.

**काँटा काँटे से निकलता है** - కంటకస్య కంటకము, ముల్లు ముల్లుతోనే వస్తుంది.

**काँटा निकल जाता है, कसक बनी रहती** - కష్టము తొలగిపోయిన తరువాత కూడ దాని దుఃఖం కొంతకాలము వరకు బాధిస్తుంది.

**काका कहने से ककडी नहीं मिलती** - వస్తువు పొందుటకు శ్రమించాలి, బాబాయి అంటే లభించదు.

**काका के हाथ की कुल्हाडी हल्की होती है** - ఇతరుల శ్రమను తక్కువగా అంచనా వేస్తాము.

**कागज की नाव आज न डूबी कल डूबी** - మోసము ఎల్లకాలము లాభించదు, మంచి పనికి చెడు ఫలితము లభించుట.

**काजी की कुतिया न जाने कहाँ बियाएगी** - పనికిమాలినవెధవ ఎక్కడ తిరుగుతున్నాడో !

**काजी के घर के चूहे भी सयाने** - శాసకుని లేక ధనవంతుని పిల్లలు బహు తెలివిగా ఉంటారు.

**काटने वाला कुत्ता भौंकता नहीं** - కరిచే కుక్క మొరగదు.

**कान पर जूँतक नहीं चलती**-ఎవరి మాటల యెడల ధ్యాసలేక పోవుట, నిశ్చింతగా ఉండుట.

**कानी को सराहे कानी की माँ** - కాకిపిల్ల కాకికి ముద్దు.

**कानी कौडी पास नहीं, नाम करोडीमाल** - దగ్గర చిల్లిగవ్వకూడలేదు, కాని పేరు కోటేశ్వరరావు.

**काने के ब्याह में अनेक आफत** - విఘ్నేశ్వరుని పెళ్ళికి అన్నీ విఘ్నాలే.

**काबू तो बाबू** - శక్తి సంపన్నునికి విలువ ఎక్కువ.

**काम न धंधा, मूसलचंद** - సోమరి తిండి పోతు.

**काम बनाने के मामा, मठा मिले की मौसी** - ఒడ్డు చేర్చేంతవరకు ఓడ మల్లయ్య, ఒడ్డుచేరిన తరువాత బోడి మల్లయ్య.

**काल को कौन रोक सकता है** - మృత్యువుని ఎవరూ ఆపలేరు.

**काली घटा डरावनी, धौली बरसनहार** - మొరిగేది కరవదు, గర్జించేది కరవదు.

**काली मुर्गी क्या सफेद अंडे नहीं देती** - చెడు నుంచి కూడ మంచి కలుగుతుంది.

**काले मुँह अंधेरे**-బహుపెందలకడ, తెల్లవార జామున.

**काहे को गूलर का पेट फडवाते हैं ?** - నన్ను ఇంకా ఎందుకు అడుగుతారు, ఇంకా చెబితే ఛండాలం బయట పడుతుంది.

**किला फतह कर आए** - సాధారణమైన పనిచేసి గొప్ప పనిచేసినట్లుగా బడాయి కొట్టుట.

**किसने अपनी माँ का दूध पीया है ?** - దమ్ము ఉన్నవాడిని బయటికి రమ్మను.

**किसने सुपारी भेजी थी** - ఆహ్వానము పంపుట.

**किस पर करूँ सिंगार पिया ही मोर आन्हर** -ఎవరికోసం సింగారము చెయ్యాలి, మొగుడు గుడ్డి ఇంకా సింగారమెందుకు?

**किसान चाहे वर्षा, कुम्हार चाहे सूखा** - అందరికి ఒకే వస్తువు ఉపయోగపడదు.

**किसी की नाक टेढी, किसी की आँख टेढी** - ఏ లోపము లేనివాడు దుర్లభము.

**किसी की मेहनत जाया नही जाती** - ఎవరి కష్టము (శ్రమ) వృథా అవదు.

**किसी के किये में घी धडे, किसी के किये में पत्थर पडे** - బలవంతునికి అంతటా

గౌరవము, దుర్బలుడు గొప్ప పనిచేసినా నింద తప్పదు.

**कसी ने यह भी नहीं पूछा कि तुम्हारे मुँह में कै दाँत हैं** - ఎవడూ కష్టములో సాయపడడు.

**कस्से में साग जल गया** - మాటల్లో పని పాడైపోతుంది.

**कीचड में पत्थर मारने से छींटे ही पड़ेंगे** - చెడ్డ పనికి చెడు ఫలితమే వస్తుంది.

**कीचड से कमल पैदा होता है** - దరిద్ర కుటుంబాలలో మంచివాళ్ళు, గొప్ప వాళ్ళు జనిస్తారు.

**कुआरी खाए रोटियाँ, ब्याहीं खाए बोटियाँ** - పెళ్ళికాని పిల్లకంటె పెళ్ళి అయిన పిల్ల తల్లిదండ్రులమీద ఎక్కువ భారము మోపుతుంది.

**कुआँ खोदते को खाता तैयार** - ఇతరుల కొరకు తీసిన గోతిలో తనే పడవచ్చు.

**कुएँ का मेंढक** - కూపస్థమండూకము; అనుభవహీనుడు.

**कुएँकी माटी कुएँ में** - దానివలన వచ్చిన ఆదాయాన్ని దానికొరకే ఖర్చు.

**कुकर प्रयाग जाएगा, तो हँडिया कौन चाटेगा** - దుష్టులు సత్కార్యాలు చేస్తే పాడు పనులు చేసేదెవరు ?

**कुचाल संग हाँसी, जीव जानकी फाँसी** - దుష్టులతో పరిహాసము ప్రాణాలకు ముప్పు.

**कुछ इन मूँछों के निभाओ** - తనగౌరవాన్ని కూడా కాపాడుకోవాలి, స్వార్థమే కాదు కావలసింది.

**कुछ खोकर ही अक्ल आती है** - తల బొప్పి కట్టిన తరువాతే మనిషికి తెలివి కలిగేది.

**कुछ दाल में काला है** - శంక కలుగుట, అనుమానము కలుగుట.

**कुतिया के सब एक से** - కుమ్మరావములో ఇత్తడి ముంతలుండవు.

**कुतिया चोर से मिल गई तो पहरा कौन दे?** - కంచే చేను మేస్తే రక్షించేది ఎవరు?

**कुत्ता भौंके हजार, हाथी चले बजार** - ఏనుగు వెడుతూంటే వీధిలో కుక్కలు మొరుగుతాయి.

**कुत्ता मुँह लगाने से सिर चढे** - నీచుడికి అలుసు ఇస్తే నెత్తికెక్కుతాడు.

**कुत्ते की दुम बारह वर्ष नलकी में रखी, तो भी टेडी की टेढी** - కుక్కతోకవంకర తీయడం సాధ్యపడదు, దుష్టుని ప్రవర్తన మార్చడం అసంభవం.

**कुत्ते के भी दिन लौटते हैं** - ప్రతివానికి

మంచి రోజులు వస్తాయి.

**कुत्ते को कपास, बंदर को नारियल -** పాత్రను చూచి వస్తువు ఇవ్వాలి.

**कुत्ते को घी नहीं पचता -** నీచుడు రహస్యాన్ని దాచలేడు; నీచుడు ధనాన్ని దాచడ మెరుగడు.

**कुत्ते ने आइना देखा तो भौंक भौंक कर पागल हो गया -** మూర్ఖుడు గాలితో తగువుపడతాడు.

**कुम्हार-कुम्हार को बरतन मोल नहीं देता -** కుమ్మరి కుమ్మరి దగ్గర డబ్బులు తీసుకోడు.

**कुरसी का अहमक -** మహా మూర్ఖుడు (కుర్సీ అయోధ్య ప్రాంతములోని ఒక చిన్న పట్టణము, ఇక్కడివారు కడు మూర్ఖులు అని ప్రతీతి).

**कुल्हाडी से कपडे धोना और करम को दोष देना -** చెడ్డపని చేసి ప్రారబ్ధాన్ని దూషించుట.

**कूडे के भी दिन फिरते है -** ప్రతివానికి ఎప్పుడో అప్పుడు మంచి రోజులు వస్తాయి.

**कूदो न कुआँ, खेलो न जुआ -** నూతి మీదగా దూకడం, జూదము ఆడడం మంచిది కాదు.

**कूबरे-लात बन गई-** హాని కలుగచేయడానికి వెళ్ళి లాభము కలిగించుట.

**केला काटने पर ही फलता है -** నీచుడు దెబ్బలతోనే కుదట పడతాడు.

**कोई न रहा बिन दाँत निपोरे -** కాలము మారుతుంది - ఎప్పుడూ ధనవంతులు గానే ఉండరు, దరిద్రులుగానే ఉండరు.

**कोई फिरे डाल-डाल, मैं फिरूँ पात-पात -** బుద్ధి చాతుర్యము వలన ఇతరుల రహస్యాలను పసిగట్టుట.

**कोई मरे कोई मल्हार गावे -** ఇతరుల విపత్తును చూచి సంతోషించుట.

**कोठी के साथ ही पाखाना भी बनता है -** మంచి చెడు - మంచివాళ్ళు, చెడ్డ వాళ్ళు అందరు కలిసే ఉంటారు.

**कोल्हू का बैल दिन भर चले, रहे वहीं का वहीं -** ఎప్పుడూ గొర్రె తోక బెత్తెడే.

**कौआ कोयल को काली कहे-** గురివింద గింజ తన దోషము గుర్తుంచుకోదు.

**कौन मारे हाथी, कौन उखाडे दाँत -** శ్రమించేది ఒకడు, ఫలితము పొందేది మరియొకడు.

**क्या उल्लू और क्या उल्लू का पट्टा -** అంతా ఒకే దుర్గుణములు గలవారే.

**क्या काबुल में गादहे नहीं होते -** మూర్ఖులు

అంటూ ఉంటారు. ఒక్కచోట ఎక్కువ మరియొకచోట తక్కువ ఇంతే తేడా.

**क्या धास में साँप नहीं चलता ?** - మంచి ప్రదేశాల్లో చెడు ఉండదా ?

**क्या भूख को बासन, क्या नींद को ओडन** - ఆకలి రుచి ఎరగదు - నిద్ర సుఖమెరగదు.

## ख

**खटि - खटि मरे बैलवा, बाँधे खाय तुरंग** - సొమ్ము ఒకరిది; సోకు మరియొకరిది.

**खट्टा खाने मिट्ठे को** - పుణ్యానికి పోతే పాపం ఎదురవుట.

**खल्क की जबान खुदा का नक्कारा** - ప్రజావాణి దేవుని చాటింపు.

**खांड की रोटी जहाँ भी तोडी मीठी ही मीठी** - మంచి వస్తువు, పని ఎప్పుడూ మంచిదే.

**खाए गाल, नहाए के बाल नहीं छिपते** - చేసినపని ముఖంలో ప్రస్ఫుటితమవుతుంది.

**खाने के दाँत और, दिखाने के और** - చెప్పేది ఒకటి, చేసేది మరియొకటి.

**खाने को ऊँट, कमाने को बकरी ; खाने को सेर कमाने को बकरी** - మెయ్య బోతే ఎడ్లలో దున్నబోతే దూడల్లో.

**खाय खसम का, गाय भाइयों का** - తినేది భర్త సొమ్ము పాగిడేది పుట్టింటి వారిని.

**खाय निबौरी दाख बतावे** - మింగబోతే మెతుకులేదు, మీసాలకు సంపెంగనూనె.

**खाया गिलहरी ने, पडा नेवले के सिर** - తప్పు చేసింది ఒకరు, శిక్ష అనుభవించేది మరియొకరు.

**खाला जी का घर नहीं है** - కష్టసాధ్యమైన పని.

**खिचडी का एक चावल देखते हैं** - కుటుంబములోని ఒక మనిషితో పరిచయము చాలు.

**खिसियानी बिल्ली खंभा नोचे** - సిగ్గుపడి కోపగించుట.

**खीर की थाली में लात मार दी** - తనకి తనే నష్టము కలిగించుకొనుట.

**खुद तो दूध देती नहीं दूसरों का भी गिरा देती है** - తను లాభము చెయ్యకపోగా ఇతరులను కూడ చెడగొట్టుట.

**खुदा गंजे को नाखून न दे** - దురాచారికి పెత్తనం లభించకూడదు.

**खुरपी के ब्याह में हँसुए का गीत** - తగ్గ పొంగత్యము.

खूँटे के बल बछडा कूदे - అండమాసుకుని నిక్కుట.

खैरात के टुखडे बाजार में डकार - మింగ బోతే మెతుకు లేదు మీసాలకు సంపెంగ నూనె.

खौलते पानी से घर नहीं जलते - వేడి నీళ్ళతో కొంపలు అంటుకోవు.

## ग

गंग जहाँ रंग - గంగ ఉన్నచోట ఆనందము.

गंगा गए गंगादास, जमुना गए जमुना दास- అవసరాన్ని అనుసరించి మారుట.

गंजी क्या जाने नाला का भाव- మూర్ఖ్యక్తి మంచి వస్తువులు లేక మంచి మనుష్యుల మహాత్మ్యము ఏ మెరుగు ?

गँवार की गाली, हँसी में टाली- మూర్ఖుని దుర్భాషలు గంభీరవముగా తీసుకో కూడదు.

गईजवानी पुनि नहिं लौट, लाख मलीदा खायँ - పోయిన యవ్వనము మళ్ళీ చస్తే లభించదు.

गई माँगने पूत को, खो आई भरतार - కొడుకుని అడగడానికి వెళ్ళి భర్తను పోగొట్టుకుంది.

गगरी अनाज है, जुलाहा राज है - సామాన్యుడు కొద్దిపాటి ధనం చూసుకునే విర్రవీగుతాడు.

गठिया खुला, बिटिया पारस - పురుష సంతానం కలిగితే స్త్రీకి గౌరవము పెరుగు తుంది.

गधा खिलाए पाप न पुन्न - మూర్ఖుని పోషించిన ప్రయోజనం శూన్యం.

गधों की बातें, गीदडों की लातें - మూర్ఖ ప్రలాపము.

गनेस के ब्याह में सौ जोखों - విఘ్నేశ్వరుని పెళ్ళికి అన్నీ విఘ్నాలే.

गरज का बावला अपनी गावे-స్వార్థపరుని ధ్యాస స్వార్థంమీదే.

गरजता बादल बरसता नहीं - మొరిగే కుక్కలు కరవవు, కోతలరాయుడి మాటలు వ్యర్థము.

गरीब की जोरू सब की भाभी ; गरीब की बहू सब की सरहज - పేదవాని భార్య ఊరందరికీ వదిన.

गले पडी ढोल की बजाए सिद्ध - నెత్తిన పడ్డ విపత్తుని అనుభవించాలిసిందే.

गाँठ का देना और लडाई मोल लेना - అప్పు ఇచ్చి తగాదా కొని తెచ్చుకొనుట.

गाँठ का पूरा अक्ल का अंधा - మూర్ఖ ధనవంతుడు.

गाँड पर नहीं लत्ता, पान खाएँ अलबत्ता

- ముడ్డిమీద గుడ్డలేదు తాంబూలం మటుక్కు కావాలి.

गाजे बाजे से आए हैं - కోలాహలంగా వచ్చారు.

गाडी का चक्कर, मेहरिया का मक्कर - స్త్రీమాయకు మొదలు-చివర ఉండదు.

गाना तो आता नहीं गाने का भाई आता - ఏడుపు వస్తోంది.

गाय गई साथ रस्सी भी ले गई - ఆవుతో పాటు పలుపుకూడ పోయింది. ఒక నష్టంతోపాటు మరియొక నష్టం.

गाय चरावें रावत, दूध पिए बिलैया - సంపాదించేది ఒకడు, అనుభవించేది మరియొకడు.

गाल वाला जीते चुप वाला हारे - బుకాయించేవాడు గెలిచాడు, నిజాయితీ పరుడు ఓడిపోయాడు.

गेनी गय में चोरी नहीं हो सकती - సర్దిన వస్తువులలో తక్కువ-ఎక్కువలు రావు.

गेरगिट का सा रंग बदलता है - మాట స్థిరం లేకపోవుట.

गेरी पहाड से रूठी भतार से - కొండ మీదినుంచి జారిపడి మొగుడిమీద కోపం చూపించుట.

गीत गाने से ही ब्याह नहीं होता - మాటలతో పనిజరగదు, పనికి శ్రమ, వ్యయము అవసరము.

गीदड ने हाथी को मार दिया - మొదలు-చివరలేని కోతలుకోయు వానియెడల వ్యంగ్యము.

गीली लकडी सीधी हो सकती है - చిన్నతనములో అయిన దురలవాట్లను మాన్పవచ్చును.

गुंडे चले बजार बिनौले ढंक रखियो - వేదాంతులు వస్తున్నారు చెంబూ, ముంతా లోపల పడవేయండి.

गुड खाएँ गुलगुले से परहेज करें - ఒక పాడుపని చేస్తూ దానికి సంబంధించిన ఇంకో పాడుపని చెయ్యకపోవడమేమిటి?

गुड न दे तो गुड की-सी बात तो करे - బెల్లం పెట్టకపోతే పెట్టకపోయారు, తియ్యని మాటన్నా వినిపించండి.

गुड पर मक्खियाँ पहुँच ही जाती हैं - బెల్లము ఉన్నచోట చీమలు వస్తాయి.

गुड बिन होय न चौथ, दुलहा बिन नहीं बरात - అతి ఆవశ్యకమైన వస్తువు లేకుండా పనిజరగదు - బెల్లం లేకుండా పండుగలేదు, పెళ్ళికొడుకు లేకుండా పెళ్ళి లేదు.

गुण ना हिरानो गुण ग्राहक हिरानो है -

గుణాన్నికాదు, గుణవంతుని గౌర వించు.

**गुदडी में भी लाल पैदा होते है** - దరిద్ర కుటుంబాలలో కూడమహా పురుషులు జన్మిస్తారు.

**गुप-चुप की मिठाई** - విన్నమాటను గుప్త ముగా ఉంచుట, గుప్తముగా ఆరగిం చుట.

**गुर-गुर विद्या, सिर सिर अकल** - అందరి తెలివి ఒకమాదిరిగా ఉండదు, వేరు వేరుగా ఉంటుంది.

**गुरू गुड रह गए, चेला चीनी होगए** - గురువుని మించిన శిష్యుడు.

**गुलाब भी जुकाम करे, देखो समय का फेर** - పరిస్థితులు మారినప్పుడు మంచి పనికి కూడ చెడు ఫలితము లభిస్తుంది.

**गुस्सा अपने को खाता है** - తన కోపమే తన శత్రువు.

**गूँगे गुड** - తన అనుభూతిని వ్యక్తము చేయ లేనివాడు.

**गूँगे में ईंटा फेंकी, न छींटा पडे** - అశుద్ధము మీద బెడ్డవేస్తే ముఖమంతా చిందుతుంది.

**गूलर के फूल हो गए** - అలభ్య వస్తువు.

**गेहूँ कहै सुनो हे वीर, मैं हूँ सब नाजन का मीर** - గోధుమ భోజనము సర్వశ్రేష్ఠ భోజనము.

**गेहूँ के साथ घुन पिसता है** - దుష్టుల సాంగత్యంలో సజ్జనులు కూడ కష్టాల పాలవుతారు.

**गेहूँ खेत में, बेटा पेट में, ब्याह की तैयारी** - ఆలిలేదు, చూలిలేదు, కొడుకు పేరు సోమలింగం.

**गैर के लिए कुआँ खोदेगा, तो आप ही गिरेगा** - తను తీసుకున్న గోతిలో తనే పడతాడు.

**गोद में लडका, गाँव में ढिंढोरा** - చంకలో పిల్లవాడు, ఊరిలో చాటింపు.

**गोबर गिरा तो कुछ लेकर ही उठेगा** - తెలివైనవాడు ఎక్కడికి వెళ్ళిన ఏదో ఒక కొత్త విషయాన్ని నేర్చుకుంటాడు.

**गोली का घाव भर जाता है, पर बोली का नहीं** - తుపాకి గాయము మాను తుంది కాని వాక్కు శూలాల గాయము మానదు.

## घ

**घडी में औलिया, घडी में भूत** - క్రోపిష్ఠి మనిషి యెడల వాడబడు ఉక్తి.

**घमंडी का सिर नीचा** - అహంకారి ఎప్పుడూ అవమానపడతాడు.

**घर का भेदी लंका ढाए** - అంతః కలహము

వినాశానికి దారి తీస్తుంది.

**घर की खाँड किरकिरी लागे, बाहर का गुड मीठा; घर की मुर्गी दाल बराबर** - పొరిగింటి పుల్లకూర రుచి.

**घर में चिराग जलाकर मस्जिद में जलाना चाहिए** - ఇంటగెలిచి రచ్చ గెలువు.

**घर में धान न पान, बीबी को बडा गुमान** - తినబోతే మెతుకులేదు, హోదా అపారం.

**घी खिचडी हो रहे हैं** - కలిసి మెలిసి ఉండుట.

## च

**चंगा है मगर नंगा** - సామర్థ్యము లేకపోలేదు కాని పీనాసి.

**चचा बनाके छोडूँगा** - మీ తెలివి సరిదిద్దు తాను.

**चटोरा खाय अपना घर बतोरा खाय पास पडोस** - తిండిపోతుగాడు తన ఇల్లు నాశనం చేసుకుంటాడు, వాగుడుగాడు ఇరుగు పొరుగుని నాశనం చేస్తాడు.

**चढ मार, गूलर पक्के** - అదనుచూచి లాభము పొందుట.

**चना और चुगल मुँह लगा बुरा** - శనగలు తింటానికి, కొండీగాలు వినడానికి బాగా ఉన్నా పర్యవసానంలో దుఃఖము అనుభవించాల్సి వస్తుంది.

**चमगीदडों के घर मेहमान आए, हम भी लटके तुम भी लटको** - సాంగత్యాను సారము వ్యవహరించాలి.

**चमडी भले ही जाए, पर दमडी न जाए** - ఆకలితో చచ్చినాసరే దమ్మిడీ కూడ ఖర్చు కాకూడదు పీనాసి యెడల చెప్పబడు ఉక్తి.

**चमार की छोकरी चंदन नाम** - పేరు గొప్ప ఊరు దిబ్బ.

**चल चकहे, मेरे मुँह मत लग** - నాతో ఎక్కువ మాట్లాడకుండా ముందు ఇక్కడనుంచి బయటికి నడు.

**चलता चरखा** - లౌకికుడు.

**चलती का नाम गाडी** - ఉపయోగపడినంత వరకే వస్తువు విలువ.

**चलती हवा से लडती है** - గయ్యాళి స్త్రీ.

**चलते चोर लंगोटी लाभ** - వచ్చినవాడి పెళ్ళికి వచ్చిందే కట్నము.

**चाँद को गहन लग गया** - మహా మనిషికి కళంకము కలిగింది; రూపసికి కురూపి భర్త లభించాడు.

**चाँदी का जूता सिर पर** - డబ్బుతో అన్ని పనులు సమకూరుతాయి.

**चापलूसी का मुँह काला** - ముఖస్తుతి పాడుపని.

**चाम के दाम** - కారుచౌక వస్తువు.

**चाम जाय पर दाम न जाय** - తొక్కపలచిన పరవాలేదు గాని పైసా పోకూడదు.

**चार चोर, चौरासी बनिए, एक एक करके लूटा** - ఐకమత్యమే బలము.

**चार दिन की चाँदनी, फिर अंधेरी रात** - మూణ్ణాళ్ళముచ్చట.

**चावल बेच कोदों ली, यह अक्ल तुझे किसने दी** - మణి ఇచ్చి మట్టి తీసుకోవడం.

**चाहे छुरी खरबुजे पर गिरे चाहे खर्बूजा छुरी पर** - అరిటాకు ముల్లు మీదపడ్డా, ముల్లు అరిటాకు మీద పడ్డా నష్టం అరిటాకుకే

**चिकनी चुपडी बातों से पेट नही भरता** - నేలమీద వ్రాసిన గార్లతో కడుపు నిండదు.

**चिडिया के मुँह में सोना** - గొప్పవాని ప్రతిమాటకు విలువ ఉంటుంది.

**चिराग गुली पगडी गायब** - అజాగ్రత్త వలన అంతా నష్టమే.

**चिराग जला दाँव गला** - జాగ్రత్తపడగానే దొంగలు, రౌడీలు అంతా పరారు.

**चिराग तले अँधेरा** - ఉపదేశానికి ఆచరణకు సంబంధము లేకపోవడం; చెప్పేది శ్రీరంగ నీతులు చేసేది పాడుపనులు.

**चींटी भी दबने पर काट खाती है** - ఎక్కువ పీడిస్తే పిల్లికూడ ఎదురు తిరుగుతుంది.

**चुटकी लो न बकोटा खाइये** - అవమానించబోయి అవమానపడడం.

**चुल्लू भर पानी में डूब मरो** - సిగ్గుపడేటట్లు చేయుట.

**चूतियों का माल यार खाएँ** - మూర్ఖుల సొత్తు చుట్టుపక్కాలు తింటారు.

**चूने के धोखे कपास न खा जाना** - ఇతరులను రెచ్చగొట్టే ప్రయత్నంలో జాగ్రత్తలో ఉండాలి.

**चूल्हे से निकला भट्ठी में पडा** - చిన్న ఆపదలోంచి తప్పుకొని పెద్ద ఆపదలో చిక్కుకొనుట.

**चूहे दंड पेल रहे है** - ఇంటిలో తినడానికి ఏమీ లేకపోవుట.

**चोंच दिया तो चारा भी देगा** - నారు పోసినవాడు నీరు కూడ పోస్తాడు.

**चोट दुश्मन की भी सराहनी चाहिए** - వీరత్వాన్ని ఎవరిదైనను, శత్రువుది అయినను పొగడవలసిందే.

**चोर और मोट कसकर बाँधना चाहिए** - దొంగని, మూటని గట్టిగా కట్టాలి.

**चोरी का माल चार पैसे सेट**- దొంగసొమ్ము కారు చౌక.

चोर का दिल सरसों बराबर - దొంగ పిరికివాండు; దొంగకి ధైర్యం ఆవగింజంత కూడ ఉండదు.

चोर का माल चांडाल खाए - అన్యాయార్జితము వంటబట్టదు.

चोर की दाढी में तिनका - అపరాధిని కనిపెట్టడానికి అపరాధే చాలు.

चोर को अंगागी मीठ - దొంగకి మందేమిస్తే కణము కూడ తియ్యగానే ఉంటుంది. దొంగకు తనచెడువనులను కూడ మంచిగానే ఉంటాయి.

चोर को भोर मिले - దొంగసొమ్ముకి భాగస్తులు అనేకం.

चोर चोर मौसरे भाई - ఒకే వృత్తివాళ్ళలో స్నేహము మెండు.

चोर ढोर का नहीं भरोसा - దొంగ, పశువుమీద నమ్మకం ఉండకూడదు.

चोरी और सीनाजोरी - ఒకవైపు దొంగతనము మరియొకవైపు దబాయింపు.

चौबे गए छब्बे होने दुब्बे ही रह गए - లాభానికిపోతే నష్టం ఎదురైంది.

चौराहे पर बैठे लडके और रास्ते में बैठे कुत्ते को कभी न छेडे - కుర్రాళ్ళకి కుక్కలకు దూరంగా ఉండడమే శ్రేయస్కరము, లేకపోతే హాని తప్పదు.

# छ

छ: महीने का सबेरा कहते हैं - టాలాటోలి వ్యక్తి యెడల చెప్పబడు ఉక్తి.

छछूँदर के सिर में चमेली का तेल - దున్నపోతు కొమ్ముకి అత్తరు.

छठी का दूध याद आ गया - అపరిమితంగా శ్రమించుట.

छठी ना चिल्ला, हराम का पिल्ला - జార సంతానానికి సంస్కారమెక్కడ.

छन में छन रंग, छन में छन रंग - చంచల స్వభావి.

छाती पर पत्थर रख लिया है - సర్వం సహించడానికి సిద్ధం.

छुआ और मुआ - బహు నాజూకు మనిషి.

छूछा बर्तन बहुत बजे - ఏమీలేని విస్తరి ఎగిరిఎగిరి పడుతుంది.

छोटा धर बडा समधियाना - అసంబద్ధ విషయము; ఊరికే కోతలు కోయువాడు.

छोटा मुँह बडी बात ; छोटे मुँह बडी बात - పిట్టకొంచము కూత ఘనము.

छोटा सो खोटा - పొట్టివానికి పుట్టెడు బుద్ధులు; బహు తుంటరి.

छोटी हाँडी जल्दी खौलती है - అల్పుడు మిడిమిడి జ్ఞానానికే మిడిసి పడతాడు.

అల్లుడు కొద్ది సంపదకే విర్రవీగుతాడు.

**छोह से छाती फाटे आँसू एक नहीं** - వట్టి వట్టి అపేక్షను కన్నీరు ఉండదు.

## ज

**जंगल में मंगल बस्ती में कडाका** - అడవి సుఖం ఊరుదిబ్బ.

**जग बौराई राज पद पाए** - అధికారము వెర్రెక్కిస్తుంది.

**जनम का कोढ एक इतवार में नहीं जाता** - ఘోరమైన తప్పు ఒకరోజు ప్రాయశ్చిత్తముతో అంతం కాదు.

**जब उतर गई लोई, तो क्या करेगा कोई ?** - గౌరవమే పోయిన తరువాత ఇంకపోయేది ఏముంది.

**जब गीदड की मौत आती है तो गाँव की ओर भगता** - వినాశకాలే విపరీత బుద్ధి.

**जब तक ऊँट पहाड नहीं देखता, तब तक वह जानता है, 'मुझ से ऊँचा कोई नहीं'** - తనకంటె గొప్ప వానిని చూడనంత వరకు తనే గొప్ప అనుకుంటాడు.

**जब तक साँसा तब तक आसा** - వంటిలో ఊపిరి ఉన్నంతవరకు ఆశ ఉంటుంది.

**जब देगा, छप्पर फाडकर देगा** - ఇవ్వాలను కుంటె భగవంతుడు ఎలాగో అలా ఇస్తాడు.

**जब नटनी बाँस पर चढी, तब लाज काहे की** - గడేకారికి సిగ్గు ఎందుకు.

**जबान तलवार से ज्यादा तेज है** - వాక్కుకి కత్తికంటె ఎక్కువ పదును ఉంటుంది.

**जमीन बीज थोडे ही खाती है** - శ్రమకి తగిన ఫలితము తప్పకుండా లభిస్తుంది.

**जर है तो नर है, नहीं तो पंछी बेपर है** - ధనమూలం ఇదం జగత్తు - డబ్బుంటేనే జీవితం లేకపోతే రెక్కలు తెగిన పక్షి.

**जर जमीन, जन, ये है झगडे की जड** - సంపద (బంగారము), ఆస్తి, స్త్రీ వీటి వల్లే ఎక్కడొచ్చినా కలహము.

**जल में रहकर मगर से बैर** - బలముగల వానితో జగడం తెచ్చుకుంటే బ్రతుకు తెల్లవారినట్లే.

**जले को क्या जलाना** - చచ్చినపాముని చంపినట్లు.

**जवानी में नहीं किए, तो कब करोगे** - శక్తి ఉన్నప్పుడు చెయ్యకపోతే ఇంకెప్పుడు చేస్తావు.

**जहर खाने को भी पैसा नहीं है** - విషం మ్రింగడానికి కూడ పైసాలేదు.

**जहाँ जाए ऊखा वहीं पडे सूखा** - ఆకలి ఎక్కువగా ఉన్నచోట కరువు తప్పదు.

**जहाँ देखी बरात वहीं गँवाई रात** - స్వార్థము, నిర్లజ్జత కలిసి ఉంటాయి.

**जहाँ बसें पंडित चार, पता न लगे दिन त्योहार** - వంటవాళ్ళు ఎక్కువైతే వంట పాడౌతుంది.

**जहाँ शाम वहाँ बिहान** - దుఃఖము తరువాత సుఖము కలుతుంది.

**जहाँ सेर वहाँ सवा सेर** - తాడిచెట్టు తల తన్నేవాడు కూడ ఉంటాడు; పనిలో అనుకున్నదానికంటె ఖర్చు ఎక్కువ పెట్టాలి పని అవ్వాలంటే.

**जाति से पति बडी होती है** - జాతికంటే ప్రతిష్ఠ గొప్పది.

**जानवरों में कौआ और आदमियों में नौआ** -పశువులలో కాకి మనుష్యులలో మంగలి చాలా తెలివైన వాళ్ళు.

**जाय ईमान, रहे सब कुछ** - చనిపోయి నప్పుడు కూడా వచ్చేది ప్రతిష్ఠ, మిగతా వన్ని ఇక్కడే ఉంటాయి.

**जितना छोटा उतना ही खोटा** - పొట్టి అయినకొద్దీ మనిషికి తుంటరి తనము ఎక్కువ ఉంటుంది.

**जितनी कंजूसी उतनी हानि** - పిసిని గొట్టుకి నష్టాలు ఎక్కువ.

**जितने मुँह उतनी बातें** - మనిషి మనిషి అభిప్రాయము వేరువేరు.

**जियत बाप को असाढी के डले, मरे बाप को दही बडे** - బతికున్నంత కాలము తండ్రికి పచ్చడి మెతుకులు, చచ్చిన తరువాత శ్రాద్ధపు రోజు పిండివంటలు.

**जिस की बंदरिया वही नचावे** - ఎవరి పనివాళ్ళే చెయ్యగలరు.

**जिसकी लाठी उसकी भैंस** - బలమున్న వాడిది రాజ్యము.

**जिस के पाँव न फटी बिवाई सो क्या जाने पीर पराई** - భుక్తభోగికే పరుల కష్టము తెలుస్తుంది.

**जिस के माथे पडती है वही जानता है** - నెత్తినపడ్డవానికే కష్టసుఖములు తెలుస్తాయి

**जिसके हाथ लोई, उसका क्या करेगा कोई** - ఉన్నవాడిని ఎవరూ ఏమీ చెయ్య లేరు.

**जिस घर खेले बाला उस घर कैसा दिवाला** - పిల్లా-జల్లా ఉన్న ఇల్లు సుభిక్షంగా ఉంటుంది.

**जिसने गर्दन झुकाई उसकी कभी नहीं बुराई** - తలకాయ వంచుకున్నవాడికి ఎప్పుడూ ప్రమాదముండదు.

**जिस शहर में फूल बेचे, वहाँ लकडी बेचते हैं** - పువ్వులు అమ్మిననగరంలోనే కట్టెలు అమ్ముతున్నారు; సుఖంగా ఉన్న చోటే కష్టాలు అనుభవిస్తున్నారు.

**जिसे पिया चाहे वही सुहागिन क्या साँवरी क्या गोरी**- భర్త ప్రేమను పొందేదే సుమంగళి.

**जीजा के माल पर साली मतवाली** - సొమ్ము ఒకళ్ళది సోకు ఒకళ్ళది.

**जी से जहान है** - బ్రతికి ఉన్నంతవరకే ప్రపంచ సంబంధము.

**जुलाहा चुरावे नली नली, खुदा चुरावे एक्के बेरी** - పాపిష్టి సొమ్ము నిలవదు.

**जुलाहे का बेगारी पठान** - తలక్రిందుల వ్యవహారము.

**जूठे हाथ से कुत्ता भी न मारता** - ఎంగిలి చేత్తో కాకిని కూడ కొట్టడు.

**जेघर हींग न हरदा ते घर जेवें बैल** - ఇంగువ, పసుపులేకుండా భోజనము రుచించదు.

**जेब में नहीं खीली की डली, छैला फिरै गली गली** - మింగబోతే మెతుకులేదు మీసాలకి సంపెంగ నూనె.

**जैसा आवे वैसा जावे** - అన్యాయార్జితము నిలవదు.

**जैसा बोवेगा, वैसा काटेगा** -కర్మానుసారం ఫలం లభిస్తుంది.

**जैसा सलाम वैसा इनाम** - మర్యాదకి మర్యాద.

**जैसी धूप वैसी छतरी** - ఏ ఎండకి ఆ గొడుగు.

**जैसी सोहबत, वैसा असर** - సాంగత్య ప్రభావము తప్పనిసరిగా పడుతుంది.

**जोंक को स्तन में भी खून ही मिलता है** - చెడ్డవానికి ఎక్కడైన చెడే లభిస్తుంది.

**जो करे सो उस्ताद**- అనుభవజ్ఞునికి అంతటా గౌరవమే.

**जो खोदेगा वह गिरेगा** - తను తీసుకున్న గోతిలో తనే పడతాడు; కర్మానుసారము ఫలితము పొందుతాడు.

**जोगी किसका मीत वेस्या कैसी प्रीत** - యోగి, వేశ్య ఎవరికీ మిత్రులు కారు.

**जो गुड खाएगा कान छिदाएगा** - లాభం తోపాటు నష్టం కూడ అనుభవించాలి.

**जो जागत है सो पावत है** - జాగ్రత్తగా ఉన్నవాడు లాభం పొందుతాడు.

**जो तोको काँटा बुवे, ताहि बोइ तू फूल** - అపకారికి ఉపకారము చెయ్యి.

**जो धोवे सो पावे, जो सोवे सो खोवे** - సోమరి నష్టజాతకుడు, శ్రమించువాడే అన్నీ పొందుతాడు.

**जो बहुत मीठा है उसे सभी खाएँगे** - బెల్లమున్నచోట చీమలు చేరుతాయి.

**जोरू खसम की लडाई क्या ?**-

భార్యభర్తల తగాదా ఏమిటి! క్షణభంగురము.

**जोरू टटोले गठरी, माँ टटोले अंतडी** - భార్య జేబు వెతుకుతుంది. తల్లి కడుపు వెతుకుతుంది.

**ज्यादा जोगी मठ का उजाड** - బైరాగులు ఎక్కువైతే మఠానికి చేటు.

**ज्यों ज्यों भीजे कामरी, त्यों त्यों भारी होय** - అప్పు పెరిగినకొద్దీ వడ్డీ తడిసి మోపెడవుతుంది.

## झ

**झगडा झूठा कब्जा सच्चा** - తగాదాకి మూలం భుక్తం (కబ్జా).

**झटपट की धानी, आधा तेल आधा पानी** - తొందరపాటు నష్టదాయకము.

**झुक के रहे तो सुख से रहे** - తలవంచుకుని ఉండడం శ్రేయస్కరం.

**झूठ का बेडा गरक** - అబద్ధం కొంప ముంచుతుంది.

**झूठ बोलना भी दिलेरी है** - అబద్ధమాడడం కూడ ఒకసాహసమే.

**झोली में खाक नहीं सराय में डेरा** - మింగబోతే మెతుకులేదు, మీసాలకు సంపెంగనూనె; అక్కరకు రాని దర్జా.

## ट

**टंटा मोल ले लिया** - తంటాకొని తెచ్చుకోవడం.

**टट्टी की ओट शिकार खेलते हैं** - చాటుగా తప్పుడు పనిచేయుట.

**टाल बता उसको न तू, जिस से किया करार** - వాగ్దానము చేసి టాలాటోలి చెయ్యవద్దు.

**टूटा औजार और खोटा बेटा** - విరిగిన పనిముట్లు, చెడిపోయిన కుమారుడు కూడ సమయానికి ఉపకరిస్తాయి.

**टूटे सुजन मनाइए, जो टूटे सौ बार** - మాటి మాటికి రుస రుసలాడినప్పటికి సజ్జనుని ఎప్పుడూ బ్రతిమాలు.

**टेढी खीर है** - గడ్డుపని.

## ठ

**ठग कौन मौसी ?** - మోసకారికి బంధువులు ఎవరూ ఉండరు.

**ठठेरे की बिल्ली खटके से नहीं डरती** - వాగుడు మనిషికిగౌరవముండదు; రోజూ చూసే సంఘటనకు మహత్వముండదు.

**ठाकुर की कुतिया मरे, तो सब आए और ठाकुर मरे तो कोई नहीं आया** - శక్తిమంతునికి గౌరవము బ్రతికి ఉన్నంత వరకే.

**ठाले से बेगार भली** - సోమరిగా ఉండేకంటే వెట్టిచాకిరి మెరుగు.

**ठेस लगे बुद्धि बढे** - తలబొప్పికట్టితే గాని జ్ఞానోదయము కలగదు.

**ठोकर खाकर, सम्भलें सब** - దెబ్బతిన్న మీదటే జాగ్రత్త పడతారు.

## ड

**डंडा सब का पीर है** - లాఠీ అందరిని దారిలో పెడుతుంది.

**डरे सो मरे, खोदे सो पडे** - భయపడేవాడు చస్తాడు, ఇతరులకొరకు గోతులు తీయువాడు గోతిలో పడతాడు.

**डायन के ब्याह में बरातियों का भोजन** - దుష్టులవెంట కష్టాలుతప్పవు.

**डूबते को तिनके का सहारा** - మునిగి పోతున్నవానికి పూచికపుల్ల ఆధారము.

**डेढ पैसे की इमली खाटी होय कि मीठी** - తుచ్ఛవస్తువుని గురించి ఆలోచించుట.

## ढ

**ढंढी गया सदा कलोर** - పేడి మూతివాడు ఎప్పుడూ పెళ్ళికొడుకే.

**ढपोल (र) संक** - గప్పాలు కొట్టు సోమరి.

**ढाक के तीन पात** - ఎప్పుడూ ఒకే స్థితిలో ఉండుట.

**ढाके के बंगाल, कूजे के कंगाल** - ఆ ప్రాంతంలో తయారగు పండు వస్తువులు ఆ ప్రాంతం వారికి లభించక పోవడం.

**ढोल के भीतर पोल** - ఆడంబరము, బోలు తప్ప ఏమీలేదు.

## त

**तंदुरुस्ती हजार नियामत** - ఆరోగ్యమే మహాభాగ్యము.

**तकल्लुफ में रेल चल दी** - 'మీరు' 'మీరు' అంటుంటేరైలు కాస్తా వెళ్ళి పోతుంది.

**तरूवर फल नहीं खात हैं, सरवर पियहिं न पानी** - పరోపకారి తనసొత్తును తన కొరకు ఉపయోగించుకోడు; ఇతరుల కొరకు ఉపయోగిస్తాడు.

**ताम झाम लगे** - అక్కరకురాని ఆడం బరము.

**ताली दोऊ कर बाजै** - తప్పట్లకు రెండు చేతులూ అవసరం.

**तिनेके की ओट पहाड** - కొద్దిపాటి సరంజాముతో పెద్ద కార్యము సిద్ధించుట.

**तिल का ताड बना दिया** - గోరంత దానిని కొండంత చేయుట.

**तीन चावल सीझें चौथे लोक पसीजें** - నమ్మకం కలిగించుటకు మూడు తడవలు చెప్పడం, ఒక్కొక్కప్పుడు నాలుగో

పర్యాయము కూడ.

**तीन तेरह घर बिखेरह**- కుటుంబ కలహము కొంపనాశనము చేస్తుంది.

**तीन दिन मेहमान, चाथे दिन हैवान** - అతిథి అంటేమూడు రోజులు, నాలగవ రోజు ఉంటే పశువు.

**तीन में न तेरह में** - పనికిమాలినవాడు; లెక్కలోనికిరానివాడు.

**तीन लोक में मथुरा न्यारी** - వింతగొలుపు నడత నడచువాడు.

**तीसमारखाँ बने फिरते हैं** - కోతల రాయుడు.

**तू डाल डाल, मैं पात पात** - ఒకని మించిన తుంటరి మరియొకడు.

**तू मेरे मुँह में अँगली दे, मैं तेरी आँख में** - నా నాట్లో నీ వేలు పెట్టు, నీ కంట్లో నేను వేలు పెడతాను.

**तेरा हाथ और मेरा मुँह** - సంపాదించి నన్ను పోషించు.

**तोता तो टें-टें ही करेगा** - అకారణంగా విర్రవీగుట.

**तोले भर की आरसी, नानी बोले फारसी** - గప్పాలు కొట్టుట.

## थ

**थप्पड का मारा ऊपर देखे, रोटी का मारा नीचे** - శక్తితో అందరిని లోబరచు కోవడం సంభవం కాదు, కాని కృతజ్ఞుడు తలవంచుతాడు; లోకువ అవుతాడు.

**थाली के बैंगन हैं** - తన అభిప్రాయము, సిద్ధాంతము ఏమీ లేనివాడు.

**थाली न लोटा, खाय दाल-भात** - స్థితిని మించి దర్జా చూపించుట.

**थुरमोल अरू दुधार** - కొద్దిశ్రమతో మంచి వస్తువు సంపాదించుట.

**थूककर चाटना अच्छा नहीं है** - మాట తప్పుట మంచిదికాదు.

**थूक का चिपकाया चिपकता नहीं** - నిర్లక్ష్యముతో పనిసరిగా కాదు.

**थोडा आपको, बहुत गैर को** - అయిన వాళ్ళకి ఆకుల్లో కానివాళ్ళకి కంచాల్లో.

**थोथा चना बाजे घना** - ఏమీలేని విస్తరి ఎగిరి ఎగిరి పడుతుంది.

**थोथे वृक्ष पर कोई खग नहीं बैठता** - అనాథుడికి ఎవరూ సాయపడరు.

## द

**दँतला खसम की हाँसी न साँची** - ముఖము ఎప్పుడూ ఒకే మాదిరిగా ఉండువాని మనోభావము పసికట్టుట సంభవము కాదు.

**दद्दा को दानों मीठी**- స్వార్థపరునికి ఎప్పుడూ

స్వార్థంమీదే ధ్యాస.

**दद्दा नहीं पढे हैं, लल्ला पढे हैं** - ఇవ్వడం తెలియదు, తీసుకోవడం తెలుసు; అప్పుతీర్చడం తెలియదు - పీనాసి.

**दबी बिल्ली चूहे की बहू बनती है**- దుస్థితిలో దుర్బలుడు కూడ పరిహాసమాడుతాడు.

**दमडी की बुढिया, टका सिर मुडाई** - దమ్మిడీ ముండకి ఏగాని క్షౌరం.

**दम भर की खबर नहीं** - క్షణమొప్పాటులో ఏం జరుగుతుందో ఎవరికీ తెలియదు.

**दम भाई किसके, दम लगाया खिसके** - తాగుబోతువాడి నమ్మకమేమిటి, దమ్ము కొట్టాడు జారుకున్నాడు.

**दरब से सरब** - డబ్బుతోనే ఉన్నదంతా.

**दरोग को फरोग नहीं** - అబద్ధాలకోరుకి ఇరుగు-పొరుగు ఉండరు.

**दलाल का दिवाला क्या, मस्जिद में ताला क्या ?**-దూరి దివాళా ఏమిటి? మసీదికి తాళమేమిటి ?

**दशहरे की नीलकंठ** - శుభదర్శనము, దసరా రోజుల్లో నీలకంఠపక్షికనిపించడం శుభంగా భావించబడుతుంది, బహు కాలము తరువాత కనిపించు మిత్రుని యెడల వినోదపు సమయం.

**दस मरेंगे, तो तू भी मर** - నలుగురితో నారాయణ.

**दही की गयाही चूडा** - పప్పునెయ్యి - పరస్పర సంయోగము మంచిదైనప్పుడు చెప్పబడు ఉక్తి.

**दही की साखी बिलारी** - దొంగచేతికి తాళం చెవి ఇవ్వడం.

**दही में मूसर पटक दिया** - మంచిపనికి అంతరాయము కలుగుట; శుభకార్యములో విఘ్నము పడుట.

**दाँतों से पीसा नहीं जाता खाया जाता** - రాత్రింబవళ్ళు కొట్లాటలేకొట్లాడుట.

**दाई से पेट नहीं छिपता** - అమ్మదగ్గరా కడుపు దాచుకోవడం !

**दाता की नाव पहाड चढे** - డబ్బులో కొండమీది కోతి దిగివస్తుంది.

**दादा कहने से बनिया गुड देता है** - ముఖస్తుతి బహు గొప్ప విషయము.

**दादू दो-दो न बने, जाले बाले डार** - ఒకే సమయంలో రెండు పనులు జరుగవు.

**दान की बछिया के दाँत नहीं देखते** - ఊరికే వచ్చిన దాని మంచి-చెడులు చూడరు.

**दाना दुश्मन, नादान दोस्त से बेहतर**-తెలివి తక్కువ స్నేహితుని కంటె తెలివైన శత్రువు మెరుగు.

**दाने-दाने को मुहताज** - తిండిలేని నిష్ఠ దరిద్రుడు.

**दाम बडा या नाम** - డబ్బు గొప్ప-దేవుడు గొప్ప; ముక్తిని ప్రసాదించేది దేవుడు కనుక దేవుడే గొప్ప అంటారు.

**दाम ही में राम है** - డబ్బులోనే దేవుడు.

**दाल-भात में मूसरचंद** - ఇద్దరు మాట్లాడు కొంటున్నప్పుడు మూడవవాడు జోక్యం చేసుకొనుట.

**दिनका भूला साँझहिं आवे, तो भूला नहिं तनिक कहावे** - తప్పుచేసి బయటికి వెళ్ళినవాడు వెంటనే ఇంటికి తిరిగివస్తే, పెద్ద తప్పు అనబడదు.

**दिन दूना रात चौगुना** - అపరిమితమైన వృద్ధి కలుగుట.

**दिन-भर चले अढाई कोस** - ఎంత శ్రమించినా స్వల్పముగా ప్రతి ఫలము లభించుట.

**दिया तले अँधेरा** - పెద్దలలో కొద్ది చెడు ఉండవచ్చు; మంచితోపాటు చెడు కూడ ఉంటుంది; చెప్పేది వేరు; చేసేదివేరు.

**दिल साफ, कसूर माफ** - మనస్సు నిర్మలముగా ఉంటే అంతా సవ్యముగానే ఉంటుంది.

**दीन-दुनिया दोनों से गए** - ఇహలోకము, పరలోకము రెండూ దూరమైనాయి.

**दीवार के भी कान होते हैं** - గోడకి కూడ చెవులు ఉంటాయి.

**दीवाली की मिठाई** - చూడడానికి ముచ్చట గానున్నా గుణంలో చెరుపు.

**दुधार गाय की दो लात भी भली** - పాడి ఆవు ఎప్పుడైనా తన్నినా బాగానే ఉంటుంది; ఇచ్చేవాడు రెండు చివాట్లు పెట్టినా దుఃఖము కలుగదు.

**दुनिया में माँ-बाप के सिवा सब कुछ मिल जाता** - ప్రపంచములో తల్లితండ్రుల ప్రేమ తప్ప మిగతావన్నీ లభిస్తాయి.

**दूरदिन परे रहीम कहि भूलत सब पहिचानि** - చెడురోజుల్లో పరిచయస్తు లలో ఎవరు ఎలాంటివారో తెలుస్తుంది.

**दूध का जला छाछ को फूँक-फूँक कर पीता है** - వేడిపాలవలన నోరుకాలిన మీదట మజ్జిగ కూడ ఊదిఊది తాగు తాము; ఒకసారి మోసపోయినావాడు ప్రతి విషయములో జాగ్రత్త పడతాడు.

**दूधों नहाओ पूतों फलो** - ధనసంపత్తులు; సంతానముతో తులతూగు.

**दूर के ढोल सुहावने** - దూరపు కొండలు నునుపు.

**दूसरे का पीसा-पकाया सभी को अच्छा**

लगता - పొరిగింటి పుల్లకూర రుచి ఎక్కువ.

देखकर मक्खी नहीं निगली जाती - చూస్తూ చూస్తూ హాని భరించలేము లేక అవమానము సహించలేము.

देर है पर अंधेर नहीं - ఆలస్యము ఉండవచ్చును గాని దురాగతం లేదు.

दो उधार और पालो बैर - అప్పు ఇచ్చి విరోధం తెచ్చుకోకు.

दोनों हाथ लड्डू हैं - రెండు చేతుల్లోనూ లడ్డూలున్నాయి, రెండు వైపులా లాభమే లాభము.

दो मालिक के नौकर की मिट्टी पलीद - ఇద్దరి యజమానుల నౌకరుకు సుఖము ఎంతమాత్రము లేదు.

दो हाथ मिलकर धाते हैं - రెండు చేతులు కలిసే పనిచేస్తాయి; ఐక్యములోనే బలము.

## ध

धक्के पर धक्का लगता है - విపత్తుమీద విపత్తు కలుగుతుంది.

धन से धर्म - ధనవంతులకే ధర్మము, మతము ఎక్కువ.

धावेगा सो पावेगा - శ్రమ ఫలిస్తుంది. శ్రమించువానికే కలిమి కలుగుతుంది.

धूल छोने कंकड मिलते - వ్యర్థమైన పనినుంచి వాంఛించిన ఫలితమురాదు.

धोबी अहिर की कौन मिताई, इनके गधा न उनके गाई - చాకలి మంగలి పొత్తు ఇంటికి రాదురా విత్తు.

धोबी बेटा चाँद सा - ఊళ్ళోవాళ్ళ బట్టలతో సోకు - సింగారము.

धौला बाल मौत की निशानी - తెల్ల వెంట్రుకలు మృత్యువుని సూచిస్తాయి.

## न

नंगन लुटे हजारों में - పేదవానిని ఎవరు దోచుకుంటారు, ఏం దోచుకుంటారు.

नई नौ दिन - కొత్తకు వింత, పాతకు రోత.

नकटा देव, चोर पुजारी - యథారాజా తథా ప్రజ.

नकटे की नाक पर पीपल उगा, तो उसे छाया मिली - సిగ్గులేనివాడికి అవమానమేమిటి!

नकटे तेरी कितनी नाक ? कहा - निन्यानबे - సిగ్గులేనివాడు తప్పుడు పని మీద తప్పుడు పని చేస్తూనే ఉంటాడు.

नगद दाम सब आसान - డబ్బుతో అన్నీ సమకూరుతాయి.

नजर से दूर दिमाग से दूर - చూపుకి అందని వాళ్ళు మనస్సుకికూడదూరం అవుతారు.

नटनी जब बाँस पर चढी तो घूँघट क्या? -

గడేకారికి పరదా ఏమిటి ?

न तो रांड को चिन्ता और न बाँझ को - వైధవ్యము పొందిన స్త్రీ, గొడ్రాలు నిశ్చింతగా వుంటారు.

नदी किनारे रूखडा जब-जब होत बिनास - నడి ఒడ్డు చెట్టు.

न नाम लेवा न पानी देवा - పేరు ఎత్తేవాళ్ళు, మంచి నీరు ఇచ్చేవాళ్ళూ ఎవరూ లేరు - ఏకాకి; సంతానహీనునియెడల కూడ యీ ఉక్తి చెప్పబడుతుంది.

न नीम - सा कडुआ, न गुड सा मीठा - పెద్ద లాభనష్టాలు లేకుండా.

न नौ मन तेल होगा न राधा नाचेगी - అసంభవమైన షరతు పెట్టుట.

न बात बिरानी कही न ऐंचा तानी सहो - పరుల కలహాల్లో తలదూర్చినందువలన నష్టమే గాని లాభము లేదు.

नमाज भी गई, बिल्ली भी भाग गई - నష్టము లేకుండా యుక్తి పారుట.

नया ज्योतिषी, वैद्य पुराना - క్రొత్త జోతిష్యుడు, అనుభవము గల వైద్యుడు బాగుగా ఉపకరిస్తారు.

नया मुसलमान, अल्लाही अल्ला पुकारे - ఆరంభ శూరత్వము.

न रहेगा बाँस न बजेगी बाँसुरी - అనిష్టానికి మూలాన్ని నాశనము చేయుట.

न साँप मरे, न लाठी टूटे - నష్టపడకుండా పనిజరుగుట; ఇతరులకు హానికలగకుండా తనని తను రక్షించుకోవడము.

न हंसिया दूर, न पडोसी की नाक - మొహామొందరా ఆడుటవలనపని జరగదు

'ना' का कोई इलाज नहीं है - 'లేదు' 'లేదు' కి చికిత్స ఏముంది.

नाखून से गोश्त अलग नहीं होता - బంధు ప్రీతి గాఢము.

नाच न जाने आँगन टेढा - ఆడలేక మద్దెల ఓడు అనుట.

नाथे बिना भैंस हेहर - ముక్కుతాడు లేకుండా గేదె మాట వినదు, అంకుశము లేకుండా దుష్టుడు దారిలోకిరాడు.

नाम कपूर चंद, गंध गोबर की- ఇంటిపేరు కస్తూరివారు ఇంట్లో గబ్బిలాలకంపు.

नाम मेरा, गाँव तेरा - సొమ్ము ఒకడిది, సోకు ఒకడిది.

निकम्मा हाथी अपनी फौज को ही मारता है -సోమరి తనవాళ్ళకే కష్టము కలిగిస్తాడు.

निबला केलिए दो असाढ - కరువులో అధికమాసము.

नहंग लाडला सदा सुखी - స్వాతంత్ర్యము లోనే సుఖము ఉంది.

**नींद के आगे खहर क्या, सूल के आगे बासी क्या ?** - నిద్ర సుఖమెరగదు, ఆకలి రుచి ఎరగదు.

**नीके को सब लागत नीको** - మంచివానికి అంతా మంచిగానే ఉంటుంది.

**नीम जैसी छाया** - నడమంత్రపుసిరి.

**नीयत साबित, मंजिल आसान** - నిజాయితీ మనిషి పనులన్నీ సవ్యంగా జరుగుతాయి.

**नेकी और पूछ-पूछ** - మంచి చేసేటప్పుడు అడగడం దేనికి.

**नौ कनौजिए, तेरह चूल्हा** - నిష్ఠాపరులు భేదభావాన్ని ఎక్కువగా పాటిస్తారు.

**नौकरी ताड की छाँह है** - నౌకరి క్షణ భంగురము.

**नौ गिहथिन, माठा पातर** - మంది ఎక్కువ అయితే మజ్జిగ పల్చన అవుతుంది.

**नौ सौ चूहा खाकर बिलाई चली हज को** - జీవితమంతా ఘోరాతిఘోరాలు చేసి చావు కాలానికి తీర్థయాత్ర.

## प

**पकने पर निबौली मीठी** - సమయాను సారం వ్యక్తి మారుతూ ఉంటాడు; పండిన వేపకాయ తియ్యగా వుంటుంది.

**पकी पकाई खाए सो हरजाई** - శ్రమించకుండా సుఖమనుభవించువాడు వేశ్యతో సమానము.

**पढे घर की बिल्ली भी पढी** - సాంగత్య ప్రభావము తప్పనిసరి.

**पत्थर की नाव नहीं चलती** - పాపాత్మునికి విముక్తిలేదు; వంచించి సంపాదించినది వంటపట్టదు.

**पत्थर की लकीर** - సత్యసంధులు మాట తప్పరు.

**पर आस, नित उपास** - ఇతరులమీద ఆధారపడినవానికి నిత్యము ఉపవాసమే గతి; స్వావలంబనే మనిషికి సరైన ఆధారము.

**परदे की बीबी और चटाई का लहँगा** - మింగబోతే మెతుకులేదు; మీసాలకి సంపెంగనూనె.

**पर निन्दा सम अघ न गिरीसा** - పరనింద ఘోరాతి ఘోరమైన పాపము.

**पर पतरी को नीक बुरा** - పొరుగింటి పుల్లకూర రుచి.

**पलास के तीन पात** - ఎప్పుడూ ఒకే మాదిరిగా ఉండుట.

**पहले चुम्मे गाल काटा** - ప్రారంభంలోనే పనిపాడు.

**पहले पेट, पीछे सेठ** - తనకు మాలిన

ధర్మమా ?

**पाँचों उँगलियाँ घी में तर** - నలువైపులా లాభమే లాభం.

**पादने का दम नहीं, तापची रख लो** - పిత్తడానికి ఓపికలేదు, కాపలా మనిషి.

**पानी का हगा ऊपर आता है**- చెడదాగదు.

**पानी ढाल की ओरही बहता है** - నీరు పల్లంవైపే ప్రవహిస్తుంది; వ్యక్తి తన స్వభావానుసారమే నడుస్తాడు.

**पानी पीकर जाति पूछते हैं** - నీరు తాగిం తరువాత జాతి అడిగి ఏం ప్రయోజనము; పని చెయ్యడానికి పూర్వమే దాన్ని గురించి తెలుసుకోవాలి.

**पानी बिन जिन्दगी किस काम की** - గౌరవములేని జీవితమెందుకు !

**पानी में मछली नौ नौ टुकडा हिस्सा** - ఆలిలేదు, చూలి లేదు, కొడుకు పేరు సోమలింగం.

**पाप प्रकट, धर्म गुप्त** - పాపం కనిపిస్తూ ఉంచింది, పుణ్యం దాగి ఉంటుంది.

**पारस के छूने से लोहा सोना हो जाता है** - సజ్జన సాంగత్యంలో చెడ్డవారు కూడ మంచి అవుతారు.

**पूरी रामायण हो गई सीता किसका बाप** - రామాయణమంతా విన్న తరువాత ప్రశ్న - సీత రాముడికి ఏమౌతుంది ?

**प्यादे ते फर्जी भयो, टेढो-टेढो जाए** - నీచుడు ఉన్నతి పొందిన తరువాత గీర పోతాడు.

**प्रेम और खुशबू छिपाने से नहीं छिपती** - ప్రేమ, సుగంధము దాచినా దాగవు.

## फ

**फकीर को जहाँ रात होगई वहीं सराय है** - ఫకీరు ఎక్కడైన మకాము చేస్తాడు.

**फटा दूध और फटा मन जुडते नहीं** - విరిగిన పాలు, విరిగిన మనస్సు మళ్ళీ కలవవు.

**फरिश्तों को भी खबर नहीं** - దేవుడికి కూడ తెలియదు.

**फिर क्या सियार ताड तर जाई** - ఒకతడవ మోసపోయిన తరువాత జాగ్రత్తపడతాడు.

**फूँक मार कर पेड नहीं गिराया जाता** - మంత్రాలకు చింతకాయలు రాలవు.

**फूल की डाल नीचे को झुके** - గుణవంతుడు ఎప్పుడూ వినయముగా వ్యవహరిస్తాడు.

## ब

**बंदर का क्रोध तबेले के ऊपर** - అత్తమీద కోపం దుత్తమీద.

बंदर की दोस्ती जी का जियान - మూర్ఖునితో మైత్రి తంటాకొని తెచ్చుకున్నట్లే.

बंदर क्या जाने अदरक का स्वाद - దున్నపోతు కొమ్ముకు అత్తరు.

बकरी का पालना, न लेना न देना - మేకను పెంచడానికి ఖర్చుబొత్తిగా లేదు.

बकरे की माँ कब तक खैर मनाएगी - హాని తప్పనిసరి అయినప్పుడు ఎవరు రక్షిస్తారు !

बगल में छुरी, मुँह में राम - చూడడానికి భక్తుడు చేసేవి తప్పుడు పనులు.

बगला भगत बना है - ధూర్తుడు, బకజపం చేయువాడు.

बचे नर हजार घर - ఒక్క సజ్జనుని రక్షించడం వెయ్యిమందిని రక్షించడం.

बच्चे का हाथ और बुड्ढे का मुँह खुजलाता है - బాలుని చెయ్యి, ముసిలి వాని నోటికి దురద ఎక్కువ; బాలుడు ఏదోకొంటి పని చేస్తూ ఉంటాడు. ముసిలివాడు గొణుగుతూ ఉంటాడు.

बट्टे खाते डालो - పారు బాకీలలో వ్రాయి.

बडा तो खजूर भी होता है - ఖర్జూర చెట్టుకి, తాడిమాదిరగా నీడా పాడూ ఏమీ ఉండదు. గొప్పవంశములో పుట్టినంత మాత్రాన, ధనమున్నంత మాత్రాన ఉపయోగములేదు.

बडी फजर, चूल्हे पर नजर - తెల్లవారిందో లేదో భోజనం మీదే ధ్యాస.

बडे आदमी की पीठ काली, गरीब का मुँह काला - గొప్పవానిని ముడ్డివెనకాల, పేదవానిని ముఖంమీదే నిందిస్తారు.

बडों की बडी बात - పెద్దల అభిప్రాయాలు కూడ గొప్పగా ఉంటాయి.

बत्तीस दाँत में जीभ - శత్రువులలో చుట్టు ముట్టి ఉన్నవాడు.

बदली की घाम, निखट्टू की चोट - మబ్బు విడిచిన ఎండ, మొగుడు విడిచిన ముండ బాధాకరంగా ఉంటాయి.

बन में मोर नाचा किसनें देखा ? - అడవిన పూసిన మల్లెను ఎవరు చూచారు?

बनिए के पेशाब में बिच्छू पैदा होते हैं - కోమటి పిల్లలకు తెలివి తేటలు అధికం.

बनी के सब यार हैं - ఉన్నవానికి అంతా స్నేహితులే.

बनी बनावे सो बनिया - తయారైన దానిని ఇంకా మెరుగు పెట్టువాడు కోమటి.

बसी करण यह मंत्र है, परिहरू बचन कठोर - మధురవాక్కులో అందరిని వశపరచుకోవచ్చు - కఠోర వాక్కు త్యజించు.

**बहन के घर भाई कुत्ता, सासरे जमाई कुत्ता** - సోదరి ఇంటి దగ్గర, అత్తవారి ఇంట ఉన్న వారికి గౌరవము ఉండదు.

**बहुत घमंड लंका नाशो** - రావణుని అహంకారమువలననే లంక నాశమైంది.

**बहुत पकाई खिचडी दाँतों से चिपक जाती** - అతి ఏ సందర్భములోనూ మంచివి కాదు.

**बहुत मामों का भानजा भूखा रहे** - పదిమందికి అప్పజెప్పిన పని ఎప్పుడూ నాశనమే.

**बाँझ न जान प्रसब की पीडा** - గొడ్రాలుకి ఏం తెలుసు ప్రసవ పీడ.

**बाँधा तो बैल भी नहीं रहता** - ఎప్పుడూ కట్టేసి ఉంచితే ఎద్దుకూడ ఉండదు; బంధనలో ఉండడం ఎవరికీ ఇష్టముండదు.

**बाँस की खूँट से बाँस** - తల్లిదండ్రుల పెంపును బట్టి పిల్లలు ఉంటారు.

**बाकी सब मर गए, केवल तुम्हीं बचे हो** - అబద్ధాలకోరు యెడల వాడబడు ఉక్తి.

**बाजार की छींक, ससुराल की गाली** - బజారు తుమ్ము, అత్తవారి తిట్టు, యీ రెండు పట్టించకోనక్కరలేదు.

**बात और मठा जितना चाहो उतना** - మాటమీదమాట పెరగడానికి, మజ్జిగ ఎక్కువ కావడానికి ఖర్చులేదు, తగువు తీర్పు సమయాన యీ ఉక్తి వాడుతుంటారు.

**बात का घाव नहीं भरता, तलवार का भर जाता है** - కత్తితో కలిగిన గాయం మానడం తేలికే కాని మాటల వల్ల కలిగిన గాయం మానడం బహుకష్టం.

**बात रह जाती है, वक्त निकल जाता है** - మాట ఉండి పోతుంది, కాలం గడిచి పోతుంది.

**बातें करें मैना की सी, आँखें बदलें तोते की सी** - మాటలు బహు మధురంగా మాట్లాడువాడు పని వచ్చినప్పుడు ముఖం తిప్పుతాడు – తిరస్కరించుతాడు.

**बातों में बात निकल जाती** - మాటల ధోరణిలో చెప్పకూడని మాట కూడ బయట పడుతుంది.

**बाप का कुआँ है तो क्या खारा पानी पीना है?** - ఇంటిలో జరుగు బాటులేనప్పుడు, ఇంకోచోట ఏర్పాటు చేసుకోవడం మంచిది.

**बाप भी किसी बाप का बेटा होता है** - అత్తగారు కూడ ఒక ఇంటి కోడలే.

**बाबा की कुदाली बहुत हल्की** - పుట్టిం

టిలో కష్టమైన పనులు కూడ ఆడపిల్లలు సంతోషంగా చేస్తారు కాని అత్తవారి ఇంట తేలిక పనులు కూడ కష్టమనిపిస్తాయి.

**बाखी भात में खुदा का निहोरा** - ఊరకే లభించిన దానికి బదులుగా ముఖస్తుతి ఎందుకు.

**बाहर बाबू तीसमारखाँ, घर में चूहेदास** - బయట పల్లకీమోత ఇంట్లో ఈగల మోత.

**बिगरी बात बने नहीं लाख करो किन कोय** - ఎంత ప్రయత్నించినా చెడిన పని కుదుటపడదు.

**बिद्या लोहे के चने हैं** - జ్ఞానార్జన చేయుట బహుకష్టము.

**बिन जुलारे ईद** - జంపఖానానేయు సాలెవాడు లేకుండా మసీదులో పండుగ (ఈద్) ఉండదు.

**बिन माँगे मिले सो दूध और, माँगे मिले सो पानी** - అడగకుండా ఇచ్చేది పాలు, అడిగితే ఇచ్చేది నీరు.

**बिना गोता खाए तैरना नहीं आता** - మునగకుండా ఈతరాదు; శ్రమించకుండా విశ్రాంతిలేదు.

**बिना नमका कौन खाय ?** - లాభం లేకుండా పని ఎవరు చేస్తాడు.

**बिना पानी मोजे उतारने वाला** - అకారణంగా చొక్కా-చేతులు పైకితీయువాడు; అకారణంగా కొట్లాటకు దిగువాడు.

**बिना रोए माँ भी दूध नहीं पिलाती** - అడగందే అమ్మ అయినా పెట్టదు.

**बिनौले की लूट में बरछी का घाव** - బహు అల్పమైన అపరాధానికి అధికమైన దండన.

**बिलायत में क्या गधे नहीं होते ?** - మంచివాళ్ళు - చెడ్డవాళ్ళు అంతటా ఉంటారు.

**बिल्ली और दूध की रखवाली** - దొంగచేతికి తాళం చెవులు.

**बिस सोने के बर्तन में रखने से अमृत नहीं होता** - బంగారు సింహాసనం మీద కూర్చో పెట్టినంత మాత్రాన కుక్కకు జ్ఞానం కలగదు.

**बुजदिल का पीर भी नहीं** - పిరికిపందకి ఎవరూ సాయపడరు, చివరికి వయోవృద్ధుడు కూడా.

**बुढापे में मिट्टी खराब** - ముసిలితనంలో కూడ శ్రమ కలిగించుట.

**बुरे काम के बुरे हवाल** - చెడ్డపనికి చెడు ఫలితము.

**बेडी सोने की भी बुरी** - సంకెళ్ళు బంగారువి అయినా అసహ్యమే.

बैठे से बेगार भली - సోమరితనము కంటె వెట్టి చాకిరి మెరుగు.

बैल कहीं भी जावेगा तो हल ही खींचेगा - కూలి-నాలి చేసి జీవించేవాడు ఎక్కడైనా ఆ పనే చేసి జీవించాలి.

बोए आम फले भाटा - మామిడిమొక్క నాటితే వంకాయ కాసింది, మంచి చెడు ఫలితము వచ్చుట.

बोलते ही आशनई है - బ్రతికివున్నంత వరకు ప్రేమ వుంటుంది.

ब्याह के गीत क्या सारे सच्चे - పెళ్ళి సందర్భంలో మాట్లాడిన మాటలకు తరువాత విలువ వుండదు.

ब्राह्मण, नाऊ, हाथी इन्हें न चाहिए साथी - బ్రాహ్మణుడు, మంగలి, ఏనుగు ఈ ముగ్గురికి తమ జాతి పొడగిట్టదు.

## भ

भंडुआ किसका यार, रंडी किसकी नार - భంగు సేవించువాడు ఎవరికి స్నేహితుడు?, వేశ్య ఎవరి ప్రేమత?

भडभडिया अच्छा, पेट पापी बुरा - లోపల కపటం పెట్టుకుని మాట్లాడేవాని కంటే ముఖంమీద తిరస్కరించేవాడు మెరుగు.

भरम मारे, भरम जियावे- ప్రతిష్ఠయే మనిషి బ్రతికిస్తుంది, ప్రతిష్ఠపోతే జీవితము లేదు.

भरे कुएँ में पत्थर भरना ठीक नहीं - పూర్తి అయినపనిలో విఘ్నము కలుగచేయడం మంచిదికాదు.

भली-बुरी सभी आय समय पर काम - మంచి-చెడు అన్నీ వాటి సమయము వచ్చినప్పుడు ఉపకరిస్తాయి.

भले भलाई, बुरे बुराई - మంచికి మంచి, చెడుకి చెడు ఫలితం లభిస్తుంది.

भाँड की भैंस दुपहरी में रंभाएँ - సోమరి వాని పనులు సమయానికి కావు.

भागते चोर की लंगोटी सही - చచ్చినవాడి పెళ్ళికి వచ్చిందే కట్నము.

भाग्य के लिखे को कौन टाल सकता है - ప్రారబ్ధాన్ని ఎవరు తప్పించగలరు.

भाड लीपे हाथ काला - చెడ్డపనికి ఫలితం అపకీర్తి.

भावज की थैली, सराफी करे देवर - సొమ్ము ఒకళ్ళది, సోకు ఒకళ్ళది.

भीतर का घाव रानी जाने या राव - లోపలి బాధ సంబంధీకులకు తెలియాలి.

भुना बीज अरू बंजर भूमि - బంజరు భూమిలో నాటిన బీజము మొలకెత్తదు.

भूखा क्या न करता ? - ఆకలిగొన్నవాడు ఏంచెయ్యడు ?

**भूखे भजन न होहि गुपाला** - ఆకలిలో భజన కూడా ఉండదు. తిండి లేకుండా ఏమీ చెయ్యడం సంభవం కాదు.

**भूतों से पूतों की याचना** - దయ్యాలని పుత్రసంతానాన్ని ఇవ్వమని వేడుకోవడం, దుష్టుల నుంచి మంచి ఆశించడం వ్యర్థం.

**भेड की लात घुटने तक** - గొర్రె తన్ను మోకాళ్ళవరకే; బలహీనుడు ఎక్కువ చెరుపు చెయ్యలేడు.

**भैंस की सगी भैंस** - జాత్యాభిమానం సాధారణంగా అందరికి ఉంటుంది.

**भैंस के लिए सब बराबर** - మూర్ఖ వ్యక్తి అందరూ, అన్నీ సమానమే.

## म

**मंगनी के बैल के दाँत न पूछ** - ఊరికే వచ్చిన దాన్ని పరిక్షించడం అనవసరం.

**मंगनी के सतुआ सास को पिंडा** - ఊరికే వచ్చిన వస్తువుని అనవసరంగా వినియోగించుట.

**मंदिर में जानेवाले सभी ईश्वर-भक्त नहीं होते** - మెరిసేవన్నీ బంగారం కాదు.

**मकान की नींव और दहेज बदलता नहीं** - కష్టసాధనమైన కార్యము మాటి మాటికి మారదు - ఇంటి పునాది, పెళ్ళి కట్నము నిశ్చితమైన ప్రకారము వుంటాయి.

**मक्के में रहते है, पर हज नहीं करते** - దేవాలయము దగ్గరైనకొద్దీ భక్తి క్షీణిస్తుంది.

**मक्खी भी कुछ देखकर बैठती है** - అన్నిజీవులకు స్వార్థము వుంటుంది.

**मखमली जूती** - తియ్యతియ్యని మాటలతో అవమానించుట.

**मजा मा मजा** - మాటి మాటికి గతించిన మాటలు చెప్పువాడు.

**मजे में सजा होती है** - రసికునికి అప్రతిష్ఠ కలుగుతుంది.

**मतलबी यार किसके, दम लगाया खिसके** - స్వార్థపరులు తమ పని కాగానే జారుకుంటారు.

**मधुर बचन है औषधी, कटुक बचन हैं तीर** - మధురవాణి ఔషధ తుల్యం, తిక్తవాణి బాణతుల్యం.

**मन का अंकुश ज्ञान** - మనస్సు జ్ఞానం ద్వారానే వశమగుతుంది.

**मन के हारे हार है, मन के जीते जीत** - మనస్సు చలిస్తే ఓటమి తప్పదు; దృఢంగా ఉంటే విజయము.

**मन चंगा तो कठौती में गंगा** - మనస్సు నిర్మలంగా ఉంటే అంతా సవ్యంగా ఉంటుంది.

**मन भला, तो गावे गीत** - మనస్సు సంతో

షంగా ఉన్నప్పుడే పాట వస్తుంది.

**मन मानी, घर जानी** - తన ఇష్టానుసారము వ్యవహరించుట.

**मन में राम, बगल में सोंटा** - మనస్సు నిర్మలంగా ఉంచుకోవాలి; 'రామ రామ' అంటూ పాడుపనులు చేయడం.

**मन हो तो दिल्ली भी जाए** - మనస్సు అనుకూలిస్తే ఏమైనా చెయ్యవచ్చు, ఎక్కడికైనా వెళ్ళవచ్చు.

**मरता ऊँट मारवाड देखे**- జన్మభూమియెడల అందరికి ప్రేమ వుంటుంది.

**मरनेवाला आक भी पिए**-చావుకు సిద్ధంగా ఉన్నవాడు ఏమైనా చేస్తాడు, జిల్లేడు రసం కూడా తాగుతాడు (విషం).

**मरी भैंस का घी बहुत**- గేదె చచ్చిన తరువాత పాడిబయట పడుతుంది.

**मरे न मूसा सिंह ते, मारे ताहि मँजार** - అన్నిపనులు అందరూ చెయ్యలేరు.

**मर्द औरत की लडाई, अभी लगी अभी बुझाई** - భార్యాభర్తల పోట్లాం క్షణ భంగురము.

**मुहल्ले में आई बारात पडौसिन को लगी घबराहट** - ఊళ్ళో పెళ్ళి కుక్కలకు హడావిడి.

**माँ करे सो बेटी करे** - కూతురికి తల్లి సాలు వస్తుంది.

**माँ की बातें मौसी से** - అమ్మపుట్టింటి విషయం మేనమామకి చెప్పడం.

**माँगत पूत भतार गंवायो** - పుత్రుడిని కోరడానికి వెళ్ళి భర్తను పోగొట్టుకుంది.

**माँगी दाल में बडा नहीं बनता** - ఊరికే వచ్చిన వస్తువు సాధారణంగా ఉపయోగ పడదు.

**माँ-बाप की गालियाँ, घी की नालियाँ** - తల్లిదండ్రుల చివాట్లు సంతానానికి శుభం కలుగజేస్తాయి.

**मानत हैं सब लोग लोन बिन सबै अलोना** - ఉప్పులేని భోజనం రుచి లేని భోజనం అని అందరూ అంటారు.

**मान दे मान पावे** - గౌరవము ఇచ్చి గౌరవము పొందు.

**माया के पास माया आती है** - ఉన్నవానికే ఇంకా కలిమి కలుగుతుంది.

**मार के आगे भूत भागे** - దెబ్బకు దయ్యం పారిపోతుంది.

**मारते की अगाडी और भागते की पिछाडी** - దెబ్బలు తినేవాడికి ముందు, పారిపోయే వాని వెనకాల ఉండాలి.

**मियाँ की जूती मियाँ के सिर** - తనకు తనే హాని కలుగజేసుకోవడం.

मियाँ बीवी राजी, तो क्या करेगा काजी - భార్యాభర్తలు ఏకమైతే మునసబు ఏం చేస్తాడు?

मिर्च छोटी, बबकार बाडी - పిట్టకొంచం కూత ఘనం.

मिस्सों से पेट भरता है, किस्सों से नहीं - అన్నంతో కడుపు నిండుతుంది, మాట లతో కాదు.

मीठे पर नोन और नोन पर मीठा - భోజ నంలో మార్పు ఉంటేనే రుచి, జీవితంలో సుఖదుఃఖాలు ఉంటేనే సుఖం విలువ తెలుస్తుంది.

मुँह के चिवने पेह - మాటలయితే మధురం లేని ఆలోచనలు చెడ్డవి.

मुर्गा बाँग न देगा तो क्या सुबह न होगी? - కోడి కుయ్యకపోతే తెల్లవారదా! నువ్వు సాయం చెయ్యకపోతే నా పని కాదా!

मुल्ला की दौड मस्जिद तक - తన శక్తికి మించిన పని ఎవరు చెయ్యలేరు.

मूँज की टट्टी और गुजराती ताला - తుంగ గడ్డి తడికకు గుజరాతీ తాళము.

मेंढ की को जुकाम - కప్పకు రొంప అసంభవమైన విషయము.

मेघ समान जल नहीं आप समान बल नहीं - వర్షంతోనే భూమి తాపం తీరు తుంది, తన బలమే అదునుకు ఉపయోగ పడేది.

मेरी सिखाई लोगडी मुझी से लोमडी फंद - హనుమంతునిముందా కుప్పిగంతులు.

मेरी ही बिल्ली मुझ से ही म्याँव - తిన్నింటి వాసాలు లెక్క పెట్టుట.

मेरे आसरे रहना मत, अपने घर खाना मत - డొంక తిరుగుడుగా తిరస్కరించుట.

मेरे बाप ने घी खाया, मेरा हाथ सूँघो - పూర్వీకుల గొప్పతనాన్ని చాటుట.

मेले में झमेला - తిరునాళ్ళలో గందర గోళము సహజము.

मेह और मेहमान किसके आएँ? - వర్షము, అతిథులు అదృష్టవంతుల ఇళ్ళకే వెడతాయి.

मैं करूँ तेरी भलाई, तू करे मेरी आँख में सलाई - నేను నీకు ఉపకారం చేస్తున్నాను నువ్వు నాకు హాని కలిగిస్తున్నావు.

मैं भी रानी, तू भी रानी कौन भरे कुएँ से पानी? - అంతా రాజులైతే పని చేసేది ఎవరు?

मोटा कान का खोटा - గొప్పవాళ్ళు చాడీకోర్లనుండి జాగ్రత్త పడాలి.

मोती का पानी उतरा सो उतरा - ముత్యపు మెరుపు పోతే మళ్ళీ రాదు; పోయిన

గౌరవం మళ్ళీ లభించదు.

**मोदी की दूकान में हीरा कहाँ** - పచారీ కొట్లో వజ్రం ఎలా లభిస్తుంది, సామాన్యునికి గొప్ప ప్రతిభ ఎలా లభిస్తుంది!

**मौत आवे बुढिया को घर बतावे पडोसी का** - చావు వచ్చింది ముసలమ్మ దగ్గరికి, కానిముసలమ్మ చూపిస్తోంది పొరిగింటిని.

**मौला यार तो बेडा पार** - భగవంతుడు దయదలస్తే పనులన్నీ సమకూరుతాయి.

**म्याऊँ का ठौर कौना पकडे ?** - పిల్లిమెడలలో గంట కట్టేది ఎవరు !

## य

**यकीन के बंदे होगे, तो सच मानोगे** - నువ్వు సత్యసంధుడువి అయితే నామాట నమ్ముతావు.

**यह बला तो कदमों से लगी है**- ఈ విపత్తు కాళ్ళకి చుట్టేసుకుంది.

**यहाँ उलटी गंगा बहती है** - నియమ విరుద్ధమైనది.

**यहाँ का बाबा आदम ही निराला है** - ఇష్టారాజ్యము చెల్లుట.

**यहाँ फरिश्तों के भी पर चलते हैं** - పెద్ద పెద్దవాళ్ళమాట కూడా చెల్లకపోవుట.

**या खुदा तू दे, न मैं दूँ** - భగవంతుడా నువ్వు నాకు ఏమీ ఇవ్వద్దు, ఇస్తే నేను కూడా ఎవరికైనా ఇవ్వాల్సివస్తుంది.

## र

**रंग में भंग पड गई** - పానకంలో పుడక పడింది.

**रंग लाती है हिना पत्थर पै पिस जाने के बाद**-నూరబడిన తరువాత గోరింటాకు రాతిమీద తనరంగు చూపుతుంది - బహు కష్టాలు అనుభవించిన తరువాత మనిషి వృద్ధి చెందుతాడు.

**रंगे सियार बने फिरते हैं** - ధూర్తుని యెడల ప్రయోగించిన శబ్దము.

**रंडी के घर माँडे और आशिकों के घर कडाके** - వేశ్య ఇంట్లో మంచి మంచి వస్తువులు కనిపిస్తే, రసికుల ఇళ్ళల్లో ఉపవాసాలు.

**रसोई के विप्र और कसाई के कुत्ते** - వంట బ్రాహ్మణుడు, కసాయివాని కుక్కలు ఎప్పుడూ బలిసి వుంటాయి.

**रस्सी जल गई, ऐंठन न गई** - చింతచచ్చినా పులుపు చావలేదు.

**रहिमन देखि बडेन को लघु न दीजिए डारि** - గొప్పవాళ్ళని పొంది చిన్న వాళ్ళని వదలొద్దు - చిన్నా పెద్దా అన్నీ ఉపయోగపడతాయి.

**रही बात थोडी, जीन लगाम घोडी** -

గుట్టపు నాడ దొరికినమీదట గుట్టం, బండి కావాలనుకోవడం.

**रहेगा बाँस न बाजेगी बाँसुरी**- వెదురేలేకపోతే వేణువు ఎక్కడనుంచి వస్తుంది, కారణమే లేకపోతే కార్యము ఎలా సంభవము.

**राँड का रोना और पुरूवा का बहना व्यर्थ नहीं जाता** - వైధవ్యము పొందిన స్త్రీ ఏడుస్తూ ఇచ్చిన శాపము, తూర్పుగాలి ఎప్పుడూ వృధాకావు.

**राख आग को छिपा नहीं सकती** - అబద్ధాలు సత్యాన్ని దాచలేవు.

**राजा के अगाडी घोडे के पिछाडी**- రాజుకు ఎదుట, గుఱ్ఱానికి వెనుక ఉంటే ఏదో ఒక ఆపద తప్పదు.

**रूपया परखे बार-बार आदमी परखे एक बार** - రూపాయిని మాటిమాటికి పరిక్షిస్తారు, కాని మనిషిని ఒక పర్యాయమే.

**रेवडी के लिए मस्जिद ढा दिए** - రేవడి (ఒకరకపు మిఠాయి) కోసం మసీదుని పడగొట్టారు - తన స్వార్థముకొరకు ఇతరులకు పెద్ద నష్టము కలుగ జేయుట.

**रोटी दोनों हाथ से बनती है** - ఏ పనికైనా రెండు చేతులు కలవాలి, ఇద్దరు కలిస్తేనే పని జరుగుతుంది.

# ल

**लंका जीत आए**- గొప్ప విజయము సాధించవచ్చారు.

**लँगडे ने चोर पकडा दौडियो मियाँ अंधे** - పనిచేసే వాళ్ళు, వాళ్ళ సహాయకులు అంతా అసమర్థులైతే యీ ఉక్తి వాడుతారు.

**लंबी घूँघटवाली** - భ్రష్ట స్త్రీ.

**लकडी के बल बंदर नाचे** - ఇతరుల ఆధారము చూచుకొని గంతులువేయుట.

**लगे दाम बने काम** - డబ్బుతో పని పూర్తియగుట.

**लडके को जब भेडिया ले गया, तब टट्टी बाँधी**-పసివాణ్ణి తోడేలు ఎత్తుకుపోయాక అప్పుడు గుమ్మానికి తడిక కట్టడం.

**लडाई और आग का बढाना क्या ?** - పోట్లాట, నిప్పువెంటనే తీవ్రమౌతాయి.

**लडाई का घर हाँसी और रोग की घर खाँसी** - నవ్వులాటతోనే జగడమౌతుంది, దగ్గుతోనే రోగము.

**लडाके के चार कान** - పేచీకోరు తగాదాకి ఏదో వంకచూసుకుంటాడు.

**लला के पैर पलना में ही दीख गए** - పువ్వుపుట్టగానే పరిమళిస్తుంది.

**लाचारी का नाम महात्मा गांधी** -

పరవశంలో శాంతచిత్తుడు.

**लात का आदमी बात से नहीं मानता** - తన్నులు తినేవాడు మాటలతో వినడు.

**लाभ को पडे ढाब** - పేరాశ పెద్దచేటు.

**लिख लोढा, पढ पत्थर** - మూర్ఖుడు.

**लिया-दिया आडे आता है** - మంచి సంబంధాలే సమయానికి ఉపయోగ పడతాయి.

**लुकमान को हिकमत सिखाते हैं** - బాగా తెలిసినవాడికే నేర్పే ప్రయత్నం.

**लुहार की एक, सुनार की सौ** - వంద కంసాలి సుత్తి దెబ్బలకి కమ్మరి సెమ్మెట దెబ్బ ఒక్కటిసరి.

**लुहार की कूँची कभी आग में कभी पानी में** - ఎవరి స్థితి ఎప్పుడూ ఒకే మాదిరిగా ఉండదు.

**लेता मरे कि देता** - అప్పు తీసుకున్నవాడు చావాలా ? ఇచ్చినవాడా.

**ले दही और दे दही में अन्तर है** - తనకొరకు అమ్ముతుంటే తక్కువలాభము వస్తుంది, ఇతరులకొరకు అయితే ఎక్కువ.

**लेना देना कुछ नही** - ఏ మాత్రము సహాయ పడకుండా జబర దస్తీ చేయుట.

**ले लुगडी, चल गुदडी** - తన సామర్థ్యాన్ని మించి వ్యవహరించకూడదు.

**लोनी सोई कंत जेहि चाहा** - భర్త ప్రేమ పొందే స్త్రీయే అందమైనది.

**लौंडी को लौंडी कहा रो पडी, बीवी को लौंडी कहा, हँस दी** - దాసీనిదాసీ అంటే ఏడుపుకి లంకించుకుంది, భార్యను దాసి అంటే నవ్వింది.

**लौटे बराती, गुजरे गवाह** - తిరిగివచ్చిన పెళ్ళివారిని, సాక్షులను నిర్లక్ష్యం చేస్తారు, పని అయిపోయిన తరువాత వారి విలువ లేదు.

## व

**वक्त पडने पर गधे को भी बाप बनाना पडता है**- అవసరం వచ్చినప్పుడు గాడిద కాళ్ళు కూడ పట్టుకోవాలి.

**वक्त पर भाग जाना ही मर्दानगी है** - అదునులో పని పూరించుకోవడం తెలివైన లక్షణం.

**वह दिन गए जब भैंस पकौडे हगती थी** - ఇప్పుడు వెనకటిమాదిరిగా ఊరికే వచ్చే రాబడి లేదు.

**वह शैतान से ज्यादा मशहूर है** - కుఖ్యాతుడు, అపకీర్తి పొందినవాడు.

**वहाँ खाना यहाँ मुँह धोना** - అక్కడ తిని ఇక్కడ మూతి కడుక్కో.

## श

**शंका डाइन, मनसा भूत** - అనుమానం దయ్యం, మనస్సు భూతం.

**शादी और लडाई में बहुतों ने धूल उडाई** - పెళ్ళి, తగాదా కొంపని నాశనం చేస్తాయి - యీ రెంటికి ఖర్చు అపరిమితం.

**शेख ने कौवे को भी दगा दी है** - తాడి తన్నేవాడు ఒకడు, తలతన్నేవాడు ఒకడు.

**शेर का एक ही भला** - యోగ్యపురుషునికి ఒకే ఒక కుమారుడు ఉండాలి, ఒకనికంటె ఎక్కువ ఉంటే ఎవరో ఒకరు పనికిమాలిన వాడు కూడా కావచ్చు.

**शैतान के मुँह में वेद पुराण**-దయ్యం వేదాలు వల్లించుట.

**शैतान से भगवान भी डरता है** - దుష్టుడు అంటే అందరికి భయమే.

**शौक में जौक दस्तूरी में लडका** - ఒక దెబ్బకి రెండు పిట్టలు.

## स

**संपत्ति हो, तो सब साथी** - బెల్లం ఉంటే చీమలు వస్తాయి.

**सखी का बेडा पार, सूम की मिट्टी ख्वार** - దాత సుఖంగా దాటిపోతాడు, పీనాసికి కష్టాలు తప్పవు.

**सखी का बोलबाला, सूम का मुँह काला** - దానశీలుడికి కీర్తివుంటుంది, పీనాసికి అపకీర్తి.

**सच बात कडवी लगती है** - నిజము చేదుగా వుంటుంది.

**सच्चा कहनेवाला दाढीजार** - నిజం చెప్పేవాడు దద్దమ్మ.

**सच्चे लोग कसम नहीं खाते** - నిజాయితీ పరులు ఒట్టుపెట్టరు-శపథం చెయ్యరు.

**सदा कागज की नाव नहीं बहती**-మోసము ఎప్పుడూ పనిచెయ్యదు.

**सफेद-सफेद सभी दूध नहीं होते** - తెల్లని వన్నీ పాలుకావు; అందరి మనుష్యుల స్వభావము ఒకటిగా ఉండదు.

**सब एक ही रस्सी में बाँधने योग्य हैं** - అందరూ చెడ్డవారే.

**सब गुड मिट्टी हुआ** - పని అంతా పాడై పోయింది.

**सबसे मीठी भूख** - ఆకలి రుచి ఎరగదు.

**सबेरे का भूला साँझ तक आ जाए तो भूला न समझो** - తన తప్పును త్వరగా సవరించుకున్నవాడు, చెడ్డవాడనబడడు.

**समझदार की ही मौत होती है** - తెలివైన వాడికే కష్టాలు.

**समय पर किसी की पहचान होती है** - అవసరం వచ్చినప్పుడు మనిషి స్వభావము

తెలుస్తుంది.

सवाल दीगर जवाल दीगर- అడిగేది ఒకటి చెప్పేది ఒకటి.

सवेरे का मेह, साँझ का मेहमान - ప్రొద్దున్నే వచ్చిన వాన, సాయంకాలం వచ్చిన చుట్టం ఉండిపోతారు.

ससुराल का रहना, गधे का चढना - అత్తగారి ఇంట్లో కాపురం గాడిదనెక్కడం ఒకటే.

सहज पके सो मीठा - సులభంగా అయ్యే పని మంచిది.

साँप छछूंदर का बैर - బలవంతునికే ఓటమి కలుగు వైరము.

साँप मरे, न लाठी टूटे - పాము చావాలి, కర్ర విరగకూడదు. ప్రయోజనము సిద్ధింప చేయని కార్యము.

साइत से सुतार भला - శుభలగ్నం కొరకు వేచియుండే కంటే అవకాశం వచ్చినప్పుడు పని పూర్తిచేసుకోవడం మంచిది.

साझे की होली सबसे भली - పదిమంది కలిసి చేసే ఉత్సవం ఎప్పుడూ మంచిదే!

साझे में मुरौवत क्या ? - ఉమ్మడి వ్యవహారంలో మొగమాటానికి తావు లేదు.

साठा सो पाठा - అరవై ఏళ్ళ వయస్సులో కూడా యవ్వనఛాయలు గోచరించుట.

साथ तो हाथ का दिया ही चलता है - వెంట వచ్చేది పుణ్యకార్యమే.

सारस को दावत, थाली में खीर - ఫలించని సాయం.

सावन के अन्धे को हरा ही हरा सूझता है - పచ్చకామెర్ల రోగికి ప్రపంచమంతా పచ్చగానే వుంటుంది.

सास की सीख दरवाजे तक- గుమ్మందాటే వరకే కోడలు అత్తమాట వినేది.

सिखाई बुद्धि आढाई धरी - ఇతరుల దగ్గర నేర్చుకున్న తెలివిమరుగున పడుతుంది, తన బుద్ధి మీదే ఆధారపడాలి.

सुंदर बीवी जी का जंजाल - రూపవతి భార్య మనస్సుకి జంజాటము.

सुबह का भूला शाम को घर आया - సుఖంలో మరచిపోయినవాడు, దుఃఖములో దారికొచ్చాడు; తప్పుచేసి వెంటనే సరిదిద్దుకున్నవాడు చెడ్డ అనబడడు.

सूई का भाला - గోరంతను కొండంత చేయుట.

सूखा ढाक बढई का बाप - మద్దిచెట్టు ఎండిన మీదట బహుకఠోరముగా ఉంటుంది.

सूम की थाती - పీనాసివాని సంగ్రహాము -

సంపాదన.

**सूरत और सीरत** - సౌందర్యము, గుణము యీ రెండు ఒకచోట లభ్యపడవు.

**सोते को सोता कब जगाता है** - మూర్ఖుడు మూర్ఖుణ్ణి ఎలా మేల్కొలుపుతాడు.

**सोनेकी चिडिया हाथ से निकल गई** - బంగారుపిట్టచేతిలోంచి ఎగిరిపోయింది.

**सोहन सीयन टाट पटोरे** - అతకని బొంత.

**सौत जाए, सौत का नाडा न जाए** - సవతి కొంపలోంచిపోవాలి, కాని భర్తమటుక్కు ఉండాలి, అనుకుంటారు స్త్రీలు.

**सौ सयाने एक मत** - బుద్ధిమంతులందరిదీ ఒకే ఆలోచన, ఒకే అభిప్రాయం.

**स्वांग बहुत रात थोडी**-సమయం తక్కువ, పని ఎక్కువ, జీవితం స్వల్పం, పని అధికం.

**स्वार्थ और दोस्ती में दोस्ती कैसी** - స్వార్థము, స్నేహము కలవవు; ఏదో ఒకటే వుంటుంది.

## ह

**हजामत बन गई** - పూర్తిగా క్షౌరము అయింది, పూర్తిగా మోసపోవుట.

**हजारों घडे पानी के पड गए** - అపరిమితంగా సిగ్గుపొందుట.

**हथौडी की चोट निहाई के माथे** - దిమ్మె మీదే సమ్మెట దెబ్బలు; బలవంతుడే గొప్ప ఇక్కట్లు సహిస్తాడు.

**हम आए थे अपना जान तुम्ही खींचने लागे कान** - ఆప్తునిగా భావించి సాయము కొరకు వచ్చినవానిని అవమానించుట.

**हमने क्या गधे चराये है** - నేనేం మూర్ఖుణ్ణి కాను.

**हमसे और चौसर** - మాతోనా టక్కరితనము.

**हमाम मे सब नंगे** - సహజమైన బలహీనతలు అందరిలోనూ ఉంటాయి.

**हमारे उनके सात सुख** - మాలో మాకు స్నేహము, ప్రేమ ఎక్కువ.

**हर निवाले बिसमिल्लाह** - పనిదొంగ, తిండిబోతు.

**हर फन मौला** - ఆ మనిషి సర్వకళా పారంగతుడు.

**हराम की कमाई हराम में गवाँई** - అన్యాయార్జితము అన్యాయంగానే పోతుంది.

**हरामजादे की रस्सी दराज है** - దుష్టులకు అందరూ భయపడతారు.

**हराम पुकारे छत पर से** - చెడుదాగదు, దానంతటు అదే బయట పడుతుంది.

**हलवाई की दूकान पर दादाजी का**

फातिहा - సొమ్ము అత్తది, సోకు అల్లుడిది.

हाथी के दाँत खाने के और दिखाने के और - మోసగాళ్ళు పైకి చూడడానికి ఒకమాదిరిగాను, లోపలనేక విధాలుగాను ఉంటారు.

हाथी को गन्ने ही सूझते हैं - తన స్వార్థము మీదే ఎప్పుడూ ధ్యాస ఉంచువానియెడల వాడబడు ఉక్తి.

हिजडे के घर बेटा हुआ - దున్నపోతు ఈనింది దూడని కట్టెయ్యి.

हिरनी के मट्ठर कहाँ ? - లేడిపిల్లలు చురుకుగా ఉంటాయి; సోమరిగా ఉండవు.

हीरा कीचड में गिरकर भी हीरा ही रहता है - ఏనుగు ఉన్నా - చచ్చినా వెల ఒకటే.

हुकूमत की घोडी छह पसेरी दाना - కుశాసనములో దూబరా ఖర్చు అధికం.

होनहार बिरवान के होत चीकने पात - పువ్వుపుట్టగానే పరిమళిస్తుంది.

हौज भरे तो फव्वारे छूटे - రాబడి అనుసరించి ఖర్చు జరుగుతుంది.

# कुछ अंग्रेजी शब्दों के हिंदी और तेलगु के पर्याय –
# కొన్ని ఇంగ్లీషు శబ్దాలకు హిందీ - తెలుగు పర్యాయ పదములు

## A

Abandonment - परित्याग, పరిత్యాగము.

Abate - उपशमन होना ; उपशमन करना, తగ్గించు; ఉపశమింపజేయు.

Ability - योग्यता, యోగ్యత, దక్షత.

Abnormal - अपसामान्य, అసాధారణమైన.

Aboriginal - आदिवासी, ఆదివాసి.

Abrogate - निराकरण करना, రద్దు చేయుట; నిరాకరించుట.

Abosolute monopoly - पूर्ण एकाधिकार, గుత్త అధికారము.

Above Par - औसत से ऊँचा, సగటు కంటె ఎక్కువ.

Absentee - गैर हाजिर, గైరు హాజరు.

Absurd - बेतुका, అర్థములేని.

Absurdity - बतुकापन, अर्थहीनता, అర్థరాహిత్యము.

Absolutely correct - बिल्कुल सही,

బాగుగానసరియైన.

Absolute order - पक्का आदेश, నిశ్చిత ఆదేశము.

Access - प्रवेश, पहुँच, ప్రవేశము, చేరిక; చొరవ.

Accession - राज्यारोहण, पदारोहण, अधिमिलन, పదవి అధిష్ఠించుట; సంపర్కము.

Accident, by - संयोग से, తలవని తలంపుగా.

Accomplished fact - पूरी हुई बात, పూర్తి అయిన విషయము.

Accord priority, to - प्राथमिकता देना, ప్రాధాన్యమిచ్చుట.

Accruing from - से प्रोद्भूत, నుంచి ఉద్భవించిన.

Accuracy - यथार्थता, వాస్తవికత.

Acknowledgement card - प्राप्ति पत्र, पावती, తిరుగు రసీదు.

Acknowledgement due - रसीदी, पावती सहित, రసీదు సహితముగా.

Acquisition - अर्जन, సంపాదన.

Act - कार्य, अधिनियम, अंक, కార్యము; చట్టము; అంకము (నాటక భాగము).

Adhoc - तदर्थ, దానికొరకు.

Adult franchise - वयस्क मताधिकार, వయోజన ఓటు హక్కు.

Advalorem - यथामूल्य, మూల్యానికి తగినట్లుగా ; మూల్యాన్ని అనుసరించి.

Advance payment - पेशगी, अग्रिम भुगतान, ముందుగా ఇచ్చు సొమ్ము.

Advertisement - विज्ञापन, విజ్ఞాపనము.

Advisory committee - सलाहकार समिति, సలహాసమితి.

Aerodrome - हवाई अड्डा, విమాన కేంద్రము.

Affidavit - हलफ नामा, शपथ-पत्र, సాక్ష్యపత్రము, ధృవపత్రము.

Affix - जोडना, लगाना, అంటించుట, జతపరచుట.

Afforestation - वन-रोपण, అడవి పెంపకము.

A fore said - पूर्वोक्त, ముందు చెప్పబడిన, ముందు వ్రాయబడిన.

Agenda - कार्य-सूची, कार्यक्रम, కార్యక్రమము.

Aggrieved - आर्त, असंतुष्ट, ఆర్తుడు, అసంతుష్టుడు.

Agreement - करार, अनुबंध, అంగీ

కారము.

Agronomist - सस्य-विज्ञानी, సస్య విజ్ఞాని.

Aid - सहायता, मदद, సహాయత, సాయము.

Air-Mail - हवाई डाक, విమానటపా.

Allegation - आरोप, अभिकथन, ఆరోపణ, దోషారోపణ.

Allegiance - निष्ठा, నిష్ఠ.

Alliance - मैत्री, సఖ్యము.

Allotment - आबंटन, बाँट, వితరణ, పంపకము.

Amendment-संसोधन, సంశోధనము, సంస్కరణ; సవరణ.

Amenity - सुख-सुविधा, సౌకర్యము.

Analysis - विश्लेषण, విశ్లేషణ.

Analyst - विश्लेषक, విశ్లేషకుడు.

Ancestor - पूर्वज, పూర్వజుడు.

Ancillery - आनुषंगिक, ఆనుషంగికము.

Annul - बातिल करना, రద్దుచేయుట.

Anonymous - अनाम गुनाम, పేరులేని, అనామకమైన.

Antedated - पूर्व-दिनांकित, వెనకతేది వేయబడిన.

Apathy - उदासीनता, ఔదాసీనము.

Appendix - परिशिष्ट, పరిశిష్టము.

Appropriation - विनियोजन, అపహరణ.

Approve - अनुमोदन करना, ఆమోదించుట.

Approval - अनुमोदन, అనుమోదనము, ఆమోదము.

Arts and crafts - कला और शिल्प, కళాశిల్పములు.

Assimilation - आत्मसातकरण, జీర్ణము.

Assets - आस्तियाँ, ఆస్తులు.

Assign - सौंपना, नियत करना, అప్పగించుట.

Attest - अनुप्रमाणित, ధృవీకరించుట.

Audit - लेखा परीक्षा, లెక్కల తనిఖీ.

Auditorium - प्रेक्षागृह, ప్రేక్షాగృహము.

Autograph - स्वाक्षर, స్వహస్తాక్షరము.

Auctioneer - नीलामकार, వేలము వేయువాడు.

Avocation - उपव्यवसाय, వృత్తి.

## B

Background - पृष्ठ भूमि, పృష్ఠభూమి; మూలకారణము లేక స్థితి.

Back reference - पिछला संदर्भ, గత

సందర్భము.

Backward tribes - पिछडी - जनजातियाँ या आदिम जातियाँ వెనకబడిన ఆదిమ జాతులు.

Bad character - दुश्चरित्र, దుశ్చరిత్రుడు.

Badge - बिल्ला, बैज, బాడ్జి, బిళ్ళ.

Balance - संतुलन, సంతులనము.

Balance sheet - तुलनपत्र, లాభనష్టముల పట్టిక; ఆదాయ వ్యయపట్టిక.

Ballot paper - मत पत्र, ఓటు పత్రము.

Ban - प्रतिबंध, पाबंदी, ప్రతిబంధకము.

Bankrupt - दिवालिया, దివాళా తీసిన వాడు.

Banquet - प्रीति भोज, స్నేహవిందు.

Base coin - खोटा सिक्का, చెల్లని నాణెము.

Basic education - बुनियादी शिक्षा, ప్రాధమిక విద్య; మౌలిక విద్య.

Basic period - मूल अवधि, మూల వ్యవధి.

Bed strength - शय्या संख्या, పడకల సంఖ్య (ఆసుపత్రి).

Before cited - पूर्व कथित, వెనక ఉదహరించిన.

Beat postman - गश्ती डाकिया, తపాలా బంట్రోతు.

Benevolent fund - हितकारी निधि, సంరక్షణనిధి.

Betterment - उन्नति, ఔన్నత్యము.

Bibliography - संदर्भ ग्रंथ-सूची, సందర్భ గ్రంధముల పట్టిక.

Bill of exchange - विनियम पत्र, వినిమయపత్రము.

Bill of lading - लदान पत्र, చేరిన సరుకుల జవాబుదారి పత్రము.

Bipartite - द्विदलीय, ఇరుపక్షములకు సంబంధించిన.

Bio-chemistry - जीव रसायन, జీవ రసాయనము.

Blackmarket - काला बाजार, चोर बाजार, నల్లబజారు, దొంగ బజారు.

Blanket order - व्यापाक आदेश, వ్యాపకమైన ఆదేశము.

Bloked capital - निरुद्ध पूँजी, స్తంభించిన పెట్టుబడి.

Boatman - केवट, పడవ నడుపువాడు.

Bodyguard - अंग रक्षक, అంగరక్షకుడు.

Bonafide - वास्तविक, నిజమైన; అసలైన.

Bonafides - सद्भाव, సద్భావము.

Book keeping - बही खाता पद्धति, జమాఖర్చులు వ్రాయు విధానము.

Booklet - पुस्तिका, పుస్తకము.

Bottle neck - गत्यनिरोध, ఇరుక్కు-పోయిన.

Boycott - बहिष्कार, బహిష్కారము.

Brain drain - प्रतिभा पलायन, ప్రతిభ దిగజారుడు; ప్రతిభ చిత్తగించుట.

Breach of confidence; Breach of trust - विश्वास-भंग, విశ్వాస భంగము.

Breach of privilege - विशेषाधिकार - भंग, విశేషాధికారభంగము.

Breakage - टूटफूट, విరుగుట; పగులుట.

Brokerage - दलाली, దలారి కమీషను, దళారి పని.

Budget provision - बजट-व्यवस्था, బడ్జటు ఏర్పాటు.

By election-उप-निर्वाचन, ఉప ఎన్నిక.

By-hand - दस्ती, చేతితో, మనిషిద్వారా.

By-law - उप विधि, ఉపచట్టము.

C

Cabinet - मंत्रिमंडल, మంత్రిమండలి.

Cabinet secretariat - मंत्रिमंडल सचिवालय, సచివాలయము.

Caliculator - गणक, గణకము.

Cantonment - छावनी, సైన్యము ఉండు చోటు.

Care taker government - काम चलाऊ सरकार, తాత్కాలిక ప్రభుత్వము.

Cargo - स्योरा, సరుకు.

Casual leave - आकस्मिक छुट्टी, హఠాత్ శలవు.

Caution - सावधानी, హెచ్చరిక.

Cease fire - अस्त्र विराम, అస్త్రవిసర్జన.

Central revenue - केन्द्रीय राजस्व, కేంద్రప్రభుత్వపు రాజస్వము - పన్ను.

Cess - उपकर, పన్ను.

Check-post - जाँच चौकी, తనిఖీ కేంద్రము.

Chorus - बृंदगान, బృందగానము.

Citation - उद्धरण, ఉద్ధరణ.

Column-स्थंभ, खाना, కాలము (పేపరు వగైరాలలోని).

Compensation - मुआवजा, क्षतिपूर्ति, నష్టపరిహారము.

Composite culture - सामासिक

Endorsement-पृष्ठांकन, सही करना, समर्थन, బలపరచుట, సమర్థన.

Engagement - आबंध, वचन बंध, కట్టుబాటు; వచన బద్ధము.

Enquiry - पूछ ताछ, जाँच, దర్యాప్తు.

En-masse - सामूहिक रूप से, సామూహికముగా.

Ensuing - आगामी, రాబోవు.

Entertainment - मनोरं जन, వినోదము, మనోరంజనము.

Entertainment-tax - मनोरंजन-कर, వినోదపు పన్ను.

Entitled - हकदार, హక్కుదారుడు.

Entrepreneur - उद्यमी, శ్రమికుడు.

Enumerator - गणनाकार, గణకుడు.

Envoy - दूत, దూత, రాయబారి.

Equipment - उपस्वर, उपकरण, స్తోమత, ఉపకరణము.

Equity - साम्य, సామ్యము.

Equivalent - तुल्यमान, पर्याय, तुल्य, పర్యాయము, తుల్యమైన.

Eradicate-मूलोच्छेदन करना, उन्मूलन करना, దుంపనాశము చేయుట.

Erratea - शुद्धि-पत्र, తప్పొప్పుల పట్టిక.

Essential service - अनिवार्य सेवा, ఆవశ్యక సేవ.

Estate - संपदा, సంస్థానము.

Estimate - आकलन, अनुमान, आकलन करना, ఆకలింపు, అంచనా ఆకలించుట.

Estimates of expenditure - व्यय अनुमान, ఖర్చు అంచనా.

Etiquette - शिष्टाचार, శిష్టాచారము.

Evaluation - मूल्यांकन, మూల్యాంకనము.

Eviction - बेदखली, निष्कासन, బహిష్కరణ.

Excahnge value - बिनियम मूल्य, మార్పిడి ధర.

Exchequre-राजकोष, ప్రభుత్వ ఖజానా.

Excess - अति, आधिकता, అతి, ఆధిక్యము.

Excise - उत्पादन शुल्क, आबकारी, ఉత్పాదన శుల్కము, ఆబ్కారి.

Executive - कार्यपालिका, कार्य - कारिणी, పాలకవర్గము.

Exempt - छूट प्राप्त, छूट देना, మినహాయింపు పొందిన, మినహాయించుట.

Exemption-छूट माफी, మినహాయింపు.

Ex-gratia grant - अनुग्रह अनुदान,

కనికరపు దానము.

Ex-gratia payment - अनुग्रह पूर्वक अदायगी, కనికరపు చెల్లింపు.

Exigency - तात्कालिक आवश्यकता, తాత్కాలిక ఆవశ్యకత.

Ex-officio - पदेन, పదవికారణంగా.

Exparte - एक पक्षीय, ఒకే పక్షపు.

Expediency - ఉపయోగకర; ఉచితమైన.

Expert - विशेषज्ञ, కుశలుడు.

Expunge - निकालना, తొలగించుట.

Extract - उद्धरण, ఉద్ధరణము.

Eye-witness - प्रत्यक्ष साक्षी, चश्मदीद गवाह, ప్రత్యక్షసాక్షి.

F

Fabricate - गढना, निर्माण करना, నిర్మించుట; అల్లుట.

face value - अंकित मूल्य, ముద్రించిన వెల.

facilitate - सरल बनाना, सुकर बनाना, సులభము చేయుట.

facility - आसानी, सुविधा, సదుపాయము; సౌకర్యము.

facsimile - अनुलिपि, प्रतिकृति, ప్రతికృతి.

fact - तथ्य, తథ్యము.

faculty - संकाय, ధీవిశేషము, విశ్వవిద్యాలయమందలి ఒకశాఖ.

Fairness - औचित्य, ఔచిత్యము, న్యాయము.

Family allowance - कुटुंब-भत्ता, परिवार-भत्ता, కుటుంబ బత్యము.

Farewell address - बिदाई भाषण, వీడ్కోలు భాషణములేక ఉపన్యాసము.

Fault - दोष, चूक, దోషము, పొరపాటు.

Fault-finding - छिद्रन्वेषण, రంధ్రాన్వేషణ.

Favouritism - पक्षपात, పక్షపాతము.

Federation - संघीकरण, परिसंघ, పలు సంఘముల కూడిక.

Fellow-अधि सदस्य, अध्येता, విశ్వవిద్యాలయములోని అధ్యేతా సదస్యుడు.

Fellowship - अध्येतावृत्ति, గౌరవ అధ్యేతా ఉపవేతనము.

Figures - आँकडे, సంఖ్యాపట్టికలు.

first aid - प्रथम उपचार, ప్రాధమిక చికిత్స.

fiscal - राजस्व सम्बन्धी, राजकोषीय, ప్రభుత్వ పన్నుకు సంబంధించిన, ప్రభుత్వ ఖజానాకు సంబంధించిన.

fitness certificate - स्वस्थता - प्रमाण पत्र; योग्यता प्रमाण - पत्र,

నష్టత-ప్రమాణపత్రము; అర్హత ప్రమాణ పత్రము.

fixed-deposit - अवधिक जमा, अवधिक निक्षेप, కాలపరిమితి జమ సొమ్ము.

flying squard - द्रुतगामी-दल निरीक्षक, హఠాత్తు తనిఖీ బృందము.

fluctuation - घट-बढ, उतार-चढाव, పెరుగు-తగ్గుదలలు; అస్థిరత.

fallow up action - अनुवर्ती कार्यवाही, పర్యవసానచర్య.

foment - उत्तेजित करना, ఆవేశపరచుట.

forecast - पूर्वानुमान, పూర్వ అంచన.

fore going - ముందు జరుగు.

food grains - खाद्यान्न, ఆహార ధాన్యములు.

foreign exchange - विदेशीमुद्रा, పరదేశ ధనము.

forgery-कूटरचना, जालसाजी, కూట రచన, కుట్ర.

foreward - प्राक्कथन, ముందుమాట.

formal - औपचारिक, శిష్టాచార పూర్వమగు.

forth with - तत्काल, తక్షణము.

fortnight - पाक्षिक, పక్షపత్రిక.

freight - मालभाडा, బరువు శుల్కము.

function - समारोह, कृत्य, సమారోహము, కృత్యము.

functionary - कार्यकर्ता, కార్యకర్త.

further action - आगे की कार्यवाही, తదుపరి చర్య.

## G

Gallantry award - शौर्य पुरस्कार, శౌర్యపారితోషకము.

Gallery - दीर्घा, गैल्री, वीथी, గ్యాలరి, వీధి.

Gazetted officer - राजपत्रित अधिकारी, గెజటులో నామాంకితమైన అధికారి.

Genius - प्रतिभा, प्रतिभाशाली, प्रकृति, ప్రతిభ, ప్రతిభాశాలి, ప్రకృతి-స్వభావము.

Genius of language - भाषाकी प्रकृति, భాషాస్వభావము.

Geologist - भूविज्ञानी, భూవిజ్ఞాని.

Good behaviour - अच्छा चलन, सद् व्यवहार, మంచి నడవడి; ఋజు ప్రవర్తన.

Good offices - मध्यस्थता, మాధ్య వర్తిత్వము.

Governing body - शासी निकाय, శాసకమండలి.

Government undertaking - सरकार उपक्रम, ప్రభుత్వ అధీన సంస్థ.

Gross value - सकल मूल्य, कुल मूल्य, యావత్తు మూల్యము.

Guard of honour - सैनिक सलामी, సైన్య ప్రణామము.

Guardian - अभिभावक, संरक्षक, సంరక్షకుడు.

Guidance - मार्गदर्शन, निर्देशन, మార్గ దర్శనము.

Guiding price - निर्देशक मूल्य, నిర్దేశించువెల.

# H

Habit - स्वभाव, आदत, స్వభావము, అలవాటు.

Habitual defaulter - आभ्यासिक व्यतिक्रमी, आभ्यासिक दोषी.

' Habitual offender - आभ्यासिक अपराधी, అలవాటు పడ్డ అపరాధి.

Halting allowance - विराम भत्ता, విశ్రాంతి భత్యము.

Hand loom - हाथ करधा, చేతి మగ్గము.

Handicap - बाधा, లోటు, ఇబ్బంది.

Handicapped - विकलांग, बाधा-ग्रस्त, వికలాంగుడు; ఇబ్బందిలోనున్న.

Handi craft - दस्तकारी, हस्ताशिल्प, చేతిపని; హస్తకళ.

Hard and fast rules - पक्के नियम, దిట్టమైన నియమాలు.

Hardware unit - धातुवस्तु एकक, లోహవస్తు కేంద్రము.

Hire charges - भाडा, అద్దె.

His Excellency - परम श्रेष्ठ, పరమ శ్రేష్ఠుగు.

His Majesty ; Her Majasty - महा महिम, బహుఘనమైన.

High lights - मुख्य बातें, मुख्य विशेष-ताए, प्रमुख आकर्षण, ప్రధానమైన ఆకర్షణలు, ముఖ్య విషయాలు.

Honorarium - मान देय, గౌరవ భృతి.

Honorary - अवैतनिक, జీతములేని.

Horticulture - बागबानी, తోట పెంపకము.

Horticulturist - उद्यान-कृषि विशेषज्ञ, ఉద్యాన కృషి ప్రవీణుడు.

Housing - आवास, నివాసము.

Humanitarian ground - मानवहित का आधार, మానవతా దృక్పథము.

Hutment - अस्थायी कमान, తాత్కాలిక నివాసము.

Hygiene - स्वास्थ विज्ञान, ఆరోగ్య విజ్ఞానము.

I

Ibid (Ibidem) - वहीं, అక్కడే.

Identification - पहचान, शिनाख्त, గుర్తు, ఎరుక.

Identity - पहचान, గుర్తు (గురుతు).

Identity card - पहचान पत्र, గుర్తింపు కార్డు.

Idle capacity - निष्क्रिय क्षमता, अप्रयुक्त क्षमता, ఉపకరించని సామర్థ్యము, ఉపయోగపడని సామర్థ్యము.

illegal - अवैध, చట్టవిరుద్ధమైన.

illegible - अपाठ्य, గజిబిజిగానున్న, చదువ వీలులేని.

illegitimate - अवैध, अधर्मज, చట్టబద్ధముగాని, సంకరమైన.

illicit - निषिद्ध, నిషిద్ధమైన.

ill-treatment - दुर्व्यवहार, దుర్వ్యవహారము.

immature - बचकाना, अपरिपक्व, అపరిపక్వమైన.

immediate officer - आसन्न अधिकारी, ఆసన్న అధికారి.

immigrant - आप्रवासी, వలస వచ్చిన నివాసి.

imminent - आसन्न, ఆసన్నమైన.

impediment - अडचन, बाधा, అడ్డంకు, విఘ్నము.

impersonation - प्रतिरूपण, చట్ట విరుద్ధమైన రూపధారణ.

imperative - लाजमी, अनिवार्य, తప్పనిసరి, అనివార్యము.

implicit - निहित, నిహితమైన.

import - आयात, దిగుబడి.

impost - लाभ कर, పన్ను, కప్పము.

imprest - अग्रदाय, బయానా.

impound - परिबद्ध करना, రద్దు చేయుట.

imputation - आरोपण, ఆరోపణ.

inadvertence - अनवधानता, అనవధానము.

incamera - गुप्त बैठक, గుప్తసమావేశము.

incentive - प्रोत्साहन, ప్రోత్సాహము.

incharge - प्रभारी, తాత్కాలిక ఏర్పాటు.

incidental - आनुषंगिक, प्रासंगिक, ప్రాసంగికముగు.

incognito - अज्ञात, गुप्त रूप से, అజ్ఞాత

ముగా, గుప్తముగా.

indent - माँग-पत्र, వలయు వస్తువులకై చీటి

index - अनुक्रमणिका, అనుక్రమణిక.

indict - इल्जाम लगाना, दोषारोपण करना, దోషారోపణ చేయుట.

indirect - परोक्ष, పరోక్షము.

indispensable - अपरिहार्य, అనివార్యమగు.

infringe - उल्लंघन करना, अतिलंघन करना, ఉల్లంఘించుట, దాటవేయుట.

initials-आद्यक्षर, ఆద్యక్షర (సంతకము)

inoculator - टीका लगाने वाला, టీకాలు వేయువాడు.

insignia-अधि चिह्न, ఉద్యోగ చిహ్నము.

inspection - निरीक्षण, తనిఖీ.

instalment - किस्त, వాయిదా పైకము.

insubordination - अधीनता, ఆధీనత.

inter alia - साथ साथ, వెంటవెంట.

interpolation - प्रक्षेप, ప్రక్షేపము.

interrogation - पूछताछ, परिप्रश्न, దర్యాప్తు.

interse - परस्पर, आपसमें, పరస్పరముగా.

in to-to - संपूर्णत:, पूरी तरह से, యావత్తు, పూర్తిగా.

in vogue - प्रचलित, ప్రచారములోనున్న.

ipsofacto - यथा तथ्यत:, इसी बात से, ఈతథ్యానుసారము, ఈమాట ద్వారానే.

ipso jure - विधित:, చట్టరీత్యా.

irrelevant - असंबद्ध, विसंगत, అసంబద్ధమైన, అసంగతమైన.

item - मद, పద్దు.

itinerary - यात्रा-कार्यक्रम, మార్గనిర్దేశిక.

J

Job - नौकरी, ఉద్యోగము.

Joint - संयुक्त, సంయుక్తమైన.

Joint venture - संयुक्त उद्यम, సంయుక్త ప్రయాసము.

Jubilee - जयंती, జయంతి.

Judiciary - न्यायपालिका, న్యాయ పరిపాలన చేయు ప్రభుత్వపు శాఖ.

Judicious - विवेकसम्मत, వివేకసమ్మతమగు.

Junior - कनिष्ठ, अवर, కనిష్ఠుడు.

Jurisdiction - अधिकार क्षेत्र, అధికార క్షేత్రము.

Jurist - विधि शास्त्री, న్యాయశాస్త్రి.

Justice - न्याय, न्यायमूर्ति, న్యాయము, న్యాయమూర్తి.

Juvenile-किशोर,बाल, बाल्य, కిశోర సంబంధమైన, బాల్య సంబంధము.

Juvenile deliquency - किशोर अपचार, కిశోర- అపచారము.

Junenile offender - किशोर-दोषी, బాల నేరస్తుడు.

K

Key board - कुंजीपटल, కీ బోర్డు.

Key map - मूल नक्शा, మూల పటము.

Kindergarten teacher-బాలోద్యాన, ఉపాధ్యాయుడు.

Know how - जानकारी, तकनीकी जानकारी, ఎరుక- జ్ఞానము; సాంకేతిక విద్యా జ్ఞానము.

L

Labour - श्रम, श्रमिक वर्ग, శ్రమ, శ్రమిక వర్గము.

Labour-welfare - श्रम-कल्याण, श्रमिक कल्याण, కార్మికసంక్షేమము.

Leave study - अध्ययनार्थ छुट्टी, అధ్యయన శలవు.

Law and order-कानून और व्यवस्था, శాంతి భద్రతలు.

Legation - दूतावास, రాయబారి నివాసము.

Legible - सुवाच्य, సువాచ్యము.

Leniency - नरमी, उदारता, మెతగతనము, ఔదార్యము.

Lessee - पट्टेदार, అధికార పత్రము గలవాడు.

Letter head - सर नामा, शीर्षनामा

Levy - महसूल, उगाही, వసూలు.

Lexicography - कोश विज्ञान, నిఘంటు విజ్ఞానము.

Lexicon - कोश, నిఘంటువు.

Liable - दायी, दायत्व के अधीन, బాధ్యతగల, జవాబుదారీగల.

Liaison - संपर्क, సంపర్కము.

License (Licence) - अनुज्ञप्ति लाइसेंस, లైసెన్సు.

Licensed - अनुज्ञप्त, లైసెన్సు పొందిన.

Life assurance - जीवन बीमा, జీవిత బీమా.

Liquidation - परिसमापन; शोधन, పరిసమాప్తి, పరిష్కారము.

Limitation - सीमा, अवधि, సీమ; వ్యవధి.

Limited concern-सीमित - दायिता

प्रतिष्ठान, బాధ్యతాయుతమైన ప్రతి ష్ఠానము.

Literate - साक्षर, అక్షర జ్ఞాని.

Litigant - वादकारी, मुकदमा करनेवाला, వ్యాజ్యాలకోరు.

Livestock - पशुधन, పశుసంపద.

Livelihood - जीविका, బ్రతుకుతెరువు.

Living expense-निर्वाहि खर्च, పోషణ వ్యయము.

Loanee - कर्जदार, ఋణగ్రస్తుడు.

Loaner - लेनदार, ఋణదాత.

Locus standi-प्रवेशाधिकार, अदालत में दाखिल होने का अधिकार, ప్రవేశాధికారము; వ్యాజ్యము వేయు అధికారము.

Lumpsum - एक राशि, एक मुश्त, ఒకే మొత్తము.

Lunch - मद्याह्न भोजन, दुपहर का खाना, మధ్యాహ్న భోజనము.

Lower age limit - निम्न आयु सीमा, కనిష్ఠ వయస్సు హద్దు.

## M

Magazine - आयुधागार, बारुद घर, पत्रिका, ఆయుధాగారము; పత్రిక.

Mail agent - रेल-डाक क्लर्क, రైలు మరియు పోస్టు గుమస్తా.

Mailing list - डाक-सूची, పోస్టు వివరణ.

Maintain (Account) - (लेखा) रखना, ఉంచుట; నిర్వహించుట.

Maintaince - अनुरक्षरण, भरण-पोषण, పోషణ, నిర్వహణ.

Major - मेजर, वयस्क, प्राप्तवय, వయస్కుడు, మేజరు.

Major head - मुख्य शीर्षक, ప్రధాన శీర్షకము.

Malafides - बदनीयती, दुर्भाव, कुदाशय, దుర్నీతి; దుర్భావము; దురు ద్దేశ్యము.

Mandate - अधिदेश, ఆదేశము.

Manpower - मनुष्य शक्ति, మానవశక్తి.

Manifesto - घोषणा-पत्र, ఘోషణా పత్రము.

Masonary - राजगीरी, తాపీ పని.

Manual skill - हस्त कौशल, హస్తకౌశ లము.

Manual work - हाथका काम, చేతి పని.

Manuscript - हस्तलेख, पांडुलिपि, చేవ్రాత, పాండులిపి.

Mass consumption - सामूहिक उपभोग, సామూహిక ఉపభోగము.

Matching grant - अनुरूपयोजी अनुदान, సహకార అనుదానము.

Maximum - अधिकतम, ज्यादा से ज्यादा, అధికతమము.

Means - साधन, उपाय, సాధనము.

Medium - माध्यम, మాధ్యమము.

Memo - ज्ञापन मेमो, సూచనచీటి, ఆదేశ సూచన.

Metallurgist - धातु कर्मी, ధాతు కర్మి.

Migrent - प्रवासी, ప్రవాసి.

Mininum - न्यूनतम, कम से कम, న్యూనతమము, కనీసము.

Mortgage - गिरवी,रेहन, తాకట్టు.

Monopoly-एकाधिकार, एकाधिपत्य, గుత్త అధికారము, ఏకాధిపత్యము.

Monument - स्मारक, స్మారకము.

Mortuary - शवागार, శవాగారము.

Motto - आदर्श वाक्य, ఆదర్శవాక్యము, ఆదర్శోక్తి

Movement - संचलन, आंदोलन, సంచలనము, ఆందోళనము.

Multipurpose - बहुद्देशीय, పలు ఉద్దేశ్యములు గల.

Muster roll - उपस्थिति नामावली, हाजिररी बही, హాజరు పట్టి.

Museum-संग्रहालय, సంగ్రహాలయము.

Mutation - नामांतरण, दाखिल - खारिज, పేరు మార్పిడి.

Mulatis-Mutandis - आवश्यक परिवर्तनों सहित, ఆవశ్యక పరివర్తనల సహితముగా.

Mutirated - कटा-फटा, विकृत, ఛిన్నాభిన్నమైన, వికృతమైన.

Myth - मिथिक, పురాణము.

## N

National emblem - राष्ट्रीय संप्रतीक, రాష్ట్రీయ చిహ్నము.

National savings certificate - राष्ट्रीय बचत-पत्र, రాష్ట్రీయ పొదుపు పత్రము.

National song - राष्ट्र गान, राष्ट्र गीत, రాష్ట్రగానము లేక గీతము.

Navigation - नौ परिवहन, नौचालन, నౌకా పరివహణము.

Necessary action - आवश्यक कार्रवाई, ఆవశ్యకచర్య.

Negative - निषेधात्मक, నిషేధాత్మకమైన.

Net assets - शुद्ध परिसंपति, निवल परिसंपत्ति, ఫక్తు సంపదలు, లాభసరు పాయములు మాత్రము.

Nominal inspection - नाम मात्र का निरीक्षण, నామమాత్రపు తనఖీ.

Non-statutory - विधीतर, చట్ట సమ్మతముకాని.

Note of dissent - असहमति नोट, असहमति लेख, అనంగీకారపునోటు.

Notorious - कुख्यात, అపఖ్యాతిగల.

Null and void - बातिल और शून्य, తిలోదకములు వదలిన, శూన్యమైన.

Numismatist - मुद्रा विद्, నాణెముల ప్రవీణుడు.



Oath - शपथ, శపథము, ఒట్టు.

Oath of allegiance - राजनिष्ठा-शपथ, निष्ठा शपथ, నిష్ఠాపూర్వక శపథము; రాజ్యముయెడల నిష్ఠాపూర్వక శపథము.

Obituary - निधन-सूचना, మృత్యు సమాచారము లేక సూచన.

Obligation - बाध्यता, दायित्व, आभार, बंधन, బాధ్యత, కృతజ్ఞత, బంధనము.

Obligatory - अनिवार्य, అనివార్యమైన.

Obscene - अश्लील, అశ్లీలమైన.

Obsolete - लुप्त, अप्रचलित, లుప్తమైన; అప్రచలితమైన.

Occupation - व्यवसाय, उपजीविका धंधा, జీవికోపాధి, వృత్తి.

Occurence - घटना, ఘటన.

Office-note - कार्यालय टिप्पणी, కార్యాలయ టిప్పణి.

Officiating - स्थानापन्न, స్థానాపన్నముగా కార్యము నిర్వహించుచున్న.

Oral admission - मौखिक अभिस्वीकृति, మౌఖిక అంగీకారము.

Orally - मौखिक रूप से, మౌఖికముగా.

Order of precedence - पूर्वता-क्रम, పూర్వతక్రమము.

Order of priority - अग्रता-क्रम, పెద్ద చిన్నక్రమము.

Orderly - अर्दली, బిళ్ళ బంట్రోతు.

Ordiance - अध्यादेश, అధ్యాదేశము, గవర్నరు, రాష్ట్రపతి మొదలగువారు జారి చేయు ఆదేశము.

Out of date - पुराना, अप्रचलित, ప్రాచీనమైన, అప్రచలితమైన; ప్రచారములోలేని.

Outlay - परिव्यय, प्रारूप, సంపూర్ణ వ్యయము (అంచనా) ప్రారూపము.

Out post - सीमा चौकी, సరిహద్దు కావలా.

Ovation - अभिनंदन, स्वागत, అభినందనము; ఉల్లాసపూరిత స్వాగతము.

Overhauling - जीर्णोद्धार, पूरी मरम्मत, జీర్ణోద్ధారము; పూర్తి మరమ్మత్తు.

Over head charge - ऊपरी खर्च, పై ఖర్చు.

Overtime-allowance - समयोपरि भत्ता, అతిరిక్త కార్యపు భత్యము.

## P

Pack animal - भारवाही पशु, బరువు మోయు పశువు.

Pact - समझौता, రాజీ.

Panel - नामिका, జాబితా.

Parasite - परजीवी, పరాన్నభోక్త.

Parasitologist - परजीव-विज्ञानी, పరాన్నజీవ విజ్ఞాని.

Par-excellence - श्रेष्ठ, उत्कृष्ट, శ్రేష్ఠమైన, ఉత్కృష్టమైన.

Parity - समानता, बराबरी, సమానత్వము, సమానత.

Parliamentary-संसदीय, పార్లమెంటుకు సంబంధించిన.

Part time - अंशकालिक, అంశకాలపు.

Partiality - पक्षपात, పక్షపాతము.

Partnership deed - साझा-पत्र, విభాజన పత్రము.

Pass-पारण, पास, पास करना, गुजारना, పాసు, దాటుట, పాసుచేయుట, గడుపుట.

Passage - मार्ग, गली, किराया, अंश, उद्धरण, यात्रा, మార్గము, సందు, అద్దె, అంశము, ఉద్ధరణ, యాత్ర.

Passport - पार पत्र, पासपोर्ट, పాసు పోర్టు.

Patent and design - एकस्व और अभिकल्प, అభికల్పము, పేటెంటు మరియు డిజైను.

Pauper - अकिंचन, నిష్టదరిద్రుడు.

Panal scale - वेतन-मान, వేతన స్కేలు.

Pecuniary - धन-संबंधी, ధనసంబంధమైన.

Padiatrician - बाल-चिकित्सक, శిశు రోగ చికిత్సకుడు.

Penal - दांडिक, शास्तिक, దండ

